# శ్రీకాళహస్తీశ్వరాయనమః

శా. వావిళ్లాన్వయవంశపావనుఁడు భవ్యప్రజ్ఞుఁ డామ్నాయవి
ద్యావిజ్ఞానవిశారదుండు సుగుణోదారుండు సౌశీల్యసీ
మావిద్యోతనుఁ డార్యసమ్మతుఁడు రామస్వామివిద్వద్వరుం
డావిఖ్యాతయశోవిశోభితుఁడు పెంపారెన్ బుధుల్ మెచ్చఁగన్.

చ. అలఘువినిర్మలప్రతిభుఁ డాబుధవర్యుఁడు సంస్కృతాంధ్రభా
షల బహుకావ్యముల్ దనవిశాలమతిం బరికించి భావముం
జులతఁ దనర్చుకొన్నిటికి సొంపుగ వ్యాఖ్య లొనర్చి యెల్లవా
రలకు సుబోధమై తగఁ గరం బుపకారము సేసె వెండియున్.

చ. క్రమమునఁ దాళపత్రముల వ్రాసిన చక్కఁగ నొండురీతి గ్రం
థము లతిదుర్లభంబు లయినన్ బుధు లొందు శ్రమంబు దీర్ప డెం
దమునఁ దలంచి ముద్రణమునన్ బ్రకటించు ప్రశస్తపుస్తకా
ఘమును గృతోపకారుఁ డయి కాంచెను గీర్తి దిగంతరంబులన్.

ఉ. తత్తనయుం డుపాత్తసముదాత్తనయుండు వివేకకౌశలా
యత్తుఁడు వేంకటేశ్వరబుధాహ్వయుఁ డాదృతి విద్య నేర్చి య
త్యుత్తమ మాత్మతాతచరణోద్యమపూరణ మంచు నెంచి తాఁ
జిత్తమునందుఁ దండ్రిక్రియఁ జేయును గ్రంథతతిప్రచారమున్.

శా. వేయున్నూటపదాఱు లిచ్చి యతఁ డుద్వేలప్రమోదంబుతో
స్ఫాయన్మైత్రి దలిర్ప నన్నుఁ బురికొల్పం బూనితిన్ నేను నీ
శ్రేయస్సాధన మైనసత్కృతికి సూరిప్రార్థితోద్యోగ మే
యాయాసంబును గూర్ప కౌర సఫలం బౌ నంచు భావించుచున్.

సీ. జగతీగుణపురాణసంఖ్యాతశాలివాహనశకవర్షముల్ సనిన వచ్చు
సాధారణాఖ్యవత్సరమున నాశ్వయుజాభిధమాసంబునందు విజయ
దశమిఁ బ్రారంభించి తగనొక్క యేఁటనీభాగవతం బాంధ్రభాషగద్య
మయముగా రచియించిమాన్యవిద్వత్కవికరుణారసస్ఫూర్తిగలుగు

తే.గీ. మదిని శ్రీవేణుగోపాలుపదములందు [కతన
భక్తి నర్పణ చేసి సంప్రాప్తజన్మ
ఫలుఁడ నైతిని పండితప్రవరులార
తప్పు లిం దున్న మన్నించి దయను గనుఁడు.

శ్రీ ర స్తు

# వి ష య సూ చి క

## ప్ర థ మ స్కం ధ ము

విషయము. పుట.

విషయము. పుట.

శ్రీ ర స్తు



శ్రీహయగ్రీవాయ నమః.

# శ్రీమదాంధ్ర వచనభాగవతము

## ప్రథమస్కంధము

శ్లో. శ్రీమద్గోపాలబాలం తం యశోదానందనందనమ్,
వందే యద్వేణునాదేన బుధాః ప్రాపుః పరాం ముదమ్.

సీ. ఎవ్వనివలన నీ యెల్లలోకములకు
జన్మాదు లఖిలార్థజాతములను
నయ్యెడు నన్వయవ్యతిరేకముల, నెవ్వఁ
డఖిలజ్ఞుఁ, డాత్మనిత్యప్రకాశుఁ,
డాత్మేచ్ఛ సూరిమోహాకమహావేదంబు
రచియించి యొసఁగెను బ్రహ్మ, కాత్మ
మాయాగుణత్రయోన్నే యసర్గం బేని
యందుఁ దేజోంబుమృద్వ్యత్యయంబు

తే. మాడ్కి మృష యగు, నాత్మధామముననే స
దానిరస్తకుహకుఁ డెవ్వఁ, డానిరంత
నిత్యసత్యస్వరూపుఁడై నెగడువాని
నాత్మ ధ్యానింతుఁ బరమేశు నాత్మలోన.

చ. పరమమునీంద్రకల్పిత మిది భాగవతం, బిటఁ దత్త్వకాముఁడౌ
స్ఫురదురుధర్మ మొప్పు ననసూయులకున్ శివదానతాపని
ర్హరణము లిచ్చువాస్తవపునప్పరవస్తువు వేద్య, మన్య మే
ల, రహిని విన్నధన్యులకు లభ్యుఁడు తత్క్షణ మీశ్వరుం డెదన్.

క. శ్రుతికల్పతరుచ్యుత మా
తతశుకవక్త్రోద్గతామృతద్రవయుతము
న్నతరసభాగవతఫలము
మతి నానుఁడు ముక్తిదనుక మహి బుధులారా.

— శ్రీమద్భాగవతకథాప్రారంభము —

శ్రీమహావిష్ణుక్షేత్రంబై పరమపవిత్రం బైన నైమిశారణ్యమున శౌనకాదిమహామునులు నారాయణప్రాప్త్యర్థము సహస్రసంవత్సర దీక్షానియమంబుతో సత్త్రయాగమునకుఁ దొడంగి యొక్కనాఁడు ప్రాతః కాలమున నగ్నిహోత్రాదినిత్యకృత్యము లెల్ల నెఱవేర్చి విజ్ఞాతనిఖిల పురాణార్థజాతుం డైనసూతురోమహర్షణతనుజాతు నుగ్రశ్రవోభిధాన విఖ్యాతు నచ్చటికి వచ్చినవానిం గూర్చుండఁ జెప్పి యుచితప్రకారంబున సత్కరించి పరమాదరంబు పల్లవింప నిట్లని యడిగిరి. ఓ సాధు శేఖరా! పరమవిజ్ఞానప్రగల్భుం డైనపారాశర్యమహామునీంద్రుని ప్రసాద మునకుఁ బాత్రంబవై యీవు సకలపురాణముల నితిహాసముల ధర్మ శాస్త్రములను వేదాచార్యుం డైనయాకృష్ణద్వైపాయనమునీంద్రుం డును సగుణనిర్గుణబ్రహ్మతత్త్వము నెఱింగిన తక్కినమహర్షులు నెఱింగిన వానినెల్లఁ జదివి వానికి లెస్స వ్యాఖ్యానం బొనర్చితివి కావున నప్పారా శర్యుప్రసాదమున వానితత్త్వ మెల్ల లెస్స తెలియుదువు. ప్రీతిభాజనం బైనశిష్యునకు గురువు లత్యంతరహస్య మగునర్థముం గరుణించి బోధిం తురుగదా. ఆయాగ్రంథములనెల్ల నీవు ఋజుత్వమున నిశ్చయించినదానిఁ బురుషుల కేకాంతశ్రేయోదాయకం బగుదాని మాకు వివరింప నీవు దగుదువు. ఈకలియుగమున జనులు తఱచుగ నల్పాయువు లలసులు మందమతులు మందభాగ్యులు రోగపీడితులు నగుదురు. నానావిధ క్రియాకలాపంబులు ఫలభేదంబులునుం గలుగుకర్మానుష్ఠానభేదంబులు

నానావిధవిభాగములు వినవలసియుండెడు. అయ్యది కలికాలమానవుల
కెంతయు నశక్యం బగుఁ గావున నీబుద్ధివైభవమున వానిలోనెల్ల సార
మేర్పఱిచి లోకానుగ్రహార్థంబు వివరింపుము. దాని విన్నమాబుద్ధియుఁ
బ్రసాదంబుఁ జెందు. పౌరాణికాగ్రణీ! నీకు మే లయ్యెడు. నీవెఱుంగు
దువు కాదె శ్రీమన్నారాయణుం డేమి సేయఁదలఁచి వసుదేవునకు దేవకీ
దేవిగర్భమున నవతరించె. నయ్యది వినఁ గోర్కులు క్రేళ్లువాఱెడు. మాకు
సవిస్తరంబుగఁ బ్రతిపాదింపుము. ఏమహాత్మునవతారము భూతముల
క్షేమమునకు సమృద్ధికిని జాలియుండె, నేజగదీశుదివ్యనామంబుఁ బేర్కొ-
న్నమాత్రమున నరుండు ఘోరసంసారబాధ లెడలు, నేమహానుభావునకు
భయంబు దాన వెఱచిపఱచు, నేపరమేశ్వరుచరణారవిందముల నాశ్ర
యించినమును లుపశమసంపన్నులై యవగాహనాదులం బావనత్వంబు
గలిగించు గంగాజలంబుకంటె నుత్కర్షంబుఁ గాంతు రన్నమహిమ
కాస్పదంబై నిజసేవాపరులకు సన్నిధిమాత్రమునం బవిత్రత్వంబుఁ
గావింపఁ జాలుదు రట్టిపుణ్యశ్లోకప్రస్తూయమానకర్ముఁ డగుభగవంతుని
పావనయశంబును సంసారదుఃఖనిర్మూలనంబు సేయుదానిం జిత్తశుద్ధిఁ
గోరునరుఁ డెవ్వఁడేని వినక యుపేక్షించునే? కావున నారదాదిమహా
మునులు కీర్తించినయాదామోదరు నుదారచరిత్రంబుల నతఁడు లీలగా
ధరించిన మూర్తిభేదంబులను శుభావతారకథలనుం దేటపఱుపుము.
తమమెల్ల నొక్కమాత్ర నడంచుకీర్తిం దేజరిల్లునప్పరమేశ్వరువిక్రమంబు
వినునెడ మాకెప్పుడుం దనివి దీఱదయ్యెడు. కపటమానుషవేషమునఁ
బ్రచ్ఛన్నుండై కేశవుఁడు రామునితోడఁ గూడి కావించినయతిమాను
షంబు లైనగోవర్ధనోద్ధరణాది కార్యముల నాకర్ణించురసజ్ఞులకుఁ బ్రతిపద
మునందును జవి మీఁదుమిక్కిలి యొసఁగుచుండెడు. కలియుగప్రవేశము
నెఱింగి మేము వైష్ణవం బైనయీపుణ్యక్షేత్రమునందు దీర్ఘ
సత్త్రనిమిత్తమున హరికథాకర్ణనంబునకుఁ గృతక్షణులమై యున్నవా
రము. సత్త్వహరంబై దుస్తరం బైనకలి నతిక్రమింపఁ బూనుమాకు
సముద్రము దాఁటువానికి నావికునట్లుపోలె నాబ్రహ్మదేవుఁడు తాన
నిన్నుఁ జూపె. యోగీశ్వరుఁడు బ్రహ్మణ్యుఁడు ధర్మరక్షకుఁడు నగు
శ్రీకృష్ణుఁ డిప్పు డియ్యవతారము నుపసంహరించి నిజమర్యాదం గొన్న

పిదప ధర్మం బెవ్వని శరణుసొచ్చె నెల్లయు మాకుఁ దెలియఁ జెప్పు మని నైమిశారణ్యవాసు లగుశౌనకాదిమహామును లడిగిరి.

సూతుఁడు భాగవతముం జెప్పఁ బూని శుకాదుల స్తుతించుట

అడుగుటయు నారోమహర్షణనందనుం డమ్మునుల నభినందించి తదీయప్రశ్నవచనంబులఁ బ్రశంసించి,

ఉ. కృత్యకలాపసన్న్యసనకేవలుఁడై యొటకేని యేఁగునే
యత్యధినాథుఁ గాంచి విరహాతురతం దగి పుత్త్రకా యఁటం
చత్యనురక్తి వ్యాసముని యార్వఁగ యన్మయతన్ మహీజముల్
ప్రత్యభినాద మిచ్చె నఖిలస్థితుఁ గొల్చెద నమ్మునీంద్రునిన్.

చ. అతులనిజప్రభావ మయి, యాగమసారము నై, పురాణసం
హతిని రహస్యమై తనరునాత్మవిచారణతత్త్వదీప మే
మతి కృపవేర్మి సంసృతిమహాతిమిరంబును దాఁటఁ గోరుపం
డితులకుఁ జూపె నాశుకమునిప్రభుఁ గొల్చెద సద్గురున్ మదిన్.

క. నారాయణునకు నుత్తమ
పూరుషుఁ డగునరునకుం బ్రభూతశుభద యా
భారతికిని మునిపతి యగు
పారాశర్యునకు నెఱఁగి పలుకుదు జయమున్.

అని యివ్విధంబునఁ బరమపౌరాణికుండు సమధిగతసమస్తపురాణార్థజాతుండు నగునాసూతుండు వందనం బాచరించి నైమిశవనంబునందుసత్త్రయాగదీక్షితులై యధోక్షజకథాప్రశ్నంబు గావించిన యాశౌనకాదిమహామునులకు శ్రీహరి పరమతత్త్వప్రతిపాదనప్రవణంబై శ్రోతృజనచిత్తంబులందు విజ్ఞానప్రదీపంబు వెలిఁగించు శ్రీమద్భాగవత మహాపురాణంబువ్యాఖ్యానంబుఁ గావింపఁ దొడంగి యిట్లనియె.

సూతుఁడు శౌనకాదిమునుల ప్రశ్న మభినందించి భాగవతకథాప్రశంస చేయుట

మునీంద్రులారా! లోకమంగళం బైనయర్థంబు మీ రడిగితిరి. ఆత్మప్రసాదము గలిగింపఁజాలిన కృష్ణకథాప్రశ్నంబుకంటె మే లొండు గలుగునే? ఫలాపేక్ష లేకయు విఘ్నములఁ దవులకయుఁ దనరి చిత్తమునకుఁ బ్రసన్నత్వంబుఁ గావింపఁ జాలినశ్రవణాదరణాదిరూపం బైన

భగవద్భక్తి దేనివలనం గలుగు నయ్యదియే పురుషులకుఁ బరమధర్మంబు. అయ్యదియే పరమశ్రేయంబు. భగవంతుఁ డగు వాసుదేవునియెడ భక్తియోగము లెస్స ప్రయోగింపఁబడునేని యయ్యది యతిత్వరితంబున సర్వవిషయవైరాగ్యమును శుష్కతర్కములకు గోచరముగాక వేదాంతమాత్రగమ్యం బైనజ్ఞానమునుం గలిగించు. ధర్మమనునది సమ్యగనుష్ఠితంబయ్యు భగవత్కథలయెడ నభిరతిం గలిగింపకుండునేని యయ్యది కేవలశ్రమంబకాక ధర్మ మనం దగునే? కావున భగవత్కథాభిరతిం గావించునదియే ధర్మముగాని యనిత్యము లగు స్వర్గాదిసుఖములం గావించునది గాదు. హరికథామృతంబుఁ గ్రోలునెడ నెవ్వనికి మనంబు గరఁగకుండు, నానందబాష్పము లురులకుండు, మేను గరుపారకుండు నట్టివానికి వేదాంతగమ్యం బయినయాత్మతత్త్వంబు దూరమున నుండుఁగాని దానిరహస్యము గోచరింపదు. కావున హరిభక్తిసహకృతంబై విరక్తి నాత్మజ్ఞానమును గలిగించునదియే యుత్తమధర్మంబు. ధర్మమున కర్థము, దానికిఁ గామము, దాని కింద్రియప్రీతి, దానం గ్రమ్మఱ ధర్మార్థపరంపరయుం గలుగునని యవిద్వాంసులు దలంచినం దలంతురుగాక. మున్ను వివరించిన విరక్తిజ్ఞానజనక మగుభక్తియుక్తధర్మమున కర్థము ఫలము గానేరదు. మఱియు నట్టిధర్మము నెడఁబాయని యర్థమున కింద్రియప్రీతిలక్షణం బయినకామము ప్రయోజనంబు గాదు. వెండియుఁ గామమున కింద్రియప్రీతియే ఫల మనియుం దలంపరాదు. ప్రాణధారణమాత్రమునకు వలసినంతయే కామము సేవింపవలయుఁ గాని యదియే జన్మమునకుఁ బ్రయోజనం బని యెంచి యెల్లప్పుడు నెల్లవిధముల నింద్రియప్రీతిం గామము ననుష్ఠింపరాదు. స్వర్గాదిసాధనార్థం బొండె. నింద్రియతృప్త్యర్థం బొండెఁ గర్మముల నాచరించుట జీవునిజీవనమునకు ఫలంబు గాదు. మఱి మనుజుఁడు జన్మమెత్తి జీవించుట కాత్మతత్త్వవిచారంబు సేయుటయే ఫల మని యెఱుంగవలయు. అద్వయ మగుజ్ఞానమే పరతత్త్వ మని తత్త్వవిదు లగుపెద్దలు పల్కుదురు. ఆతత్త్వమే బ్రహ్మ మనియుఁ బరమాత్ముఁ డనియు భగవంతుఁ డనియు వేదాంతులు మున్నగువారు సెప్పుదురు. కావున శ్రద్ధావంతు లగుమునులు జ్ఞానవైరాగ్యసమ

స్వీతంబై వేదాంతశ్రవణలబ్ధం బైనభక్తిచే నాత్మునాత్మలోనం గాంతురు. కావున నో బ్రాహ్మణోత్తములారా! వర్ణాశ్రమములకుం దగినట్లు పురుషులు లెస్స యాచరించుధర్మమునకు హరిప్రీణనంబే పరమఫలంబు. ఎవ్వనిధ్యానం బనుఖడ్గము చేతం గొని వివేకు లహంకారబంధనం బైనకర్మమును దఅుగుదు రట్టిమహానుభావునికథయెడ రతి నెవ్వండు చేయకపోవు? పుణ్యతీర్థస్నానము మున్నగువానివలనం బూర్వపాపంబు సమయుటయు సాధుసేవనమునెడ మనస్సు దవులు. దానివలన ధర్మశ్రద్ధ యుదయించు. ధర్మశ్రద్ధవలన శ్రవణేచ్ఛ గలుగు. దాన భగవత్కథాభిరతి యొసంగు. పుణ్యశ్రవణకీర్తనుం డైనభగవంతుఁడు సాధువులకుం జెలికానిరీతి హితకారియై తనకథల నాకర్ణించువారిహృదయములం జొచ్చి యం దుండునమంగళము లగుకామాదివాసనలం బొఱిఁదోలు. భాగవతసేవనమునం గామాదులు నష్టప్రాయము లగుడు విక్షేపకము లేమిం జేసి యుత్తమశ్లోకుం డగుభగవంతునియెడ నిశ్చలం బైనభక్తి గలుగు. అప్పుడు రజస్తమోగుణములయు వానివలన నావిర్భవించు కామలోభాదులగముఁ దిరస్కారంబుఁ గానక చిత్తంబు సత్త్వగుణావిశ్రాంతంబై యుపశాంతిఁ బడయు. ఇట్లు భగవద్భక్తియోగమునఁ బ్రసన్నచిత్తుఁడై విషయాభిలాషము లెల్ల నీఁగినమహాత్మునకు భగవత్తత్త్వవిజ్ఞానం బుదయించు. జ్ఞానమున నాత్మదర్శనంబు గలుగునేని చిదచిద్గ్రథనరూప మగునహంకారము భిన్నమగు. అసంభావనాదిరూపము లగుసర్వసంశయములు విచ్ఛిన్నము లగు. అనారబ్ధఫలము లగుకర్మము లెల్ల నశించు. దానివలనం గదా వివేకు లగుపెద్దలు చిత్తశుద్ధిసాధనం బయినవాసుదేవభక్తి నత్యంతసంతోషమున నెల్లప్పుడుం జేయుచుందురు. సత్త్వము రజస్సు తమస్సనునవి మూఁడుప్రకృతికి గుణములై యుండు. వీనితోడం గూడి పరమపురుషుఁ డొక్కరుఁడే యీలోకమునకు స్థిత్యాదుల నిర్వహింపఁగ భిన్నభిన్నముగా హరివిరించిహరసంజ్ఞఁ దాల్చుచున్నవాఁడు. అందుఁ బ్రాణులకు శ్రేయములు సత్త్వగుణప్రథానుం డగువాసుదేవునివలనం గలుగుచుండు. పృథివీతత్త్వమయంబై ప్రవృత్తిప్రకాశరహితం బైనదారువుకంటెఁ బొగయు దానివలనఁ బ్రవృత్తిస్వభావంబు గలిగి వేదచోదితకర్మప్రచురం బైనయగ్నియు లయాత్మక

ముగుతమస్సువలన సోపాధికజ్ఞానకారణం బయినరజస్సు దానివలన బ్రహ్మదర్శనం బైనసత్త్వము నుదయించుఁగాని యయ్యది శుద్ధసత్త్వంబురీతి నాంతరీయకబ్రహ్మప్రకాశనంబు గానేరదు. అవ్విధంబుననే తత్తద్గుణోపాధు లగుబ్రహ్మాదులకుం దారతమ్యము గలిగియుండు. దానం జేసి తొల్లి మునులు శుద్ధసత్త్వమూర్తి యగుభగవంతునింద్రియార్థగోచరుండుగానివాని నుపాసించిరి. వారితెరువు పట్టినవా రితరులును సంసారమున క్షేమముఁ బడయఁ జాలిరి. మోక్షముఁ గోరువారు ఘోరరూపు లగుపితృభూతప్రజేశాదులను విడిచి దేవతాంతరములయెడ నసూయఁ దొఱఁగి శాంతము లగునారాయణమూర్తుల నుపాసింతురు. రాజసతామసస్వభావు లగువా రట్టిపితృభూతపతులకుఁ దుల్యశీలురై సంపత్ప్రజాదు లగుతుచ్ఛసుఖముల కాస చేసి వారిం గొల్తురు. పెక్కు లేల? వేదము లెల్ల వాసుదేవపరంబులు. యజ్ఞయోగక్రియలు వాసుదేవపరములే. తపోజ్ఞానంబులును స్వర్గాదిసాధనం బగుధర్మమును దద్ధర్మఫలము లగుస్వర్గాదులును వాసుదేవపరంబులే కాని యొండుగాదు. ఆవాసుదేవుఁడే తొలుదొలుతఁ దాను నిర్గుణుఁడయ్యు విభుండై గుణమయము కార్యకారణాత్మకంబు నగునాత్మమాయతోడం గూడి యీజగమెల్ల సృజించె. అయ్యాత్మమాయవలన విలసిల్లునాకాశాదిగుణములలోనం దాను జొచ్చి గుణవంతునిపోలెఁ దోఁపఁజేయుచుండు. వస్తుగతిం జూచినఁ జిచ్ఛక్తివిజృంభణమునం జేసి యాతం డట్టివాఁడుగాఁడు. అగ్ని యొక్కఁడయ్యుఁ బెక్కుదారువులం గూడి నానావిధములఁ దోఁచురీతి విశ్వాత్ముడగుపరమపురుషుండు నానాభూతముల నంతర్యామియై నానారూపములఁ గొన్న యట్లు దోఁపఁ జేయుచుండు. హరి భూతసూక్ష్మేంద్రియమనములం దననిర్మించినభూతములలోనం జొచ్చి తత్తద్గుణముల నిచ్ఛమై భోగింపఁజేయు. లోకపావనుఁ డైనయాలోకేశ్వరుఁడు లీలావతారలోలుపుఁడై దేవతిర్యఙ్నరాదిరూపములం గొని సత్త్వగుణమున లోకములం బాలించుచున్న వాఁడు.

### సూతుఁడు శౌనకాదులకు భగవదవతారములు వివరించుట

మహదహంకారపంచతన్మాత్రములం బొదలి యేకాదశేంద్రియములు పంచమహాభూతము లనుషోడశకళల నొప్పారుపురుషావతారంబుఁ

దొలుత భగవంతుఁడు లోకముల సృజించువాఁడై గ్రహించె. అయ్యాదియే భగవంతుని విరాడ్రూపం బని చెప్పఁబడు. అదియే పరమేశ్వరుని ప్రథమావతారంబు. అప్పరమపురుషుఁ డేకార్ణవం బయినజలమున విశ్రమించుచు సమాధిరూప మగునిద్రం దనరించునెడ నతనినాభిహ్రదంబు నందలికమలమునం దొల్లి పాద్మకల్పమునం బ్రపంచసృష్టికారుల కధిపతి యగుచతుర్ముఖుండు వొడమె. బ్రహ్మజన్మకారణం బయిన యప్పురుషావతారముఁ దాల్చినభగవంతుని విరాణ్మూర్తియవయవసన్నివేశంబులచే దేవమనుష్యాదిలోకవిస్తారంబెల్లఁ గల్పింపఁబడియె. అయ్యాదియే రజోగుణాదులం దవులనిసత్త్వమయం బైనభగవంతుని నిరతిశయనిజరూపంబు. వేయిపాదములు తొడలు ముఖములు శిరస్సులు నేత్రములు శ్రోత్రములు నాసికములు కిరీటకుండలాంబరంబులును గలిగి యద్భుతంబుగా వెలయు నయ్యుత్తమరూపమును యోగు లుత్తమం బగుజ్ఞానలోచనమునం గాంతురు. ఇయ్యదియే యాదినారాయణరూపం బని చెప్పఁబడు. ఇది యితరావతారములరీతి నావిర్భావతిరోభావములం గాంచక యవికారంబై కార్యాంతమున సర్వావతారములకు నివేశస్థానంబై యారంభమున నన్నింటికి బీజముచాడ్పున నుద్గమస్థానంబై నాశరహితంబై యొప్పుచుండు. తదీయాంశాంశములనే దేవతిర్యఙ్నరాదిసర్గంబు చెల్లుచుండు. అట్టిపురుషావతారంబుఁ బూనియే భగవంతుఁడు దొలుతఁ గౌమార మనుసర్గవిశేషమునకుఁ దొడరి బ్రాహ్మణుండై దుర్భరం బైన యఖండితబ్రహ్మచర్యంబు నడపె. ఈలోక ముద్భవింపఁ బాతాళగతం బైనభూమి నుద్ధరించువాఁడై యజ్ఞేశ్వరుం డైన యయ్యాదినారాయణుండు వరాహావతారంబుఁ గైకొనియె. ఇయ్యది నారాయణుని ద్వితీయావతారంబు. ఋషిసర్గముఁగొని నారదనామధేయంబున దేవర్షిత్వంబు గ్రహించి కర్మబంధనంబు నిరసింపఁ జాలుదివ్యజ్ఞానంబు బోధించు పాంచతంత్రము వచించె. ఇది హరితృతీయావతారంబు. తురీయావతారమున ధర్మకలాసర్గమున నరనారాయణు లనునామముల మునిద్వయరూపములఁగొని శమదమసమన్వితంబుగాఁ దీవ్రతపం బాచరించె. పంచమావతారముఁ గపిలనామధేయంబుఁ గొని సిద్ధులకెల్ల నీశ్వరుండై కాలవశమున నుత్పన్న మైనసాంఖ్యశాస్త్రవిస్తరమెల్ల నాసురి యను

విప్రునకు బోధించె. షష్ఠావతారమున ననసూయ వరింప నత్రిమహామునికిఁ బుత్రుండై దత్తాత్రేయనామంబుఁ దాల్చి యలర్కుఁ డను రాజునకుం బ్రహ్లాదాదులకు నాత్మవిద్య నుపదేశించె. సప్తమావతారమున రుచి యనుముని కాకూతియందు యజ్ఞనామమున జనించి తన కొడుకు లగుయామాదిసురులు గొలువఁగ స్వాయంభువమన్వంతరంబుఁ బాలించె. అష్టమావతారంబున నాభి యనువానికి మేరుదేవి యందు జనించి ఋషభనామముఁ గొని సర్వాశ్రమపూజితం బైనపరమహంసాశ్రమప్రకారంబుఁ దెలిపె. నవమావతారమున మహర్షులెల్లఁ బ్రార్థింపఁ బృథురూప మెత్తి యీమహి నోషధులు మున్నగుపాలు పితికె. పృథివీదోహనకారణంబున నీయవతారము కమనీయతమం బై యమరె. దశమావతారమునం జాక్షుషమన్వంతరమునం దకాలమున జలప్రళయము పొసఁగుటయు మత్స్యరూపము ధరించి వైవస్వతమనువుం బ్రోచె. ఏకాదశావతారమున దేవదానవులు మందరగిరిఁ గవ్వముగా నమర్చి యర్ణవంబుఁ ద్రచ్చునెడఁ గూర్మరూపముఁ గొని యమ్మందరమున కాధారంబై యమరె. ద్వాదశావతారమున ధన్వంతరిరూప మెత్తి యమృతకలశముఁ దెచ్చె. త్రయోదశావతారంబున జగన్మోహనం బైనమోహినీరూపము గ్రహించి యసురులకు మోహముం గూర్చి సురల కమృతపానంబు సమకూర్చె. చతుర్దశావతారమున నాశ్చర్య మగునరసింహరూపము ధరించి బలియుఁ డగు హిరణ్యకశిపుఁ డనుదైత్యునిఁ దొడపై నిడికొని చాఁప లల్లువాఁడు తుంగల నె ట్లట్లు గోళ్ల వానిం జీల్చి పరిమార్చె. పంచదశావతారమున వామనరూపము ధరించి బలియధ్వరమునకుఁ జని మూఁడడుగుల కొలఁది పుడమి యడిగి యాతం డాక్రమించికొన్న ముల్లోకములం గ్రమ్మఱ సాధించి యింద్రున కొసంగె. షోడశావతారమునఁ బరశురాముఁ డై ధర్మద్రోహంబు సేయురాజుల కలిగి యిరువదియొక్కమాఱు విక్రమించి క్షత్రియక్షయంబుఁ గావించె. సప్తదశావతారమునఁ బరాశర మునీంద్రునకు సత్యవతియం దుద్భవించి తత్కాలపురుషు లల్పబుద్ధులగుటఁ దనలోఁ బరిపోసి వేదాధ్యయనంబు వారికి సుకరంబు గాఁగ వేదపాదపశాఖల విభజించి వేదవ్యాసు డనం బ్రఖ్యాతిఁ గాంచె. అష్టాద

శావతారమున దేవకార్యమును నెఱవేర్ప దశరథనందనుండై శ్రీరామ
నామధేయంబు ధరించి సముద్రుని నిగ్రహించి తన్మధ్యమున సేతు
బంధనము మున్నుగా నత్యంతవీర్యప్రధానంబు లైనపెక్కుకార్యము
లొనర్చె. ఏకోనవింశవింశావతారముల యాదవులలోన వసుదేవునకు
దేవకీదేవియందు రామకృష్ణరూపముల నవతరించి భూభారంబు హరి
యించె. ఏకవింశావతారంబుగాఁ గలియుగమున రాక్షసులకు సమ్మో
హంబుఁ గావించుతలంపునఁ గీకటదేశమున జనుఁడనువానికిఁ బుత్త్రుఁడై
బుద్ధరూపం బెత్తఁగలండు. ద్వావింశావతారంబుగాఁ గలియుగాంతమున
యుగసంధ్యతఱి రాజులెల్ల ధర్మ మెడలి స్వార్థమాత్రపరులై దస్యు
ప్రాయు లగునెడ విష్ణుయశుఁ డనువిప్రునకుఁ గల్కిరూపమున నవతరింపఁ
బోయెడు. ఊఁట యుడుగనిసరస్సునం గాలువలమాడ్కి సత్త్వనిధి
యగుహరియవతారము లసంఖ్యాకంబులై ప్రవర్తిల్లు. ఋషులు మునులు
సురలు మనుపుత్త్రులు ప్రజాపతులు మున్నుగా నెల్లవారు హరి
విభూతి విశేషంబ కాని యొండుగాదు. ఇయ్యవతారంబులలో నెల్లఁ
గొన్ని హర్యంశములుగను కొన్ని యంశాంశములుగనుం దనరి దైత్య
వ్యాకులంబైనలోకమునకుఁ బ్రతియుగమున సుఖముఁగూర్పఁగ యథోప
యోగముగ జ్ఞానక్రియాశక్తులకు సమావేశము గలిగించుచుండు. వసు
దేవునకు దేవకీదేవియం దవతరించిన కృష్ణుఁడన్ననో యట్లు గాక సర్వపరి
పూర్ణుండై యావిష్కృతసకలశక్తివిలసితుండై సాక్షాన్నారాయణుండ
యగు. అతిరహస్యం బైనయీభగవదవతారప్రకారంబు శుచియై ప్రతి
దినము సాయంప్రాతఃకాలముల నత్యంతభక్తిం గీర్తించునరుండు దుఃఖ
భూయిష్ఠ మగుసంసారమువలన ముక్తిం గాంచు. రూపహీనుఁడై చిదేక
రసుఁడైనయాత్మున కీరూప మాత్మమాయాగుణము లగుమహదాదు
లచే నాత్మస్థానమునం గల్పితం బయ్యె. వాయువు నాశ్రయించియుండు
మేఘమండలము నాకాశమందుఁ, బృథివ్యాశ్రితం బైనపరాగముఁ బవ
నునందు, నెట్టులట్టుల యజ్ఞులు స్వరూపావరణలక్షణ మగు నధ్యాసము
నద్రష్ట యగునాత్మునందు దృశ్యత్వాదిధర్మముల నొప్పుశరీరము నారో
పింతురు. స్థూలరూపములకంటె సూక్ష్మంబై కరచరణాదిరూపములఁ
బరిణామంబుఁ జెందనిగుణములఁ నుపబృంహితంబై యాకారవిశేషము

లేమిం జేసి వస్తుదర్శనశ్రవణములం గాంచని జీవోపాధి యగు లింగశరీ
రము జీవునకుత్క్రమణగమనాగమనములకు నిమిత్తంబై యొప్పు. కార్య
కారణాత్మకము లగుస్థూలసూక్ష్మరూపములు రెండు నాత్మునియం దవి
ద్యాకల్పితంబుల కాని వాస్తవములు గావని సమ్యగాత్మజ్ఞానమునఁ బ్రతి
షేధముఁ గావింపఁబడునప్పుడు జీవుఁడు జ్ఞానైకస్వరూప మగుబ్రహ్మంబ
యగు. సంసారచక్రమునం గ్రీడించుసర్వజ్ఞుఁ డగునీశ్వరునిమాయాదేవి
యావరణవిక్షేపము లొనర్పక యుపరమంబుఁ గావించి విద్యారూపమునం
బరిణమించి సదసద్రూపం బగుజీవోపాధిని నీఱు చేసి యుపరమంబుఁ
గాంచునేని యప్పు డతఁడు బ్రహ్మస్వరూపసంపన్నుఁ డని తత్త్వవిదు
లెఱుంగుదురు. పెక్కు లేల? అప్పు డతఁ డాత్మీయ మగుపరమానంద
రూపమునఁ బూజితుం డగు. జీవునకు జన్మాదులు మాయాకార్యంబులైన
విధముననే యంతర్యామి యగునీశ్వరునకును గర్తృత్వంబు లేకున్ననుం
గర్మంబులును జన్మాదులు లేకున్న నవతారంబులును వేదరహస్యం
బులై చెల్లుచుండు నని పెద్దలు వర్ణింతురు. ఈశ్వరుండు దనయమో
ఘలీలం జేసి యీవిశ్వమునకు సర్గస్థితు లొనర్చుచుఁ దాను వానిం దవు
లక షడింద్రియనియామకుండై స్వతంత్రుఁడై భూతజాలమున నంతర్హి
తుండై యింద్రియషడ్వర్గవిషయమెల్ల గంధముఁబోలెదూరమునం గ్రహిం
చుఁగాని యించుకేనియు నందు సక్తుండు గాఁడు. స్వాతంత్ర్యపారతం
త్ర్యములే యీశ్వరునకు జీవునకును విశేషమైయుండెడు. మనోవచన
ములనామరూపవిస్తారంబుఁ గావించుజగదీశ్వరలీలలు కుబుద్ధి యగు
వాఁడు తర్కాదికుశలత్వమున ననభిజ్ఞుఁడు నటచర్యంబోలె నెఱుఁగ
నేరఁడు. ఋజు వగునిరంతరానువర్తనంబున భగవంతునిచరణారవిందగం
ధము సేవించుభక్తుఁడ దురంతవీర్యుఁడై యప్పరమపురుషపదవి నెఱుంగు.
సకలలోకనాథుఁ డగువాసుదేవునియెడ సర్వాత్మకముగ నాత్మభావ
మొనర్చి గర్భవాసాదిరూపం బైనజన్మాద్యావృత్తులఁ దప్పి భగవంతులు
కృతార్థులగుదురు. వేదతుల్యంబై హరిచరిత్రప్రతిపాదకంబై లోకక్షేమం
కర మైనభాగవత మనునీపురాణమును వేదవ్యాసమహామునీంద్రుఁడు
రచియించి లోకములకు శ్రేయముఁగూర్పువాఁడై యాత్మవిద్వరుఁడైన
తనకుమారుని శుకమునీంద్రుని జదివించె. సర్వవేదేతిహాసములలోనెల్ల

నేఁటియేఁటి యెత్తినసారం బైనయీపురాణమును శుకయోగీంద్రుఁడు గంగాతీరమున మహర్షులు పరివేష్టింపఁ బ్రాయోపవిష్టుం డైనపరీక్షిన్మహారాజునకు వినిపించె. అప్పు డమ్మహాయోగీంద్రుఁడు వ్యాఖ్యానంబు సేయునెడ నేను నందుఁ గూర్చుండి యమ్మహాత్ము ననుగ్రహమున నీపురాణరత్నము గ్రహించితి. విప్రవర్యులారా! మీరును సాధువ్యవసాయమునఁ దదర్థము నెఱుంగ నిష్ఠఁ గొనియున్నవారు. కావున నాచదివినయమ్మహాపురాణము నేర్చినకొలఁది మీకు వినిపించెద. కలియుగమునఁ గృష్ణుండు ధర్మజ్ఞానాదులతోడ నాత్మధామమున కరుగుటయు నష్ట దృష్టు లగువారికిఁ బ్రకాశముఁ గూర్ప నీపురాణమురవి యిప్పు డుదయించె నని సూతుండు సెప్పుచున్నంత దీర్ఘసత్త్రదీక్షితు లగునమ్మునులలో నెల్ల వృద్ధుఁడు కులపతి బహ్వృచుఁడు నగుశౌనకమునీంద్రుఁ డప్పురాణవిదుం బ్రస్తుతించి యిట్లనియె.

### శౌనకాదులు భాగవతకథఁ జెప్పు మని సూతు నడుగుట

సూత! రోమహర్షణసుతా! భగవంతుం డైనశుకయోగీంద్రుండు సెప్పిన పుణ్య మగుభాగవతకథను మాకు వివరింపుము. ఏయుగమున నెచ్చోట నేనిమిత్తమున నెవ్వం డడుగ బాదరాయణుఁ డాసంహితను రచియించె. అప్పారాశర్యకుమారుండు మహాయోగి సమదర్శనుఁడు నిరస్తభేదుఁ డేకాంతమతి మాయాశయ్య విడిచి మేలుకొన్నవాఁ డాత్మశక్తిప్రకటనంబు సేయని గూఢవర్తనుఁడునై మూఢునిరీతి నున్మత్తుని కైవడి మూఁగమాడ్కి జడునివడువునం గురుజాంగలదేశములం గరినగరమునఁ దిరుగునెడఁ జారు లెట్టు లాతనిఁ గనిపెట్టిరి? సర్వసంగముల సన్న్యసించి వివస్త్రుఁడై చనుచున్నతనసుతు శుకయోగీంద్రు వెంబడించి పారాశర్యుండు చనునెడ నాచెంగట జలక్రీడ లాడుచున్న యప్సరస లాసాత్యవతేయుం గాంచి యతండు పుట్టంబులు గట్టియున్నను సిగ్గుపెంపునఁ దమచీరలు గట్టిరి. ఆవిచిత్రంబుఁ గాంచి వారలం బిలిచి కృష్ణద్వైపాయనుం డిది యేమి వస్త్రధరుం డైననన్నుఁ గనుంగొని సిగ్గుపడితిరి? నాకుమారుండు నగ్నుం డైన నతనిం గాంచినపుడు మీకేల సిగ్గుదోఁపకుండె? ననియడుగుటయు మునీంద్రా! నీకు స్త్రీపురుషభేదజ్ఞానంబు గలదు గావున నిన్నుఁ గాంచిన మాకు సిగ్గయ్యె, నీకుమారుఁడు

వివిక్తవర్ణునుం డై స్త్రీపురుషభేదజ్ఞానంబు లేనివాఁడు గావున నాతనిం జూచిన మాకు సిగ్గు వొడమకుండెడు ననిచెప్పి రని విందుముగదా. అట్టి బ్రహ్మనిష్ఠునితోడఁ బరీక్షితునకు సంవాదం బెట్లు సంఘటించె ? ఎట్లు భాగవతకథ నాతం డాతనికిఁ జెప్పె ? ఆతండు గృహస్థులయిండ్ల ముందటఁ దదాశ్రమమునకుఁ బావనత్వంబుఁ గావించుతదర్థము గోదోహనకాలము మాత్రమే ప్రతీక్షించియుండుఁగాని యొక్కచోట నైనఁ బెద్దకాలంబు నిలువఁడుగదా ? అభిమన్యునందనుం డైనపరీక్షిత్తుఁడు మహాభాగవతుఁడని బుధులు సెప్పుదురు. పరమాశ్చర్యం బైన యతని జన్మంబును గార్యములను మాకు వివరింపుము. పాండవమానవర్ధనుం డైనయాచక్రవర్తి తనరాజాధిరాజసంపద ననాదరించి యేలగంగాతీరమునం బ్రాయోపవేశంబునకుఁ దెగువ పూనె ? శత్రురాజులెల్లఁ దమమేలు గోరి యపరిమితధనములతోడఁ దనయడుగుల కెఱఁగుచుండఁ ద్యజింపరాని యామహారాజ్యలక్ష్మిని దాఁ బ్రాయపువాఁడయ్యుఁ బ్రాణములతోడ నక్కటా ! యెట్లు విడువ నుద్యోగించె ? భగవత్పరాయణు లగు మహాత్ములు లోకమునకు సుఖము సమృద్ధి నైశ్వర్యముం గూర్చుపొంటె జీవింతురుగాని యాత్మనిమిత్తంబు గాదు. పరీక్షితుఁడు విరక్తుఁడై నం బరుల కాశ్రయం బైనతనమే నేల విడిచె? ఏదేని కొంచెమే యడిగిన నీ వీయర్థమెల్ల మాకు లెస్స తేటపఱుపుము. వైదికేతరము లగుపురాణేతిహాసాదివాక్యములయర్థముఁ బ్రతిపాదించునెడ నీవు పట్టాభిషిక్తుండ వని యే నెఱుంగుదు నని యడిగిన నమ్మునుల కప్పౌరాణవిదుఁ డిట్లనియె.

### సూతుఁడు శౌనకాదులకు భాగవతరచనానిమిత్తముఁ జెప్పఁబూనుట

మునులారా ! తృతీయ మగుద్వాపరయుగము చరమభాగమునం బరాశరున కుపరిచరవసువీర్యసంభూత యగుసత్యవతియందు విష్ణుదేవునంశమునం గృష్ణద్వైపాయనుండు యోగాభ్యాసతత్పరుం డైనవాఁడవతరించె. అతీతానాగతవిదుం డైనయమ్మహర్షి వ్యాసుఁ డొక్కనాఁడు సరస్వతీనదిం గృతస్నానుండై శుచియై యాహ్నికములనెల్ల నెఱవేర్చి సూర్యోదయానంతర మొక్కవివిక్తదేశమున నాసీనుండై యెఱుంగ రానివేగమునఁ దనరుకాలమునం జేసి ప్రతియుగమున భూమిలోఁ గలుగు

పుణ్యపాపరూపంబు లైనయుగధర్మంబులసంకరం బరసి తన్నిమిత్తంబునఁ గలియుగమున నొదవుపాంచభౌతికశరీరముల శక్తిహ్రాసంబును బ్రాణుల శ్రద్ధారాహిత్యంబును సత్త్వగుణ హీనత్వంబును బుద్ధిదోషంబును నాయురల్పత్వంబును బలక్షయంబును దనదివ్యజ్ఞానమునం దలపోసి తాను సర్వోపకారకతత్త్వంబుఁ దెలిసినవాఁడు గావున సర్వవర్ణాశ్రమముల కెయ్యది లెస్స హితం బగు నద్దానిం జింతించి వేదచోదితంబైన చాతుర్హోత్రముఖవిధానంబు జనులకుఁ జిత్తశుద్ధికరం బని యెంచి యయ్యజ్ఞప్రచారంబు చెల్లఁగ వేదమెల్ల నొక్కటియై యున్నఁ దదధ్యయనంబు జనులకు సుకరంబుఁ గావించువాఁడై ఋగ్యజుస్సామాథర్వనామములఁ జతుర్విధముగ విభజించి వేదార్థోపబృంహకము లగునితిహాసపురాణములం బంచమవేదముగాఁ గల్పించి యాచతుర్విధ వేదములం గ్రమమునఁ బైలజైమినివైశంపాయనసుమంతులనుం జదివించి పంచమవేదం బైనయితిహాసపురాణముల నాతండ్రి యగురోమహర్షణునకుఁ బ్రసాదించె. వ్యాసశిష్యు లైనయలపైలజైమినివైశంపాయనసుమంతులనుమునులు తమతమవేదములం బహుశాఖలుగా విభజించి శిష్యప్రశిష్యులం జదివించుటయు వేదశాఖ లత్యంతబహుళంబు లయ్యె. సమగ్రవేద్యంబుఁ జదువ సమర్థత లేని యీ కాలంపుమందమతు లావేదశాఖలనే యిప్పుడు చదువుదురు. దీనదయాళుం డైనవేదవ్యాసమహామునీంద్రుఁ డిత్తెఱంగున వేదవిభాగంబుఁ గావించి వేదవచనములు విన నధికారము లేకయు శ్రేయస్సాధనం బైనకర్మమార్గముఁ బడయఁ జాలకయు వగచు స్త్రీశూద్రులకు మేలుగావింప వేదసమ్మతం బైనమహాభారతం బనునితిహాసంబు రచియించె. ఇవ్విధంబున నెల్లకాలము భూతములశ్రేయంబుకై ప్రవర్తించుచుండిన యోవిప్రులారా! యావేదవ్యాసునకు సర్వాత్మకంబుగా హృదయసంతోషంబు గలుగకుండె. అంత నొక్కనాఁడు పావనంబగు సరస్వతీతటమున నాతి ప్రసన్నచిత్తుండై యాసాత్యవతేయుఁ డొంటిమైఁగూర్చుండి యక్కటా! యేను నియమముతో వేదములనెల్లఁ జదివితి, గురువులఁ గొలిచితి, సగ్నులనుపాసించితిఁ, గపటము లేక గుర్వానుశాసనంబు నడపితి, మహాభారతవ్యాజమున స్త్రీశూద్రాదులకు నెఱుంగ వేదార్థంబు వివరించితి, నిట్లుండినను వస్తుగతిఁ బరిపూర్ణుఁడయ్యు

బ్రహ్మావర్చసవిలసితుండయ్యుఁ గమనీయతముండయ్యు మదీయ దేహమున నున్న జీవాత్మం డేలొకో తాదాత్మ్యసంపత్తిం గాంచనివానియట్లపోలెం దోఁచుచుండెడు. భాగవతధర్మములం దదేకనిష్ఠమెయిఁ బ్రాయికముగ నిరూపింపనైతిం గాఁబోలు, నయ్యదియేకదా పరమహంసులకు నచ్యుతు నకుం బ్రియంబు లని యేకాంతమునం దనలోఁ బలుతెఱంగుల వితర్కించుచుండె.

## వ్యాసునొద్దకు నారదుఁడు వచ్చుట

అట్లు చింతిల్లుచున్న ఖిన్నచిత్తుండగు నా వ్యాసుఁ గాంచ నయ్యాశ్రమమునకు నారదుం డరుగుదెంచినం బరాశరాత్మజుం డద్దేవర్షిం గాంచి తటాలున లేచి యెదురేఁగి తోడితెచ్చి యుత్తమాసనంబునం గూర్చుండం జెప్పి విధియుతముగఁ బూజించుటయు వీణాపాణి యగు నా దేవర్షి పుంగవుండు మందహాససుందరంబుగా నా బ్రహ్మర్షి కిట్లనియె. పారాశర్య మునీంద్రా! నీశరీరాభిమాని యగునాత్మ యాశరీరమునను మనోభిమాని యగునాత్మ యామనంబునను బరితోషంబు గాంచునె? తెలియం గోరం దగినధర్మాదు లెల్ల నీకు సంపన్నంబులు. మఱియు సాధ్వనుష్ఠితంబులు. సర్వధర్మాదులం బరిపూర్ణంబై మహాద్భుతంబైనమహాభారతమును నీవు రచియించితివి. మఱియు నిత్యమగు బ్రహ్మము విచారించి పడసితివి. ఇట్టివాఁడవయ్యు నకృతార్థునిరీతి యేల యాత్మవిషయమున శోకింతు వని యడిగిన నానారదునకు ద్వైపాయనుం డిట్లనియె. మునీంద్రా, నీచెప్పినదెల్ల నొప్పియున్న నాయాత్మ యేలొకో పరితుష్టిం గాంచదు. దానికిం గారణంబు నాకుం దోఁపదు. బ్రహ్మదేవుని దేహమున నుద్భవించి యగాధబోధమున విలసిల్లు నిన్నుం దత్కారణం బడిగెద. ఆత్మసంకల్ప మాత్రమునం గుణముల నీలోకముం బుట్టించుచుం బాలించుచు నుపసంహరించుచుం దద్గుణములం దాను దవులక కార్యకరణముల రెంటిని నియమించుపురాణపురుషు నుపాసించితివి గావున సర్వరహస్యములు నీ వెఱుంగుదువు. మఱియు నీవు ముల్లోకములం దిరుగువాఁడవై యాదిత్యునిమాడ్కి సర్వముంగాంచుచు యోగమహిమమునం బ్రాణవాయువు రీతి సర్వప్రాణులలోనం జరించుచు బుద్ధివృత్తుల నెఱుంగుదువు గావున నీవు ధర్మయోగమునం బరబ్రహ్మనిష్ఠం గాంచి శబ్దబ్రహ్మ మగు వేదమునం

బరినిష్ఠితుం డైన నా కెయ్యది మిక్కిలి తక్కువయై యుండు నద్దానిం దెలియం జెప్పు మని యడిగినం బారాశర్యునకు నారదుండు వెండియు నిట్లనియె.

నారదుండు భాగవతము రచింపు మని వ్యాసునకుం జెప్పుట

సత్యవతీసుతా! నిర్మలం బైనభగవంతునియశము నీవు ప్రాధాన్యమున వర్ణింపవైతివి. దాని విడిచి ధర్మాదుల నెద్దానిం జెప్పినను నా వాసుదేవునకుం బ్రియంబు గాదు. నారాయణప్రీణనంబు సేయంజాలని జ్ఞానము శూన్యమని నామతంబు. ప్రసంగవశమున వాసుదేవుమహిమ మచ్చుటచ్చట వర్ణించితివకాని ధర్మాదుల నెట్లట్లు తాదర్థ్యబుద్ధితో వివరింపవైతివి. చిత్రపదాలంకారభాసురంబయ్యు వచనము జగత్పావనం బైనహరియశముం గీర్తింపదేని యయ్యది వాయసతీర్థం బనం బరఁగి కాకతుల్యు లగుకాముకులకు రతిస్థానంబై సత్త్వప్రధానం బైన మానసమునం బ్రవర్తిల్లు బ్రహ్మాశ్రయం బగు పరమహంససందోహం బునకుం గ్రీడాస్థానంబు గాదని పెద్దలు దలంతురు. శ్లోకములెల్ల నపశబ్దాదిదోషభూషితంబులై యున్నను సాధువులెల్ల శ్రవణకీర్తన గానములం గ్రహించు భగవత్కీర్తిచిహ్నితంబులైనదివ్యనామము లెందు వర్ణింపఁబడు నవ్వచనప్రయోగంబె సకలజనులపాపజాలంబులం బాఱం దోలు. నిష్కర్మతాపాదకంబు సకలోపాధినివర్తకంబు నయ్యు జ్ఞానమేనియు భగవద్భక్తివిరహితం బగునేని లెస్స యపరోక్షభావనం గలిగింపఁజాలదు. సాధనసమయమునను ఫలావసరమునను దుఃఖరూపం బైననిత్యనైమిత్తికకామ్యకర్మజాతంబు, భగవంతునకు భక్తిమై నర్పింపఁ బడకుండినం బ్రకాశింప దని వేఱ చెప్పవలయునే. కావున యథార్థ మతియుం బావనకీర్తియు సత్యరతియు వ్రతధృతియుం గలిగి మహాభాగుండ వైననీవు వాసుదేవునివివిధలీలావిచేష్టితంబుల నేకాగ్రచిత్తమున నఖిలబంధమోక్షార్థంబు దలపోసి వర్ణింపుము, కాదేని విష్ణులీలల విడిచి వేఱొక తెఱంగున నేదేనొకయర్థాంతరంబు సెప్పఁ బూనినం దానం దోఁచురూపనామభేదములం జేసి యవ్యవస్థితం బై మతి పెనుగాలికిం దూలునావకైవడి నొక్కనాఁడేనియు నియత స్థానంబుఁ గాంచదు. మఱియు స్వభావముననే విషయరక్తుం డగు

పురుషునకు ధర్మార్థంబు నింద్య మగుకామ్యకర్మము మున్నగువాని నీ వనుశాసించుటంజేసి భవద్వచనంబు నమ్మి ప్రాకృతజనుఁ డయ్యది యే ముఖ్యధర్మ మని భావించి తత్కర్మనివారకం బైనయుత్తమ జ్ఞానంబు దెసఁ బోవ కుడుగుం గావున నివృత్తిమార్గప్రవృత్తి గలిగింపనికారణమునంజేసి శాస్త్రమార్గ మతిక్రమించురీతిం బ్రత్యవాయంబై యెప్పుడు, కేవలనివృత్తిపథం బన్ననో యయ్యది సర్వసాధారణంబుగాదు. దాన నత్యంతనిపుణుఁ డగునెవ్వఁడే నొక్కఁడు పరమేశ్వరు నిర్వికల్పసుఖాత్మకరూపం బెఱుంగఁజాలుఁగాని యందఱుం దానఁ గడ తేఱ నేరరు. కావున నీవు దేశకాలముల సంతతముం గాంచని దేవదేవుని లీలాచేష్టితంబులనెల్ల దేహాభిమానియై గుణములం బ్రవర్తించు జనునకుఁ దెలియ వివరింపుము. స్వధర్మ మగుకర్మాదుల నిరసించి హరిచరణారవిందములఁ గొల్చువాఁడు భక్తిపరిపాకంబు నొందకమున్న కృతార్థుండు గాక నడుమన భ్రష్టుండైనను మేను దొఱఁగిన నాభక్తిరసికునకు భక్తివాసనాప్రభావమునంజేసి యేలోకమునన్నైన నేశరీరమునన్నైన నమంగళంబు గలుగదు. భక్తిహీనులు కేవలకర్మములం గృతార్థు లగుట యరిది. గంభీరవేగ మగుకాలమునం జేసి యెల్లెడల దుఃఖమువోలె విషయసుఖమునుఁ బ్రాచీనకర్మబలమునఁ దనంతన వచ్చుచుండుఁగాని మీఁద బ్రహ్మపర్యంతము క్రింద స్థావరంబులుదనుకం బరిభ్రమించుచు జీవుల కలభ్యం బైననిత్యసుఖము సాధింప యత్నము పండితునకుఁ గర్తవ్యంబు. ముకుందభక్తుఁ డగుజనుఁడు కర్మవశమున నీచజన్మ మెత్తిన నొకప్పుడేనియు నభక్తునిరీతి సంసారక్లేశంబుఁ గుడువఁడు. భగవచ్చరణసేవారసము చవిఁగొన్న యుత్తముఁడు గ్రమ్మఱ దాని విడువనొల్లఁడు. ఈజగంబెల్ల సర్గస్థితిలయకారణంబై ప్రపంచాతీతుండైన యీశ్వరునిరూపంబ కాని యొండుగాదు. ఇయ్యర్థ మెల్ల నుపనిషద్వచనముల నీవ యెఱుంగుదువు. ఐన నత్యల్పంబుగఁ దదర్థ మేను సూచించితి. నీ కితరులు సెప్ప నేల? అమోఘదర్శనా, లోకానుగ్రహార్థంబు పరమపురుషునంశమునం జనించినవానిఁగా నిన్ను నీవ యెఱుంగుము. నీజన్మం బిట్టిది గావున మహానుభావుఁ డగుశ్రీకృష్ణునిలీలల విస్తరించి చెప్పుము. ఉత్తమశ్లోకుఁ డగుభగవంతునిగుణముల వర్ణించుటయే పురుషుఁ డాచ

రించుతపమునకు వేదాధ్యయనమునకు యజ్ఞానుష్ఠానమునకుఁ దటాకాది పూర్తనిర్వర్తనమునకు సూనృతవచనమునకు దానవిధానమునకుం జెడని ఫలం బని పెద్దలు పల్కుదురు.

## నారదుఁడు వ్యాసునకుఁ దనపూర్వజన్మ చరిత్రము చెప్పఁబూనుట

ఏను బూర్వకల్పమునం దొలిజన్మమున వేదవాదులయింటఁ బరిచర్య సేయునొక్కదాసికిఁ గుమారుండనై జనించి వర్షకాలమునం జాతుర్మాస్యదీక్షానియమమున యాత్ర సాలించి యొక్కచో నిలిచియున్న సన్న్యాసులకుఁ బరిచర్య సేయ బాల్యముననే నియుక్తుండనై యమ్మహాత్ముల సేవించుచుండుటయు నమ్మునులును తుల్యదర్శనులయ్యుఁ జాపలంబువిడిచియు నాటలు దొఱంగియు నింద్రియముల నిగ్రహించియు మితభాషిత్వంబుఁ బూనియు ననుకూలవృత్తిం గొల్పుచున్న నాయెడఁ గరుణించిన నేను దదనుజ్ఞఁగొని వారియెంగిళులు గుడుచుచు దానం బాపంబులెల్ల నెడలఁ జిత్తశుద్ధిఁ గావించిన నాకీశ్వరభజనంబున మనఃప్రీతియుదయించె. దానంజేసి శ్రద్ధావంతుఁడనై యమ్మునులయనుగ్రహమ్మున నెల్లప్పుడు వారు కీర్తించుమనోహరము లగుకృష్ణకథలు వినునెడ నత్యంతాసక్తిఁ గాంచితి. నిరంతభగవత్కథాశ్రవణాసక్తిం జేసి నాకుఁ బరమేశ్వరుపై నప్రతిహతమతి జనించె. దాన నేను బ్రపంచాతీతబ్రహ్మరూపుఁడగునాయందు స్థూలసూక్ష్మరూపంబులు రెండును నిజావిద్యామహిమకల్పితంబుల కాని వాస్తవంబులు గావని చూచుచుండెద. ఇట్లు వర్షశరదృతుమాసములు నాలు గమ్మహాత్ములు కీర్తించువిమలహరికీర్తివినవిన నాకు రజస్తమోగుణముల నిరసించుభగవద్భక్తి తనర్చె. నిత్యానురాగము వినయము శ్రద్ధ యింద్రియనిగ్రహము పరిచర్యయుం గలిగి క్షీణపాపుఁడై వర్తించునన్ను బాలుఁడని యెంచక దీనవత్సలులైన యమ్మహామునులు చాతుర్మాస్యదీక్షావసానమున నచ్చోటు వాయువారు భగవంతుండు తానే చెప్పినపరమరహస్య మగుపరమేశ్వరతత్త్వజ్ఞానము నాకుపదేశించిరి. భగవత్పదప్రాప్తిసాధనంబైన తదుపదేశమహిమంబునం జేసి యేను వాసుదేవుని విచిత్రమాయాప్రభావంబు నెఱింగితి. సర్వనియామకుఁడ ప్రచ్యుతపూర్ణరూపుఁడు నగునీశ్వరునియెడ సకలకర్మముల సమర్పించుటయే యాధ్యాత్మికాదితాపత్రయనిర్మూలనమునకు మంచిమందై

సత్త్వమును శోధించు నని సూచితం బయ్యె. స్వతంత్రప్రయోగమున రోగనిమిత్తంబులయ్యె ఘృతాదిపదార్థములు గొన్నిలాఁతివస్తువుల తోడం గూడి యౌషధమై యారోగముల నుపశమింపఁ జేయుచాడ్పున సంసారకారణంబయ్యెఁ గర్మము భగవదర్పణసహాకృతం బగునేని సంసారనివృత్తిం గావించు. ఇవ్విధంబునఁ దొలుత సాధుసేవనంబుగలిగినం దానఁ దత్కరుణాలాభము, దానివలన ధర్మశ్రద్ధ, యాశ్రద్ధవలన భగవత్కథాశ్రవణంబు, దాన భగవదాసక్తి, యయ్యాసక్తివలన దేహద్వయ వివిక్తాత్మజ్ఞానం, బాజ్ఞానమున దృఢభక్తి, యాభక్తివలన భగవత్తత్త్వ విజ్ఞానంబు, దాన సర్వజ్ఞత్వాదిభగవద్గుణావిర్భావంబునుం గ్రమమునఁ గలుగు. భగవదర్పణపూర్వకముగఁ జేయఁబడుకర్మము భక్తియోగసమన్వితంబైన జ్ఞానము నొదవించు. కర్మభోజనహోమదానతపంబులెల్ల నాకర్పింపుమని భగవంతుఁ డర్జునున కుపదేశించినగీతార్థంబుఁ దలపోసి తత్క్రి మమునఁ గర్మముల నాచరించువారు కృష్ణనామకీర్తన కృష్ణస్మరణములం జేసినవారగుదురు. నమశ్శబ్దము చతుర్థ్యేకవచనాంతములగుభగవద్వ్యాష్ట ద్వాసుదేవశబ్దంబులు ధీమహి యనుపదంబును జతుర్థ్యేకవచనాంతప్రద్యుమ్నానిరుద్ధశబ్దంబులును నమశ్శబ్దంబును జతుర్థ్యేకవచనాంతసంకర్షణ శబ్దంబునుం గూడినమంత్రముల మంత్రమూర్తియు నమూర్తియునగు యజ్ఞపురుషునుపాసించుపురుషుఁడు సమ్యగ్దర్శనుఁడనంబడు. ఇత్తెఱంగుననే నాత్మోపదేశ మనుష్ఠించిన దానికిఁ బ్రసన్నుండై కేశవుండు జ్ఞానైశ్వర్య భక్తియోగముల నాకొసంగె. బహుశ్రుతా! నీవును విశ్రుతం బైన విష్ణుయశంబు వర్ణింపుము. దానిం దెలిసినవిద్వాంసులకు వేద్యంబుల నెఱుంగఁ గోర్కి వేద్యాంతరంబు లేమిం జేసి దానితో సమాప్తిఁ జెందు. ఘోరసంసారక్లేశములఁ గుందువారికి దానం దక్క మఱియొద్దాని వలనను శాంతి గలుగనేరదు. నీవాహరియశంబు ప్రధానముగ వర్ణింతువేని నీకుఁ జిత్తతుష్టియు లోకమునకు మహోపకారంబు నగు నని చెప్పినం బారాశర్యుఁడు నారదునిజన్మకర్మములం దెలిసి యోబ్రహ్మనందన మునీంద్రా! నీకు జ్ఞాన ముపదేశించినయమ్మునులు చాతుర్మాస్యదీక్షాంతమున దేశాంతరమున కరుగ నాబాల్యదశనుండి నీ వేమి చేసితివి ? పిమ్మటి వయఃకాలం బెట్లు కడపితివి? కాలమున నాదాసీపుత్త్రకళే

బరం బెట్లు విడిచితివి? ప్రాక్కల్పమున నడచిన యీకథలనెల్ల నెట్టు లిప్పటికిని స్మరింపఁ గలిగితివి? కాలము సర్వనిరాకృతిసమర్థంబు గాదె? అనియడుగుటయు నావేదవ్యాసునకు నారదుండు వెండియు నిట్లనియె.

## నారదుఁడు వ్యాసున కాత్మమాతృవియోగంబు చెప్పుట

మునీంద్రా! నాకు జ్ఞాన ముపదేశించినమహామునులు దీర్ఘకాలమున నాచోటు వాసి చనినపదంపడి మదీయవర్తనం బెట్లుండెనని చెప్పెద వినుము. ఏకపుత్త్ర యగునాతల్లి స్త్రీస్వభావమున నస్వతంత్రయై కార్యనిశ్చయంబుఁ దెలియని మూఢురాలు గావున నింటిపనులు చేసికొనుచు నాకు యోగక్షేమంబులు గూర్పఁ దలంపు గలిగియు నయ్యది నెఱవేర్ప నేరక గత్యంతరంబు లేనియేకపుత్త్రుండైన నాపైఁగడుఁగూర్మి సేయుచుండు నట్టితల్లిని విడిచిపోవ వలనుగాక దారుమయంబైననారిలీరున లోకమెల్ల నీశ్వరువశమున నుండఁగలయది యని నిశ్చయించి యప్పు డేమియుం జేయఁజాలక దిగ్దేశకాలములఁ దెలియఁజాలని యయ్యైదేండ్లప్రాయమున బ్రవ్రజనం బప్పటికిఁ దగదని నాలోనం దలపోసి కాలముఁ బ్రతీక్షించుచు నాబ్రాహ్మణకులముననే యుండునంత నొక్కనాఁడు మాతల్లి రాత్రివేళ నిల్లుదాటి చనినగోవుం బాలు పితుకఁ బోవుచుఁ దెరువునఁ గాల నొక్కపాముసు దాఁచినం గాలచోదితంబై యయ్యాశీవిషంబు దీనురాలగు నాతల్లిని గఱచి యసువులకు వెలిచేసె.

## నారదుండు ప్రవ్రజితుండై శ్రీహరిం గాంచుట

ఏ నామాతృవియోగం బప్పటికి భక్తులమేలు గోరునీశ్వరు ననుగ్రహము నాయెడ ఫలించినఫలం బని తలంచి యుత్తరదిక్కు పట్టి చని సమృద్ధము లగుదేశముల, నందలిపట్టణములను, గ్రామములను, మందలను, గనులను, గృషీవలనివాసములను, గొండనెత్తపు బల్లియలను, గ్రామనగరాంతరస్థితంబులై గిరినదులనాశ్రయించినఖర్వటంబుల, నుద్యానవాటికలను, వనములను, దోఁటల, నేనుంగులు విఱిచినకొమ్మలుగలుగు మ్రాకులఁ దనరి చిత్రధాతువులవిచిత్రంబులైనపర్వతంబులను, శుభసలిలము లగుతటాకములను, నద్భుతంబుగ నెలుఁగిచ్చుపులుఁగులను,

మకరందపానాసక్తిం ద్రిమ్మరుతుమ్మెదలను నమరి యమరసేవితంబు లైనకమలాకరంబులను, నీలవేణుశరస్తంబకుశకీచకగహ్వరంబై వ్యాళో లూకశివాదిదారుణమృగసంచారస్థానం బై భీకరం బైనఘోరవిపినంబు లను, నిస్పృహోయుండనై కని యాఁకలికి దప్పికి నలసి సొలసి యంత నట నొక్కనదిలోనం దీర్థమాడి యాచమించి సలిలంబులు ద్రావి సేద దేఱి యవ్విజనారణ్యమున నొక్కచో నశ్వత్థమూలమునం గూర్చుండి హృదయాకాశవర్తి యగుపరమాత్ము నమ్మహామునులవలన వినినవిధంబు దప్పకుండ మనమునం జింతించితి. భక్తివశీకృత మగుమనస్సున భగవం తునిచరణారవిందముల ధ్యానించుచు నుత్కంఠావిశేషమునం జేసి యా నందబాష్పపూరితలోచనుండ నైననామనంబున మెల్ల మెల్లన భక్తవత్సలుం డైనహరి పొడగట్టుటయుఁ బ్రేమాతిభరమునంజేసి మేను గరుపారఁ బరమానందపూరమున మునింగి యంతలో నప్పరమాత్ముని నన్ను నుం గాననైతి. మనోరమణీయంబు సర్వదుఃఖహరంబు నగునప్పరమ పురుషురూపంబుఁ గానక వెల్లఁబోయి దీనుండనై తటాలున లేచి క్రమ్మఱఁ జిత్తము సుస్థిరంబుఁ గావించికొని యాదేవదేవునిదివ్యరూపంబుఁ గాంచఁగ ధ్యానించుచు నిటునటుం జూచియు నాహరిం గనుంగొన నేరక యసంతృప్తుండనై యాతురభావమున యత్నము నొనర్చు చున్నంత నవ్విపినంబున వేదవచనములకు నగోచరుం డైనయప్పరమేశ్వ రుఁడు నాశోకమునకు శాంతిఁ గావించుతెఱంగున మృదుగంభీరవచ నంబుల నా కిట్లనియె.

**శ్రీహరి నారదునకుఁ బ్రతివచనంబులు పలుకుట**

వత్సా, యీజన్మమున నీవు నన్నుఁ గాంచఁ జాలవు. అవిపక్వ కషాయు లగుననిష్పన్నయోగులకు నన్నుఁ జూడ శక్యంబు గాదు. నాయెడ నీకు భక్తిదృఢత్వంబె గలుగు. తదర్థం బొకపరి మదీయదివ్య రూపంబు నీకుఁ జూపితి. మద్భక్తుఁడు క్రమమునం గామములనెల్ల నీఁగు. నీవు పెద్దకాలంబు సాధుసేవఁ గావించితివి. కావున నాపై దృఢభక్తి నీకుఁ గలిగె. నింద్య మగునీదాసీపుత్త్రశరీరంబు విడిచి మదీయపా ర్షదత్వంబుఁ బొందుదువు. నాపై నీకుఁ గలిగినయిప్పటియధికభక్తి యె న్నఁడుం దఱుఁగకుండెడు. ప్రళయము లైనను మదనుగ్రహమున స్మృతి

కడకుం డెదు మని చెప్పి మహాభూతపదవాచ్యుండు సర్వనియామకుం డాకాశశరీరుం డశరీరుండు నగుసమ్మహానుభావుండు విరమించుటయు నేను బెద్దలకుం బెద్ద యగుసమ్మహామహుం గాంచకయే స్వరశ్రవణోపలక్షితదిశ నుపలక్షించి యతనిదయం గన్నవాఁడనై సాష్టాంగదండప్రణామం బాచరించి లజ్జ విడిచి యయ్యనంతునినామములఁ గీర్తించుచుఁ బ్రాకృతజనుల కెఱుంగరాని యతనియవతారచేష్టితంబులఁ దలంచుచుఁ బృథివిలోనం జరించుచు సంతుష్టమానసుండనై వీతరాగుఁడనై మదమత్సరవిరహితుండనై కాలముం బ్రతీక్షించుచుంటిని. ఇవ్విధమునఁ గృష్ణమతినై యెద్దానియెడను సంగమంబు గానక నిర్మలచిత్తుండనై వర్తించునాకు మెఱుఁగు మెఱసినతెఱఁగునఁ దద్దేహవియోగకాల మాసన్నం బయ్యె. ఈశ్వరుండు పరమపావనం బైనభాగవతదేహము నాకుఁ గూర్చునెడఁ బంచభూతమయంబై ప్రారబ్ధకర్మక్షయావధికం బైన యాదాసీపుత్త్రశరీరము లయముఁ జెందె. కల్పాంతముల నీలోకముల నెల్ల నుపసంహరించి యేకార్ణవం బైనజలమున శయనించునారాయణు లోన శయనింపఁ దలఁచుబ్రహ్మదేవునిమధ్యమును నిశ్వాసంబుతోడం జొచ్చితి. సహస్రచతుర్యుగావసానమునం బ్రహ్మ లేచి యీవిశ్వమెల్ల సృజింప నుద్యోగించునాచతుర్ముఖుప్రాణములనుండి మరీచిప్రముఖులగుప్రజాపతులును నేనుం జనించితిమి. మహావిష్ణుననుగ్రహమున నవ్యాహతగతినై యఖండితబ్రహ్మచర్యుండనై ముల్లోకముల నంతర్బహిర్భాగములనెల్ల దేవదత్తం బైనయీవీణను స్వర బ్రహ్మభూషితం బైనదాని నారోహణావరోహణక్రమమున స్వరసంయోగంబు దనర వాయించుచు, హరికథలం బాడుచుఁ దిరుగుచున్నవాఁడ. తీర్థపాదుఁడు ప్రియశ్రవుఁడు నగుహరి నిజవీర్యములఁ బాడుచుండ నామనమునఁ బిలిచినట్లు శీఘ్రదర్శనం బొసంగు. విషయభోగేచ్ఛం జేసి యాతురచిత్తు లగువారికి సంసారసాగరంబుఁ దరింప నావపోలె హరిచర్యానువర్ణనంబు విరాజిల్లెడు. కామలోభతిరస్కృతం బైనమనస్సు ముకుందసేవనంబున నెట్లట్లు యమనియమాదియోగానుష్ఠానంబున లెస్స యుపశమింపదు. అనఘా, మదీయజన్మకర్మరహస్యంబులును నీకుఁ జిత్తతోషంబు గలుగువెరవును నీప్రశ్నంబుల కుత్తరంబులుగా వివరించితిఁ

గదా యనిచెప్పి యదృచ్ఛాప్రాప్తుం డైననారదమునీంద్రుఁ డాసాత్యవతేయు నామంత్రణంబు చేసి వీణ వాయించుచు నరిగె. వీణ వాయించుచు వాసుదేవకీర్తిం బాడుచు సంసారరోగపీడిత మైనలోకమునకు భగవద్భక్తిం గావించు దేవర్షివర్యుం డైననారదమునీంద్రుఁ డద్దిరా! పరమధన్యుం డని సూతుండు సెప్పిన విని శౌనకుఁ డయ్యా, నారదుఁ డరిగినపదంపడి యమ్మునియభిప్రాయవిషయంబు విన్నబాదరాయణుం డేమి చేసె నని యడుగుటయు సూతుఁ డిట్లనియె.

### వేదవ్యాసుఁడు శ్రీమద్భాగవతపురాణము రచియించుట

బ్రహ్మానది యగుసరస్వతీపశ్చిమతీరమున ఋషులకు సత్త్రవర్ధనం బైనశమ్యాప్రాస మనునాశ్రమంబు గలదు. బదరీషండమండితం బైనయమ్మహాశ్రమమునం బాదరాయణుం డానదిలోఁ గృతస్నానుం డై సంధ్యాద్యనుష్ఠానముల నిర్వర్తించి శుచియై యాచమించి నారదుఁ డుపదేశించినరీతి సమాధిఁ బూని పరమాత్ముని ధ్యానించుచు భక్తియోగమున నిశ్చలంబై నిర్మలం బైనమనమునం దొలుతఁ బరమేశ్వరుని నటఁ దదధీన మగుమాయనుఁ గాంచె. అమ్మాయవలనఁగదా జీవుఁడు గుణత్రయాతీతుఁ డయ్యు స్వరూపావరణమున విక్షిప్తుండై త్రిగుణాత్మాభిమానకృత మగుకర్తృత్వాదిరూప మగునన ర్థముఁ బొందుచుండు? పదంపడి యయ్యనర్థముననెల్ల నిరసింపఁజాలినభగవద్భక్తియోగమునుం గాంచి యజ్ఞానవిజృంభిత మగులోకమునకు మేలు గావించువాఁడై భాగవతసంహితను రచియించె. ఆసంహితను వినునప్పుడె మనుజునకు శోకమోహభయాదుల నడంచుభగవద్భక్తి యుదయించు. అవ్విధమునం బారాశర్యుఁడు భాగవతసంహితను రచియించి శోధించి యాత్మపుత్త్రుఁడగుశుకయోగీంద్రుని నివృత్తినిరతుం డైనవానిఁ జదివించె ననిన విని శౌనకుఁ డయ్యా, వృత్తినిరతుఁడై యన్నిటియెడ నుపేక్షుమై వర్తించు నాత్మారాముఁడయ్యు శుకుఁ డేనిమిత్తమున నమ్మహాసంహిత నభ్యసించె నని యడుగ నతనికి సూతుం డిట్లనియె. ఆత్మారాము లైనమునులును నివృత్తహృదయగ్రంథులయ్యు భగవంతునియెడ ఫలనిరపేక్ష మగుభక్తిం జేయుదురు. హరిగుణంబు లిట్టివి. పరమపురుషగుణములు దనమతి నాకర్షించుటయు నెల్లపుడు భాగవతులపైఁ బ్రీతి సేయుశుకయోగి యమ్మహాసం

హితం జవివె. రాజర్షి చంద్రుం డైనపరీక్షితునిజన్మవృత్తాంతము నాతం డొనర్చిన యద్భుతకార్యంబు నతనిదేహత్యాగప్రకారంబును గృష్ణమహిమ ప్రకాశకం బైనపాండవులమహాప్రస్థానగమనంబునుం జెప్పెద వినుండు.

### నిద్రించుద్రౌపదేయాదులం జంపినయశ్వత్థామ నర్జునుండు దఱుముట

కురుక్షేత్రమునం బ్రవృత్తం బైనయాదారుణరణంబునం గౌరవపాంచాలవీరులు పోరి వీరస్వర్గము నధిగమించినయనంతరము దుర్యోధనుండు భీమసేనుగదతాఁకునఁ దొడలు విఱిగి పడినపదంపడి యశ్వత్థామ తనమనమున కప్రియంబయ్యు లోకము నిందించునని తా నెఱింగియుఁ దన్నేలినయాధార్తరాష్ట్రునకుఁ బ్రియం బగు నని భావించి బాలకులగుద్రౌపదీసుతులు నిద్రించుచుండు నెడ వారితలలు దఱిగె. తెలుగుటయుఁ దల్లి యగునప్పాంచాలి తనకొడుకు లట్లు దిక్కులేనిదుర్మరణంబుఁ జెందుటకు మీఁదుమిక్కిలి వగపుతోఁ గన్నుల నశ్రువు లురుల నేడ్చుటయు నర్జునుం డాప్రేయసిని డాసి కల్యాణీ వగవవలదు. నేను గాండీవమ్మున నమ్ము లరిఁ బోసి యేసి బాలఘాతకుం డైనయాబ్రాహ్మణాధమునితల దఱిగి తెచ్చి నీ కిచ్చెద. దాని నాసనంబుగఁ జేసికొని కూర్చుండి చిత్తశాంతిఁ బొందు మని విచిత్రరమణీయభాషణముల నోదార్చి కత్తళంబు దొడిగి కృష్ణసారథికంబు కపికేతనంబు నగు తేరెక్కి యాద్రోణనందనుండు చనినతెరువు పట్టి యరిగె.

### అశ్వత్థామ బ్రహ్మశిరోఽస్త్రం బేయుట

అశ్వత్థామ తన్నుఁ దఱిమికొని వచ్చుచున్నవివ్వచ్చుని దవ్వుదవ్వునఁ గాంచి తనయొనర్చిన బాలవధమునం జేసి తల్లడిల్లుడెందముతోఁ బ్రాణములఁ గాచికొనువాఁడై తనతేరెక్కి తొల్లి క్రమము దప్పి కూఁతుఁ గామించి శివునకు వెఱచి పఱచువిరించివిధమునం బుడమి పయిం బారుదెంచి యటఁ గొండొకవడికి గుఱ్ఱములు డయ్యుటయుఁ బలాయనంబు నశక్యం బగుడు వే ఱొకశరణంబుఁ గానక యాబ్రాహ్మణతనయుఁ డప్పటికి బ్రహ్మశిరోనామకం బగుదివ్యాస్త్రమే తన్నుఁ గాచు నని తలఁచి దానియుపసంహారంబుఁ దా నెఱుంగకున్నను బ్రాణసంకటంబు దొడరుటం జేసి యొద్దియు నరయలేక యాచమించి శుచియై ధ్యానించి యమ్మహనీయాస్త్రముఁ బ్రయోగించె. దాన నత్యుగ్ర

తేజంబు దెసలెల్ల నాక్రమించినం జూచి సవ్యసాచి యాతేజమున లోకప్రాణిజాలమునకుఁ బ్రాణసంకటంబు గలుగు నని వెఱచి కృష్ణున కిట్లనియె. కృష్ణకృష్ణ మహానుభావా, భక్తరక్షకా, సంసారమున దహింపఁ బడువారికి నీవొక్కరుండవే ముక్తిగావింతువు. చిచ్ఛక్తిచే మాయను నిరసించి కేవలాత్మస్వరూపంబుఁ గొని లోకముల కాదికారణంబై ప్రకృతికిఁ బరుఁడై పురుషపదవాచ్యుఁడైనయీశ్వరుండవు నీవు. మాయావిమోహితచిత్త మగుజీవలోకమునకు ధర్మాదిలక్షణం బైనశ్రేయమెల్ల నిజవీర్యమున నీ వొనర్తువు. ఈభవదవతారము భూభారము హరింపను ననన్యభావు లగునిజభక్తులకు నిరంతరధ్యానంబుఁ గూర్పనుం బ్రవర్తించు. దేవదేవా,పరమదారుణం బైనతేజస్సు సర్వతోముఖంబై యలము చుండెడు. ఇది యెయ్యది యేమి కారణంబు గలుగ నిట్టు లలము చుండు ననియే నెఱుంగనయ్యెద ననియడుగుటయు భగవంతుఁ డప్పార్థున కిట్లనియె. అర్జునా, యియ్యది ద్రోణపుత్త్రుండు ప్రయోగించిన బ్రహ్మశిరోఽస్త్రంబు తేజంబు. అతండు దన కుపసంహారంబు దెలియ కున్నం బ్రాణబాధ దొడరినం దానిఁ బ్రయోగించె. దీని నడుప మఱి యేయస్త్రముం జాలదు. నీవు నిప్పుడు తదస్త్రముఁ బ్రయోగించి యత్యంత విజృంభితం బైనయాచార్యసుతునస్త్ర ముపశమింపఁ జేయుము.

## అర్జునుఁడు బ్రహ్మాస్త్రమేసి యశ్వత్థామ బ్రహ్మశిరోఽస్త్ర మడఁగించుట

నీవు సర్వాస్త్రప్రయోగవిద్యాకుశలుండ వనిచెప్పిన విని పరవీరహరుం డైనపార్థుం డంత నాచమించి శుచియై కృష్ణునకుఁ బ్రదక్షిణముఁ గావించి ద్రౌణియస్త్రము శమింపఁ జేయువాఁడై తాను బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించె. అంత నయ్యిద్దఱిబ్రహ్మాస్త్రములు శరజాలసంవృతంబులై యొండొంటం బెరసి పెరిగి ప్రళయసమయమున సంకర్షణముఖాగ్నియు నాదిత్యుండు నెట్టులట్టులు భూనభోంతరం బావరించి ముల్లోకములం గాల్చుచున్నం జూచి జనులు వానితాపమునం గుందుచుఁ బ్రళయానలంబుగా నూహించి వెఱచుచున్నంతఁ గొంతేయుఁ డాప్రజోపద్రవంబును లోకాపాయంబునుం గాంచి వాసుదేవమతముఁ గొని యయ్యస్త్రముల రెంటి నుపసంహరించె. అంతఁ గ్రోధారుణితలోచనుండై కిరీటి తటాలున నతిదారుణకర్ముఁ డైనయయ్యశ్వత్థామను డాసి త్రాటఁ

బశువుఁబోలెఁ గట్టి శిబిరమునకుఁ గొంపోవఁ దలంచుచుండ నంబుజే క్షణుఁ డలిగినవానిరీతి నాతని కిట్లనియె. పార్థా, యీతనిం గావఁ దగదు నిద్దురవోవుబాలకుల నిరపరాధుల నిశాసమయమునం జంపినయీబ్రాహ్మణాధముం దెగటార్పుము. మద్యపానాదుల మైమఱచినవాని నేమఱినవాని గ్రహవాతాద్యావేశమున నున్మాదంబుఁ గొన్నవాని నిద్రించువాని బాలుని జడుని నాఁడుదాని శరణాగతుని విరథుని భీతుని ధర్మవిదుఁడు చంపఁడు. పరప్రాణములఁ దనప్రాణముం గాచుకొనునట్టి దయలేని దురాత్మునిం జంపినవాని కయ్యది మరణాంతప్రాయశ్చిత్తంబై నరకపతనంబుఁ దప్పింపఁ జాలుఁ గావున నట్టివానిం జంపుట వానికిని మే లగుం గాని యొండుగాదు. మఱియు నేను విన నీవు పాంచాలి నూరార్చుచు మానినీ, నీకొడుకులఁ బరిమార్చినవానితలం గోసి తెత్తునని యప్పటి ప్రతిజ్ఞ బాస చేసితివి. వీరవర్యా, పాపాచారుఁ డాతతాయి యాత్మపుత్రఘాతకుఁడు నగు నీతనిం జంపుము. సుప్తబాలకవధం బాదుర్యోధనునకుం బ్రియంబు గాకుండిన నీకులపాంసనుఁడు గాదనక యొనరించెనని యర్జునుచిత్తమునం గలధర్మముఁ బరీక్షించువాఁడై కృష్ణుఁ డెంతయొత్తి చెప్పినం బార్థుఁ డాత్మరూపాంతరం బైనపుత్రుం జంపిన నాచార్యపుత్రుం జంప నొల్లక శిబిరమునకుఁ గొనిపోయి పుత్రమరణశోకమునం గుందుచున్న ప్రియురాలికిఁ జూపె.

## అశ్వత్థామబంధనంబు విడుపు మని ద్రౌపది యర్జునునకుఁ జెప్పుట

పాంచాలియుఁ బశువుపోలెఁ బాశబద్ధుండై తననింద్యకర్మమునకుఁ దల వాంచి యున్నగురుసుతుం గాంచి దీనులం జూచునెడఁ దనకోదవుదయ పెల్లునను గురుపుత్రుం డనుగౌరవంబునను వానిచేసిన యపకృతిం దలపోయక నమస్కారంబుఁ గావించి యతనిం గట్టితెచ్చుటకు సైరింపక యర్జునుం జూచి వీరశేఖరా, విడువుము విడువుము. ఇతండు బ్రాహ్మణమాత్రుండ కాక గురుపుత్రుండు గావున గురుతుల్యుండు. ప్రయోగోపసంహారపూర్వకంబుగా సరహస్య మగుధనుర్వేదంబు దివ్యాస్త్రగ్రామంబు నత్యంతానుగ్రహంబున నీకు నేర్పినయమ్మహాత్ముఁ డగు ద్రోణాచార్యుఁడు తానే పుత్రరూపమునఁ గన్పట్టుచున్నవాఁడు అమ్మహాను భావున కర్ధశరీరం బైనకృపి వీరపుత్రుం గన్నది గావున నీకొడుకుం

జూచికొనుచుఁ బతిసహగమనంబు సేయక మేను దాల్చియుండు. నీ వితనిం జంపుదేని యాగౌతమి పతిసుతమృతిం జేసి యే మయ్యెడునో. ధర్మజ్ఞా, మీనిమిత్తమున నత్యంతపూజార్హంబైనగురుకులమునకుఁ జేటు గలుగవచ్చునే? పతిదేవత యగుసీతనితల్లి నాయట్లపోలె మృతపుత్త్రయై దైన్యమున నేడువఁ దగదు. రాజు లజితేంద్రియులై బ్రాహ్మణకులము నకుఁ గోపముఁ గూర్తురేని యయ్యపకారము వేగంబ సపరివార మగు నారాజకులమునకు నిరంతరశోకముఁ గూర్చి యేర్చు నని ధర్మన్యాయ దయాన్వితంబుగను నిర్వ్యళీకంబుగను సర్వసమభావసముల్లసితముగను హితముగనుం జెప్పినపాంచాలివచనంబు నజాతశత్త్రుఁ డభినందించె నకులసహదేవులు నర్జునుండు సాత్యకియు భగవంతుఁడును మఱియు నచ్చటఁ జేరినసభ్యులును స్త్రీలు నిది లెస్స యనిరి. భీమసేనుఁ డాక్రోధం డలుక పెల్లునఁ దనకుఁ దనరాజునకుం బ్రియంబుగా నిద్రించుబాలురం జంపినపాపుం దెగఁజూచుట మేలని పలికె. అప్పు డర్జునుండు భీమ గదితంబును ద్రౌపదీవచనంబును విని కర్తవ్యసందేహమునం గృష్ణునా ననంబుఁ జూచుటయు నాచతుర్భుజుఁ డతనిం జూచి యయ్యా, బ్రాహ్మ ణుఁ డవధ్యుఁ డాతతాయి వధార్హుఁ డనునీయుభయధర్మంబులు నేన చెప్పితి నిం దెయ్యది సేసిన నావాక్యంబు నడిపిన ట్లగు నెట్లు చేసినం బాంచాలి కిచ్చినబాస నెఱవేర్చిన ట్లగు నెయ్యది భీమునకు ద్రౌపదికి నాకుం బ్రియం బగు నద్దాని నిపుణముగ నాలోచించి యొనర్పు మని భావగంభీరముగఁ జెప్పె.

### అర్జునుఁడు శిరోమణినిగొని ద్రౌణిని విడిపించుట

చెప్పుటయుఁ దదర్థ మూహించి కిరీటి హరిమనోగతం బెఱింగి యయ్యాచార్యసుతుశిరమునం గేశములతోడం బుట్టినదివ్యరత్నముఁ గృపాణమునఁ గోసికొని పాశబంధ మెడలించి బాలవధక్షీణతేజుఁడు మణిహీనుఁడు నగునయ్యశ్వత్థామను శిబిరమునుండి వెడలం బనిచె. వప నము సర్వస్వహరణము దేశనిర్వాపన మనునివియే బ్రాహ్మణులకు దండ నంబులు గాని దేహదండనంబు దగదని ధర్మశాస్త్రంబుల వినంబడు.

అంతఁ బుత్త్రశోకార్తులై పాండవులు పాంచాలీసమన్వితులై పరేతులైనతమవారి కుదకదానముల నిర్వర్తింప స్త్రీపుంసులై వాసు

దేవునితోడ గంగానదికిఁ జని హరిచరణాంబుజ పరాగపావనం బైనత
త్తీరమున స్నానపూర్వకముగాఁ బరలోకగతు లైనతమవారి కెల్ల
నివాపసలిలము లిచ్చి విలపించి క్రమ్మఱ శౌచార్థం బమ్మహానదిం గృతావ
గాహనులై యుండు నెడ మాధవుఁ డచ్చట మునులతోడం గూర్చుండి
యున్న ధర్మరాజు నతనితమ్ములును ధృతరాష్ట్రుని బుత్త్రశోకార్త యగు
గాంధారిని గుంతిని ద్రౌపదిని మఱియు శోకార్దితు లగు తక్కినబంధువు
లనుం జేర నరిగి కాలకృతం బైన జన్మమరణాది కార్యజాతము భూతముల
కపరిహార్యం బని యిట్లు సాంత్వవచనముల నూఱడించి పరమపతివ్రత
యగు పాంచాలి కేశపాశంబు వట్టియాడ్చుట నాయువు దఱిఁగిన పాపాత్ము
లగు ధార్తరాష్ట్రులఁ జంపించి యాకితవు లక్రమంబున నాఁచికొన్న నిజ
రాజ్యముఁ గ్రమ్మఱ ధర్మరాజునకు సాధించి యిచ్చి యుత్తమకల్పమున
మూ డశ్వమేధము లయ్యజాతశత్త్రుం డొనర్చిన నింద్రునకుం బోలె
దాన నాతని కెల్లదెసలఁ బవిత్రకీర్తి వెలయుఁ గావున నట్లు సేయ
వలయు ననుతలంపు తనమనమునం గొనుచు బ్రహ్మర్షు లగు ద్వైపాయ
నాదులం బూజించి వారిపూజలం గ్రహించి పాండుపుత్త్రుని వీడుకొని
సాత్యకియు నుద్ధవుఁడును దన్ను వెన్నడించి రాఁగ ద్వారవతికిఁ బోవఁ
దలఁచి తే రెక్కుచు భయవిహ్వలయై తనయొద్దకుఁ బఱతెంచుచున్న
యుత్తరను గాంచె.

### కృష్ణుఁ డశ్వత్థామాస్త్రమునఁ గాలకుండ నుత్తరాగర్భము రక్షించుట

అంతలో నయ్యభిమన్యుపత్ని యాలోకనాయకునొద్ద కరుదెంచి
యో దేవదేవా, మహాయోగీశ్వరా, జగన్నాథా, కావు కావుము. ఎందుఁ
జూచినం బరస్పరమృత్యుప్రసారంబు దప్పకుండెడు. నీ వొక్కరుండ
నిర్భయుండవు. పరమేశ్వరా, తప్తాయసం బైనతీవ్రబాణ మొక్కఁడు
నన్నుఁ దఱుముచుండెడు. అయ్యది నన్నుఁ గాల్చునేనియు దానికి వగ
వను. మఱి మదీయగర్భమునకుఁ జేటు వాటిల్లకుండఁ గా బొనర్పు మని
వేఁడికొనియె. అవ్వేడికో లాలించి భక్తవత్సలుం డైనభగవంతుఁ
డక్కటా! యియ్యది యపాండవంబుగా నశ్వత్థామ ప్రయోగించినదివ్యా
స్త్రంబు గావలయు ననితలంచుచున్నంతఁ బాండవు లేవురును దమపైఁ
బడవచ్చుచున్న నిశితశరపంచకంబుఁ జూచి వానిం దెగటార్పఁగ దివ్యా

స్త్రములం గ్రహించిరి. ఇంతలో నాత్మైకనిష్ఠు లగు నప్పాండవులకు మూడినకీ డరసి సరసిజాక్షుండు తనసుదర్శనంబుఁ బ్రయోగించి యశ్వత్థామ ప్రయుక్తము లైనబాణములం ద్రుంచి తమవారికిఁ గాపుఁ గావించి యంత నాత్మయోగ ప్రభావమున సర్వభూతములలో నంత ర్యామి యైనయమ్మహానుభావుఁడు కౌరవవంశాంకురంబు నిల్పువాఁడై నిజమాయచే నుత్తరగర్భముం గప్పి యమోఘ మప్రతీకారము నగు ద్రౌణిబ్రహ్మశిరోస్త్రంబు నిజచక్రాయుధతేజమున శాంతముఁ గావించె. ఆత్మశక్తి యగు మాయచే నీజగమెల్లఁ బుట్టించుచుఁ బ్రోచుచుఁ దుది రూపడంచుచు సర్వైశ్వర్యచర్యానిధానం బైన యచ్యుతుఁడు బ్రహ్మ శిరోస్త్రముఁ బ్రశమింపఁజేయుట యాశ్చర్యం బగునే? అవ్విధమునం బాండవుల నుత్తరాగర్భముం బ్రహ్మాస్త్రము బారిం బడకుండఁ దప్పించి రక్షించి యటఁ గృష్ణుఁడు ప్రయాణాభిముఖుం డైనకృష్ణుని డాయఁ బోయి కుంతీదేవి యిట్లని స్తుతించె.

### కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట

కృష్ణా! నీకు మ్రొక్కెద. నీవు సామాన్యయాదవుండవు గావు. మఱి లోకముల కెల్ల నాదిభూతుఁ డగుపురుషుండవు. ప్రకృతికి నియా మకుండవై దాని కతీతుండవు. సర్వభూతములతో నంతర్బహిఃప్రదేశ ములఁ బరిపూర్ణుండవై వర్తింతువు. మాయాయవనికాచ్ఛన్నుఁడవుగాన నితరులకు నిన్ను పలక్షింపరాదు. ఇంద్రియజన్యజ్ఞానముల కగోచరుం డవు వ్యయరహితుండవు భవదీయభక్తియోగంబు నే నెఱుంగఁ జాలను గావున నీకుఁ బ్రణామమాత్రంబు సేయుదు. నాట్యమున నానావేష ములఁదాల్చు కుశలనటునివాస్తవరూపవేషముల సామాజికు లెట్టు లట్టుల విచిత్రప్రపంచప్రకారంబుల నానారూపవేషములఁ గొను నీదు వాస్తవ రూపానుభావముల మూఢదృష్టు లెఱుఁగనేర్తురే? మఱియు నాత్మా నాత్మవివేకంబుతో నిత్యమననమునఁ దనరి రాగద్వేషాదులం బాసి యంతఃకరణ నిర్మలత్వంబుఁ గొన్న పరమహంసులకును నిన్నుఁ గనుంగొన శక్యంబుగాదు. ఇఁక నాఁడువారము భక్తియోగవిధానార్థంబు నిన్నెట్లు గాంతుము. కృష్ణ, వాసుదేవ, దేవకీనందన, నందగోపకుమార, గోవింద, పంకజనాభ, పంకజమాలి, పంకజనేత్ర, పంకజాంఘ్రి పదవాచ్యుఁ డైన

నీకు నీనామము లుచ్చరించి ప్రణామంబు సేసెద. తొల్లి దురాత్ముం డగు కంసుఁడు దేవకీదేవిని నిర్బంధించి శోకింపఁ జేయఁగ వానిం జంపి యద్దేవికి శోకం బుడిపి నిర్బంధము వాపిన తెఱంగున నన్నును నాకొడుకులను గోడలినిం బలుమాఱు విపద్గణములకుఁ జిక్కకుండఁ దప్పించి ప్రోచితివి. నీవకదా మాకు నాథుఁడవు. భీమునకు విషముం బెట్టినపుడును, మమ్ము వారణావతనగరమున లక్కయింటఁ గాల్ప నుద్యమించినపుడును, హిడింబకిమ్మీరాదిరాక్షసుల కగపడినప్పుడు, నానాఁ డాసభలోఁ బాంచాలికిఁ బరిభవంబు నొడర నున్నపుడును, నాకొడుకులు భార్యతోడ వనవాసాయాసంబులు గుడుచునపుడును, ఘోరసంగ్రామంబున నావారు మహారథుల దివ్యాస్త్రములబారిం బడునపుడు, నప్పు డశ్వత్థామ యపాండవంబుగా నేసిన బ్రహ్మాస్త్రమునకుఁ జిక్కనెడను నీవకదా మమ్ము రక్షించితివి. నాసుతుల కెగ్గొనం గీడు సేయ రోసి సుయోధనుండు వా రడవుల నుండుతఱి నత్యంతకోపనుం డైన దుర్వాసుం బ్రార్థించి పంచిన నతం డకాలమున వచ్చుటయు నమ్ముని కాతిథ్యంబు సేయ నన్నంబుఁ గానక చింతిల్లుచు నతం డేమి శపియించునో యని తలఁచు నెడఁ బాత్రలగ్నం బైన పత్రమాత్రంబు భుజియించి నీవు ముల్లోకములతోడఁ దృప్తిఁ జెంది యమ్ముని కాతిథ్యంబు సలుపనేరని యపచారమును దాన నతనివలనఁ దొడర నుండిన శాపమునుం దప్పించుట యెఱుంగవే? జగద్గురూ! యాపదలే యప్పుడప్పుడు వచ్చుఁగాక యని వేఁడఁ దగియుండెడు. దాన సంసారచక్రభ్రమణంబు నివారించు భవదీయదివ్యదర్శనము గలుగుచుండు. జన్మము ప్రభుత్వము వేదశాస్త్రాది సంపత్తి ధనసంపత్తి యను నివి గలిగెనేని మదము హెచ్చి మనుజుఁడు దీనదయాళుం డైననిన్నుఁ దలఁచి నీదు దివ్యనామములఁ గీర్తింపఁ దలంపు గొనఁడు. ధనము లెట్టు లట్టులు భక్తులఁ గాచువాఁడు, గుణవృత్తులగు ధర్మార్థకామవిషయములఁ బాసినవాఁ, డాత్మారాముఁడు, శాంతుఁడు, కైవల్యదానసమర్థుండు నగు నీకుఁ బ్రణమిల్లెద. నిన్నుఁ గాలస్వరూపుఁ గను, సర్వనియామకునిఁగను, నాద్యంతరహితునిఁగను, వ్యాపకునిఁ గను, నీవు నిమిత్తమాత్రంబై యుండ భూతజాలమునకుఁ దమలోఁ బరస్పరకలహంబు గల్గుగాని నీయెడ నెట్టివైషమ్యము దోఁపని సమప్రవ

ర్తనుఁగను నెఱుంగెద. మనుష్యచర్య ననుసరించుచు నీవు సేయఁ దలఁచు వాని నెవ్వరు నెఱుంగరు. నీ కొక్కరుండేనియు నొకప్పుడేనియు ద్వేషుఁడును బ్రియుఁడునుం గాఁడు. పామరులకుఁ గలుగు హేయోపాదేయ మతిభేదంబు నీయెడం గలుగదు. విశ్వాత్మా! జన్మరహితుఁడు కర్తృత్వహీనుఁడు నగు నీదుతిర్యఙ్నరఋషియాదోజన్మంబులును దదీయకర్మంబులును లోకానువర్తనార్థంబ కాని పారమార్థికంబులు గావు. కృష్ణా! నీవలనఁ గన్నుల బాష్పంబు లురుల మోము వాంచి భయ మభినయించు నీయప్పటిదశఁ దలంచిన నా కిప్పుడును మోహం బయ్యెడు. భయము దాన నీకు వెఱచు నన్న నీ కితరభయంబు గలుగనేర్చునే? నీయవతారమునకు నిమిత్తముం బలువురు పలుదెఱంగుల నూహింతురెట్లంటేని, కొందఱు యుధిష్ఠిరునకుఁ గీర్తి గావింపఁగ ననియుఁ, గొందఱు మలయమునఁ జందనతరువుపోలె యదువంశమున నవతరించుటం జేసి తద్వంశమునకు వన్నె పెట్టఁగ ననియుఁ, గొందఱు పూర్వజన్మంబులందు సుతపఃపృశ్నిరూపములం బ్రార్థించిన దేవకీవసుదేవులకోర్కులు నెఱవేర్చుచు లోకములకు మేలు గావింపను దానవాంశమునఁ బుడమిలోనం బుట్టినవారలఁ దెగటార్పఁగను ననియుఁ, గొందఱు భూరిభారమునం జేసి సముద్రమధ్యమున నావపోలె నలజడిపడు భూదేవిభారము హరింపఁగ ననియుఁ, గొందఱు బ్రహ్మదేవునిప్రార్థనంబున లోకక్షేమ మొనరింపఁగ ననియుఁ, గొందఱవిద్యాకామకర్మముల నీసంసారముననిడుమలు గుడుచువారి శ్రవణస్మరణయోగ్యము లైనదివ్యలీలలు చూపఁగ ననియుఁ దలంతురు. భవదీయదివ్యనామముల వినుచుఁ బాడుచుఁ గీర్తించుచు నెల్లపుడును స్మరించుచు నీలీలలఁగొనియాడువారే సంసారప్రవాహనివారణచణం బైనభవచ్చరణకమలంబుఁ దత్క్షణంబ కనుఁగొందురు. భక్తవత్సలా! పరమస్నేహమున నిన్ననుజీవించుమమ్మిప్పుడు విడిచి చనఁ దలంతువేమొ. దుర్యోధనాదు లగురాజులకుఁ గీడు చేసినమాకు నీపాదకమలంబుకంటె నొండొక్కటి పరాయణంబు గన్పట్టదు. జీవునిదర్శనము లేనితఱి నింద్రియములకుంబోలె భవదీయదర్శనము లేనప్పుడు యాదవులకుఁ బాండవులకును నామరూపంబులైన నెక్కడివి? మఱి యామే మెవ్వరము? అనా-

ధారణాదివ్యలక్షణముల విలసిల్లునీయడుగులచిహ్నములం గాంచి యిప్పు డీభూమి శోభించురీతి నీ విది విడిచి చనినపదంపడి విలసిల్లదు. నీకటాక్ష నిరీక్షణంబులనే యీదేశములు సంపన్నంబులై పక్వౌషధిలతావిరాజితం బులై యొప్పుచున్నవి. ఓవిశ్వేశ్వరా! విశ్వాత్మా! విశ్వమూర్తీ! స్వకీయు లగుయాదవపాండవులయెడ నాకుఁ గలస్నేహపాశము విచ్ఛిన్నంబు గావింపుము. దాన ననన్యవిషయంబై నామతి గంగానది సాగరమున నాత్మ ప్రవాహముంబోలె నీపైనప్రతిహతరతిం గూర్పఁ జాలెడు. శ్రీకృష్ణా! యర్జునునకుఁ జెలి యాదవులలో నుత్తముఁడు లోకద్రోహంబు సేయు రాజులవంశముఁ గాల్చువాఁ డక్షీణప్రభావుఁడు సంప్రాప్తకామధేన్వై శ్వర్యుఁడు గోవులయు బ్రాహ్మణులయు నమరులయు బాధల నుడుపునవ తారము, గొన్నవాఁడు యోగీశ్వరుఁ డఖిలగురుఁడు భగవంతుఁడు నగు నీకు నమస్కార మని యిట్లు కుంతీదేవి మధురపదములఁ బ్రభావవర్ణనంబు చేసి ప్రస్తుతించిన విని వైకుంఠుఁడు మాయచే మోహింపఁ జేయురీతి మందహాసంబు సేసి వల్లె యని యప్పటి కప్పాండుపత్నికిఁ జెప్పి కరిపురి కరిగి యటఁ గ్రమ్మఱ నమ్మాధవుఁడు ద్వారకకుం బోవ నుద్యమించి పాంచాలి మున్నగువారిని గుంతీదేవిని వీడుకొనియు ధర్మనందనుండు ప్రేమబంధురముగ నిలిపినం బ్రయాణంబు సాలించి యటఁ బాండవుల తోడం గొన్నినాళ్లు లుండె.

ధర్మరాజు ధర్మజ్ఞానార్థము శరతల్పగతుఁ డగుభీష్మునొద్దకుఁ జనుట

అప్పుడు ధర్మరాజు బంధువధశోకపాతకములకుఁ గుందుచుండ నప్పాండవాగ్రజునకు భీష్మునిచే హితముఁ జెప్పింపవలయు ననుకృష్ణు మతం బెఱుంగక వ్యాసాదు లగుమును లెందఱు బోధించినను లోక విడంబనార్థంబు కృష్ణుండు తాన వివిధేతిహాసప్రతిపాదనపురస్సరంబుగఁ దేర్చిన నయ్యజాతశత్రుండు దేఱక శోకవిహ్వలుండై సుహృద్వధంబె తల పోయుచు స్నేహమోహవశుండై యవివేకాక్రాంతస్వాంతంబుతో నిట్లని యె. అక్కటా! దురాత్ముఁ డగునామదిం బొడమినయజ్ఞానంబుఁ జూడుఁడు. కుక్కలకు నక్కలకు నాహారం బైనశరీరమునిమిత్తమున బహుళాక్షౌహిణులు పరిమార్పఁబడియె. బాలకుల బ్రాహ్మణుల బాంధ వులఁ జెలులఁ దండ్రుల నన్నదమ్ముల గురువులం జంపిననాకు సంవత్సర

శతాయుతంబులకేనియు నరకమోక్షంబు గలుగునే? ధర్మయుద్ధమున నరివధము రాజునకు దోషకరము గా దనుశాస్త్రము దనప్రజలకుఁ బరులవలన బాధ దొడరునపు డొనర్చుసమరమునెడఁ జెల్లుఁగాని దుర్యోధనుండు రాజ్య మేలుచుండ నేను గేవలరాజ్యలోభమునఁ బోరికి నడిచి నప్పుడన్వయింప దని తలంచెద. పతులు కొడుకులు మున్నగుతమవారు నానిమిత్తమునం జావంగ వనరు స్త్రీజనంబున కేను గావించిన యిప్పటి ద్రోహమును గృహస్థాశ్రమధర్మముల నిరసింపఁజాలనయ్యెద. పంకమునఁ బంకోదకంబును సురచే సురాద్రవమునుం గడుగువడువున నీభూత వధపాతకమును యజ్ఞాచరణమునఁ గడుగఁ దలంచుట యని తోఁచుచుండెదునని యప్పాండవాగ్రజుండు ప్రజాద్రోహమునకు వెఱచి సర్వధర్మముల లెస్స తెలియఁగోరి రణక్షోణీతలంబున శంతనుసూనుండు శరతల్పగతుండై యున్నచోటి కరిగె.

### భీష్ముఁడు ధర్మజు నూరార్చి నానాధర్మములఁ జెప్పుట

అవ్విధంబున శరతల్ప గతుం డైనశంతనునందనుం గొలువ నరుగు ధర్మనందను వెంబడి నతనితమ్ము లుత్తమాశ్వములం బూన్చిన కాంచనాలంకృతరథము లారోహించి చనిరి. వ్యాసధౌమ్యాదులును దోడన యుచితవాహనారూఢులై యరిగిరి. భగవంతుఁ డగువాసుదేవుఁడు సర్జునతోడఁ దేరెక్కి చనియె. అప్పు డప్పుండరీకాక్షుం డొక్కఁ డందఱిలోనం గుహ్యకపరివృతుం డైనకుబేరునితీరునం దేజరిల్లె. అట్లు పంకజాక్షపురస్కృతులై పాండవు లరిగి రణరంగమున దివంబు వాసి భువి కరుదెంచినయమరునిచందమున శరతల్పమునం బడియున్న యాపగేయుం గాంచి చక్రియుం దా మక్కురుపితామహునకు మ్రొక్కి నిల్చుచుండిరి. అట్టియెడ నమ్మందాకినీనందనుం జూడఁగ బర్వతుఁడు నారదుఁడు ధౌమ్యుఁడు బాదరాయణుఁడు బృహదశ్వుఁడు భరద్వాజుఁడు శిష్యసమన్వితుం డైనపరశురాముఁడు వసిష్ఠుఁ డింద్రప్రమదుఁడు త్రితుఁడు కృత్స్నమదుఁ డసితుఁడు కక్షీవంతుఁడు గౌతముఁ డత్రి విశ్వామిత్రుఁడు సుదర్శనుఁడు శుకుఁడు కాశ్యపుఁడు బృహస్పతి మున్నగుపలువురు బ్రహ్మర్షులు దేవర్షులు శిష్యప్రశిష్యులతోడ నచ్చటికి వచ్చుటయు సర్వధర్మజ్ఞుఁడు దేశకాల విభాగవిదుఁడు నగునవ్వసూత్తముఁడు వారల నుచితరీతిం బూజించి

యటు హృదయాంతర్యామియయ్యు సమీపవర్తిగా మాయాప్రభావమున మేను దాల్చి యెదుటఁ బొడగట్టియున్న శ్రీకృష్ణునిఁ దాను దదీయమహిమం బెఱింగినవాఁడు గావున లెస్స పూజించి వినయస్నేహములు దనరఁ జెంగటంగూర్చున్న పాండునందనుల నశ్రుసలిలక్లిన్నలోచనంబులం గాంచి ధర్మరాజున కిట్లనియె ధర్మనందనా! మీరు బ్రాహ్మణులను ధర్మము నచ్యుతు నాశ్రయించినవారయ్యుఁ గ్లేశములపాల్పడుట యెంతయుం గష్టంబు. మఱియు నన్యాయ్యంబు అతిరథుం డైనపాండునృపాలుండు లోకాంతరగతుం డైనపదంపడి కుంతి పసిబాలు రగుమీతదర్థం బెన్నియే నిడుమలు పెక్కుమాఱులు గుడిచె. మీ కప్రియంబులు గలుగుటెల్లఁ గాలకృతంబ కాని యొండు గాదు వాయువశమున మేఘజాలంబువోలెఁ దనవశమున లోకముఁ ద్రిప్పఁ జాలునదియే కాల మనంబడు. ధర్మరాజు రాజఁట వృకోదరుఁడు గదాపాణియై యురువడించునఁట. సవ్యసాచి దివ్యాస్త్రముల నేయునఁట. వానికి గాండీవంబు విల్లఁట. కృష్ణుండు మీకు జెలియఁట. ఇట్టిమీకును విపత్తులు వచ్చుచున్న నయ్యది కాలకృతంబగాక వేఱొండగునే? కాలస్వరూపుఁ డైనయీ కృష్ణుండు సేయఁ బూనుదాని నొకప్పుడేనియు నొక్కఁడేనియు నెఱుంగఁడు ఇతనిచేష్టితంబు దెలియంగఁ గోరి విద్వాంసులును మోహముం గాంతురన వినమె? కావున నిదియెల్ల దైవతంత్రం బని నిశ్చయించి యాదేవదేవు ననువర్తించుచు దిక్కు గాననిప్రజల నాథుఁడవై యేలుము. ఈ కృష్ణుఁడే సాక్షాదాదినారాయణుండు. తనమాయచే లోకము మోహింపఁ జేయుచు గూఢవర్తనుండై వృష్ణికులమునఁ జరించుచున్నవాఁడు. ఇమ్మహాత్ముని ప్రభావంబు శివుఁడు దేవర్షి యగునారదుఁడు కపిలాచార్యుండు నెఱుంగుదురు. ఇట్టివానిని నీవు మేనత్తకొడుకనియుఁ బ్రియుఁడనియుఁ బ్రీతి సేయుమిత్త్రుఁడనియు నుపకారమున పేక్షింపక తాన యుపకరించు సుహృదుఁడనియు మంత్రియనియు స్నేహవిశేషమున సారథియనియుం దలంచుచుండెదవు. సర్వాత్ముఁడు సమదర్శనుఁ డద్వయుఁ డహంకారరహితుఁడు రాగాదిదోషశూన్యుఁడు నగునిమ్మహానుభావునకు నీచోచ్చకర్మకృత మగువైషమ్య మేమిటం గలుగదు. అయిన నప్పరమేశ్వరునకుఁ దనయేకాంతభక్తులయెడఁ గలుగుకరుణ యిట్టి దని చెప్ప

వలవి గాదు. చూడుము. ఏను ప్రాణములఁ ద్యజింపఁ బూని ధ్యానిం
చిన నీతండే ప్రత్యక్షదర్శనం బనుగ్రహించె. భక్తిభరితంబుగ భగవంతు
నెడ మనస్సు నిలిపి యతని దివ్యనామములం గీర్తించుచుఁ గళేబరముం
ద్యజించు యోగి కామకర్మవిముక్తుం డగు. ఏ నీకళేబరము విడుచు
నందాఁక నా దేవదేవుం డైన చతుర్భుజుండు సుప్రసాదంబు వెలిఁగొల్పు
చిఱునగవు మెఱుంగుల నరుణలోచన మరీచుల సొంపు పెంపారు వద
నారవిందంబుతో నాకు దర్శనగోచరుండై ప్రతీక్షించుఁగాక యని భీష్ముండు
సెప్పిన విని యుధిష్ఠిరుండు శరతల్పశయానుం డైన యాశాంతనవుం గొల్వ
ఋషులెల్ల వినుచుండ నడిగిన నమ్మహాప్రాజ్ఞువలన మానవ సాధారణధర్మ
ములు వర్ణాశ్రమధర్మములు రాగవైరాగ్యనిమిత్తంబులై ప్రవృత్తి
నివృత్తిలక్షణంబులైన యుభయవిధధర్మములు దానధర్మములు రాజధర్మ
ములు మోక్షధర్మములు స్త్రీధర్మములు సంక్షేపవిస్తరోపాయంబులైన
భగవద్ధర్మములు నానాఖ్యానేతిహాసప్రతిపాదితంబు లగు సోపాయ
ధర్మార్థకామమోక్షప్రకారంబులు మున్నగు నానాధర్మముల నిరూపించె.

### భీష్ముఁడు దేహత్యాగమునకు నిశ్చయించుట

అవ్విధమున ధర్మముల నిరూపించుచుండ స్వచ్ఛందమృత్యు వగు
యోగికి దేహముఁ ద్యజింపఁ దగిన యుత్తరాయణ సమయం బాసన్న
మయ్యె. అప్పుడు జ్ఞాని యగు భీష్ముఁడు వాగ్వ్యవహారంబు సాలించి
యెదుటఁ బ్రత్యక్షగోచరుం డైన పీతాంబరధారి యగు కృష్ణునిపై
మనస్సు నిలిపి కన్నులు మూసికొని ధ్యాన మొనరించె. కృష్ణదర్శన
మాత్రమున మున్నె సమరమునఁ దాఁకిన కైదువులవలని యలమట
యెల్లఁ బాసియుండినవాఁడుగావునఁ బరిశుద్ధమగు ధ్యానధారణావిశేష
మున నశుభములనెల్లఁ బాసియు సర్వేంద్రియవృత్తివిభ్రమంబుల
నీఁగియు మేను సాలించువాఁ డై సర్వాతిశయితుండు పరమైశ్వర్యరూప
మగు పరమానందసుఖముఁ బడసిన పరమపురుషుఁ డయ్యుఁ గ్రీడార్థంబు
సంసారప్రవాహకారణంబైన ప్రకృతిం బ్రాపించిన స్వతంత్రుఁడు నగు
నాసాత్త్వతపుంగవునిపై నానాధర్మాద్యుపాయముల మనోధారణ లక్ష
ణంబు నిష్కామంబు నగు మతి నాభీష్ముం డమర్చి యాజనార్దను నిట్లని
ప్రస్తుతించె.

### భీష్ముఁడు శ్రీకృష్ణునిఁ బ్రస్తుతించి ధ్యానించుట

* ముల్లోకముల నొప్పిదంబై తమాలనీలంబై బాలాతపసవర్ణ పీతాంబరంబుఁ దాల్చిన దివ్యమంగళవిగ్రహంబును ముంగురులు గ్రమ్ముకొను నెమ్మొగమ్మును సొంపుగూర్ప నొప్పారు నప్పార్థసారథిపై నాబుద్ధి ఫలాభిసంధిరహితంబై ప్రవర్తిల్లుఁగాక. రణరంగమునఁ దురంగరేణుధూసరంబులై యిటునటు గదలుచున్నకచములం దనరియుఁ జెమటబొట్ల నాక్రమింపఁబడియు ముఖవికాసం బొకభంగి దర్శనీయంబై యుండ నా వాఁడితూపులఁ గత్తళంబు డుల్చి మేను వ్రచ్చుటయు నొకతెఱంగున

---

* శ్రీమద్భాగవతే ప్రథమస్కంధే నవమాధ్యాయే భీష్మకృతశ్రీకృష్ణస్తుతిః.

శ్లో. త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే,
వపు రలకకులావృతాననాబ్జం విజయసఖే రతి రస్తు మేఽనవద్యా.
యుధి తురగరజోవిధూమ్రవిష్వక్కచలులితశ్రమవార్యలంకృతాస్యే,
మమ నిశితశరై ర్విభిద్యమానత్వచి విలసత్కవచేఽస్తు కృష్ణ ఆత్మా.
సపది సఖివచో నిశమ్య మధ్యే నిజపరయో ర్బలయో రథం ప్రవేశ్య,
స్థితవతి పరసైనికాయు రక్ష్ణా హృతవతి పార్థసఖే రతి ర్మమాస్తు.
వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య స్వజనవధా ద్విముఖస్య దోషబుద్ధ్యా,
కుమతి మహరదాత్మవిద్యయా య శ్చరణరతిః పరమస్య తస్య మేఽస్తు.
స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞా మృత మధికర్తు మవప్లుతో రథస్థః,
ధృతరథచరణోఽభ్యయా చ్చలద్గు ర్హరి రివ హంతు మిభం గతోత్తరీయః.
శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయినో మే,
ప్రసభ మభిససార మద్వధార్థం స భవతు మే భగవాన్ గతి ర్ముకుందః.
విజయరథకుటుంబ ఆత్తతోత్రే ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే,
భగవతి రతి రస్తు మే ముమూర్షో ర్య మిహ నిరీక్ష్య హతా గతా స్సరూపమ్.
లలితగతివిలాసవల్గుహాసప్రణయనిరీక్షణకల్పితోరుమానాః,
కృత మనుకృతవత్య ఉన్మదాంధాః ప్రకృతి మగన్ కిల యస్య గోపవధ్వః.
మునిగణనృపవర్యసంకులేఽంత స్సదసి యుధిష్ఠిరరాజసూయ ఏషామ్,
అర్హణ ముపపేద ఈక్షణీయో మమ దృశిగోచర ఏష ఆవి రాత్మా.
క్షితిభర మవరోపితుం కురూణాం శ్వసన ఇ వాసృజ దక్షవంశవహ్నిమ్;
త మిమ మహ మనువ్రతా ర్తిహాంఘ్రిం హృది పరిరభ్య జహామి మర్త్యనీడమ్.
త మిమ మహ మజం శరీరభాజాం హృది ధిష్ఠిత మాత్మకల్పితానామ్,
ప్రతిదృశ మివ నైక ధార్క మేకం సమధిగతోఽస్మి విధూతభేదమోహః.

నొప్పారునాకృష్ణునిపై నామనంబు నిలుచుఁగాక. యుద్ధారంభమునఁ దనచెలి యగునర్జునుండు కోరినరీతి స్వకీయపరకీయంబు లగురెండుసేనల నడుమం దేరు వోనిచ్చి నిలిపి చూడ్కి సారించినంతన పరసైనికుల యాయువు నెల్ల హరించిన కాలస్వరూపుఁ డగునాపార్థసఖునిపై నాకుభక్తి సుస్థిరం బగుఁగాక. సేనాగ్రమున నున్న తనవారలనెల్ల దవుదవ్వునం గాంచి దోషబుద్ధిం జేసి స్వజనవధమునకు వెనుదీయుచున్న యన్నరున కాత్మవిద్య యుపదేశించి యహంతామమతాత్మకం బైనకుమతి మార్చిన యప్పరమాచార్యునిపాదారవిందముఁలయెడ నాకు భక్తి సుస్థిరం బగుఁ గాక. ఆయుధముఁ బట్టక సహాయమాత్రం బేను గావింతునను తనప్రతిజ్ఞ యైనం ద్యజించి శ్రీకృష్ణునిచేతం గైదువు పట్టింతు ననునాప్రతిజ్ఞను సత్యముఁ గావించి నా కధికత్వం బొనర్చుతలంపునం దాను జక్రాయుధంబు వట్టి తటాలునం దేరుడిగ్గి యేనుంగుపయిం గవియుసింగము తెఱం గునఁ బుడమి యద్రువ లలితపీతాంబరంబు చెఱంగు భూమిపయిం జీరాడ నత్యంతసంరంభముతో నాపయి నురువడించి నావాలంపగములతాఁకున మైమఱు వఱువ కృగుటయు నెత్తుటం జొత్తిల్లుమేనితో వలదని వారిం చుచున్న కిరీటిమాట గీటునంబుచ్చుచు నాతతాయి యగునన్నుఁ బొరిగొన నెదిరించినభక్తవత్సలుం డైన యాముకుందుఁడు నాకు గతియగుఁగాక. అర్జునురదంబు తనకుటుంబమువోలె రక్షణీయం బనుమతిం జేసి ముని కోలఁ గేలం బూని యుగ్యముల పగ్గములం గొని సారథికృత్యమునకుఁ దొడరి యప్పటియాకారవేషమున నత్యంతదర్శనీయుం డైనయాభగవం తునిపైఁ బ్రాణోత్సర్గంబున కుత్సహించిన నా కత్యంతభక్తి గలుగుఁగాక. ఏ నెట్టివాఁ డైన నేమి? ఆపరమేశ్వరునిదర్శనంబునం గడతేరుదు. ఆతని విలోకనంబునంగాదె యుద్ధమృతులందఱుఁ దత్సారూప్యంబుఁ గాంచిరి. క్షత్రధర్మమునం బోర మేను ద్యజించినవారే పరమగతిం బ్రాపించి రనుట చిత్రంబుగాదు. మఱి లలితగమనవిలాసములను సుందరమందహా సములను బ్రణయవీక్షణములను నాదేవదేవునియెడ నన్నురాగంబుచేసి మదనమదంబునం దనరియు నాతనిలీలాకృత్యంబుల ననుకరించియు గోప కాంతలు తత్స్వరూపతం గాంచిరి. అట్టిమహనీయునియెడ నామనంబు నిలుకడఁ జెందుఁగాక. ధర్మరాజు రాజసూయమునాఁడు మునిబృందము

వను నానారాజసమాజమునను నిండారియున్న సభలో నద్దిరా! యిమ్మ
హాత్ముఁ డెంతటివాఁడని యందఱకు నెల్లప్పుడుం జూడ్కిసారించి దర్శనీ
యుండై యందఱిలోనం బ్రథమసత్కారముం గొన్నయాజగదాత్మ
స్వరూపుఁ డిప్పుడు నాయెదుట సాక్షాత్కరించి యున్నవాఁడు. నాభాగ్యం
బేమని తలపోయుదు? వెదురుటడవి కగ్గి నెట్టు లట్టుల భూభారంబు
హరింపఁ గురువంశమున కకుద్యోతం బనువహ్నిం దరికొల్పి తనపూనిన
పని నెఱవేర్చినభక్తార్తిహరచరణుం డైనయీయిమ్మహానుభావుని మదిం
బదిలపఱిచికొని యే నీమానవదేహముఁ ద్యజింతు. ఆత్మమాయానిర్మి
తంబులైననానాప్రాణిజాలంబులలో నంతర్యామియై చొచ్చినయేకరూపుఁ
డయ్యు నొక్కసూర్యుఁడే చూచువారిచూడ్కులకు వేఱువేఱ తోఁచు
రీతి నధిష్ఠానభేదమున బహురూపునట్లు దోఁచునట్టియీయజుని
విధూతభేదమోహుఁడనై లెస్స యెఱింగితిఁ గృతార్థుఁడనైతినని యిట్లు
మనోవచనదర్శనవృత్తుల భగవంతుఁ డాత్మస్వరూపుఁడు నగుకృష్ణునిపై
నాత్మసమావేశంబుఁ గావించి యాభీష్ముఁ డంతర్విలీనశ్వాసుండై యుప
రమించె.

దినావసానమునం బులుఁగులువోలె నప్పుడు నిరుపాధి యగు
బ్రహ్మమున నాపగేయుండు మిళితుం డయ్యె నని యెఱింగి సభాసదు
లందఱును దూష్ణీంభూతులైరి. దివి దేవదుందుభులును భువిమానవదుం
దుభులును మ్రోసె. సాధురాజులప్రస్తుతివచనంబులెసంగె. అంతరిక్షము
నం గుసుమవర్షంబు గురిసె. మునులు హృష్టులై కృష్ణుం దదీయరహస్య
నామములం బ్రస్తుతించి తదావేశితచిత్తులై తమతమయాశ్రమంబులకుఁ
జనిరి. భీష్ముఁడు బ్రహ్మసంపన్నుఁ డైన నతనిశరీరమునకు వలయుసంస్కా
రములనెల్ల యుధిష్ఠిరుండు సేయించి ముహూర్తమాత్రంబు దుఃఖితుం
డై యట నూఱడిల్లి కృష్ణునితోడ హస్తిపురంబున కరిగి తండ్రి యగు
ధృతరాష్ట్రుని బుత్త్రశోకమునం గుందుగాంధారి నూఱార్చి యాధృత
రాష్ట్రుననుమతిం జేసి వాసుదేవానుమోదితుండై పితృపితామహపరం
పరాప్రాప్తం బైననిజరాజ్యమును ధర్మమునం బాలించె నని సూతుండు
చెప్పిన విని శౌనకుం డోరౌమహర్షణీ, ధర్మజునకు నిజధన మగురాజ్యము
నెడను స్పర్ధఁగావించినయాతతాయు లగుధార్తరాష్ట్రులఁ దెగటార్చియు

రాజ్యలాభమున భోగముల మిక్కిలి యనుభవింపఁ దగినవాఁడయ్యు బంధువధసంతాపమునం జేసి తత్సంకోచంబుఁ గోరు ధార్మికవరేణ్యుం డైనయాధర్మరాజు తమ్ములతోడ నెవ్విధమునం బ్రవర్తిల్లె? మఱియు నాపదంపడి యేమేమి గావించెఁ దెలియం జెప్పు మని యడుగుటయు నాశౌనకముని కాయుగ్రశ్రవసుఁ డిట్లనియె.

ధర్మరాజు రాజ్యపాలనమునందు ధర్మము వరిల్లుట

మునీంద్రా, తమకులమునంబుట్టిన పరస్పరక్రోధానలంబున నీఱైన కురువంశమునకుఁ బ్రతిష్ఠఁ గావించువాఁడై లీలార్థంబు సంసారవృద్ధిఁ గావించుహరి పరీక్షితుని రక్షించి కౌరవకులంబున కంకురంబుఁ గల్పించి నిజరాజ్యమున ధర్మరాజుం బట్టాభిషిక్తుం జేసి ప్రీతచిత్తుం డయ్యె. తాను రాజ్య మేలుట హరికిఁ బ్రియం బనితలంచియు భీష్ముఁడు నచ్యుతుఁడు నుపదేశించినధర్మముల నెఱిఁగియుఁ దత్ప్రభావమునం బొడమినవిజ్ఞానమునఁ గర్తృత్వాదిమోహములం బాసి కృష్ణాశ్రయుండై తమ్ములు గొలువ నింద్రుఁడు నాకలోకము నెట్టు లట్టుల సముద్రముద్రితం బైనభూమండలంబు నేలె. అప్పుడు పర్జన్యుండు లెస్స వర్షింప భూమిలో నెల్లపంటలు మీఁదుమిక్కిలి పండుటయు సర్వాభీష్టములు నెఱవేఱ గోవు లత్యంత సమృద్ధములుగాఁ బాలు గురిసె. నదీమాతృకంబు లగుక్షేత్రములం బంట లెక్కు డయ్యె. సముద్రముల రత్నాదిసంపత్తి యొసంగె. పర్వతములందు ధాతుసమృద్ధి యతిశయిల్లె. వనస్పతులందు లతలందును ఫలపుష్పాదిసమృద్ధి మించె. ఎల్లఋతువులం దెల్లయోషధులును లెస్స ఫలించె. ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు లగుశారీరమానసవ్యాధు లెవ్వియు నయ్యజాతశత్రుండు రాజ్య మేలునెడఁ గలుగవయ్యె.

శ్రీకృష్ణుఁడు ద్వారకకుఁ దఱలుట

అవ్విధమునం బాండవకార్యములనెల్ల నెఱవేర్పుచుఁ దనచెలియ లగుసుభద్రకుఁ బ్రియంబు సేయను సుహృదు లగుధర్మజాదులకు శోకం బుడుపను హరి కరిపురిం గొన్ని నెలలు నివసించి యట ధర్మనందనునకు మ్రొక్కి గాఢపరిరంభముతోడం దదనుజ్ఞ వడసియుఁ గొందఱ కెఱఁగియుఁ గొందఱిప్రణామముల నంగీకరించియుఁ గొందఱఁ గవుఁగిటఁ గ్రుచ్చి యాదరించియు నెల్లవారి నుచితరీతి నాదరించి వీడుకొని

ద్వారవతి కరుగువాఁడై రథ మధిరోహించె. సుభద్ర, ద్రౌపది, కుంతి, విదురుఁడు, యుధిష్ఠిరుఁడు, గాంధారి, ధృతరాష్ట్రుఁడు, యుయుత్సుఁడు, కృపాచార్యుఁడు, నకులసహదేవులు, భీమసేనుఁడు, ధౌమ్యుఁ, డుత్తర మున్నుగా స్త్రీలు నప్పు డప్పుండరీకాక్షు నెడఁబాయ నోర్వక బమ్మరించు చుండిరి. సత్సంగమునం జేసి దుస్సంగ మెడలినబుధుఁ డెవ్వఁడేనియు మనోహరం బగువాసుదేవుచరిత్రం బొకపరి కీర్తించియుఁ గృతార్థతం జెందుఁగాని దాని విడువ నుత్సహించునే? దర్శనస్పర్శనాలాపశయనా సనభోజనములం బెద్దకాలంబు సహస్థితిం గాంచి పాంచజన్యధరుపై మతి నిలిపి సుఖించుపాండవు లవ్వాసుదేవునివిరహము సైరింపనేర రనిచెప్ప వలయునే? వా రందఱు తెప్పపాటు గాంచక చూచుచు మనంబుల నతనివెంబడింబంపుచు స్నేహసంబంధమునం దేవదేవుఁ డరిగినదెసఁ జూడ్కులు నిగుడ్చుచుఁ దిరుగుచుండిరి. బాంధవస్త్రీలు ప్రేమాతిశయము నం జేసి లోలోనం బొడమువిరహతాపమునం గ్రమ్ముకన్నీరు ప్రయాణ శకునంబు గాదని వెలికి రాకుండ నడంచుకొనుచుండిరి. ప్రయాణశుభ సూచకంబుగా మృదంగశంఖ భేరీవీణాపణవగోముఖచర్చర్యానక ఘంటా దుందుభిప్రముఖము లగువాద్యము లెల్ల మొరసె. కౌరవసుందరు లమ్మం దరధరుం జూచువారై ప్రాసాదంబు లెక్కి ప్రేమాతిశయమునను సిగ్గు పెంపునను నెమ్మొగమ్ముల లేనగవు సొంపు పెంపారఁ గనుంగొనుచు నవ్వ నజలోచనుపయిం గుసుమవర్షంబుఁ గురిసిరి. రథారూఢుం డైనహృషీ కేశునకు గుడాకేశుండు ముక్తాదామభూషితంబు రత్నదండమండితంబు నగు శ్వేతచ్ఛత్రంబు పట్టె. ఉద్ధవుఁడు సాత్యకియు నద్భుతచామరముల వైచిరి. తెరువునం గుసుమవృష్టి మీఁదుమిక్కిలి దనరె. పరమానంద స్వరూపుఁడు లీలామానుషధరుఁడు నగునవ్వాసుదేవు నుపలక్షించి సత్యము లగునాశీర్వచనంబు లచ్చటచ్చట బ్రాహ్మణులు గావింప వినఁ

### కౌరవపురస్త్రీలు కృష్ణునిమాహాత్మ్యం బుగ్గడించుట

బడుచుండె. కౌరవపురంధ్రీజనంబు లయ్యుత్తమశ్లోకునెడం జిత్తంబులు నల్పి సర్వశ్రుతిమనోహరంబుగాఁ దమలో నొండొరులతో నిట్లని చెప్పు కొనుచుండిరి. ఎట్లంటేని గుణక్షోభమునకు మున్ను సృష్టికిఁ బూర్వకాల మందును బ్రళయానంతరము జీవోపాధు లగుసత్త్వాదిశక్తులు లీనము

లగుటయు జీవులెల్ల లీనరూపు లయినపిమ్మటను నిష్ప్రపంచ మగునిజాత్మ రూపమున నద్వితీయుం డైనయాపురాణపురుషుండేకదా యీకృష్ణుండు. అట్టియప్రచ్యుతస్వరూపస్థితి యగునతండే సృష్టిప్రవాహ మనాది యగుటంజేసి క్రమ్మఱ నామరూపరహితుండగు నాత్మునకు నామరూపకల్పనంబుఁ గావించువాఁడై నిజకాలశక్తిప్రేరణమునం బ్రవర్తించుచు నాత్మజీవమోహనం బొనర్చుచు సృష్టికిం గారణం బైనప్రకృతి నధిష్ఠించె. కర్మాచరణార్థము వేదముల నిర్మించె. వాయువుల నిరోధించియు నింద్రియముల నిగ్రహించియుఁ బరమతత్త్వంబుఁ గాంచినపండితులు భక్తియోగనిర్మలం బగుబుద్ధిచే నెవ్వనిపదంబుఁ గాంతు రట్టిమహనీయుండే యితండు. మనబుద్ధులకు నితండే విశుద్ధి గావించు. ఇట్టివాఁ డిటుఁ బాసిచన మన కిట నుండరాదు. ఇమ్మహాత్మునితోడ బోవుటయే మనకుఁ గర్తవ్యంబు. సఖీ, యాత్మలీలను లోకములఁ బుట్టించుచుఁ బ్రోచుచుఁ దుదిఁద్రుంచునట్టి యేకరూపుఁడైన యీశ్వరుఁడే యితం డనియు నెప్పుడేనియు నధర్మమున రాజులు తమోమత్తులై ప్రవర్తిల్లుదు రప్పుడెల్లఁ బ్రతియుగమున లోకస్థితిపొంటె సత్త్వగుణమున నానావతారము లెత్తి ధర్మము నైశ్వర్యమును సత్యప్రతిజ్ఞను యథార్థోపదేశకత్వంబును దయ నద్భుతకర్మములనుం బ్రకటించు ననియు రహస్యార్థప్రతిపాదకు లగు పెద్దలు వేదములందును రహస్యాగమములందు నెవ్వనిసత్కథలం బాడుదు రట్టిపుణ్యకీర్తనుం డితండే. ఈప్రియకీర్తనుని యవతారసంచారములంజేసి క్రమంబున యదువంశంబును మధురానగరంబు నత్యంత శ్లాఘనీయంబును బరమపావనంబునయ్యె. తన్నే రాజధానిఁగా నమర్చుకొన్నయన్నలినలోచను సానుగ్రహమందహాససుందర విలోకనంబులం దనరు నాదేవదేవువదనారవిందంబుఁ దనలోఁ గాపురం బున్న జనులకుఁ గాంచుభాగ్యంబుకలిమికిఁ దాను బాత్రం బగుటంజేసి యద్దిరా! ద్వారవతీనగరి యమరావతీయశముఁ దిరస్కరింపఁజాలి భూలోకమునకెల్ల వన్నెపెట్టఁ గలిగె. చెలీ, నిక్కువంబుగ వ్రజసుందరీమణులు పూర్వజన్మంబుల వ్రతస్నానహోమాదినిధుల నీశ్వరు నారాధించి యీజన్మమున నీమహాత్మునకుఁ బత్నులై యితని నాశ్రయించి యితనిమధురాధరామృతంబుఁ బలుమారు గ్రోలుచు మోహంబుఁ గాంచిరి. వ్రజవనితల

కాదు. మఱియు స్వయంవరంబున బలియు రగుశిశుపాలాదుల నోటుపఱిచి వీర్యశుల్కమునఁ దెచ్చి పెండ్లి యైనరుక్మిణి జాంబవతి మున్నగునెన మంద్రుగురు దేవులును నరకాసురు సంహరించి పరిగ్రహించిన షోడశ సహస్రసుందరులుం దొల్లిపుట్టువుల నెన్నియేఁ బుణ్యకర్మము లాచరించి తత్ప్రభావమున నిమ్మహానుభావునకుఁ బత్ను లైరి. సర్వకాలంబు వీరి నివేశనంబు లెడఁబాయక నారాయణుండు మధురవచనంబులను భారి జాతాదివస్తుసంపాదనంబులను దమకుఁ బ్రియము గావించుచు నానం దింపఁజేయుటంజేసి యీసుందరు లందఱును స్వాతంత్ర్యసుఖమునకు శుచిత్వమునకును దూరం బైనస్త్రీజన్మమునే యుత్తమంబుగా శ్లాఘించు చున్నవా రని యిట్లు తమలోనం బలుకుచున్న పురనారీజనుల ప్రియ వచనముల సుందరదరహాసవిలోకనముల నభినందించుచు గోవిందుఁడు పురంబు వెడలి యరిగె. స్నేహము గలిగినచోటఁ గీడు శంకించుట సహ జంబు కావున నజాతశత్రుఁడు పరమస్నేహాస్పదుం డైన వాసుదేవునకుఁ దెరువున నేమిటం గీడు వొరయకుండఁగ రక్షణార్థంబు చతురంగబలో పేతం బైన సైన్యంబు గొంతఁ బనిచె.

### శ్రీకృష్ణుండు ద్వారకానగరముఁ జొచ్చుట

అట్లు తఱలి యరుగుచు హరి తనయెడఁబాటోర్వఁజాలక వెన్న డించి వెనుదవ్వు తనతోడ నరుదెంచిన యతిస్నిగ్ధు లగుకౌరవుల నెల్ల మెల్లన మఱలించి నిజనగరంబునకుఁ జనుచుఁ గురుజాంగలపాంచాలం బులను శూరసేనంబులను యమునాతీరదేశంబులను సరస్వతీతటజన పదంబులను బ్రహ్మావర్తంబును గురుక్షేత్రంబును మత్స్యవిషయంబులను నిర్జలాల్పజలదేశంబులను సౌవీరాభీరసైంధవదేశములనెల్లం జూచుచు నచ్చటచ్చటివారు గావించినపూజలనెల్లం గ్రహించుచు నాదిత్యుండపర గిరిచేరువ నేరునంతకు శ్రాంతవాహనుండై యత్యంతసమృద్ధను లైన యాత్మీయము లగునానర్తదేశములం జొచ్చి యచ్చటివారి కెల్ల నుల్లా సంబు పల్లవింపఁ జేయువాఁడై పాంచజన్యముఁ బూరించె. అప్పు డత్యంత ధవళం బైనయప్పాంచజన్య మప్పంకజాక్షునధరరాగంబునం జేసి కెంపు గదిరి యరుణకమలషండమునం జరించుచు మ్రాయంచ కైవడిం జూడ నొప్పె. లోకసంసారభీతి నడంపఁ జాలునమ్మహానాదంబు విని

## ద్వారకాపురవాసులు శ్రీకృష్ణుం బ్రశంసించుట

ద్వారకానగరవాసులు తమ ప్రభుం జూడఁ గుతూహలాయత్తులై యాత్మా
నందానుభవలాభమున నెల్లప్పుడుం బూర్ణకాముండై యాత్మారాముండైన
యద్దేవదేవునకు భానుమంతునకు దీపములం బోలెఁ గానుకలు గొనితెచ్చి
ప్రీతిసంఫుల్ల వదనులై బిడ్డలు తండ్రిం గింబోలె సౌహార్దమునం జేసి తమ్ముఁ
బ్రోచున మ్మహాత్మునకు హర్షగద్గదవచనంబుల నిట్లని విన్నవించిరి.
మహాప్రభూ, సంసారదుఃఖనివారణముఁ గోరువారికి బరాయణంబై
బ్రహ్మేంద్రాదినిర్జరులును సనకాదిమహర్షులునుం గొలిచియున్న నీ
పాదారవిందమున కేము మ్రొక్కెదము. కాలమేనియుఁ దన ప్రభుత్వ
మెవ్వనియెడఁ జెల్లింపఁ జాల దట్టిసర్వప్రభుండవు నీవకదా. ఓజగద్రక్షకా,
నీవ మాకు భవమున కగుము, నీవే మా కాత్ముఁడవు, సుహృదుఁడవు,
తండ్రివి, ప్రభుఁడవు, సద్గురుండవు, పరదైవతంబ వని నిన్ననువర్తించి
కృతార్థుల మైతిమి. స్వర్గలోకంబు సాధించినవారికిం జూడ నశక్యంబైన
ప్రేమస్మితస్నేహావలోకసుందరవదనంబై సర్వసౌభాగ్యనిధానంబైన
భవదీయదివ్యమంగళవిగ్రహముఁ గనుంగొనుటం జేసి యేము నీవలన
సనాథుల మైతిమి. పద్మలోచనా, సుహృద్దర్శనమనీషచే నీవు కరిపురి
కొండె మధురానగరమునకొండె నెప్పుడేని మమ్ముఁ బాసి యరుగుదేని
సూర్యుఁడు లేకున్నఁ గన్నులకుంబోలె మా కప్పు డొక్కక్షణమైన నబ్ద
కోటితుల్యంబై యంధప్రాయం బయ్యెడు నని పురజనులు విన్నవించు
చున్నంత మురాంతకుండు వారివచనంబు లాకర్ణించుచు సానుగ్రహ
వీక్షణంబు సారించుచు నాగంబులు భోగవతింబోలె నాత్మతుల్యబలు
లగుమధుభోజదశార్హకుకురాంధకవృష్ణివీరులు గాచుచుండ సురక్షి
తంబై సర్వర్తుసర్వవిభవముల సర్వకాలములం దనరుపుణ్యపాదపలతాశ్ర
మంబులను దర్శనీయపద్మాకరంబులను బరివృతంబై గోపురద్వారమార్గ
ముల నమర్చినలలితకుసుమకిసలయతోరణములను రమణీయంబై యంత
టంతట దంతురంబుగ సంతరించిన చిత్రధ్వజపతాకాగ్రముల వెల్లున నెండ
సొర నెడ గలుగమింజేసి స్పృహణీయం బై రాజమార్గముల నాపణ
వీథులఁ జత్వరంబుల ధూళిసమ్మార్జనం బొనర్చి గంధసలిలములం దడిపి
ఫలపుష్పాక్షతాంకురంబుల నలంకరించుటం జేసి కమనీయంబై గృహా

ములం దెల్ల ద్వారములం బూర్ణకుంభములు బలులు ధూపదీపములు దధ్యక్షతఫలేక్షుకాండంబులు నిండార నమర్చుటం జేసి యత్యంతశోభనంబై సొంపు పెంపారు ద్వారవతీపురంబుఁ బ్రవేశించె.

**వసుదేవాదులు శ్రీకృష్ణు నెదుర్కొని పురమునకుం దోడ్తెచ్చుట**

పరమప్రేమాస్పదుం డైనపద్మనాభుండు వచ్చుట విని వసుదేవుఁడు బలభద్రుఁడక్రూరుఁడుగ్రసేనుఁడు ప్రద్యుమ్నుఁడుచారుదేష్ణుఁడు సాంబుఁడు గదుఁడు మున్నుగాఁ గలయాదవులు ప్రహర్షవేగమునం జేసి యప్పుడు తము కావించుచుండినశయనాసనభోజనాదికార్యముల నుజ్జగించి మంగళార్థంబు మదమాతంగంబుఁ బురస్కరించుకొని ఫలపుష్పాదిమంగళద్రవ్యములం గొనుచు స్వస్తివాచనం బొనర్చు బ్రాహ్మణులుం దాము చేరులెక్కి శంఖతూర్యనాదములు మొఱయ సప్రణయంబుగను ససంభ్రమంబుగ నాశ్రీకృష్ణు నెదుర్కొనం జనిరి. వారివెంట నవ్వారిజాక్షుం జూడ వేడుక వొడమి వారవనితలు మణికుండలకాంతులు గండస్థలంబులం బ్రాఁకి నెమ్మొగముల కొకవింతచెలువుగూర్ప సంభ్రమంబుతో నరిగిరి. నటనర్తకగాయకసూతమాగధవందిబృందంబు లెల్ల నత్యద్భుతంబు లగునయ్యుత్తమశ్లోకుచరిత్రంబులం బాడుచు వారివెంటనంటి నడిచె. భగవంతుఁడు వచ్చుటఁ దన్నెదుర్కొన వచ్చినసర్వజనంబులను బురజనంబులను బరమాదరమునం గటాక్షించి నమస్కారుర్హులకుఁ బ్రణామంబులను గొందఱకు వాచానతులను గొందఱ కాలింగనంబులను దనకు మ్రొక్కినకొందఱకాశీర్వాదంబులను గొందఱకుఁ గరగ్రహణంబులను గొందఱకు మందహాసంబులను గొందఱకు దయార్ద్రదృష్టివిక్షేపంబులనుం గావించి వీరు వారనక పూజ్యు లాదిగాఁ జండాలజనులు తుదిగా నెల్లవారల నాదరించియు నభయదానముల నూరార్చియు నభీష్టముల నొసఁగి మన్నించి తాను గురువులయు వృద్ధులయు బ్రాహ్మణులయు మంగళాశీర్వచనముల వినయమునం గ్రహించి వందిబృందము లొనరించుప్రస్తుతిపాఠములఁ జిత్తగించుచు రాజమార్గంబు దఱియం జొచ్చె. అప్పుడు కులపురంధ్రిజనంబు లమ్మహానుభావుం జూడ వేడుక గడలుకొన మేడలెక్కి రెల్లకాలంబుఁ జూచుద్వారకాజనులకు నావనజనాభుం జూచు నెడ నెన్నటికిం దనివి దీఱకుండె. ఇయ్యది వింత గాదు. శ్రీవిలాసనివేశనం

బైనయచ్యుతుం జూచునెడ నేరికిం దనివి గలుగు? ఆదేవదేవుని వక్షస్థలం బునం గోరి శ్రీ తానే నిత్యంబు వసియించు. దేవకీనందనువదనంబు సర్వ ప్రాణిలోచనంబులకు సౌందర్యామృతపానపాత్రంబు. ఆచతుర్భుజు భుజ ములు లోకపాలురకు నెలవు. భక్తుల కతనిచరణారవిందంబు మనికిపట్టు. అట్టియెడం బసిండివెలిగొడుగు ధవళచామరద్వయంబునుం దనర నలరుచు నగరనారీజనంబులు పయిపయిం జల్లువిరిసోన నెనయుచు లలితపీతాం బరంబు మెఱుంగునం దుఱంగలించుచు సురభివనమాల నలరారుచుం దమాలనీలుం డైనయవ్వాసుదేవుండు మేఘమండలముపయి నాదిత్య బింబము నిరుదెసల నిద్దఱు సుధాకరులును నక్షత్రగణంబును స్థిరం బైన సౌదామనీప్రకాశంబు నింద్రచాపంబునుం గూడునేని యప్పు డెట్టి చెన్నుదోఁచు నట్టిసొంపునం జూడ నయ్యె.

### శ్రీకృష్ణుఁడు నగరు సొచ్చుట

అవ్విధంబున మధుసూదనుండు రాజమార్గంబునం జనిచని నగరి కరిగి తల్లిదండ్రులకుం దక్కినతల్లుల కంపఱకును బాదాభివందనంబు నేసి నం దల్లులు గౌఁగిటం గ్రుచ్చి స్నేహమునం బయోధరములు చేపం దొడ లపై నిడికొని హర్షవిహ్వలత్వంబునం జేసి యానందబాష్పములం దడిపి దీవించినం దదీయాశీర్వచనంబులం గ్రహించి కొంతతడవు వారిం గొలిచి యట నామంత్రణంబు నేసి యత్యుత్తమంబై సర్వకామసమృద్ధివిలసి తంబై షోడశసహస్రభార్యలయుం దక్కినపత్నులయు దివ్యసౌధము లంత టంతటం బెరయ మెఱయునిజభవనంబునకుం జనియె. కృష్ణభార్యలును దేశాంతరమునుండి యింటికిం జనుదెంచినపతిని దవుదవ్వులం గాంచి మనం బులం గడలుకొన్న వేడుక వెల్లునం జేసి యంతరకరణములం గూడుచు సిగ్గుపెంపునం గ్రేఁగంటం జూచుచు మొగమ్ముల వాంచుచుం బతిప్రవాస వ్రతములతోడం దటాలున లేచి తొలుదొలుత మనంబుల నాతనిం గౌఁగిలించికొని యటం జూడ్కులం దత్సుఖంబు వడసి పదంపడి తనుజుల నెత్తి యిచ్చునెపమునం గాఢాలింగనం బనుభవించి భావగంభీరలు గావునం దనంతనయొదవునానందసలిలముల వ్రీడావిహ్వలత్వంబున నడంచి కొనుచుం బరమసుఖముం బ్రాపించిరి. శ్రీకృష్ణుండు వారికిం దలంచినపు డెల్లం బ్రక్కను రహస్యమున నమరియున్న నతనిపదకమలంబు వారి కప్పుట

ప్పటికి నవనవంబై తోఁచె. చంచలస్వభావ యయ్యు లక్ష్మి యతని నెల్ల పుడు నెడఁబాయక యుండు నన్న నిఁక లోఁతు లతనిసహవాసంబు విడువ నేర రని చెప్పవలయునే?

అట్టియెడంగున భారతసమరంబునం గమలనాభుండు వాయువు వనములలో నగ్ని నెట్లట్లు భూభారజన్ము లగు రాజులకుఁ దమలో నంతర కలహంబుఁ గల్పించి యక్షౌహిణులం గూర్చి పోరమర్చి తా నాయుధ వ్యాపార మేమియుం గొనకయే వారలనెల్లం బరిమార్చి భూభారంబుఁ దీర్చి యుపశాంతిం గ్రహించి నిజమాయాబలంబున నీనరలోకమున నవత రించిన మానుషవేషమున కనురూపంబుగాఁ బ్రాకృతునివడువున నుత్తమ స్త్రీజనంబుతోడం గ్రీడించుచుండెఁగాని మదనాంతకునకును మోహము పుట్టి పినాకచాపముఁ గ్రింద నేయఁజేయఁ జాలినగంభీరభావసూచ కంబు లగుచిఱునగవులను లలితలజ్జావిలోకనంబులను నేర్చినకోలఁది వివరించియు నుత్తమస్త్రీమంతనీజనంబు లాజితేంద్రియుచిత్తముం దమ కుహకవిలాసముల మథింపఁ జాలరైరి. జ్ఞానశూన్యు లగుజనులు మానుష వేషమున కనురూపముగ లోకమున వ్యాపించు నాపరమేశ్వరుఁ డేమి టను సక్తుండు గాఁ డని యరయ నేరక తమయట్లపోలె సంసారసక్తునిఁ గాఁ దలంతురు. ఆత్మాశ్రయ మగుబుద్ధి యాత్మస్థము లగునానందాదులం గూడనికైవడిఁ బ్రకృతిస్థుం డయ్యు నీశ్వరుండు తదీయగుణంబు లగు సుఖదుఃఖాదులం గూడఁడు. ఇయ్యదియే యీశ్వరునియైశ్వర్యప్రకా రంబు. ఈశ్వరతత్త్వం బరయనేరక యబలలు మూఢత్వమునంజేసి యహంవృత్తు లీశ్వరుని స్వాధర్మయోగిగాఁ దలంచువిధమునఁ దమతో నేకాంతమునం గ్రీడించుచుఁ గూడుచుఁ దమకు వశ్యుం డని తలంతు రియ్యది పరమార్థంబు గాదని సూతుండు సెప్పె.

**సూతుని బరీక్షిచ్చరిత్రంబు చెప్పు మని శౌనకుం డడుగుట**

చెప్పిన విన శౌనకుం డోరోమహర్షణసుతా, యశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రమున నుత్తరాగర్భంబు సమ సియుఁ గ్రమ్మఱఁ గృష్ణునిదయవెంపునం బ్రదికె ననిచెప్పితివిగదా. తద్గర్భ సంభూతుం డైనపరీక్షితుని జన్మకర్మంబులును దేహత్యాగంబును దదీయ పుణ్యగతిప్రకారంబును విన వేడుక వొడమెడు. శుకయోగీంద్రు నుపా

సించి జ్ఞానంబు వడసినయమ్మహానీయునిచరిత్రంబు వినఁ గుతూహలం
బయ్యెడు. శ్రద్ధావంతు లగుమాకయ్యది తేటపఱుపవే యనియడుగు
టయు నాశ్రోతృమునుల కప్పౌరాణికుఁ డిట్లనియె.

### సూతుఁడు పరీక్షిజ్జన్మాదిచరిత్రంబు చెప్పుట

మునివరా, ధర్మరాజు సర్వకామములయెడ నిస్పృహుండై కృష్ణపాదసేవాప్రభావమునం జేసి తండ్రిమాడ్కిఁ బ్రజల రంజిల్లఁ జేయుచు రాజ్య మేలుచుండె. ముకుందచరణాసక్తచిత్తుం డైనయయ్య జాతశత్రున కాఁకొన్నవాని కన్నంబుదక్కఁ దక్కినవస్తువులు రుచింపని కైవడి సురలకును స్పృహణీయంబు లయ్యు సంపదలు క్రతువులు పుణ్యలోకములు భార్యలు భ్రాతలు భూమి యఖండజంబూద్వీపాధిపత్యంబు స్వర్గలోకంబున కెక్కినకీర్తియు ముదంబుఁ గూర్పవయ్యె. అదియట్లుండె. అప్పు డయ్యభిమన్యుకుమారుండు మాతృగర్భమున నశ్వత్థామాస్త్రతేజమునం గాలుచు నంగుష్ఠమాత్రుండు నిర్మలప్రకాశుండు కనకకిరీటవిలసితుండు దివ్యసుందరనీలగాత్రుండు పీతాంబరుండు దీర్ఘచతుర్భుజుండు తప్తకాంచనకుండలుండు క్రోధాతామ్రలోచనుండు నగు నొకపురుషునిఁ గోఱవి తెఱఁగున మెఱయుచున్నగదఁ ద్రిప్పుచు సూర్యుఁడు నీహారమునుంబోలెఁ దదస్త్రతేజ మెల్ల రూపుమాపువానిఁ దనచెంగటం జూచి యిమ్మహాపురుషుం డెవ్వఁడొకో యని తన తనలోఁ బరీక్షించుచున్నంత నాపదినెలలగర్భబాలునియెదుర నప్పరమపురుషుఁ డాగర్భగోళమునం దే యంతర్ధానంబుఁ గాంచె. అంత ననుకూలగ్రహోదయంబై సర్వగుణంబుల నుత్తరఫలంబునకు మేలిమి గావింపఁ జాలినశుభలగ్నమున నా కుమారుఁడు పాండువంశమునకుఁ గర్తయై పరాక్రమమునఁ బాండురాజునకు సాటియై జనించె. అతనికి ధర్మరాజు ధౌమ్యకృపాదులు బోధించినతెఱంగునం బ్రీతిపూర్వకముగా జాతకర్మంబు నిర్వర్తించి యుత్తములచే స్వస్తివాచనంబు సేయించి హిరణ్యము గోవులు భూమి గ్రామములు గుఱ్ఱములు మృష్టాన్నంబునుం బ్రాహ్మణుల కాపుత్రోత్పత్తిపుణ్యకాలమున నొసంగె. దానికి సంతుష్టులై బ్రాహ్మణులు వినయాన్వితుం డైనధర్మరాజున కిట్లనిరి.

జోస్యులు ధర్మరాజునకుఁ బరీక్షిత్తుగుణములు చెప్పుట

రాజేంద్రా, దుర్వార మగుదైవమున నత్యంతపరిశుద్ధ మగుపూరువంశ ముత్పన్న మగుటయు నీకుమారుండు దానికిఁ బ్రతిష్ఠఁ గావింప నుద్భవిల్లె. మీయెడ ననుగ్రహించిన ప్రభ విష్ణుం డైనదేవునిచే నీకుమారుఁడు * రాతుఁ డయ్యెఁ గావున నీతండు విష్ణురాతుఁ డనం బరమకీర్తిఁ దనరి లోకమున వెలయఁ గలఁడు. మఱియు నితండు మహాభాగవతోత్తముఁ డయ్యెడు; నిస్సంశయం; బని చెప్పిన విని ధర్మనందనుం డయ్యా, యీకుమారుఁడు యశమునను సాధువాదమునను బుణ్యశ్లోకు లగు తొల్లింటియస్మద్వంశరాజుల ననువర్తించునే యని యడుగుటయు బ్రాహ్మణులు మఱియు నిట్లనిరి. కుంతీనందనా, యితండు మనుతనుజుం డైన యిక్ష్వాకునిమాడ్కిఁ బ్రజల నేలఁగలఁడు. దశరథతనయుండైన శ్రీరామునిచాడ్పున బ్రహ్మణ్యుఁడును సత్యసంధుఁడు నగు. ఔశీనరుం డైనశిబితెఱఁగున దాతయు శరణాగతరక్షకుఁడు నగు. దుష్యంతసుతుం డైనభరతునిరీతి యజ్వ లగుస్వీయరాజులకీర్తికి వన్నె పెట్టు. కార్తవీర్యార్జునుఁడు పార్థార్జునుఁడు నెట్లట్లు విలుకాండ్రలో నెల్ల నగ్రగణ్యుం డగు. అగ్నికైవడి నితరులకుఁ జెనక నలవి గాఁడు. సముద్రంబువోలె దుస్తరుం డగు. సింహమువడువున విక్రమోల్బణుం డగు. హిమవంతునివిధమున సజ్జనసంసేవనీయుం డగు. భూమితీరున శాంతిసంపన్నుఁ డగు. తల్లిదండ్రు లెట్టు లట్టుల ప్రజలయపరాధముల సహించు. బ్రహ్మదేవునిప్రకారమున సర్వభూతములయెడ సముం డగు. శంకరుకరణిఁ బ్రసాదవంతుఁడగు. సర్వసద్గుణమాహాత్మ్యమునం గృష్ణునకు సాటియై సర్వభూతముల కాశ్రయంబగు. ఉదారత్వమున రంతిదేవునకుఁ దుల్యుఁడగు. ధార్మికత్వంబున యయాతికి సమానుఁ డగు. ధృతిగుణమునం బలికి సముఁ డగు. విష్ణుభక్తిసమభినివేశమునం బ్రహ్లాదునకు సాటి యగు. మఱియు నితండనేకాశ్వమేధముల నాచరించు. వృద్ధుల నుపాసించు. జనమేజయాదు లగు రాజర్షులం బుట్టించు. దుర్మార్గప్రవృత్తుల శాసించు. భూధర్మనిమిత్తమునఁ గలిని నిగ్రహించు. ద్విజసుతుం డైనశృంగిచేఁ బ్రేరితుం డగు.

---

* రాతుఁడు = దత్తుఁడు. "రాదానే" అనుధాతువుమీఁద నిష్పన్నము. విష్ణునా రాతః విష్ణురాతః=విష్ణువుచే నియ్యఁబడినవాఁ డని భావము.

తక్షకునివలనం దనకు మృతి గలుగు ననియెఱింగి వ్యాససుతుం డైనశుక యోగివలన నాత్మతత్త్వంబుఁ దెలిసి పాంచభౌతిక మగు దేహమును గంగ లోనం ద్యజించి ముక్తసంగము నిర్భయము నగుహరిపదంబుఁ దుదిఁ బ్రాపించు నని జాతకవిదు లైనబ్రాహ్మణులు ధర్మరాజునకుఁ దెలియఁజెప్పి యమ్మహారాజు కావించినసత్కారములం గ్రహించి నిజగృహంబులకుఁ జనిరి. ఆకుమారుఁడే తాను గర్భస్థుఁడై చూచినపరమపురుషు నితరజను లలో నెల్లఁ బరీక్షించుచుండుకారణమునఁ బరీక్షితుం డనంబరఁగి శుక్ల పక్షచంద్రునిచందమునం బ్రతిదినమును యుధిష్ఠిరాదు లొనరించు సర్వ కామముల సంపన్నుండై సర్వకలాసమృద్ధి దనరఁ బెరుఁగుచుండె.

అట్టియెడ ధర్మరాజు తనకావించినజ్ఞాతివధపాతకమునకుఁ బ్రాయశ్చిత్తముగా నశ్వమేధ మాచరించువాఁడై రాజ్యమునఁ దనకు వచ్చుషష్ఠాంశధనము దుష్టదండనాత్తధనము నను నీరెండును రాజ్యపాలనమాత్రోపయోగ్యంబు లవుటం జేసి యయ్యాగమునకుఁ జాలినంతధనసంపత్తిం గానక విచారించుచున్నంతఁ దమ్ము లచ్యుతునానతిం జేసి యుత్తర దిశం దొల్లి మరుత్తుండు యజ్ఞ మొనర్చినప్పుడు విడిచిన సువర్ణపాత్రాదిరూపం బైనమహాధనమును దెచ్చియిచ్చుటయు ధర్మరాజు దానం జేసి సంభృతసమస్తసంభారుండై లబ్ధకాముండై మూఁ డశ్వమేధము లనుష్ఠించి యజ్ఞేశ్వరుం డైనహరినారాధించె. యజ్ఞమునకు ధర్మనందనుండు పిలువ నేతెంచి వాసుదేవుఁడు ద్విజులచే నామఖంబు నడిపించి సుహృదులకుఁ బ్రియంబుసేయుచుఁ గరిపురిం గొన్ని నెలలు నివసించి యట నయ్యజ్ఞదంపతు లగునజాతశత్రునిద్రౌపదిని వీడుకొని యాదవులు గొలువ నర్జునునితోడ ద్వారవతి కరిగె.

### తీర్థయాత్ర చేసి వచ్చినవిదురునితో ధర్మరాజు సంభాషించుట

అంతఁ గొండొకకాలమునకు విదురుఁడు తీర్థయాత్ర వెడలి యచ్చటఁ బ్రసంగవశమున మైత్రేయమునిం గొలిచి యతనివలన బ్రహ్మతత్త్వంబు నెఱింగి దానం జేసి విదితవేదితవ్యుండై మగిడి హస్తిపురము నకుఁ జనుదెంచె. విదురుండు దొలుత మైత్రేయుం బెక్కుప్రశ్నంబు లడిగెఁగాని యమ్ముని సెప్పినకొన్నింటివలననే యాతనికి భగవంతునియెడ నేకాంత భక్తిగలిగెఁ గావున నితరప్రశ్నార్థముల విచారింపకయే యప్పి

దురుఁ డుపరతుఁడయ్యె. ప్రియబాంధవుం డైనవిదురుని దీర్థయాత్ర నెఱవేర్చి వచ్చినవానిం జూచి ధర్మపుత్త్రుండును దమ్ములును ధృతరాష్ట్రుండును యుయుత్సుండును సంజయుండును గృపాచార్యుండును గుంతియు గాంధారియు ద్రౌపదియు సుభద్రయు నుత్తరయు ద్రోణపత్ని యగు కృపియు మఱియుం గలపాండవజ్ఞాతిభార్యలు దక్కినబాంధవులు నతని నెదురుకొని మూర్ఛాదులవలనం దొలుత నవసన్నంబై క్రమ్మఱ నావికార ముడిగినం బూర్వస్థితిం జెందుప్రాణముం గాంచినయింద్రియముల చందమున నతనిరాక కుల్లసిల్లుచుఁ జేర నరిగి యథావిధి నమస్కారాలింగనాదుల నయ్యైవార లుచితరీతి నతని నాదరించి విరహోత్కంఠాకాతరులు గావున నానందబాష్పసలిలములం గురిసిరి. అట ధర్మరాజతని నుచితాసనమునఁ గూర్చుండఁ జెప్పి తగినసత్కృతులం గావించి యట నతండు భుజించి విశ్రమించి యాసనమున సుఖాసీనుఁడై యున్న తఱిం దమవారెల్ల వినుచుండ నవ్విదురున కిట్లనియె. అయ్యా, మీపక్షచ్ఛాయచేఁ బెరిగి విషానలప్రముఖము లగువిపత్పరంపరలబారిం బడక మీసహాయమునఁ దల్లితోడఁ దప్పించికొని బ్రదికిన మమ్ముఁ దలఁతురే? క్షితిమండలమునం జీవించునెడ మీ రేవృత్తిమై వర్తించితిరి? ఈభూమండలమున నేయేతీర్థముల సేవించితిరి? మహాత్మా, తీర్థభూతు లగు మీయట్టిభాగవతులు నిజమనోనివాసి యగువాసుదేవునిచేఁ దీర్థములకుఁ బావనత్వంబుఁ గావింతురుగాని యొండు గాదు. కృష్ణుఁడే తమకు దైవమని తలంచు మనసుహృద్బాంధవు లైనయాదవులు నిజనగరమున సుఖమున్నవారే? మీరు వారిం జూచితిరే? మఱి వారిసుఖవర్తనంబు వింటిరే? అని యడిగిన ధర్మరాజునకు విదురుండు యదుకులక్షయం బొక్కటి దక్కఁ దక్కినయెల్ల విషయములు దనయనుభవించినరీతిని వివరించె. తనంత వచ్చిన నప్రియంబు మనుష్యులకు సహింపరాదు గావున నద్దానిం జెప్పినం బాండవులు దుఃఖింతు రనియు వారిదుఃఖావస్థఁ జూడ రాదనియు విదురుఁడు యదుకులవినాశం బొకటి చెప్పక విడిచె. స్వజనులు తనకు దేవోపచారము లొనర్ప నుల్లసిల్లుచుఁ దనయన్న యగు ధృతరాష్ట్రునకు మేలు గావించుచు నెల్లవారికిం బ్రీతి నాపాదించుచుఁ గొంత కాలము కరిపురమున నివసించె. యముఁ డాణిమాండవ్యముని

శాపమున వర్షశతమాత్రంబు శూద్రకులమున విదురుఁడన జనించుటం
జేసి యామాత్రేం డ్లచ్చట యమునకు లోకపాలనమునం గర్తవ్యంబైన
దండము నతనితండ్రి సూర్యుఁ డరయుచుండె. ధర్మరాజు లబ్ధరాజ్యుండై
లోకపాలతుల్యు లగుతమ్ములసహాయసంపత్తిం దనరి రాజ్య మేలుచుఁ
గొంతకాలమునకుఁ గులకర్త యగుపౌత్త్రుఁడు రాజ్యనిర్వాహకుఁడై
యుండుట నరసి తాను రాజ్యభోగములం దొఱంగఁ దలంపు గొనియె.
అక్కడ నచ్యుతుండు తనవెంట వచ్చుబాంధవులనెల్ల మఱలించి యర్జు
నోద్ధవసాత్యకులతోడ ద్వారవతికిఁ జనియెఁగదా.

### విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ గాలగతి చెప్పి విరక్తి బోధించుట

వృత్తాంతంబులెల్ల నిట్టు లుండ గృహాసక్తులై గృహవ్యాపారముల నేమఱియున్న యాదవులు మున్నగువారికిఁ బరమదుస్తరంబైన యాకాల మవిజ్ఞాతంబయ్యుఁ గడచనియె. అట్లు కాలముదీఱుటరసి విదురుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. రాజేంద్రా, వేగంబ వెడలు మిదె భయము వచ్చెఁ జూడుము. దేనివలన నెందునుం బ్రతిక్రియం జెందనికాలము మనకెల్ల నిపుడు మూడె. అట్టికాలము దరిసినమనుజుఁ డత్యంతప్రియములగుప్రాణములనైనం గోల్పోవు, నిఁక ధనాదులం గోలుపడుట చెప్పవలయునే? నీకుఁ దండ్రులు నన్నదమ్ములు కొడుకులు సుహృదులుం దెగటారిరి. వయస్సు చెల్లె. మేన ముదిమి ప్రబలె. ఇట్లయ్యు నింక నిల్లు విడువ ననరాదు. ముందె యంధుఁడవు. ఇప్పుడు జరాభారమునం జేసి బధిరుఁడవు. బుద్ధిదుర్బలుండవైతివి. పండ్లు రాలిపడియె. జఠరాగ్ని మంద మయ్యె. రోగములు పెల్లలముకొనియె. కఫప్రకోపమునసలజడిపడుచున్న వాఁడవు. అక్కటా! జంతుకోటికి జీవితాశ యింత యెక్కు వగునే? జీవితాశానిమిత్తమునం గదా నీవు గృహపాలంబురీతి భీముఁ డిచ్చుపిండముఁ దినుచు నొడలోముకొనుచున్న వాఁడవు. అగ్గి పెట్టియు విష మిచ్చియు భార్యం బరిభవించియు క్షేత్రధనముల నాఁచికొనియుఁ బలుదెఱంగుల నీ వెవ్వరికెల్ల కాలంబు కీడులే చేసితి వట్టివా రొసఁగు నన్నాదులఁ గాచికొనంబడు ప్రాణము లుండిన లేకుండిన నేమి? ఇట్లు పగవారికూడు గుడుచుచునైనం బెద్దకాలము బ్రదుకఁ గోరునీవు వలదన్నను మృత్యువు దనంతన వచ్చుఁ గాన జీర్ణవసనంబుమాడ్కి జరాజీర్ణంబైననీశరీరము నశించు. అభిమా

నము మాని తనగతి యితరులకుఁ దెలియరాకుండ విరక్తుండై యశో ధర్మాదిశూన్యం బైనయీ మేను విడుచువాఁడు ధీరుఁ డనంబడు. స్వత స్సంజాతవిజ్ఞానముననైనఁగాని పరోపదేశలబ్ధవిజ్ఞానముననైనఁగాని దేహగేహాదుల యెడ విరాగంబుఁ జెంది యాత్మవంతుఁడై హృదయమున హరి నిడికొని గృహము విడిచి ప్రవ్రజనంబు సేయువాఁడే నరోత్తముఁ డనంబరఁగు. కావున నీక నీవు యదృచ్ఛావిజ్ఞాతగతివై యుత్తరదిశం బట్టి చనుము. ఉత్తరకాలము పురుషులకు ధైర్యాదిగుణముల నడంచుఁ గావున నీకు దడయరా దని యనుజుం డైనవిదురుండు బోధించినం బ్రజ్ఞాచక్షుం డైనధృతరాష్ట్రుండు మనస్సు దృఢము గావించుకొని స్వజనులయెడ స్నేహపాశములం ద్రెంచి తమ్ముఁడు సూపినతెరువు పట్టి వెడలె. పతి య ట్లరుగుటం జూచి పరమపతివ్రత యగుగాంధారి యతని వెంబడించి యతం డరిగినహిమాలయమునకుఁ దాను నరిగె. ఆహిమవంతంబు మంచుపెల్లున నాయాసబహుళంబయ్యు శూరులకుఁ దీవ్రప్రహారం బయ్యు సమరము ప్రియమగురీతి సన్న్యస్తదండులకు సంతోషదాయకం బయ్యెడు.

## ధర్మరాజు ప్రవ్రజితుఁ డైనధృతరాష్ట్రుని గాంధారిని గానక చింతిల్లుట

అంత నజాతశత్రుండు సంధ్యావందనంబు సలిపియు నగ్నిహో త్రంబు దీర్చియు బ్రాహ్మణులకుఁ బ్రణామపూర్వకంబుగాఁ దిలగోవస్త్ర హిరణ్యదానముల సలిపియు గురువందనార్థంబు తదీయగృహంబు సొచ్చి యచ్చటఁ దలిదండ్రు లగుగాంధారీధృతరాష్ట్రులం గానక యుద్విగ్న మానసుండై యచ్చట నున్న సంజయుం బిలిచి గావల్గణీ, నేత్రహీనుఁడు వృద్ధుఁడు నగుమాతండ్రి యెక్కడ? కొడుకులం గోల్పోయి దైన్యముఁ బ్రాంచినతల్లి గాంధారీదేవియు నెక్కడ? కృతప్రజ్ఞుండుకాని నాయెడ నేమేని యపరాధము శంకించి దుఃఖితుండై గంగలోఁ బడిరో కా? మాతండ్రి పాండురాజు లోకాంతరగతుం డైనం బసిబాలు రగుమమ్ము సౌహృదమునం బెంచిన మాపెద్దతండ్రియుఁ బెద్దతల్లియు నిటఁ బాసి యెటకుఁ జని రనియడిగె. అడుగుటయు సంజయుండు తదీయవిరహకర్శి తుండు గావునఁ గరుణాస్నేహవిహ్వలత్వంబులు దన్నుఁ గ్రమ్ముకొనం దనయేలినవానిం జూడనికతంబున మీఁదుమిక్కిలి కుందుచు నెట్టకేలకుఁ

తన్నుఁ దాన యూఱార్చికొని చేతఁ గన్నీరు దుడిచికొని ధర్మజునకుఁ బ్రత్యుత్తరంబు లెస్స చెప్ప నోరాడక యారాజుపాదములం దలంచుచు నో రాజేంద్రా, యేను నీతల్లిదండ్రులవ్యవసాయం బెఱుంగనయ్యెద నమ్మహాత్ములచే మోసపోయితి నని చెప్పుచున్నంత నారదమునీంద్రుఁడు తుంబురునితోడ నచ్చటికి విచ్చేసె.

### ధర్మరాజు నారదునివలన ధృతరాష్ట్రుని ప్రవర్తనం బెఱుంగుట

విచ్చేసిననారదమునీంద్రు నెదుర్కొని ధర్మరాజు మ్రొక్కి యర్చనాదు లాచరించినట్లు సల్పి మునీంద్రా, మాతండ్రి యగుధృతరాష్ట్రుఁడును దనకన్నబిడ్డలనెల్లఁ గోల్పడి దీనత్వంబునం గుందు మాతల్లి గాంధారియు నెటు వోయిరో యెఱుంగనయ్యెద. వ్యసనార్ణవమున మునిఁగినమాకు భాగ్యవశమున నీవు దర్శన మొసంగితివి. అపార మగు శోకసాగరమునం బారము సూపి మమ్ముఁ గావు మనియడుగుటయు నతనికి నారదుం డిట్లనియె. రాజేంద్రా, నీ వెవ్వరికిని శోకింపకుము. ఈలోకమెల్ల నీశ్వరవశంబై యుండు నయ్యీశ్వరుండే భూతములకు సంయోగవియోగములఁ గావించుచుండు. పొడవు గలముకుద్రాటఁ గట్టంబడిన యెడ్లచాడ్పున లోకపాలురును లోకములు నయ్యీశ్వరుండు నియమించినవానిం జేయుటయు మఱియుఁ గార్యాకార్యవిధాయక మగువేదమనువాక్తంత్రిని వర్ణాశ్రమలక్షణంబుల బంధనంబు వడసి యాపరమేశ్వరుండు పురికొల్పినపనిం జేయుటయు సహజంబులై యుండెడు. క్రీడించువారి యిచ్ఛానుసారముగఁ గ్రీడాసాధనము లగునక్షకందుకాదులకుం బోలె లోకమునం బ్రాణులకు సంయోగవియోగములు జగత్క్రీడాపరుండైన యీశ్వరునియిచ్ఛ మెయిఁ బ్రవర్తిల్లుచుండు. లోకమెల్ల జీవరూపమున నిత్యమనిగాని దేహరూపమున ననిత్యమనిగాని శుద్ధబ్రహ్మరూపంబున నొండె ననిర్వచనీయత్వమున నొండె నుభయవిలక్షణం బనికాని చిజ్జడాంశయోగమునం జేసి యుభయాత్మకం బనికాని, తలంతువేనియు నీ నాలుగువిధములను మోహజనితం బగుస్నేహ మొక్కటి దక్క మఱియే నిమిత్తమునను నీతండ్రి మున్నగువారిం గూర్చి శోకింపఁ బని లేదు. కావున నజ్ఞానకృతం బైనమనోవ్యాకులత్వంబు విడువుము. నన్ను విడచి నాతల్లిదండ్రులు రక్షకరహితులై యక్కటా! యెట్లు వర్తింతు రని చింతింప

వలదు. పాంచభౌతికం బైనయీ దేహము గుణక్షోభ మగు కాలమునకు జన్మనిమిత్త మగుకర్మమునకు నుపాదానరూపము లగుగుణములకు నధీనంబై వర్తించుఁ గావున వానికి విభాగంబు గలిగినం దాను నశించు. కావున నిందుఁ గర్తవ్యం బేమియుం గలుగదు. అజగరమునకుఁ జిక్కినవాఁడు లాఁతిం గావఁ జాలనివిధమునఁ గాలాదులకుఁ జిక్కినప్రాణి యేమియుం జేయఁజాలఁడు. హస్తవంతములకు హస్తహీనములును జతుష్పదంబులకుఁ బాదహీనంబులును గొప్పభూతముల కల్పసత్త్వంబులు ననునీ విధముగా జీవుఁడే జీవునకు జీవనంబుగాని యొండు గాదు. కావున లోకమెల్ల విచారించిచూచిన మృత్యుగ్రస్తంబకాని మృత్యువునకుఁ దప్పినది గానంబడదు. సమస్త మగునీప్రపంచము భగంతుఁడే కాని వేఱు గాదు. ఆభగవంతుఁ డొక్కరుండ కాని భిన్నరూపుఁడు గాఁడు. భోక్తల కాత్మస్వరూపుఁడే కావున సజాతీయభేదంబును నంతర్బహిర్భాగముల భోక్తృభోగ్యరూపములఁ దోఁచుఁ గావున విజాతీయభేదంబును నాతని యెడం గలుగదు. నీవ చూడుము. స్వీయమాయాప్రభావమునం జేసి కేవలము బహువిధములం దోఁచుచుండు. భూతభావనుం డైనయాభగవంతుఁడే దేవవిద్వేషుల కంతముఁ గావింపఁగఁ గాలరూపమున నవతరించి దేవకృత్యంబు నెఱవేర్చి యిఁక మిగిలియుండుదానికి వేచియున్నవాఁడు. ఆయీశ్వరుం డిట నుండునంతకు మీరును వేచియుండుఁడు.

ధృతరాష్ట్రుఁడు దనభార్య యగుగాంధారితో నిటఁ దఱలి హిమవంతంబునకు దక్షిణమునం గంగానది సప్తఋషులకుఁ బ్రియము సేయ నేడు వఱదలై పాఱునట్టిపుణ్యాశ్రమమునకుఁ బోయి యట నాసప్తస్రోతస్తీర్థమునం ద్రిషవణస్నానంబు సేయుచు విధియుతంబుగ నగ్నిహోత్రము నిర్వర్తించుచు నిరాహారుఁడై శాంతాత్ముఁడై విగతపుత్త్రాద్యేషణుండై జితాసనుండై జితశ్వాసుండై ప్రత్యాహృతషడింద్రియుండై హరిభావనామహిమంబునఁ ద్రిగుణమలములం దెగడి మనస్సు నహంకారాస్పదంబగుస్థూలమునుండి యెడఁబాపి విజ్ఞానాత్మ యగుబుద్ధిలోఁ జొనిపి దానిని దృశ్యాంశమునుండి తొలఁగించి ద్రష్ట యగుక్షేత్రజ్ఞునందుఁ జేర్చి యతనిం ద్రష్ట్రంశమునుండి వియోగింపఁజేసి మహాకాశములోని ఘటాకాశముంబోలె నాశ్రయసంజ్ఞం బైనబ్రహ్మమున ననుసంధించి మాయాగుణ

ఫలము లగుపుత్రవాసనలం బాఱఁద్రోలియు సర్వేంద్రియవ్యాపారం బుడిగియు నాహారము లెల్ల మానియు స్థాణువట్లపోలె నిశ్చలుండై యున్నవాఁడు. సర్వకర్మముల సన్న్యసించినయతని కీఁక నంతరాయ మాచరింపఁజనదు. మఱియు నతండు నేఁటి కైదవనాఁడు దనకళేబరముం దహించు. అదియుం దత్క్షణంబ యోగానలముం జేసి భస్మంబు గాఁగలయది. పతిదేహ మట్లు దగ్ధమగునం జూచి పతివ్రతామణి యగుగాంధారి యప్పుడే యయ్యగ్నిలోనం బ్రవేశింపఁగలదు. అయ్యాశ్చర్యంబు సూచి విదురుఁడు హర్ష శోకములం దనరి తత్క్షణంబ తీర్థయాత్ర వెడలువాఁడని చెప్పి నారదుండు తుంబురునితోడ స్వర్గలోకమునకుఁ జనియె. నారదోపదేశము విని ధర్మరాజు శోక ముడిగె.

## ధర్మరాజు కృష్ణనిర్యాణసూచకోత్పాతములం గనుట

అంత నక్కడ నర్జునుండు బంధువులం జూడను బుణ్యశ్లోకుఁడైనపుండరీకాక్షునిచేష్టితముల నెఱుంగను ద్వారకకుఁ జనినపదంపడి కొన్ని నెలలు గడచెఁ గాని యతండు రాక తడసె. ఇక్కడ ధర్మరాజు ఘోరరూపము లగునుత్పాతములను ఋతుధర్మవిపర్యాసంబుతోడ రౌద్ర మయినకాలగతిని గ్రోధలోభానృతములయెడ మనసుదవిలి మనుష్యులజీవిక పాపప్రాయంబై యుండుటయును గపటభూయిష్ఠం బైనవ్యవహారమును శాఠ్యమిశ్రం బైనస్నేహమును దండ్రులకుఁ దల్లులకుఁ జెలులకు నన్నదమ్ములకు దంపతులకుం దమలోఁ బొడమునన్యోన్యకలహంబును గన్నియల నమ్ముదండ్రులను దల్లిదండ్రులఁ బోషింపనిపుత్త్రులను వేదవిముఖు లగుబ్రాహ్మణులను బ్రహ్మవాదు లగుశూద్రులను మఱియు నాకాలమునకుఁ దగినరీతి మానవుల కొదవినలోభాద్యధర్మప్రవృత్తులను బరికించి భీముం జూచి యిట్లనియె. భీమసేనా, నీతమ్ముఁ డర్జునుండు బంధువులఁ జూడను గృష్ణునిచేష్టితం బెఱుంగను ద్వారకకుఁ బోయి యేడునెలలయ్యె. ఏలొకో యింతకు రాకున్నవాఁడు. దానికిం గారణం బిట్టిదని యే నెఱుంగనయ్యెద. భగవంతుఁడు లీలార్థంబు దానెత్తినమనుష్యరూపంబు విడుచు నని నారదమునీంద్రుండు సెప్పినయవసరం బిప్పటి కాసన్న మయ్యెఁగాఁబోలు. సంపదలు రాజ్యము భార్యలు ప్రాణములు కులము ప్రజలు శత్రువిజయము లోకములును మన కప్పర

మేశ్వరు ప్రసాదమునంగదా సుఖమైతి. చూడుము మీవె దివ్యభౌమదైహికము లగువివిధోత్పాతములు బుద్ధిసమ్మోహనంబైన ఘోరభయమును దవ్వుదవ్వులం జూపుచుం గన్పట్టుచుండెడు. మదీయవామలోచనోరుభుజములు పలుమాఱు నదరుచుండెడు. మదిలోనం బెనుగంప మొక్కటి యుదయించి యేదే నొక్కయత్యంతవిప్రియంబు నతిసన్నిహితకాలమునం దెల్పుచుండెడు. ఇదెయొక్క వఱడు నోట నిప్పు గ్రక్కుచు నాదిత్యున కెదురై యఱచుచుండెడు. ఇదె యొక్క కుక్క భయము దక్కి నాయెదుర నేడ్చుచుండెడు. ప్రశస్తము లగుగోప్రభృతిపశుగణంబులు నాకప్రదక్షిణమును నితరము లగుగర్దభాదులు నాకుఁ బ్రదక్షిణముగనుం దిరుగుచుండెడు. నాయశ్వములెల్ల విలపించుచుండునట్లు చూపట్టుచుండెడు. మృత్యుదూత యనఁ దగునీకపోతమును గూబయు దానికి విరోధి యగువాయసంబును నామనంబు వడఁక ఘోరముగ నార్చుటం జూడ లోకమున కెల్ల శూన్యభావంబు గలుగువిధంబు దోఁచుచుండెడు. దెసలెల్ల ధూసరంబులై తోఁచెడు. పరివేషములు ప్రపంచము నాక్రమించుచుండెడు. పుడమి కొండలతోడ గడగడవడంకెడు. మింట మబ్బు లేకున్న నుఱుములతోడం బిడుగులు వడునట్లు దోఁచుచుండెడు. కటికిచీఁకట్లు గ్రమ్మ దుమ్ము రేఁచుచుం గఠోరస్పర్శముగా గాలి వీచుచుండెడు. మేఘములు నెత్తురు గురియుచు నంతట బీభత్సముఁ గావించునట్లు తోఁచెడు. అదెచూడు మాదిత్యునితేజముఁ దఱుఁగుచుండెడు. మింట గ్రహములకుఁ బరస్పరసమరము గానవచ్చెడు. భూతగణసంకులత్వమునం జేసి ప్రాణుల కశుభంబు దోఁచెడు. పుడమియు నాకసంబును మండుచుండునట్లు చూపట్టెడు. తూర్పునఁ బాఱునదులును బడమటఁ బాఱునదములును సరస్సులును మనస్సులును గలఁకఁ బాఱెడు. అగ్ని నేయి వోసి వేల్చినను లెస్స జ్వలింపకుండెడు. కాల మెట్లున్నదో యెఱుంగరాదు. మఱియుఁ గ్రేఁపులు తల్లులచన్నులఁ ద్రావవు. తల్లులకును బిడ్డలకుఁ బాలిచ్చుటలో నాసక్తి గలుగకుండెడు. గోవులు కంట నీరు వెట్టి యేడ్చుచుండెడు. మందలలో నాఁబోతులు హర్షింపకుండెడు. దేవతావిగ్రహములు విలపించునట్లును జెమరించునట్లును జలించునట్లును గనుపట్టెడు. ఇవిగో జనపదములు గ్రామము

లుద్యానములును లాశ్రమములును జెన్ను దఱిఁగియు నానందంబుఁ దొఱఁగియుఁ జూపట్టెడు. మన కేదుఃఖము సూపనున్నవియో యెఱుంగరాదు. ఇన్ని మహోత్పాతంబు లిట్టులు గన్పట్టుటం జూడ నితరసాధారణంబులుగాని శుభలక్షణంబుల నలరుభగవంతుని దివ్యచరణములం బాసి యీధరణి తనసౌభాగ్యంబు గోల్పడియుండ నోపు నని యేనూహింతు నని పలుదెఱంగులఁ దనలో వితర్కించుచు భీమునితోఁ దలపోయుచుండె.

## అర్జునుఁడు హరినిర్యాణానంతరము కరిపురికి వచ్చుట

అట్టియెడఁ గపిధ్వజుండు యదుపురినుండి మగిడి చనుదెంచి యున్న యడుగులపయిం బడినపాండవాగ్రజుండు నొల్లింటియొప్పిదంబు దప్పి దీనత్వంబు గదుర మోము నేలకు వాంచి కన్నీరు రాల్చుచు నుద్విగ్నహృదయుండై యున్న యన్నరుఁ గాంతిహీనుం గాంచి నారదు వచనంబుఁ దలపోయుచు సుహృన్మధ్యమున నయ్యర్జునున కిట్లనియె. అన్న, సవ్యసాచీ, ద్వారకాపురమున మనవా రగుమధుభోజకదాశార్హసాత్త్వతాంధకవృష్ణివీరు లెల్ల సుఖమున్నవారలె? పూజార్హుం డైన మనమాతామహుఁ డగుశూరునకుఁ గుశలంబె? మాతులుఁ డగువసుదేవునకు సేమమే? మన మేనమామభార్యలు దేవకీదేవి మున్నగు నేడ్వురు కోడండ్రునుం దారు సుఖింతురే? అసాధుఁ డగు కంసునిఁ గొడుకుఁగాఁ బడసినరాజుగ్రసేనుఁడు తమ్మునితోడం గుశలియే? హృదికతనయుం డైనయక్రూరునకు జయంతగదసారణసత్యజిత్ప్రముఖులకు ననామయంబె? సాత్త్వతప్రభుం డైనబలరామునకు సుఖంబె? సర్వయాదవవీరులలో మహారథప్రవరుఁ డనఁ బొగడ్త గని యనిమొన వసజనయసువిధమున గంభీరరయమునం జేయుప్రద్యుమ్నునకుఁ గుశలంబె? సుషేణచారుదేష్ణసాంబఋషభాదు లగుకుమారు లెల్లఁ గుశలవంతులె? శౌరికి నిత్యపరిచరు లగుశ్రుతదేవోద్ధవాదులును సునందనందప్రముఖు లగుభాగవతులును మఱియు రామకృష్ణులభుజముల నాశ్రయించినవారందఱును నెమ్మది నున్నవారె? వారెల్ల సౌహార్దమున మనకుశలం బరయుదురే? బ్రహ్మణ్యుఁడు భక్తవత్సలుఁడు భగవంతుఁడు నగుగోవిందుఁడు నగరిలోపల సుధర్మ పేరిటి సభలో సుహృదు

లెల్లం గొలువ వెలయుచుం గొలువుండునే? లోకములకు శుభమును లబ్ధపాలనంబు నుద్భవంబునుం గావింప బలభద్రసమన్వితుండై యయ్యాది పురుషుండు యదుకులాంబుధి నవతరించియుండెడు. అమ్మహానుభావుని బాహుదండబలమున సురక్షితమగు నిజపురమున యాదవులు మహాపౌరుషులట్లపోలె నెల్లవారిపూజలం గొనుచుం బరమానందమున విహరించుచుండుదురు. ఆదేవదేవునిపాదచర్యయే ముఖ్యముగం గొని తత్ప్రభావమునం జేసి సత్యభామాదు లగుషోడశసహస్రాధికసుందరులు సమరమున నమరులం గెల్చి శచీదేవి కుచితములు దేవభోగ్యములు నగుపారిజాతాదులం బడసిరి. మఱియు నాజగన్నాథుని భుజదండప్రభావము నాశ్రయించియేకదా యదువీరు లేమిటను వెఱపుగానక సురేంద్రభోగ్యంబైనసుధర్మాభిధానసభామంటపంబు నాగోవిందుండు దెచ్చినదానిం దమ యడుగులం ద్రొక్కం జాలిరి. వత్సా, నీ కనామయంబె? తేజ దఱిగిన చందము నిన్నుం జూడం దోంచుచుండెడు. అచ్చటం బెద్దకాల మునికిం జేసి బాంధవులసమ్మానంబు వాసి చులకనై యవమానం బేమియైన నీకుం గన్పడియెనే? యాచకుల కిత్తు నని యాశ పుట్టించి యయ్యర్థ మియ్యక తప్పితివో? బ్రాహ్మణులను బాలురను గోవులను వృద్ధులను రోగులను స్త్రీలను శరణాగతులనుం బరిత్యజింపవుగదా? అగమ్యాగమనంబును గమ్యనిరాకరణంబు నొనరింపవుగదా? సమానులచేనొండె నధములచేనొండెం దెరువునం బరాజయముం బొందవుగదా? భోజనార్హులైనవృద్ధబాలకుల నతిథిభృత్యుల గర్భిణ్యాతురకన్యకల నుపేక్షించి నీవు ముందు భుజించితివొకో? తగనినింద్యకర్మ మేమియుం జేయవుగదా? పరమప్రియుం డత్యంతాంతరంగభూతుండు నగు నాత్మబాంధవు నెడంబాసితి నని శూన్యహృదయుండ వగుదువొక్కొ? అట్లు గాకుండిన నీ కీమనఃపీడ గలుగునే యని యన్న యగుధర్మరాజు నానాశంకాస్పదంబైనరూపం బుపలక్షించి బహువిధముల వికల్పించి యడుగుటయుం గృష్ణవియోగకర్శితుండు గావున శోకవేగమునం జేసి వదనకమలంబు వాడంగం గన్ను వఱిగి యన్నకు బదులు సెప్ప నోరాడక కొండొక వడిమిన్నకుండి యప్పుండరీకాక్షుని డెందమునం దలంచుచు నెట్టకేలకుం బైపయిం గ్రమ్ముదెంచుకన్నీళ్లు లడంచుకొనియుం గన్నుంగవం జేదోయుం

దుఃడిచికొనియుఁ గృష్ణుండు లోచనగోచరత్వంబునకుఁ దప్పిన నెక్కువ యగుప్రేమాతిశయమునం జేసి వ్యాకులుండై యవ్వైవ్వకుఁ తుండు దన యెడ సారథ్యాదిసమయములఁ జూపినహితచింతనంబు నుపకారమును సౌహార్దమునుం దలపోయుచుఁ గిరీటి బాష్పగద్గదవచనముల నన్న కిట్లనియె.

## అర్జునుఁడు ధర్మరాజునకుఁ గృష్ణనిర్యాణంబు చెప్పుట

మహారాజా, బంధురూపుఁ డగుహరిచేత మోసపోయితి. సురలకు నాశ్చర్యంబుఁ గొల్పు నమ్మహనీయ తేజం బాతండు దాఁగొనిపోయె. అతని నెడఁబాసినక్షణమే లోకమెల్ల నాకప్రియంబై కనుపట్టె. ఈజన మెల్లఁ బ్రాణములతో నుండియును మృతప్రాయంబ కాఁ దోఁచె. అమ్మహాత్మునిప్రాపునం గదా పాంచాలీస్వయంవరంబునాఁడు ద్రుపదపురమునం గూడినకామదుర్మదాంధు లగురాజులతేజంబు హరింపను విల్లెక్కు పెట్టి మత్స్యయంత్రముఁ దెగవ్రేయను ద్రౌపదినిఁ బరిగ్రహింపనుం జాలితి. అతని సన్నిధానమహిమమునం గాదె దేవగణముతోడ దేవేంద్రుని బలిమి పెంపునం గెలిచి ఖాండవవన మగ్నిదేవున కాహారముగా నర్పింపను, మయుఁ డద్భుతశిల్పవిద్య నేర్పున జగన్మోహనంబుగా నిర్మించిన యుత్తమ సభను సాధింపను, నీరాజసూయమునకుఁ గా నెల్లదెసలరాజులవలనఁ గప్పము లార్జింపనుం గలిగె. తదీయసాన్నిధ్యప్రభావమునం గదా నాగాయుతబలుం డైననీతమ్ముఁడు భీమసేనుఁడు నీచేయఁబూనిన రాజసూయంబు నెఱవేఱ సర్వవిజయంబు నీకు సాధించువాఁడై రాజచక్రంబెల్ల నోడించి యంతఃపురములపైఁ గాలువెట్టఁజాలునట్టి జరాసంధుని దెగటార్చి యతండు మహాభైరవునకు బలిసేయ బట్టి చెఱఁ బెట్టినరాజలోకము నెల్ల విడిపింపఁ జాలె. దాన నప్పుడు చెఱఁ దప్పినరాజులెల్ల నీయజ్ఞమున కపరిమితధనకనకములు బలిగా సమర్పించిరి. రాజసూయావభృథమహాభిషేకముఁ గాంచుటం జేసి పరమశ్లాఘనీయం బైననీధర్మపత్ని యగు పాంచాలి కేశపాశ మానాఁ డాసభలో దుశ్శాసనాదు లగుకితవులు పట్టి యీడ్చి పరిభవింపఁ జూచినం దిక్కుదోఁపక యప్పాంచాలి యప్పాంచజన్యధరు నెడఁదం దలంచి యాక్షణంబ పాదసూపిన యాపరమపురుషుని యడుగుల కెఱఁగి కన్నీరు రాల్చినం గరుణించి యవ్విధించి జనకుండై

కదా యాసాధ్వీమానంబు గాపాడి యకార్యమునకుఁ దొడరిన యప్పాపాత్ములఁ దెగఁజూచి వారిభార్యలకు వైధవ్యంబుఁగూర్చి వారును వెండ్రుకలు జాఱవైచి కన్నీరు దొరుఁగఁ బలవించునట్లు గావించె. మన మడవుల నివసించుతఱి దుర్యోధనుండు ప్రార్థింపఁగ దుర్వాసుండు పదివేవురుశిష్యులతోడఁ బాంచాలి భుజించినపదంపడి యతిథియై యేతెంచి నీవు మాధ్యాహ్నికంబుఁ దీర్చి రమ్మని యాతిథ్యమునకుఁ బిల్చిన నమ్ముని స్నానార్థంబు శిష్యులతోడం జనుడు ద్రౌపది యపుడేమియుం జేయ నోపక యాపంకజనాభుం దలంచుటయు స్మృతమాత్రుండై యానీల గాత్రుండకదా యాక్షణంబ సన్నిధి చేసి యతినిర్బంధపూర్వకముగా నక్షయ్యపాత్రంబునంచున నంటికొన్న శాకాన్నశేషమాత్రంబుఁ దానుప యోగించి ముల్లోకములకు నత్యంతతృప్తిఁ గావించి దాన దుర్వాసుండు నతనిశిష్యులు నాఁకలి దీఱి యింక నే మని ధర్మరాజునొద్ద నాతిథ్యంబుఁ గొనఁ గల మని సిగ్గువడి తమంతన పాఱునట్లు సవరించి యా క్రోధముని శాపమువలని యాపదలబాఱిం బడనీక మనలఁ దప్పించి రక్షించె. అమ్మహాత్ముండు తన తేజములలోనం గొంత యావహిల్లఁ జేయుటన కదా యే నెక్కటిబవరమున శూలపాణిం దలపడి యమ్మహేశ్వరున కబ్బురంబుఁ గొల్పి యద్దేవదేవునివలనం బాశుపతాస్త్రంబు సాధింపను, మఱియు లోకపాలాదులవలన ననేకదివ్యాస్త్రములం బడయ, నీమేనితో నింద్రలోకమున కరిగి యాత్రైలోక్యవిభునర్ధాసనమునఁ గూర్చుండను జాలి యయ్యమరలోకమున నేను విహరించుచుండ గాండీవలక్షణం బైన మదీయబాహుదండయుగ్మము నరాతివధార్థంబు దోడ్పడ సురలు గోరుటయుఁ దత్కార్యంబు నెఱవేర్పను నాకుఁ గలిగె. అట్లు సర్వవిధమహానుభావములు నా కమర్చిననిజమహిమావస్థాన భూతుండైన యాపరమపురుషునిఁ గోల్పోయితి. అతఁడు పరమబాంధ వుఁడై నామేలు గూర్చుటంగాదె విరాటపురమున నుత్తరగోగ్రహణ సమయంబునం దరింపరానిభీష్మాదు లనుసత్త్వములం దనరు కురుసేనా సాగరంబు నే నొక్కరథముతో నిస్తరించి విరాటుగోధనంబు మరల్చి యావీరులకెల్ల సమ్మోహనాస్త్రమున మోహముఁ గల్పించి వారియుష్ణీ షంబులఁ గొని రాఁగను సేర్చితి, , అతండేకదా భారతమహారణమున

నానారాజరథమండలనిబిడంబులైన భీష్మద్రోణకర్ణశల్యసైన్యములం దలపడునప్పుడు నాకు సారథియై తేరినొగలపయిం గూర్చుండి తదీయసేనలం గల మేటిదొరల యాయువులను మనంబులను గాయికమానసికబలములను జూడ్కి నపహరించి నన్నుం దనభుజములం గప్పుకొన్నట్లుగాచి పరసైన్యమునం జేయంగలదొర లగు నాభీష్మద్రోణకర్ణాశ్వత్థామసుశర్మసైంధవబాహ్లికాదుల యమోఘాస్త్రములు హిరణ్యకశిపునస్త్రములు ప్రహ్లాదు నెడ నెట్టు లట్టుల నాయెడ వమ్ము గావించె. ఉత్తములు మోక్షార్థ మెవ్వనిపాదములం గొలుతు రట్టిజ్ఞానప్రదుం డైనయాకృష్ణు నక్కటా! యేను బుద్ధి మాలి సారథ్యమునకుం జొనిపితి. దానికి నొడంబడి యాతండు నా కొనర్చిన మేలు చెప్పంగొలందిగాదు. సైంధవసంహారంబు నాండు గుఱ్ఱములు డప్పి గొనినప్పు డేను దేరు డిగ్గి దివ్యాస్త్రమున వానికి నీళ్లు లోనంగూర్చునెడ రథస్థులయ్యు నరివీరు లమ్మహాత్ముని ప్రభావమున నిరస్తచిత్తులై కదా నేలకు డిగియున్న నన్నేమియుం జేయంజాలరైరి. సుందరోదారమందహాసభాసురంబులైన "హోపార్థ, యర్జునా, చెలీ" యనునాదేవదేవుపలుకు లిప్పుడు నామదిం దవులుచు మిక్కిలి కలంచుచుండెడు. శయనాసనవిహారవికత్థనభోజనాదులలో నేకత్వమునం జేసియే "నోసఖుండా, సత్యంబ పలికితి"వని మేలమున వక్రోక్తు లాడి తిరస్కరించిన కుమతి యగునాయపరాధమెల్ల సఖునితప్పిదమును నెచ్చెలియుం గొడుకుతప్పులం దండ్రియు నెట్లట్లు మహామహుండు గావున సైరించె. రాజేంద్రా, సఖుండు ప్రియుండు నుపకారియు నగునాపురుషోత్తముం గోల్పోయితి. శూన్యచిత్తుండ నైతి. అతనిం బాసినపదంపడి యతనిభార్యలం గొనివచ్చుచు గోపాలతుల్యు లగుదుర్బలులు కొంద ఱేతెంచి యఱిమిన నయ్యసదుల గెలువనేరక యబలయపోలె నేను దెరువున వారి కోడితి. అమ్మహానుభావుం డొక్కరుండ లేకుండెంగాని యప్పటిగాండీవం బప్పటియమ్ము లప్పటి తే రప్పటిగుఱ్ఱము లప్పటిరథికుండగు నేన యుండినను నిష్ప్రయోజనం బయ్యె. అయ్యీశ్వరు నెడంబాసిన క్షణంబె భస్మహోమమువిధమున నపాత్రదానము తెఱంగునం జవుటం బెట్టినవిత్తుచాడ్పునను సర్వంబు శూన్యంబై కార్యాక్షమం బయ్యె. రాజచంద్రా, నీవడిగిన మనసుహృదు లగుయాదవులవృత్తాంతము

వినుము. వారు విప్రశాపమూఢులై కల్లు ద్రావి కైపెక్కి యితరే తరజ్ఞానంబు దక్కి యుక్కివులై తమలో నొండొంటఁ బోరి నలుగు రైదురు దక్కఁ దక్కినవారెల్ల నన్యోన్యప్రహారములం బొలిసిరి. భూత జాలము నితరేతరవ్యాపారముననే పుట్టించుటయుఁ బొలియించుటయు నీశ్వరునిచేష్టితంబ కాని యొండు గాదు. నీళులందు జలచరములు పెద్దవి చిఱుతవానిం గబళించుచందమున బలవంతులు దుర్బలుల నీశ్వర ప్రేరణమునం జంపుదురు. ఇవ్విధమున మధుసూదనుండు యాదవులచే నితరులను యాదవులను వారిచేతన యన్యోన్యక్షోభమునం జంపించి భూభారం బపనయించె. ఇందుఁ గర్తవ్య మేమియుఁ గానంబడదు. మున్ను వాసుదేవుఁ డుపదేశించిన దేశకాలార్థయుక్తములు చిత్తతాప శాంతికరములు నగువచనములం దలంచికొని యుపశమిల్లుదు నని చెప్పి యప్పార్థుండు కృష్ణపాదారవిందము నతిగాఢస్నేహమున ధ్యానించు టయు నతనిమతి శాంతితో విరక్తిం గొనియె. పురుషోత్తమచరణకమల-చింతనపరిబృంహిత మగుభక్తియోగమునం జేసి యర్జునుండు కామాది సకలకషాయము లెడలి రణముఖమునఁ దనకు భగవంతుఁ డుపదేశిం చినయథార్థాత్మవిద్యను గాలకర్మతమోవశత్వమున మధ్యకాలమున మఱ చినదానిం గ్రమ్మఱఁ దలంపునకుఁ దెచ్చికొని బ్రహ్మాత్మభావనంబున నవిద్యఁ దెగడి గుణసంగ మెడలి స్థూలసూక్ష్మశరీరాభిమానము నిరసించి ద్వైతసంశయములం ద్రెంచి విగతశోకుం డయ్యె.

## ధర్మరాజు తమ్ములతో మహాప్రస్థానంబు చేయుట

అట్లు పాండవాగ్రజుండు పుండరీకాక్షుని లీలామర్త్యావతార సంక్షేపంబును యదుకులక్షయంబును విని తాను మున్న యయ్యర్థం బట్లు కాఁగలయది యని నారదునివలన విన్నవాఁడు గావునఁ దద్వచనములం దలపోసి చిత్తము నిశ్చలము గావించికొని స్వర్గమార్గంబు సాధనీయం బని నిశ్చయించె. అప్పుడు కుంతీదేవి ధనంజయవాక్యముల భగవన్నిర్యా ణంబును యాదవనాశంబునుం దెలిసి యాపరమేశ్వరునెడ నేకాంత భక్తిం జేసి యాత్మం బరమాత్ము నపరోక్షముగ ననుసంధించి సంసారమూలం బైనమేను విసర్జించె. కాలంగ్రుచ్చినముల్లు దీయునతఁ డొండొకముల్లు గొని యానాటుకొన్నతొల్లింటిముల్లు దీసి పాఱవైచి దానికి సాధనం

బైనయాదవుల్లును విప్రశాపవిధమున మధుసూదనుండు ధరిత్రీ
భారం బపనయింప లీలామానుషవేషముం గొని దానం దనకాంప
బూనినభూభారాపనయనంబు నెఱవేర్చి కార్యాంతమునం దత్సాధనం
బైన యమ్మానుషవేషముం ద్యజించె. నాటకక్రీడలలో నటుండు సమ-
యోచితముగఁ బలువేషములం దాల్చి పని దీఱుటయు నవ్వేషముల
నిరసించుకరణి గోవిందుండు కార్యార్థంబు మత్స్యకూర్మాద్యవతారంబు
లెత్తి పని తీరంగ వానిం ద్యజించు. ఇది పరమార్థంబు. ఆకర్ణనీయచరి
త్రుండైన కమలనేత్రుం డేపూటం బుడమిం దనలీలామానుషవిగ్రహంబు
విసర్జించె నాపూటనే యజ్ఞానాపష్టచిత్తుల కభద్రంబుగలుగం గలి భువి
లోనం జొచ్చె. లోభ మనృతము కుటిలత్వము హింస మున్నగుధర్మ
చక్రము ప్రసరించుట రాష్ట్రములం బురముల నిండ్లను మనస్సులనుం
గాంచి కలి ప్రవేశించె ననియరసి ధర్మరాజు సర్వగుణములం దనకు సాటి
వచ్చునభిమన్యుకుమారుం డైనపరీక్షితుని నింద్రపౌత్రుని సముద్రముద్రితం
బైనభూమండలంబునకెల్ల రాజుగాఁ బట్టాభిషిక్తుం జేసి హస్తిపురంబున
నిలిపియు శూరసేనసూనుం డైనవజ్రుని మధురాపురరాజ్యమున నభిషే
కించియుఁ బ్రాజాపత్యేష్టి నిర్వర్తించి యగ్నుల కాత్మసమారోపణంబుఁ
గావించి మహాప్రస్థానయాత్రకు దీక్షితుండై దుకూలవలయాదులెల్ల
విసర్జించి నిర్మోహుండై నిరహంకారుండై సంఛిన్నాశేషబంధనుండై
సర్వేంద్రియములను మనస్సునందును మనస్సును బ్రాణమందును
బ్రాణము నపానమందును సవ్యాపారం బైనయపానమును దదధిష్ఠాత్రు
దేవత యగుమృత్యువునందును మృత్యువును బంచభూతములయైక్యము
నందును దానిం గుణత్రయమందును త్రిగుణముల నవిద్యయందును
సర్వారోపకారణం బైనయయ్యవిద్యను జీవాత్మునందును జీవాత్మం
గూటస్థుం డగుపరమాత్మునందును లయించి చీరవసనుండు నిరాహారుండు
ముక్తకేశుండు మౌనియునై చూపఱు దన్ను జడోన్మత్తపిశాచాదులకు
సాటిగాఁ జూచుచుండఁ దమ్ములనైనం బ్రతీక్షింపక చెవిటియట్టు లెవ్వరి
పలుకులుం బాటింపక తొల్లింటిపెద్దలు చన్నయుత్తరదిశం బట్టిచనియె.
ఆదెస నవ్విధమునం జన్నవారు పునరావృత్తిం గాంచరు. భీమాదు
లగుధర్మరాజుతమ్ములు నధర్మంబుతోడ్పాటునం గలి ప్రజల నఱుప

నని యరసి ధర్మకార్యములు లెస్స నెఱవేర్చి, వారు గావున వాసుదేవు పదారవిందమే యాత్యంతికశరణం బని నిశ్చయించి యాదివ్యపదమ్ముఁ జిత్తంబుల నిలిపికొని యన్నపానంబు లుడిగి మౌనవ్రతం బట్టి యతనివెంట నరిగి భగవద్ధ్యానోద్రిక్తభక్తియోగమున శుద్ధచేతస్కులై యేకాంతనిష్ఠులై విధూతకల్మషు లగుయోగుల కావాసం బగునారాయణపదమును విషయరక్తులకు దుర్లభం బగుదాని రజోరహిత మగునాత్మ నధిగమించిరి. అక్కడ జ్ఞాని యగువిదురుండు తీర్థపర్యటనంబు సేయఁ బోయినవాఁడు ప్రభాసక్షేత్రమునం గృష్ణునందుఁ జిత్తంబు నిలిపి మానవకళేబరంబుఁ ద్యజించి తన్నుఁ దోడ్కొని పోవ నేతెంచినపితృగణంబులతోడ నిజాధికారస్థానం బైనయమలోకమునకుఁ జనియె. ద్రౌపది తనపతులు దనపై ననురాగంబుఁ దొఱఁగి యీలోకము విడిచి పోవుటం జూచి తానును వారివెంట నరుగుచు భగవంతుఁ డగువాసుదేవునియెడ నత్యంతభక్తిం జేసి యన్నారాయణగతిం బ్రాపించె. అత్యంతమంగళాస్పదంబు పరమపావనంబు నగుభగవంతునిపరమపదప్రయాణంబును బాండవులమహాప్రస్థానంబును విన్నయుత్తముఁడు హరిభక్తిం జేసి ముక్తిసిద్ధిం బడయు నని చెప్పి సూతుండు శౌనకాదులకు వెండియు నిట్లనియె.

### పరీక్షిన్మహారాజు రాజ్యంబు సేయుట

అంతఁ బరమగుణవిలసితుం డైనపరీక్షిన్నరపాలుండు పరమభాగవతుఁ డనం బ్రశస్తిం గాంచి తొల్లి జాతకర్మసమయంబున జాతకకోవిదు లగుబ్రాహ్మణులు యుధిష్ఠిరునితోఁ దెల్పినవిధంబు దప్పక బ్రాహ్మణోత్తముల యుపదేశంబు మెయిఁ బుడమి యేలె. తత్ప్రకారంబు వినవలయు. అయ్యర్జునపౌత్త్రుఁ డుత్తరునికూఁతు నిరావతి యనుదానిం బెండ్లియై యద్దేవియందు జనమేజయుఁడు మున్నుగా నలుగురుకొడుకులం గాంచి యటఁ గృపాచార్యునాచార్యకంబున గంగాకూలంబున భూరిదక్షిణలతో మూఁ డశ్వమేధము లాచరించె. తత్ప్రభావం బేమని చెప్పుదు ? అయ్యజ్ఞములందు సురలు ప్రత్యక్షముగ నరుగుదెంచి తమతమహవిర్భాగములం గ్రహించిరి. అప్పార్థివుండు గోమిథునంబుఁ గాలదన్నుచుండినశూద్రాకారుం డైనకలిని రాజవేషధరుం డైనవానిం దిగ్విజయావసమునం బరాక్రమమున నిగ్రహించె నని విని శౌనకుఁ

వయ్యా, యేమి నిమిత్తంబు గలుగఁ బరీక్షిజ్జనపాలుండు దిగ్విజయమునం గలిని నిగ్రహించె? రాజవేషధరుండై గోవులఁ గాలఁ దన్నుచుండిన యాశూద్రాకారుఁ డెవ్వఁడు? తత్ప్రకారంబు భగవత్కథల నొండె భాగవతచరిత్రంబు నొండె ననుబంధించియుండు నేని మాకుఁ జేటపడ నెఱింగింపుము. వృథాయుర్వ్యయంబుఁ గావించులాఁతిదురాలాపము లేల? అల్పాయువు లగుటం జేసి సన్నిహితమృత్యువులయ్యు మోక్షముఁ గాంక్షించునరులకు మృత్యు వగుదండధరుం డీసత్త్రంబున శామిత్ర కర్మమున కాహూతుండై చనుదెంచియుండెడు. అతం డిచ్చట నుండునంతకు నెవ్వనికేనియు మరణంబు గలుగదు. ఆయువు వున్నంతలోన మనుష్యలోకమున హరిలీలామృతంబు గ్రోలవలయు. కాదేని మందుఁడు మందబుద్ధి మందాయువు నగువానికిఁ దనయాయువునందు సగ మగు-రాత్రుల నిద్రహరించు. పెఱసగ మగుపగలు వ్యర్థకర్మములం జను. కావున వివేకవంతుఁ డాయువు గలుగునంతలో నేమఱక భగవత్కథల వినుచు భక్తి సేయవలయు నని యడిగిన శౌనకునకు సూతుం డిట్లనియె.

### పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించుటఁ జెప్పఁ బూనుట

మునీంద్రా, పరీక్షిన్నరేంద్రుండు కురుజాంగలంబుల నివసించుచు సార్వభౌముఁడై భూమండలం బెల్ల నేలువాఁడు నిజసేనాపాల్యమానం బైన రాష్ట్రమునం దనతిప్రియం బైన కలిప్రవేశంబు విని సమరశూరుండు గావున విల్లు గొని శ్యామతురంగములం బూన్చి సింహధ్వజం బెత్తి లెస్సకై సేసి తెచ్చినతేరెక్కి చతురంగబలంబులు గొలిచి నడువ దిగ్విజయార్థంబు నగరు వెడలి భద్రాశ్వకేతుమాలభారతోత్తరకురుకింపురుషాదివర్షములం గెలిచి యచ్చటివారు సమర్పించిన కానుకలతోడి పూజల నంగీకరించి యచ్చటచ్చటఁ జేర్కొనంబడు తనపూర్వులగు పాండవేయుల మహనీయకీర్తిం గృష్ణమహిమసూచకం బైనదాని, నశ్వత్థామబ్రహ్మాస్త్రమునం బొలియకుండఁ గృష్ణుండు దన్నుఁ బ్రోవఁ జాలినంతటి పాండవులమీఁది హరిస్నేహంబును, పాండవులకు వాసుదేవునిపై నాటుకొన్న పరమభక్తితాత్పర్యంబును నాకర్ణించుచు నాచరిత్రలు నిరూపించువారికిఁ గడుఁ గూర్మి సేయుచు వికాసిలోచనుండై సంతుష్టమనంబుతో నపరిమితధనకనకాంబరాదులఁ బారితోషికంబుగా నొసంగి యాజగదీశ్వ

రుండు నిజస్నేహపాత్రు లగుపాండుపుత్త్రులకుఁ గావించిన సారథ్యము, సభికత్వము, చిత్తానువర్తనము, వారికిఁ గావలియై యుండుట, వారు పంచినపను లొనరించుట, వారివైభవములఁ బ్రకటించుట మున్నగుకార్యములనెల్ల నాకర్ణించి యమ్మహారాజు మహామహిముఁ డగుహృషీకేశుని మీఁద నత్యంతభక్తి చేయుచుండె. అవ్విధమున దనతొల్లింటిరాజుల సచ్చరిత్రం బనువర్తించు నాపరీక్షిన్నరపాలుండు తదనంతరం బొనర్చిన యాశ్చర్యంబు వినుఁడు.

### ధర్మదేవతకు భూదేవికిం గలిగినసంవాదము

ధర్మము వృషభరూపంబై యేకపాదమునఁ దిరుగుచుఁ దే జుడిగి వత్సముఁ గోల్పోయిన తల్లిమాడ్కిఁ గన్నీరు నించుచుండినగోరూపధారిణి యగుధరణిం గాంచి యిట్లనియె. తల్లీ, నీదేహమున ననామయంబకదా? నీమొగముఁ గనినం దేజ దఱిఁగినచందంబు దోఁచుచుండెడు. శరీర రోగంబు లేకుండినను మనోవ్యాధియేదేనియు నుండనోపు ననియూహించెద. నీక్రేఁపు దవుదవ్వుల నెక్కడకేనియుం బోవఁగ దానిం దలంచికొని చింతిల్లుదువో? మూఁడుపాదములఁ గోల్పడియే నేకపాదమునఁ జరింతు ననియొండె, ధర్మశూన్యు లగుకురురాజులు నిన్నేలఁ దొడఁగి రనియొండె, మంత్రాదిలోపపూర్వకంబుగా యజ్ఞము లనుష్ఠింపఁబడుటం జేసి యసురులు హవిర్భాగములఁ గొనుచున్నవా రనియొండెఁ, బర్జన్యుఁడు దఱితో వర్షింపమింజేసి ప్రజలు నవయుదు రనియొండె, భర్తలు భార్యలఁ బ్రోవ రనియొండె, దల్లిదండ్రులు తమబిడ్డల రక్షింప రనియొండె, బ్రాహ్మణకులజనితులు సరస్వతి నబ్రహ్మణ్య మగునిందకర్మమునం దుపయోగింతు రనియొండె, బ్రాహ్మణులు రాజకులమున సేవావృత్తిఁ జేసి బ్రదుకఁ దలచి రనియొండె, క్షత్త్రియాధములు కలివ్యాప్తులై రనియొండెఁ, బుడమిలో క్షత్త్రియ మహిమంబు దఱుఁగఁ జొచ్చె ననియొండెఁ, బ్రాణిజాలంబు శయనాసనాన్నపానవ్యవాయాదికం బైన దేహవ్యాపారమునందే యాసక్తిగలిగి పరమార్థచింత యుజ్జగించె ననియొండె, నీభారం బపనయింప నవతరించి యిప్పు డంతర్హితుం డైనహరి యొడఁబాటునం గలుగునకార్యములఁ దలంచియొండె నీవు శోకింతు వని యే నెన్నెద. మనోవ్యాధి కెయ్యది మూలంబో దాని నెఱింగింపుము.

మానసవ్యాధి పెల్లలముకుండిన నీకృశత్వంబు నీకేల గలుగు? బలవం
తులకెల్ల బలవంతం బైనకాలము నీసౌభాగ్యము హరించెనే? అని
యడిగిన ధర్మదేవతకు భూదేవి యిట్లనియె. అయ్యా, నన్నడుగనేల?
సకలంబు నీ వెఱుంగుదువు. లోకసుఖావహము లగునాలుగుపాదముల
నీ వెవ్వనికరుణమై వర్తింతువు, సత్యము, శౌచము, దయ, శాంతి,
త్యాగము, సంతోషము, ఋజుత్వము, మనోనిగ్రహము, బహి
రింద్రియజయము, తపస్సు, సమత్వము, పరాపరాధసహనము, లాభముల
యెడ నుపేక్ష, శాస్త్రవిచారము, జ్ఞానము, విరక్తి, యైశ్వర్యము, శౌర్య
ము, తేజస్సు, దక్షత్వము, కర్తవ్యార్థానుసంధానము, స్వతంత్రత్వము,
క్రియానైపుణ్యము, కాంతి, ధైర్యము, మృదుత్వము, ప్రగల్భత్వము,
వినయము, శీలము, మనోదార్ఢ్య, మింద్రియపటుత్వము, భోగాస్పద
త్వము, గాంభీర్యము, స్థిరత్వ, మాస్తికత్వము, కీర్తి, పూజనీయత్వ,
మనహంకారత్వము మున్నగుమహాగుణము లెన్నఁడు నెడఁబాయక
యెవ్వనియెడ నిత్యంబులై యొప్పు నప్పరమసకల గుణావాసుం డగుశ్రీని
వాసుఁ డిప్పు డీలోకముఁ బాసె ననియుఁ బాపాత్ముఁ డగుకలి సొచ్చె
ననియు నేను నన్నే కాదు, మఱి నిన్నును దేవర్షి పితృసాధుజనులను సర్వ
వర్ణాశ్రమాదులనుం గుఱించియు శోకించెద. బ్రహ్మాదులు పలుమాఱు
లేదేవికటాక్షవీక్ష యపేక్షించి తపంబు లాచరింతు రట్టిసరోజవాస్య
యగులక్ష్మియుఁ గమలవనవాస ముజ్జగించి నిత్యానురక్తయై యెవ్వని
పాదలావణ్యముపై నాస చేసియుండు నమ్మహానుభావునిపద్మకులిశాంకుశ
ధ్వజరేఖాలాంఛనము లగుశ్రీమచ్చరణములఁ గైసేయంబడి యేను
ముల్లోకములలో నెక్కువ యని పేరు గాంచి నాకంటె నింక నెవ్వ
రెక్కు డనిగర్వించియుండ నా దేవదేవుఁడు నన్నుఁ బాసి చనియె. అప్పర
మేశ్వరుండు నాకు మోవరానిబరువై యుండినరాక్షసాంశజనితరాజుల
నక్షౌహిణీశతంబులతో నాత్మతంత్రుండై హరింపను న్యూనపదుం డైన
నీకుఁ దనపురుషకారమునఁ బూర్ణపదత్వముఁ గలిగింపను యదువంశం
బున దివ్యమంగళవిగ్రహంబు ధరియించె. ప్రేమావలోకమందహాస
మధురభాషణాదులం జేసినసత్యభామాదులమానస్థైర్యముల హరించియుఁ
దనచరణరేణుసంసర్గమున నలంకృతం బగునా మేను సస్యాదివ్యాజమున

రోమాంచకంచకితంబుగాఁ దోఁపఁజేసియు వెలయునట్టిపురుషోత్తము వియోగ మెవ్వరు సైరింప నోపుదురని యిట్లుధర్మదేవతయు భూదేవియు సంభాషించుచున్నంతఁ బూర్వవాహిని యగుసరస్వతీనదీతీరమునం గల యాకురుక్షేత్రప్రదేశమున నట్టియెడఁ బరీక్షిన్నరపాలుఁ డాకస్మికంబుగఁ జనుదెంచె.

### పరీక్షిన్నరపతి కలి నధిక్షేపించి ధర్మదేవతను భూదేవి నూరార్చుట

అట్టియెడ రాజవేషముఁ దాల్చి దండపాణియై దిక్కు లేని వానింబోలె గోమిథునంబుఁ దన్నుచున్న యొక్కశూద్రుని, వానితాడనమునం జేసి యేకపాదమునఁ గుందుచు వెఱపునం గాఁబోలు మేహనంబు సేయుచున్న మృణాళధవళం బైనవృషభమును, నాశూద్రునికాలితన్ను వడిసి యేడ్చుచుఁ గృశించి మేపుగోరుచున్న హావిర్ధోగ్ధ్రి యగుగోవునుం గాంచి యప్పాండవపౌత్త్రుండు విల్లెక్కుపెట్టి రథస్థుఁడై మేఘగంభీరస్వరంబుతో నిట్లనియె. ఓరీ! దురాత్మా! నీ వెవ్వండవు? మదీయశరణంబుఁ గాంచినయీలోకమున బలియుండవై దుర్బలులఁ బీడించెదవు. వేషమున రాజుమాడ్కిఁ జూపట్టుచుండెదవుగాని నీకార్యంబు రాజయోగ్యంబు గాదు. కృష్ణుండును గాండీవియు నీలోకము విడిచినపదంపడి నిరపరాధుల రహస్యమునం బ్రహరింపఁ దెగువ పూని తప్పు చేసినదానికి నీవు వధ్యుండవు. అయ్యా, మృణాళధవళుం డగునీ వెవ్వండవు? వృషభరూపముగొని మూడుపాదములఁ బోకార్చికొని యొంటికాలఁ దిరుగుదువు. దేవగణమున నొక్కండవై వృషభరూపమున నిట్లు మాకు ఖేదముఁ గావింపఁ దిరుగుదువే? కౌరవరాజులు నిజభుజబలంబున లెస్స యేలు నీభూమండలంబున దుఃఖభాగి యగువాని నిన్నొక్కనిఁ దక్క నింక నెవ్వనిం జూడనయ్యెద. వృషభరాజా, శోకింప వలదు. శూద్రునివలని వెఱపు దక్కుము. తల్లీ, దుష్టశిక్షకుం డైనయేను గలుగ నీకు విలపింపం బనిలేదు. మే లయ్యెడు. సాధ్వీ, యెవ్వనిరాష్ట్రమునం బ్రజల సాధుజనులకు వెఱతు రట్టియున్మదుం డైనరాజునకుఁ గీర్తియు భాగ్యంబు నాయువుఁ బరలోకమునుం జెడుట నిక్కువంబు. దీనులపీడల నడంచుటయే రాజులకుఁ బరమధర్మంబు. కావున భూతద్రోహి యగునీ యధముం దెగటార్చెద. వృషభవర్యా, చతుష్పదుం డైననీకాళుల

షూఁడింటి నెవ్వండు నటికె ? కృష్ణానువర్తులకా స్త్రమున నీ యట్లుశోకిం చువా రుండరాదు. సాధువులు నిరపరాధులు నగుమీయట్టివారికి వైరూప్యముఁ గావించి పార్థులకీర్తి దూషించునతనిం జెప్పుము. నీకు మే లయ్యెడు. నిరపరాధుఁ డగుజనునకుఁ గీడు చేయుదురాత్మునకు నా వలనిభయంబు దప్పదు. పెక్కు లేల ? నిరంకుశముగ నిరపరాధులకుఁ గీడు రోయువాఁడు దేవుఁడైన నేమి వానికేయూరాదిభూషణభూషితం బైనబాహుదండము నేనఱుకుదు. ఉత్పథప్రవృత్తుల ననాపత్సమయమున యథాశాస్త్రముగ శాసించుచు స్వధర్మమున వర్తించువారిం బరిపాలిం చుటయకదా రాజులకుఁ బరమధర్మం బనియూరార్పుచున్నంత ధర్మ దేవత యానరదేవున కి ట్లనియె. రాజేంద్రా, పాండువంశజాతు లగుమీ కే దీనుల కభయ మొసఁగఁ జెల్లు. మీకులమువార లట్టివా రవుటంగా దే జగన్నాథుండు తానే వారికి దూతకృత్యంబైనఁ జేయఁ బూనె. ప్రాణు లకుఁ గ్లేశబీజము లగుసంసారభ్రమణంబు లెవ్వనినిమిత్తమునం గలుగు నట్టిపురుషుని వాక్యభేదమోహితు లగుమే మెఱుంగఁ జాలము. కుత ర్కవాదు లగుప్రాకృతులు కొందఱు తామే తమసుఖదుఃఖములకుఁ గారణం బని నాస్తికులై పల్కుదురు. కొందఱు కర్మంబు కారణం బండ్రు. కొందఱు మనోవచనాగోచరత్వమునం జేసి స్వభావమే హేతు వని వాదింతురు. రాజపుంగవా, యిం దెయ్యది యుచితం బగు నద్దాని నీవ నీమతిం బరికించి నిశ్చయింపు మని ధర్మదేవత సెప్పుటయుఁ బరీక్షి జ్జనపతి సమాహితమనంబుతో ఖేదం బుడిగి ధర్మదేవతకు మఱియు నిట్లనియె. ధర్మజ్ఞా, వృషభరూపముఁ గొన్నధర్మంబె నీవు కావున నిన్నుఁ దన్నినవాని నెత్తి చెప్పుట పాడి గా దని నన్నే విచారించికొ మ్మందువు. అది యట్టిద. అధర్మ మాచరించువానికిఁ గలుగునరకాదులు తత్సూచ కునకుం గలుగుఁగదా. ఇంతేల ? వధ్యఘాతుకలక్షణం బైనదేవమాయా ప్రకారంబు మనోవచనములకుం గోచరంబు గాదు. తపస్సు శౌచము దయ సత్య మనునాలుగుపాదములు ధర్మమునకుఁ గృతయుగమునఁ బరిపూర్ణంబులై యుండె. అట్టినాలుగింటిలో మొదటిమూఁడు స్మయ సంగమదములనిమిత్తమున భంగముఁ గాంచె. ఇఁక సత్యాత్మకం బైన ధర్మపాద మొక్కండే మిగిలియుండెడు. దాని నొక్కదాన నెట్టులో

యీకలియుగమున వర్తింతువు. అనృతమునం బెంపు గాంచి యధర్మ ప్రధానంబైనయీకలి యీకాలి నొక్కదానింగూడ హరింపం జూచు చుండెడు. ఈభూదేవియు భగవంతుండు దనభార మెల్లం దొలంగించి నిజ చరణారవిందవిన్యాసముల నలంకరించినభాగ్యమునకుం దాను భాజనంబై యిపు డాదేవదేవునిం బాసి దౌర్భాగ్యములం బొందు యబ్రహ్మణ్యు లైనశూద్రులు రాజవ్యాజమున నికముందుం దన్నేలం బోవుదు రని కన్నీరువిడుచుచుండెడు నని పరీక్షితుండు ధర్మదేవతను భూదేవిని నూరార్చి రాజలాంఛనములం గొని యధర్మంబు పెంచుకలి యవశ్య వధ్యుం డని నిశ్చయించి వానిం బరిమార్పంగ వాడికృపాణముం గొనియె.

## పరీక్షిన్నృపాలుండు కలిని నిగ్రహించుట

అంతం గలి యెంతయు వెఱచి వెల్లంబోయి దిక్కుగానక యా నరనాయకునడుగులపయిం బడి శరణు సొచ్చినం దీనవత్సలుండును శరణాగతరక్షకుండు కీర్తియోగ్యుండు నగునాధీరుండు తనకాళు లాశ్రయించిన కలి యెట్టివాండైనం దా నతనిం జంపం దెంపు సేయక కరుణించి నవ్వుచు నిట్లనియె. అర్జునయశోధారులకుం గేలు మోడ్చిననీకు భయము వలదు. ఐన నస్మదీయరాష్ట్రమునం దధర్మబంధు వగునీకు నిలువం జోటియ్యరాదు. నీవు రాజదేహములం జొత్తువేని లోభ, మనృతము, చౌర్యము, స్వధర్మత్యాగ, ఖలక్ష్మి, కపటము, కలహము, దంభ మనునీ యధర్మపరివారమెల్లం దోడన చొచ్చు ధర్మసత్యముల కావాసయోగ్యంబై యజ్ఞవిస్తారకోవిదులు నానాయజ్ఞముల యజ్ఞేశ్వరు నారాధింప యోగ్యంబై పరమపవిత్రంబైనయీబ్రహ్మావర్తదేశమున నీకుం గాలూంద రాదు. వాయువుతీరునం జరాచరాత్మకజీవకోటిలోనెల్ల నంతర్బహిర్భాగములందు వ్యాపించి యపరిచ్ఛిన్నుండై యుండుయజ్ఞమూర్తి యగు పరమేశ్వరుం డీపుణ్యదేశమున నానాయజ్ఞములం బూజ్యమానుండై యజించువారికి క్షేమము నమోఘకామములును బ్రసాదించు నని చెప్పిన విని కలి దండపాణి యగునంతకుచాడ్పునం గృపాణపాణియై యున్నయన్నరపాలునకు వెఱచి మేను వడంకం గృతాంజలియై "యోసార్వభౌమ వరేణ్యా, నీశరణుసొచ్చిననాకును నిలువ నెడ గలుగవలయుంగదా ఎటం

జూచినను శరశరాసనంబులతో నీవునాప్రాలం బొడగట్టుచున్నవాడవు. నీయానతిమెయి నేదే నొక్కచోట నే నుండుదు. అట్టిచోటు నీవ నిర్దేశింపు"మని యడుగుటయు నయ్యభిమన్యుసూనుఁడు జూదము, పానము, స్త్రీలు, హింస యనునాలుగింటిని గలికి నిలువఁ జోటుగా నిర్దేశించె. అయ్యవి నాలుగు నసత్యమదసంగక్రౌర్యములకుఁ బ్రత్యేకస్థానంబులు గావున నన్నింటికి నెలవుగాఁ దగినమఱియొక్కదాని నిర్దేశింపు మని కలి క్రమ్మఱ వేఁడుటయుఁ బరీక్షితుండు సువర్ణమును నేనవదానిఁగా నిరూపించె. సువర్ణమున నసత్యమదకామరజోవైరము లైదు జనించుఁ గావున నయ్యది కలికిఁ జాలియుండె.

**సూతుఁడు శౌనకాదులకుఁ బరీక్షిన్మహిమ చెప్పుట**

అవ్విధమున నభిమన్యుసుతుం డైనపరీక్షితుండు కలినివాసస్థానంబులుగా నిరూపించిన స్త్రీద్యూతపానహింసాసువర్ణంబు లనుపంచస్థానములను భూతికాముఁ డగుమనుజుఁడు విశేషించి లోకమునకుఁ బతియు గురువు ధర్మశీలుఁడు నగురాజు సేవింపరాదు. అప్పటికి విఱిఁగిన తపశ్శౌచదయాఖ్యంబు లగుధర్మవృషభపాదముల మూఁడింటిం గ్రమ్మఱఁ గూర్చి యాపరీక్షిన్నరేంద్రుండు భూదేవికిఁ బెంపొనర్చి హస్తిపురమ్మున నాత్మపితామహుం డగునజాతశత్రుఁ డొసంగినరాజ్యాసన్నం బధిష్ఠించి చక్రవర్తియై మహాకీర్తియై యధికశ్రీపరిస్ఫూర్తియై యిప్పటిదనుక వెలయుచుండె. అయ్యభిమన్యుకుమారునిప్రభావంబు చెప్పఁ గొలఁది గాదు. అమ్మహాత్మునిపాలనమహిమంబుననే మీర లీసత్త్రమునకు దీక్ష సేయఁ జాలితిరి. తల్లిగర్భమున నశ్వత్థామబ్రహ్మాస్త్రమునం గ్రాఁగియు నాశ్చర్యచర్యుం డైన జనార్దనునియనుగ్రహమునఁ బునరుజ్జీవితుం డైనయారాజచంద్రుండు బ్రాహ్మణశాపప్రేరితుం డైనతక్షకునివలనం దనకుఁ గలుగు ప్రాణాపాయంబునకుఁ దలఁకక భగవదర్పితాశయుండై సర్వసంగములం దొలంగి వ్యాసనందనుం డైనశుకయోగీంద్రునివలన హరితత్త్వము లెస్స దెలిసి నిజకళేబరము గంగానదిఁ ద్యజించె. హరిపై మనస్సు నిలిపి తత్కథామృతంబుఁ గ్రోలుచు నంతకాలమున నాతనిఁ దలంచువారికి మోహం బేల గలుగు? వాసుదేవుఁ డేవాసరమున నేక్షణమున భూలోకము విడిచి పరమపదమున కరిగె నాదివసమునం దాక్షణంబె యధర్మ

ప్రభవం బైనకలి యన్నింటం బ్రవేశించియు మహానుభావుం డైనపరీక్షిన్నరనాథుండు చక్రవర్తియై రాజ్యమేలుచుండినందాఁక నేమియుం జేయఁ జాలక యణఁగియుండె. కలికాలమునఁ బుణ్యములు చేయకుండినను శ్రద్ధతోఁ జేయుదు నని సంకల్పించినమాత్రనే తత్ఫలంబు సమకూరెడు. పాపంబులన్ననో లెస్స చేసినంగాని ఫలింపఁ జాలవు. కావున నితరయుగములకంటెఁ గలియుగంబు కొండొకశ్రేయస్కరం బని తలంచియుఁ బ్రమాదము నొందునధీరులయెడ నయ్యది వృకవిధమునఁ బొంచియుండి యలముకొనుఁగాని యప్రమాదు లగుధీరులపొంతఁ బోవవెఱచుఁ గావున నరసి చూచినం గలివలని కీడు సుకరనిరాసం బనియెంచియుఁ బరీక్షిన్మహీపాలుండు మకరందరసంబుఁ గ్రోలుమధుపంబు పూవులకుఁ జేటు వాటిల్లకుండఁ దత్సారంబుఁ గొనుకైవడిఁ గలిపైఁ గడు నలుగక తదీయగుణసారంబు గ్రహించుచు దాని మూల ముట్టఁ దెగఁ జూచుటుడిగి తనయానతిమెయి నడచునట్లు నిగ్రహంబుఁ గావించె. మునులారా, వాసుదేవకథాసమన్వితం బైనపరీక్షిన్మహారాజచరిత్రంబు మీ రడిగినదానిం జెప్పితి. కీర్తనీయమహనీయచరిత్రుం డైనపద్మనేత్రుని గుణకర్మాశ్రితంబు లైనకథలు భూతికాము లగుపురుషులకు సంసేవనీయంబు లని చెప్పినసూతునకు నైమిశారణ్యవాసు లగుసన్మును లిట్లనిరి.

## శౌనకాదులు భాగవతపురాణము చెప్పు మని సూతు నడుగుట

సూత, పౌరాణికాగ్రణీ, పెక్కేఁడులు మనుము. మరణధర్మ లగుమాకు మృత్యునివృత్తిఁ జేయఁ జాలినపరిశుద్ధ మగుకృష్ణకీర్తి వర్ణించి మేలు చేసితివి. ప్రత్యవాయబాహుళ్యకారణంబున ఫలనిశ్చయము లేమిం జేసి యవిశ్వసనీయం బైనయీసత్త్రకర్మమునం గేవలము పొగ దాఁకి వన్నె చెడినమేనులఁ దనరు మాకు మధుర మగుమధుమథనచరణారవిందమకరందరసముఁ గ్రోలఁ జేసితివి. స్వర్గము నపవర్గమును భగవద్భక్తులసంసర్గమునకు లేశమాత్రముననేనియు సాటి యని తలంపము. రాజ్యాదు లగునైహికభోగములఁ జెప్పవలయునే! భాగవతులకుఁ బరమాశ్రయం బైనప్రాకృతగుణరహితుఁ డగుహరి కల్యాణగుణము లెన్ని యని యోగేశ్వరు లగుబ్రహ్మరుద్రాదులు నెఱుంగ

నేరరు. అట్టిమహానుభావ్రునికథలు వినునెడ రసజ్ఞుఁ డెవ్వఁడేనియుఁ దనివి చెందునే? కావున భగవత్ప్రధానుం డైనసీవు భాగవతులకుఁ బరాయణంబై పరమపురుషార్థప్రదం బైనవిష్ణుదేవుని పవిత్రచరిత్రంబు వినఁ గోర్కులు గ్రేళ్లువాఱుచున్నమాకు విస్తరించి చెప్పుము. మహామతి మహాభాగవతుఁడు నగుపరీక్షిన్మహీశ్వరుండు శుకయోగీంద్రువలన బరమజ్ఞానసాధనం బైనయేమహాపురాణ మాకర్ణించి యపవర్గపదవాచ్యం బైనగరుడధ్వజపాదమూలంబుఁ బ్రాపించె నట్టిపారీక్షితభాగవతపురాణమును బరమపావనము నత్యద్భుతము నగుయోగమున నిష్ఠఁ గావించుదానిఁ గృష్ణలీలల నలరుదాని భాగవతప్రవరుల కభిరామం బగుదాని మాకుఁ దేటపడం జెప్పు మని యడుగుటయు సూతుఁ డిట్లనియె.

సూతుఁడు మునులఁ బ్రశంసించి పారీక్షితభాగవతంబు చెప్పఁ బూనుట

అద్దిరా! యేము ప్రతిలోమజాతిం బుట్టియుఁ బెద్ద లగుమీయాదరణంబు వడయఁ గాంచుటం జేసి కృతార్థజన్ముల మైతిమి. మహాత్తములతోడిసంభాషణంబు లభించెనేని సామాన్యజనునకుం గుత్సితకులజనననిమిత్త మగుమనఃపీడ దొలంగు. ఇఁక నయ్యాది భగవన్నామకీర్తనంబు సేయువాని దుష్కులజన్మాదిదోషములఁ దొలఁగించునని వేఱ చెప్పవలయునే? పెక్కు లేల? భగవన్నామములఁ గీర్తించువానికి దుష్కులత్వదోషం బెక్కడిది? ఒకవేళ జన్మకృతం బైనయయ్యది యుండెనేనియుఁ దనకీర్తించుభగవన్నామం బాదుష్కులత్వదోషము నడంపఁ జాలకుండునే? గుణములపట్టున నితరులతోడిసాటియే లే దన్న నిఁక నెక్కువ లేదని చెప్పఁ బని లేదుగదా. అట్టియసమాభ్యధికగుణుం డైననారాయణు నెఱుంగ నింతమాత్ర సూచించినయడి చాలు. బ్రహ్మాదులు ప్రార్థించుచుండినను వారలం గాదని శ్రీదేవి కోరకుండిన నేపరమపురుషునిపాదపరాగంబుఁ దాన వచ్చిసేవించుచుండు మఱియు నేజగదీశ్వరు చరణనఖసంసర్గముం గాంచి పావనతం బడసినబ్రహ్మసమర్పితార్ఘ్యసలిలంబు లీశ్వరులతోడిలోకములకుఁ బూతవృత్తిఁ గల్పించు నమ్ముకుందుండు దక్క మఱి యెవ్వఁడు భగవచ్ఛబ్దవాచ్యుఁ డగు? అట్టి హరియెడఁ బరమభక్తిం జేసి సత్పురుషులు తత్క్షణంబే చిరకాలరూఢ మగు

దేహాదిసంగముం ద్యజించి శాంత్యహింసాప్రధానం బైనతదీయపరమహంసపదముం బ్రాపింతురు. సూర్యతేజులారా, భగవచ్చరిత్రంబు మీా రడిగితిరి. అందు నామతికి గోచరించినంత చెప్పెద. పక్షులు మింటం దమకు శక్తి యున్నంతకు నెగసియు నయ్యాకసంబుతుది యెఱుంగం జాలని తెఱంగున జ్ఞానులకుం బరమపురుషచరిత్రలం దమతమయెఱింగినంతయే చెప్పం జాలియుండు నని చెప్పి యప్పౌరాణికుం డప్పరమమునుల కిట్లనియె.

## శమీాకసుతుం డగుశృంగి పరీక్షిత్తునకు శాప మిచ్చుట

పరీక్షిన్నరేంద్రుం డొక్కనాఁడు విల్లు గొని వేఁటకై యడవుల కరిగి మృగములవెంటం దవిలి పెనుదప్పి చని డస్సి యాఁకటను నీరువట్టునను మీాఁదమిక్కిలి యలజడిపడి యెచ్చటను జలాశయ మెద్దియుం గానక డబ్బాట శమీాకమునియాశ్రమముం జొచ్చి యందుం గన్నులు మూసికొని యింద్రియములను బ్రాణములనుం గుదియించి యుపరతుండై జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూఁడవస్థలకు వెలి యగుతురీయపదముం బ్రాపించి బ్రహ్మభూతుఁడై నిర్వికారుఁడై రురుచర్మంబు విప్రకీర్ణజటాకలాపంబును ధరించి పరమశాంతి మెయిం గూర్చుండినయమ్మునిం గాంచి యత్యధికపిపాస పట్టనేరక తాలువు లెండఁగ డయ్యుచుం ద్రావజలం బడిగి సమాధినిష్ఠుం డైనయమ్మునివలనం బ్రత్యుత్తరంబుం గానక యమ్ముని దన కాసనార్ఘ్యాద్యుపచారములం జెప్పక యొప్పరికించె ననియయ్యది తన కవమానముగ భావించుటం జేసి క్షుత్పిపాసాపరిశ్రాంతుఁడు గావునం గాఁబోలు నమ్మహీపతి కమ్మునిపై నెన్నఁడు నెయ్యడనుం బొడగట్టనిక్రోధమాత్సర్యంబులు మనస్సునం బొడతెంచుటయు నాతం డయ్యాశ్రమంబునుండి మఱలువాఁ డౌరా! యితండు నిక్కంబ సమాధినిష్ఠుండో కాకుండిన నీరాజు లేమి చేయుదురు వీరి నాదరింపకుండిన నే మగునని వట్టివేషముం బూనెనో చూచెద నని తనలోం దలంచి యమ్మునియంసదేశమునం జచ్చినపాము నొక్కదానిం దనవింటికొపునం బడ వైచి మగిడి కరినగరికిం జనియె. ఆశమీాకమునికుమారుండు శృంగి యనువాఁడు బాలుఁడయ్యు నత్యంత తేజమున వెలుంగుచుం దోడిబాలురతోడం గ్రీడించువాఁడు దనతండ్రికిం బరీక్షిత్తు చేసినయపచారమునకుం

గింకిరిపడి "యక్కటా! బలియు రగురాజుల యధర్మం బే మన వచ్చు?
కాకశునకదౌవారికాపచారము లెట్లట్లు దాసులతప్పిదములు స్వామి
యందు యావేశించు. బ్రాహ్మణులు రాజులం గృహపాలస్థానమున నియ
మించిరి. అట్టిరాజన్యుండు తనస్వామివాఁకిట నుండి కుండలోనికూడు
గుడువఁ గూడునే? దుర్మార్గవర్తనుల శాసించు శ్రీకృష్ణుఁ డీలోకము విడు
చుటంజేసి ధర్మమర్యాద యుల్లంఘించుదుష్టాత్ము నిదె నేఁ డేను శాసింతు
నాబలంబు సూడుఁ" డని తోడిబాలురతోడం జెప్పి రోషరక్తాక్షుండై
కౌశికీనదిలో నాచమించి శుచియై "మర్యాద దప్పి మాతండ్రికి ద్రోహ
మొనర్చినకులాంగారం బైనపరీక్షితుని నేఁటి కేడవనాఁడు తక్షకుండు
మదీయచోదనంజేసి విషానలంబునఁ గాల్చెడు" మని శపించి యాశ్ర
మంబున కేతెంచి మెడలోనం బాముపీనుగు మోచియున్న తండ్రిని
జూచి శోకార్తుండై యెలుంగు రాల్పడ నేడ్చుటయు నాంగిరసుం డైన
యాశమీకుఁడు సుతునేడ్పు విని మెల్లమెల్లనం గన్నులు దెఱచి
యంసమున నున్న సర్పశవముం గనుంగొని యవలఁ బడం ద్రోచి కొడుకు
దెస మొగంబై వత్సా, "యేల యేడ్చెద వెవ్వరు నీకుఁ గీడు రోసి"
రని యడిగి యతనివలనం దద్వృత్తాంత మంతయు సవిస్తరంబుగ నెఱింగి
శాపార్హుండు గానిపరీక్షిన్నరేంద్రునకుఁ దనకొడుకు శాపం బిచ్చుటఁ
దాను మెచ్చక యక్కుమారున కిట్లనియె.

**శమీకుఁడు పరీక్షిత్తునకు శాప మిచ్చినకొడుకును నిందించుట**

బాలకా, తెలియక ఘోరపాపంబు చేసితివి. అక్కటా! కొం
చెము తప్పిదమునకుఁ గఠినదండనంబు సేయఁ దగునే? ఓరి యపక్వమతీ,
విష్ణుదేవాంశసంభూతుం డైనభూపాలుని మనుష్యమాత్రునిఁగాఁ దలఁప
రాదు. దుస్సహ మగురాజతేజంబు రక్షించుటంగదా ప్రజలు దేనికిని
వెఱవక శుభములఁ గుడుచుచున్నవారు. రాజు పేరిటిశ్రీవిష్ణుండు లేకుండు
నేని మనము నీలోకంబును గావలి లేనిగొఱియలగుంపుచందమునఁ
జోరప్రచురత్వమునంజేసి కాపు గానక చెడుదుము. మఱియుఁ బ్రజలకు
నాథుఁడు లేనికతనఁ గలుగుధననాశమునకు మనము నిమిత్త మైతిమి.
కావున నేసంబంధము లేకున్న నాపాపము మనలం జేరవచ్చు. పాల
కుండు లేకుండునేని జనులు దస్యుప్రాయులై యొండొరులం జంపు

దురు. శపింతురు. పశు స్త్రీ ధనాదుల నుచ్చిలింతురు. వర్ణాశ్రమాచార యుతము వేదత్రయమయము నగుసదాచారము నశించు. దానివలన నర్థకామములయందే మనసు చేసి జనులు గ్రోఁతులు గుక్కలు నెట్లట్లు వర్ణసంకరంబు సేయుదురు. రా జన్మమాత్ర నాతని ధర్మపాలుఁ డన వలయు. పరీక్షిన్నరేంద్రుఁడన్నవో చక్రవర్తియు మహాకీర్తియుఁ బరమ భాగవతుఁడునై యశ్వమేధముల నాచరించినరాజర్షివరుండుగాని రాజ మాత్రుండు గాఁడు. అతఁడు పరమధర్మమూర్తి యని వేఱచెప్ప నేల! అంతటివాఁ డాకటను నీరుపట్టుననుం గడుబడలి కర్తవ్యవిచారం బర యక యేమి చేసిననుం దాని దప్పిదంబుగ నెన్నరాదు. అట్టిసార్వ భౌముని శపింపఁ బోలునే? నీచేసినయీనీచకృత్యమువలని పాపమునకుఁ బ్రతివిధానంబు నాకుఁ జూడఁ దోఁపకుండెడు. పాపరహితు లగుతన భక్తులయెడ నపక్వమతి యగుబాలుఁ డొనర్చినతప్పిదం బప్పరమేశ్వరుండే క్షమింపవలయు. తిరస్కరించినను వంచించినను శపించినను దూఱినను దన్నినను భగవద్భక్తులు మాఱు సేయ నొల్లరు గావున నాపరీక్షిజ్జన పాలుండు నీకుఁ బ్రతిశాపం బియ్యఁడయ్యె. అక్కటా! యే నేమి సేయుదు నెయ్యది తుది యేమి కాఁగలయది యని యిట్లు శమీకముని తనతనయుతప్పిదమునకు మది వగచుచుఁ దనకు రాజు చేసిన యప చారముఁ జింతింపక యూరకుండె. లోకమునఁ దఱచుగా సాధుజనులు పరప్రేరణమునంజేసి సుఖదుఃఖాదు లగుద్వంద్వములందు మనస్సు చేయుదురుగాని యాత్ముఁడు సుఖదుఃఖాదిగుణాశ్రయుండు గాఁ డని వానియెడ మోదమును ఖేదమునుం బొరయరు.

## పరీక్షిత్తు మునిశాప మెఱిఁగి ప్రాయోపవిష్టుఁ డగుట

అక్కడఁ బరీక్షిన్నరనాథుం డమ్మునియెడఁ దనకావించిన నింద్య కర్మమునకు వగచుచు దుర్మనుండై యక్కటా! నిరపరాధుఁ డగుగూఢ తేజుఁ డైనబ్రాహ్మణునియెడ ననార్యునట్లుపోలె నీచకర్మముఁ జేసితి. ఈశ్వరునకే యవజ్ఞ చేసిన ట్లయ్యె. దానంజేసి యప్రతికార్యం బైన వ్యసన మచిరయమున నాకే కలుగుఁగాక. అయ్యది మదీయపాపమునకుఁ బ్రాయశ్చిత్తంబై మీఁద మే లొనర్పఁ జాలెడు. దాన నిఁక నిట్టివి చేయ నవకాశ మైనం గలుగకుండెడు. ప్రకోపితబ్రహ్మకులం బనునగ్ని

యిప్పుడే మదీయరాజ్యబలకోశముల నీఱు సేయుఁగాక. పాపాత్ముఁడ
నగు నా కికమీఁదనైన దేవబ్రాహ్మణగోవులయెడఁ బాపమతి గలుగ
కుండుఁగాక యని తనలోఁ జింతించుచున్నంత శమీకమునిశిష్యుఁ డొక్క
విప్రబాలకుఁ డేతెంచి శృంగిశాపప్రకారంబును దానం దక్షకునివలనఁ
బరీక్షిత్తునకుఁ గలుగుకీడునుం జెప్పుటయు నాకర్ణించి సార్వభౌముఁడు
విషయాసక్తితో మెలఁగు తనకుఁ దచ్ఛాపము విరక్తికిఁ గారణం బయ్యె
నని యెంచి చిత్తంబున మెచ్చి యీలోకంబు నాలోకంబు ననిత్యంబులు
దుఃఖప్రాయములు గావున హేయంబులే కాని యుపాదేయంబులు గా
వని విచారించి కృష్ణపాదపరిచర్యయే పురుషార్థములలోనెల్ల నుత్తమం
బని నిశ్చయించి గంగానదిలోనం బ్రాయోపవిష్టుం డయ్యె. లలితతులసీ
దళమిశ్రము లగువిష్ణుచరణరేణువులసంసర్గమునం జేసి యత్యంతపవిత్రం
బైనదివ్యసలిలము వహించునమ్మహానది యీశ్వరులతోడి యుభయలోక
ములఁ బవిత్రీకరించుచుండ నట్టిపరమపావనమహాస్రోతస్వి నాశ్రయించి
సేవింపక చావసిద్ధపడినవాఁ డెవ్వఁ డుపేక్షించు ?

### విష్ణుకథలఁ జెప్పుఁ డని పరీక్షిత్తు మునుల నడుగుట

అవ్విధమున విష్ణుపదసంభూత యగుగంగానదిం బ్రాయోప
విష్టుండై పరీక్షిన్నరపాలుం డనన్యచిత్తుండై మునివ్రతుండై సర్వసంగ
ముల విసర్జించి నారాయణచరణసరసీరుహముల ధ్యానించుచున్నంతఁ
దీర్థయాత్రావ్యాజమునఁ దీర్థములకుఁ బావనత్వంబుఁ గావించుచు లోక
ములకుఁ బవిత్రత్వం బొడఁగూర్చుమహానుభావులైనయత్రి, వసిష్ఠుఁడు,
చ్యవనుండు, శరద్వంతుఁ, డరిష్టనేమి, భృగు, వంగిరసుఁడు, పరాశ
రుఁడు, విశ్వామిత్రుఁడు, పరశురాముఁడు, చథ్యుఁ, డింద్రప్రమదుఁ
డిధ్మవాహుఁడు, మేధాతిథి, దేవలుఁ, డార్ష్టిషేణుఁడు, భరద్వాజుఁడు,
గౌతముఁడు, పిప్పలాదుఁడు, మైత్రేయుఁ, డౌర్వుఁ, డగస్త్యుఁడు, వేద
వ్యాసుఁడు, నారదుఁడు మున్నగుసశిష్యులైనదేవర్షి బ్రహ్మర్షులు నరు
ణాదు లగురాజర్షులు నానాఋషిగోత్రప్రవరముల జనించినవా రచ్చ
టికి విచ్చేసిరి. విచ్చేసినయమ్మునుల నుత్తమవిధానమున నర్చించి సుఖా
సీను లైనవారికిఁ బ్రణమిల్లి పరీక్షిన్నరవరుండు కేలుదోయి మొగిడ్చి

వివిక్తచిత్తుండై తనచేయఁ దలఁచినదాని సమ్మునులకు విన్నవించు వాఁడై యిట్లనియె. మహాత్ములారా! బ్రాహ్మణులయొద్దఁ దదీయపాద ప్రక్షాళనోదకంబు వార్చుచోటికంటె దవ్వున నుండఁ దగిననీచకర్మ వృత్తం బైనరాజకులంబునం బుట్టియు నేను మహాత్ములయనుగ్రహము వడయఁ జాలినశీల మించుక యార్జించుటంజేసి యద్దిరా! యత్యంతంబు కృతార్థుల మైతిమి. అట్టిపాపవర్తనుం డైనయేను గృహకార్యములయెడ నత్యంతలోలుపత్వమున నుండినం గడతేర్పఁబూని పరాపరేశ్వరుం డైనయప్పరమేశ్వరుండే ద్విజశాపరూపమున నన్ననుగ్రహించె ఆశాపమునంగాదే యేను వెఱచి యొండుగతింగానక విషయవిరక్తుండ నైతి. కావున నేను సంసారమున విరక్తిఁ జెంది యీశ్వరునియెడఁ జిత్తంబు నిలిపి శరణుసొచ్చితి నని మీరలు నీగంగాదేవియుఁ బ్రసన్నచిత్తమున నెఱుంగవలయు. విప్రశాపప్రేరితుండై తక్షకుండు నన్ను లెస్స కఱచుగాక. మీరు శ్రీవిష్ణుదేవునికథలఁ గీర్తింపుఁడు. ఇఁక నేజన్మంబెత్తినను నా కపుడెల్లఁ దప్పక భగవద్భక్తియు భాగవతానురక్తియు బ్రాహ్మణమైత్రియుఁ గలుగవలయు. బ్రాహ్మణులకుఁ బ్రణమిల్లుదు నని యప్పాండవపౌత్త్రుం డప్పరమమునులకుఁ జెప్పి నిశ్చితస్వాంతుండై తన కుమారుఁ డగుజనమేజయునకు రాజ్యభారమెల్ల నప్పగించి గంగానది దక్షిణతీరమునం బ్రాచీనాగ్రము లగుకుశలపయి నుదఙ్ముఖుండై కూర్చుండె. అప్పుడు సురలు సాధువాదములతోడఁ బుష్పవర్షంబు గురిసిరి. దుందుభిధ్వానం బెసంగె.

## మునులు ప్రాయోపవిష్టుఁ డైనపరీక్షిత్తును బ్రశంసించుట

అచ్చటఁగూడినప్రజానుగ్రహసారశీలు రగుమహామును లుత్తమశ్లోకగుణోల్లసితుం డగు నాపరీక్షిన్నరేంద్రుం బ్రశంసించి "యోరాజర్షివర్యా! భగవత్సాన్నిధ్యంబుఁ గోరి రాజకిరీటసేవితం బైనసార్వభౌమసింహాసనముఁ ద్యజింపనీకుఁదగుగాని యితరుల కలవి యగునే? మఱియుఁ గృష్ణునాశ్రయించినమీయెడ నిట్టిది చిత్రంబునుంగా"దని యాచక్రవర్తికిఁజెప్పి తమలో నొండొరులం జూచి "యయ్యా! మనమందఱము భాగవతప్రవరుం డైనయీరాజచంద్రుం డీమేను దొఱఁగి రజోరహితము శోకవివర్జితము నగు నుత్తమలోకమునకుఁ జనునంత కిచ్చుటన

యుండుదు" మని తమలోనం జెప్పికొనుచున్నంతఁ బక్షపాతశూన్యంబై సత్యంబై యర్థగంభీరంబై తేనియ లొలుకునట్టి యమ్మునులవచనం బాకర్ణించి పరీక్షిన్నృపాలుండు వారి నభినందించి శ్రీవిష్ణుచరితంబు వినువాఁడై యిట్లనియె. మునీంద్రులారా! సత్యలోకమున నాకాకారంబుఁ గొన్న వేదములమాడ్కిఁ బావనజ్ఞాను లగుమీ రందఱు నిటకు విజయంబు చేసితిరి. సహజ మగుపరానుగ్రహముకంటె మీ కొండొక్కయర్థ మీ లోకంబున నాలోకంబునను లేమి యే నెఱుంగుదు. కావున విశ్వాసంబు మై మిమ్మడిగెద. ఏనిప్పు డేమి సేయవలయునో దానిం దెలియఁజెప్పుఁడు. విశేషించి యాసన్నమరణుఁ డగుమానవున కెయ్యది పాపరహితం బైన కర్తవ్యం బగునద్దానింగరుణించి యాలోచించి బోధింపుఁడని వినయమున

శ్రీ శుకయోగి పరీక్షిత్తునొద్దకు వచ్చుట

నడుగుచున్నంత వ్యాసపుత్త్రుం డైనశుకయోగీంద్రుం డాశ్రమాదిలాంఛనంబుల నెఱుంగవలనుగాక యవధూతవేషంబుతో బాలు రాశ్చర్యముతోఁ జూచుచుఁ జుట్టికొని రాఁగ నాత్మలాభసంతుష్టుండై యదృచ్ఛం జేసి భూమిలోనం ద్రిమ్మరువాఁ డచ్చటికి సన్నిధిచేసె. అవ్విధమున నప్పుడచ్చటికి యదృచ్ఛాగతుం డైనయాశుకమహర్షివర్యునిఁ, బదునాఱేండ్లప్రాయమువాని, సుకుమారకరచరణాంసకపోలగాత్రంబులఁ దనరువాని, సుందరవిశాలనేత్రుండైనవాని, నున్నతనాసుండైనవాని, సమశ్రోత్రుండైనవాని, బంధురభ్రూవిలసితాననుం డైనవానిఁ, గంబుకంఠుండైనవాని, గూఢజత్రుం డైనవాని, విశాలోన్నతోరస్కుం డైనవాని, నిమ్ననాభియైనవాని, వళిసంవలితోదరుం డైనవాని, నాజానుపీవభుజుం డైనవాని, విష్ణుతేజస్కుం డైనవాని, నీలవస్త్రుండైనవాని, నత్యుత్తమంబగుయౌవనశ్రీసమృద్ధిం జేసి జవ్వనుల కెంతయు మనోహరుం డైనవాని, గూఢతేజమునఁ దేజరిల్లువానింజూచి యచ్చటిమును లమ్మహామహులక్షణం బెఱింగినవారు గావునఁ దటాలున లేచి యెదు రేఁగి దోడు తెచ్చి పూజించుటయు విష్ణురాతుం డైనపరీక్షిన్మహీపాలుఁ డతిథి యగునమ్మహామునికి వివిధపూజలెల్లఁ దలఁ దాల్చి యొనరించె. అప్పు డావ్యాసనందనుఁ గాంచక వెంబడించి యరుదెంచినపామరులు స్త్రీలు బాలురు నటఁ దొలఁగి చనిరి. పరీక్షిన్నృపతి పరమభక్తిమై నొసర్చినసపర్యల నంగీక

రించి యాపరమయోగీంద్రుం డప్పుటం గూడిన బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి సభామధ్యమునం దుత్తమాసనంబునం దత్ప్రార్థనంబున నాసీనుండై న గ్రహనక్షత్ర తారానికరపరివృతుం డైనచంద్రునిచందమునం జూడ నొప్పె.

### పరీక్షిత్తు శుకయోగినిఁ గర్తవ్యవిచారం బడుగుట

అత్తెఱంగున సుఖాసీనుం డైన యప్రతిహతమేధాశాలియుఁ బ్రశాంతుఁడు నగునమ్మునిం జేర నరిగి పరీక్షిన్మహీంద్రుండు సాష్టాంగ ప్రణామంబాచరించి కేల్దోయి మొగిచి యవధానంబుతో సూనృతవచనముల నిట్లనియె. బ్రహ్మర్షివర్యా! క్షత్రబంధువులమయ్యు నే మిప్పుడు మీరలు కరుణించి మా కతిథులై సన్నిధి చేయుటం జేసి యద్దిరా! సాధుజనసంసేవ్యుల మైతిమి. యోగీశ్వరా! విష్ణుదేవునిసన్నిధి నసుర లెట్టు లట్టులు భవదీయసన్నిధానమున మహాపాతకగణంబులు తొలంగి పోడవడంగు. పాండవప్రియంకరుం డైన శ్రీకృష్ణుండు దన మేనత్తకొడుకు లగునాకౌంతేయులకుఁ గూర్మి సేయుతలంపునఁ దదన్వయజాతుం డైన నాయెడఁ జుట్టఱికము పాటించి నాపయిం బ్రీతి సెఱపునే? విచారం బేల? అద్దేవదేవుఁడు నాయెడఁ దద్దయుఁ గరుణించు ననుట నిక్కువంబు. కాకున్న సకలసిద్ధులం గాంచి యేరికిం దనవర్తనం బిట్టిదని నిరూపింప నలవి గాక యదృచ్ఛాగతి నెల్లెడలం దిరుగునీదర్శనంబు ముముక్షు జనప్రార్థనీయతరం బైనయది. నాయట్టివాని కబ్బునే? కావున నాసన్న మరణుం డెయ్యది సేయవలయు, దేని నాకర్ణింపవలయు, దేనిం జపింప వలయు, దేనిం జింతింపవలయు, దేని సేవింపవలయు, దేనిం ద్యజింప వలయు, నయ్యర్థంబు యోగుల కెల్లం బరమగురుం డైన ని న్నడిగెద. నాభాగ్యమహిమంబున మీర లెట్టులో యిచ్చోటికి విచ్చేసి కూర్చుండు దురుగాని గృహస్థులయిండ్లలోనం గోదోహనమాత్రకాల మేనియు మీరు నిలుచుట దుర్లభంబు. మహానుభావా! నాయడిగినయర్థ మెల్ల వివరించి సవిస్తరమధురంబుగా విశదీకరింపవలయు నని భక్తివినయబంధు రంబుగా నడిగిన పరీక్షిన్నరేంద్రునకు సకలధర్మజ్ఞుం డైనయాశుక యోగీంద్రుఁ డిట్లని చెప్పఁ దొడంగె నని నైమిశవాసిమునులకు సూతుఁ డిట్లనియె.

చ. జగములకెల్లఁ దా గృహముచందమునం దగియుండియుం బ్రపం
చగణముఁ బ్రోవ యాదవునిసద్మమునన్ నిజయోగమాయలీ
లఁగొని దురూహవైభవములన్ వెలయించుచు భక్తకోటి నె
ప్డుగఁ గరుణించునాకపటసంసృతిధూర్వహుఁ గృష్ణుఁ గొల్చెదన్.

గద్యము. ఇది శ్రీమదుభయభాషాకవిత్వకలాభిరామ సీతారామకవి
లలామ పుత్త్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహ
సుధీవర్య సచ్ఛాత్త్ర, శాలావత్సగోత్రాపస్తంబసూత్ర, విబుధ
విధేయ, వేంకటరంగనామధేయ విరచితం బైన శ్రీమదాంధ్రవచన
భాగవతమునందుఁ బ్రథమస్కంధంబు సర్వంబు నేకాశ్వాసము.



శ్రీ ర స్తు

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్ర వచనభాగవతము

## ద్వితీయస్కంధము



క. శ్రీకైవల్యప్రేప్సువ
వాక్శ్రుతిసతతాభివర్ణితామలనామున్
లోకాలోకాంతరని
ర్వ్యాకులధాముని భజింతు సద్భూతధామున్.

**శుకుఁడు పరీక్షిత్తునకు భాగవతము చెప్పెదు నని చెప్పుట**

అవ్విధంబున సవినయంబుగ నడిగిన యాపరీక్షిన్నరేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె. రాజేంద్రా! నీయడిగినయర్థంబు లోకహితంబు, బ్రహ్మవిదులకు సమ్మతంబు శ్రోతవ్యాదులలో నెల్ల మేలునుం గావున నత్యుత్తమంబు. గృహవ్యాపారములయెడ నాసక్తులైనగృహస్థులకు శ్రోతవ్యాదివిషయములు వేనవేలు గలుగు. దాన నాయువు వ్యర్థముగఁ గొంత వడయు నెట్లంటేని. మనుష్యులకుఁ దమయాయుష్కాలమునందు రాత్రులెల్ల నిద్రచేఁ గొంతయు రతిప్రసంగమునఁ గొంతయుంగా వ్యర్థముగఁ గడచు. పగలన్నో ధనార్జనయత్నంబునను ధన మార్జించినపదంపడియుఁ గుటుంబభరణవ్యాసంగముననుం గడచు. మిథ్యాభూతములైనదారపుత్త్ర నిజదేహాదిరూపము లగునాత్మపరికరములయెడం బ్రసక్తుండై మనుజుఁడు దనయెదుట లాఁతు లెందఱో తెగుట చూచుచుండియుఁ దదీయమిథ్యాత్వంబు గాంచనేరఁడు. కావున నో భారతకులాగ్రణీ! మోక్ష మపేక్షించు నుత్తముండు సర్వాత్ముండు భగవంతుఁ డీశ్వరుఁడు నగుహరికథల నాకర్ణింపవలయు. అతనినామంబుఁ గీర్తింపవలయు. అతనిమహామహిమంబు స్మరింపవలయు. సాంఖ్యయోగ

విజ్ఞానమునను స్వధర్మానుష్ఠానముననుం బడయఁ గోఁబడుమనుజునిజన్మఫల మరసిచూచినఁ గడపట నంతకాలమునందు నారాయణస్మరణం బనుటయే కాని యొండు గాదు. విధినిషేధశాస్త్రార్థంబులు విడిచి కేవలబ్రహ్మనిష్ఠఁ గొన్న మునులును బ్రాయికముగా హరిగుణసంకీర్తనంబునందే యాసక్తి చేయుదురు. భగవన్నామకీర్తనప్రధానంబై సర్వవేదతుల్యంబై నయీభాగవతపురాణంబుఁ దొల్లి నేను ద్వాపరాదిని మాతండ్రి యగుకృష్ణద్వైపాయన మునీంద్రునితోడఁ జదివితి. నైర్గుణ్యనిష్ఠుఁడ నయ్యు నేను హరిలీలలు చిత్తము నాకర్షించుటయు దీనింజదువఁబూనితి. నీ వమ్మహాపురుషునకుఁ బరమభక్తుండవు గావున నేఁ జదివినయమ్మహాభాగవతంబురహస్యంబు నీకుఁ దేటపఱిచెద. అందు శ్రద్ధగలవారికి ఫలాభిసంధిరహితంబై నహరిభక్తి యతిశీఘ్రముగ నొదవు. హరినామకీర్తనం బనునది యొకండే సకాములకుఁ గామితార్థప్రదంబై విషయవిరక్తులైన ముముక్షువులకు మోక్షసాధనంబై యోగులకు నిర్భయఫలదంబై యొసంగు. పెద్దకాలంబు పరలోకచింత సేయక కాలమెల్ల వృథవుచ్చితి, నిఁక మృత్యు వాసన్న మయ్యె, నేమి చేయఁగలవాఁడ నని చింతింపఁ బనిలేదు. ప్రమత్తుఁ డగువాని కెన్నియేండ్లైన నప్రయోజకంబుగా నతిక్రమించు. దానం బని యేమి? అక్కటా! కాలమెల్ల వ్యర్థమయ్యెడు ననుచింతతో నొక్కముహూర్తమాత్రమేనియుఁ దెలిసికొన్న నయ్యది శ్రేయంబొడఁగూర్పు. తొల్లి ఖట్వాంగుఁ డనురాజర్షి సురాసురసమరంబు సురలకుఁ దోడ్పడి యసురుల గెలిచి ప్రియంపడినసురలవలనఁ దనయాయుశ్శేషం బప్పటి కొక్కముహూర్తమాత్రంబ యనియెఱింగి యంతలో నఖిలసంగములం ద్రెంచి సంసారభయనివారకుం డైనహరి శరణుసొచ్చి ముక్తింగొనియె. నీకుఁజూచిన నిఁక నేఁడుదినంబు లాయుర పరిమాణంబు గలదు. ఇంతలో నెంతయైనం జేసికొన వల నయ్యెడు. కావునఁ బరలోకసాధనంబు సమకూర్చికొనుము. తత్ప్రకారంబు వివరించెద. వినుము.

### శుకుఁడు పరీక్షిత్తునకు స్థూలధారణాక్రమంబు చెప్పుట

అంతకాల మాసన్న మయినం బురుషుండు సంసారభయశూన్యుండై యసంగ మనుశస్త్రముఁగొని దేహమునెడను దాని ననుసరించి

యున్న దారపుత్త్రాదులయెడనుం గలసుఖేచ్ఛం దొలుదొలుతఁ ద్రెంప
వలయు. అట బంధకారణం బైనయిల్లు వెడలి ధీరుండై యోగియై పుణ్య
తీర్థస్నానాదినియమములం గ్రహించి యేకాంతప్రదేశంబున విధికల్పి
తంబు శుచియు నగునాసనమునం గూర్చుండి మనస్సునం బ్రహ్మాక్షరం
బైనశుద్ధప్రణవంబు నావర్తింపవలయు. అట్లు లావర్తించుచు వాయు
వుల నిరోధించి మనస్సు నిగ్రహింపవలయు. నిగృహీతమానసుండై నిశ్చ
యాత్మక మగుబుద్ధిసహాయమున నింద్రియములవిషయములం దవులనీక
గుదియింపవలయు. అట్లింద్రియములం గెలిచి క్రమ్మఱఁ గర్మవాసన
లకుఁ జిక్కనీక మనస్సును బుద్ధిచే శుభార్థ మగుభగవద్రూపమందు
ధారణాయోగమున నిలుపవలయు. అట్లు ధారణఁ గావించు నెడ స్థిరీ
కృతచిత్తమునం గ్రమమున హస్తపాదాద్యవయవవిభావనతోడ దృఢ
ధ్యానం బొనర్పవలయు. అవ్విధమున మనస్సును విషయములం బోవనీక
గుదియించి భగవద్రూపధ్యానంబునందే నిశ్చలంబు గావించి యట
నొండొక్కదానిం దలంపరాదు. ఎందు మనస్సు శాంతిఁగొని ప్రసన్నం
బగు నయ్యదియే విష్ణుదేవునిపరమపదంబు. గుణవశమునం గ్రమ్మఱ
నెప్పుడేని చిత్తక్షోభంబు గలుగునేనియు రజోగుణమున విక్షేపంబుఁ
గాంచి తమోగుణమున మోహముఁ జెందినయమ్మనస్సును మనోమల
నివర్తంబైనధారణాయోగమున నిరోధింపవలయు. ధారణాయోగముఁ
బూని ధారణాశ్రయుం డైనహరి నపరోక్షముగఁ గనుయోగికి భక్తి
యోగ మతిశీఘ్రముగ నలవడు నని చెప్పుచున్నంతఁ బరీక్షిన్నరవరుం
డో బ్రహ్మర్షివర్యా, పురుషార్థసాధనం బైనభక్తికి సాధనం బని సమ్మతం
బైనధారణాయోగ మేవిధానమున నెందుఁ జేయవలయు నియ్యది
యెట్టిదియైనం బురుషునిమనోమలనంబు హరించు నని యడుగుటయు నా
నరేంద్రునకు శుకయోగీంద్రుఁ డిట్లనియె.

### శుకుఁడు పరీక్షిత్తునకు విరాట్పురుషునవయవకల్పన చెప్పుట

ఆసనజయశాలియై వాయువులం గుదియించి సంగముఁ ద్యజించి
జితేంద్రియుండై తొలుత స్థూల మగుభగవంతుని విరాడ్రూపమునందు
మనస్సును బుద్ధిచే నిలుపవలయు. అతీతాగామివర్తమానాత్మకం బైన
త్రివిధప్రపంచ మెందుఁ గానంబడు నట్టిస్థూలతముఁ డగునాపరమాత్ముని

విరాడ్రూపంబే ధారణకుఁ దొలుత విషయం బయ్యెడు. పృథివ్యప్తేజో వాయ్వాకాశమహదహంకారంబు లనుసప్తావరణముల నావృతం బైన యీయండకోశశరీరమున నంతర్యామియై విలసిల్లువై రాజనామధేయుఁ డైనపురుషుఁడే ధారణ కాశ్రయం బగు. అతనికిఁ బాతాళలోకంబు పాదమూలంబుగను రసాతలంబు గుదిగాలుగను ముంగాలునుంగను మహాతలంబు చీలమండలుగను దలాతలంబు పిక్కలుగను సుతలంబు మోఁకాళ్లుగను వితలంబు నతలంబును దొడలుగను భూతలంబు మొలగను నాకాశంబు నాభిసరస్సుగను నక్షత్రమండలంబు వక్షస్థ్సలంబుగను మహర్లోకంబు కంఠముగను జనోలోకము వదనముగను దపో లోకంబు లలాటముగను సత్యలోకంబు సహస్రశిరస్సులుగను నింద్రాది నిర్జరులు బాహువులుగను దిగ్దేవతలు కర్ణస్థానంబుగను శబ్దము శ్రోత్రేంద్రియంబుగను నశ్వినులు నాసికంబులుగను గంధము ఘ్రాణేంద్రియంబుగను నగ్ని దేవుఁడుముఖముగనునంతరిక్షంబు నేత్రస్థానంబుగనుసూర్యుఁడు నేత్రముగను నహోరాత్రములు గను తెప్పలుగను బ్రహ్మపదవృత్తి యొల్ల నావులింతకు సమకాలంబుగను జలము తాల్వధిష్ఠానంబుగను రసము జిహ్వేంద్రియంబుగను వేదము లెల్ల బ్రహ్మరంధ్రంబుగను యముఁడు గోఱలుగను బుత్త్రాదిస్నేహకళలు దంతములుగను జనులకుఁ జిత్తవిభ్రమం బొదవించుమాయ నగవుగను నపార మగుసృష్టి కటాక్షవీక్షణంబుగను లజ్జ మీఁదిపెదవిగను లోభ మధరోష్ఠంబుగను ధర్మము స్తనముగను నధర్మమార్గము పృష్ఠముగను బ్రజాపతి పుమింద్రియముగను మిత్త్రావరుణులు వృషణములుగను సముద్రములు కుక్షిగను బర్వతము లెమ్ములుగను నదులు నాడులుగను వృక్షములు రోమములుగను వాయువు నిశ్వాసంబుగను గాలము గమనంబుగను బ్రాణికోట్లసంసారంబు క్రియగను మేఘజాలంబు కేశపాశంబుగను సంధ్య వస్త్రముగను బ్రధానము హృదయస్థానముగను ధూమాదిమార్గ గమ్యుఁ డవుటం జేసి సర్వవికారములకుఁ గోశమురీతి నాశ్రయభూతుం డైనచంద్రుఁడు మనస్సుగను మహత్తత్త్వము విజ్ఞానశక్తిగను శ్రీరుద్రుఁ డహంకారముగ నశ్వాశ్వతర్యుష్ట్రగజములు నఖములుగను సర్వమృగపశుగణంబులు శ్రోణిస్థానంబుగను బక్షులు శిల్పినైపుణ్యంబుగను స్వాయంభువుం డైనమనువు

బుద్ధిగను బురుషుఁ డాశ్రయంబుగను గంధర్వవిద్యాధరచారణాప్సరోగ ణంబులు సర్వముగను బ్రహ్మోదుండు స్మృతిగను బ్రాహ్మణుండు ముఖ ముగను క్షత్త్రియుండు భుజములుగను వైశ్యుఁ డూరువులుగను శూద్రుఁడు పాదములుగను నానావిధవసురుద్రాది దేవగణసముపపన్నంబు హవిస్స్వార్థ్యంబు నగుయజ్ఞప్రయోగంబు క్రియాకలాపంబుగను నమరి యుండు. ఇయ్యదియే యీశ్వరునిస్థూలరూపమునకుం గలయవయవ సన్నివేశప్రకారంబు. దీని నీకుఁ దెల్పితి. నిజబుద్ధిమహిమమున మనస్సీ విరాడ్రూపమునందు దృఢముగ నిలుపఁబడునేని ముముక్షువునకుఁ గర్తవ్యంబు వేఱు గన్పట్టదు. అద్వితీయుం డైయప్పరమాత్ముఁడు సర్వులబుద్ధివృత్తులమూలమునం దా నొక్కరుఁడయ్యుఁ గలలో బహు జీవులఁ గల్పించి తదింద్రియముల నెల్లయుం జూచుచాడ్పున సర్వంబు ననుభవించు. పరమానందనిధి యగునట్టిసత్యాత్ముని భజింపవలయుఁ గాని యితరంబు నెడ సంగము సేయరాదు. ఇతరసంగమున సంసార బంధంబు గలుగు.

## శుకుఁడు పరీక్షిత్తునకు ధారణాయోగంబు చెప్పుట

ధారణాయోగమహిమంబు చెప్పఁ గొలఁదిగాదు. తొల్లి బ్రహ్మ దేవుఁ డిట్లు ధారణఁ గావించి దానం బ్రీతుఁడై హరివలనం బూర్వ ప్రళయసమయమున నశించినసృష్టిస్మరణంబుఁ గ్రమ్మఱఁ బడసి సఫల జ్ఞానుండై నిశ్చయాత్మకబుద్ధియై ప్రళయమునకుఁ బూర్వముండినరీతిం గ్రమ్మఱ నీవిశ్వంబు సృజియించె. అర్థశూన్యము లగుస్వర్గాదినామ ముల వివరించి మనుజులకు వానిపైఁ గోర్కి గలిగించుటయే శబ్ద బ్రహ్మం బైనవేదమునం గలకర్మకాండము మార్గంబు. మాయా మయ మగునమ్మార్గమునందు వాసనలం దవిలి యదియే సుఖ మని యెంచి పరిభ్రమించువాఁడు వాస్తవము లైనయర్థములం గాంచ నేరఁడు. కావునఁ బండితునకు నామమాత్రసారము లైభోగ్యములం దవులక దేహయాత్రకు వలసినంతయే యాభోగ్యవిషయములం గొనఁ దగు. అందును దేహయాత్ర కయ్యవి లేకుండినను వేఱొకవెరవున నుపపత్తి గలుగునేని యాభోగముల కాశ చేయుటలోఁ బరిశ్రమం బొక్కటియే తనకు శేషించు నని నిశ్చయించి వానిఁబొంతఁ బోక త్యజిం

చుట మిక్కిలి రొప్పు. కార్య మన్యథాసిద్ధ మగునేని కేవలశ్రమకారి యగు ప్రయత్నమునఁ బాటుపడమి వివేకలక్షణంబుగదా. పరుండ నేల యుండఁగఁ బాన్పులకై యేల ప్రయాసపడవలయు? తలక్రిందికి భుజము తనంతన సిద్ధించియుండఁగ దిండ్లకై యేల యత్నింపవలయు? అన్నము భుజింపఁ దనదోసిలి యుండఁగ నానావిధము లగునన్నపాత్రల కేల పాటుపడవలయు? దిగంబరంబు లప్రయత్నమున నలవడియుండఁగ దుకూలములకై యేల జతనంబు సేయవలయు? చినిఁగినవస్త్రములతుని యలు తెరువునఁ బడియుండవో? వృక్షములు దఱితోఁ బత్రఫలాది భిక్షం బొసంగవో? నీళులు ద్రావ నేఱు లింకెనో? లాఁతుల నెవ్వరి నైన భరించుగుహ లడ్డగింపఁబడియెనో? ఇం తేల? దిక్కు లేనిబీదలం బ్రోవఁగ హరి దాను లేఁడో? కావునఁ బండితులు ధనదుర్మదాంధుల నేల గొలువవలయు? ఇవ్విధమున విషయములయెడ విరక్తిం గని పరమాత్ముఁడ నిజచిత్తమునఁ దనంతట నిత్యసిద్ధుఁడై యుండెడు ననియు నాత్ముండ యనియుఁ బ్రేమవిషయుండనియు సత్యుఁడనియు భజనీయగుణుండనియు నిత్యుండనియుం దలపోసి నియతుఁడై తదనుభవానందమున సుఖించుచు నాపరమాత్ముని సేవింపఁదగు. అతని భజియించిన నఖిల సంసారానర్థములకుం గారణం బైనయవిద్య దనంతట నశించు. నిజకర్మములంగలుగుపలుదెఱంగు లగునిడుమలం గుడుచుచుఁ దుది వైతరణి లోనం బడుసంసారిజనులం దాను జూచుచుండియుఁ గర్మజడుఁడు దక్కఁ దక్కినవాఁ డెవ్వండేనియు నట్టిహరిధ్యానం బుజ్జగించి నింద్య మగువిషయ చింతపై మనస్సు చేయునే?

### శుకుఁడు పరీక్షిత్తునకు ధారణాలక్షణంబు వివరించుట

కొందఱు నిజదేహములోని హృదయాకాశమునం బ్రాదేశమాత్రప్రదేశమున వసించుపరమపురుషుం జతుర్భుజుని శంఖచక్రగదాధరుం డైనవాని ధారణాయోగమునం జింతింతురు. ప్రసన్నవదనంబు నళినాయతనయనంబులు కదంబకింజల్కమువోలెఁ బచ్చ నగుమేలి పుట్టంబు రత్నఖచితసువర్ణకేయూరంబులు మహామణివిభూషితకనక కిరీటకుండలంబులు మణిమేఖలారత్నాంగుళీయంబులు మణినూపుర కంకణాదులుం దనరఁ దేజరిల్లువాని, నత్యంతభక్తి నారాధించుయోగి

శ్వరుల వికచహృదయకమలకర్ణికాంతరమున నిజపదపల్లవంబుల నెల కొల్పి కొనసంగువాని, శ్రీదేవీపరిష్కృతవక్షస్థ్సలుం డైనవాని, కౌస్తుభ సముల్లసితకంధరుం డైనవాని, వాడనివనమాలఁ దాల్చినవాని, రుచిర కుటిలనీలకుంతలపరీత ఫాలభాగుం డైనవాని, దరహాసభాసురవదనవికా సుం డైనవాని, నుదారస్మేరవీక్షణసముల్లసితభ్రూభంగమాత్రసూచిత మహానుగ్రహుం డైనవాని, ధ్యానమాత్రమున సన్నిధిఁ జేయువానిఁ, బరమేశ్వరు నెందాఁక మనస్సు ధారణాయోగమున సుస్థిరం బగు నందాఁక ధ్యానింపవలయు. ధ్యానంబునందును విశేషంబు గల దెట్లం టేని తొలుదొలుత స్థూలాకారముగ మూర్తిని భావించుచు నటఁ బాదాదిమస్తకాంతంబు సర్వావయవముల వేఱువేఱ చింతింప వలయు. అందొక్కొకయంగముఁ జింతించి యభ్యాసమునఁ దచ్చిం తనము లెస్స యలవడి మనస్సునకు నిశ్చలత్వంబు గలుగునేని యట నయ్యవయవంబు ధ్యానించుట మాని వేఱొక్కయంగముం జింతింప వలయు. పరు లగుబ్రహ్మాదులకుం బరుండు, సర్వలోకనియామకుండు, సర్వసాక్షియు నగునప్పరమపురుషునిపై నెందాఁకభక్తియోగము గుదుర కుండు నందాఁకఁ బ్రతిదినము నిత్యనైమిత్తికకర్మానుష్ఠానానంతరంబున శుచియై యప్పరమాత్ముని స్థూలరూపం బగువిరాడ్రూపంబు ధ్యానింప వలయు. ఆసన్నమరణునకుఁ గర్తవ్యం బియ్యది. అట్టియతి దనమేను చాలింపఁ దలంచునేని పుణ్యదేశకాలములం దనమనస్సు విషయ సక్తంబుగానీక నిగ్రహించి నిశ్చలము సుఖకరము నగునాసనమునం గూర్చుండి ప్రాణాయామమున వాయువుల నిరోధించి మనస్సున నింద్రియముల నిగ్రహింపఁ దగు. అట్లింద్రియముల నిగ్రహింప సాధనం బైనమనస్సును నిశ్చయరూపం బైనవిమలబుద్ధిని నిగ్రహించు నది. అట్లు మనోనిగ్రహసాధనం బైనబుద్ధిని క్షేత్రజ్ఞునందు లయింపఁ జేయునది. ఆక్షేత్రజ్ఞుని శుద్ధతత్త్వంబునందుఁ బ్రవిలాపింపఁ జేయునది. శుద్ధతత్త్వంబునకు బ్రహ్మమునం దేకీభావంబుఁ గల్పించి ధీరుఁడు శాంతిఁ గొని తనకుఁ జేయఁగలయది వేఱు లేమిం జేసి యుపరమించునది. జగదీశ్వరు లైనయనిమిషులకుం బరం బైనకాలంబు నెద్దానియెడం గార్యకరణసమర్థంబు గాకుండు, సత్త్వరజస్తమోగుణంబులు తద్వి

కారంబులు మహత్తత్త్వంబు ప్రకృతియు నేయప్రాకృతస్వరూపంబు నెడ నెయ్యదియుం జేయం జాలకుండు, నట్టిదియే పరమ మగువైష్ణవ పదం బని యెల్లకాలంబు వాసుదేవుపదం బాశ్రయించి, యన్యముల మీఁదం బ్రేమ యుజ్జగించి, దేహాత్మభావనం బరిత్యజించి, యాత్మేతర వస్తువులనెల్ల నిది గా దియ్యది గా దిదియునుంగాదని వేఱువేఱ నిషేధించి, సర్వోత్తమం బైనసత్యస్వరూపంబు నరయుమహాత్ములు పలుకుచుండు. ఇత్తెఱంగున బ్రహ్మాత్మభావనావ్యవస్థితుం డైనముని సకలవిషయములయెడ నుపరతిం గాంచి శాస్త్రజన్యజ్ఞానబలమున విషయవాసనలెల్ల మూలముట్టం ద్రెంచినసమ్యగభ్యస్తయోగుండు గావున నక్రమంబున గుదస్థానంబున నుండుమూలాధారచక్రంబు గుదిగాలం దన్ని బిగియించి, యచట నుండువాయువును లేపి, నాభిస్థానస్థితం బైనమణిపూరకచక్రంబునందుం జేర్చి, యంత, హృదయస్థితం బైనయనాహతచక్రంబునందుం జొనిపి పిమ్మట, నుదానవాయుమార్గమునం గంఠము క్రింద నుండువిశుద్ధచక్రంబునందు నిలిపి, యట, నియతచిత్తుండై బుద్ధిసహాయమున నవ్వాయువును మెల్లమెల్లగ నిజతాలుమూలంబున నియమించి, పదంపడి, నేర్పునం బ్రాణోత్క్రమణమార్గంబు లైననేత్రంబులు రెండు శ్రోత్రంబులు రెండు నాసికంబులు రెండు నో రొక్కండు నను నీయేడింటిపొంతం బోనీక నిరోధించుచు, భ్రూమధ్యదేశవర్తి యగు నాజ్ఞాచక్రంబునందుం బదిలపఱిచి ముహూర్తార్ధమాత్రం బచ్చట సుస్థిరంబు గావించి, యైహికాముష్మికసుఖనిరపేక్షుండై యప్రతిహతవిజ్ఞానుండై పరబ్రహ్మతాదాత్మ్యంబుం గాంచి, బ్రహ్మరంధ్రంబు భేదించి దేహేంద్రియంబుల విసర్జించు. ఇయ్యది సద్యోముక్తిప్రకారంబు.

**శుకుఁడు పరీక్షిత్తున కర్చిరాదిగతి చెప్పుట**

బ్రహ్మలోకము సాధింపం దలంపుగలుగునేనియు సిద్ధులకుం గ్రీడాస్థానంబై యణిమాద్యష్టైశ్వర్యములం జెలంగు స్వర్గాదిలోకములందు విహరింప నింపు గలుగునేనియు దేహత్యాగముం గావించునెడ సూక్ష్మమగులింగదేహము వారికి భోగార్థం బపేక్షితంబు గావున నద్దానిని మనస్సు నింద్రియములనుం ద్యజింపరాదు. పవనమధ్యమున లింగశరీరము ధరించుయోగీశ్వరులకు ముల్లోకములకు లోపలను వెలు

పలనుం గతి యలవడియుండు. విద్యాతపోయోగసమాధిసంపన్నులకు గమ్యం బైనయర్చిరాదిమార్గగమనంబు కేవలకర్మానుష్ఠానపరులకు గమ్యంబు గాదు. అట్టియోగి యాకాశమునం బ్రహ్మలోకమార్గంబు పట్టి జ్యోతిర్మయ మగుసుషుమ్నానాడిసహాయమునఁ దొలుత వైశ్వానరాభిమానిదేవతం జొచ్చి యటఁ బరిత్యక్తసర్వసంగములుండై యన్నిటికి మీఁద నుండునారాయణుని శింశుమారచక్రంబు నధిగమించు. అంత సూర్యాదుల కాశ్రయం బగునాశింశుమారచక్రం బతిక్రమించి తా నొక్కరుండే సూక్ష్మతరంబై శుద్ధం బైనలింగశరీరంబుతో స్వర్గవాసులకు దుర్గమంబై యెల్లవారికి నమస్కార్యంబై బ్రహ్మవిదులకు నెలవై కల్పాంతాయుష్మంతు లగుభృగ్వాదులకుఁ గ్రీడాస్థానం బైన మహర్లోకంబుఁ బ్రాపించు. అటకుఁ జని కల్పాంతమందు లోకమెల్ల ననంతునిముఖాగ్నిం గ్రాఁగుటఁ గాంచి యయ్యదియు దుఃఖలవశంకాసంపృక్తం బని యెంచి దానినివిడిచి యట సిద్ధేశ్వరుల కాటపట్టై ద్విపరార్ధస్థాయి యగుబ్రహ్మలోకంబున కరుగు. ఆలోకమును దాని సాధించు నుపాయంబు నెఱుంగనివా రక్కటా! దురంతదుఃఖములకుఁ బాలుపడుదు రన్నసదయపశ్చాత్తాపం బొక్కండు దక్క నక్కడ నుండువారికి వేఱుశోకముగాని ముదిమిగాని మృత్యువుగాని యార్తిగాని భయముగాని నేమిటం గలుగదు.

## శుకుండు పరీక్షిత్తునకు విష్ణుపద ప్రాప్త్యుపాయము చెప్పుట

అట్లు బ్రహ్మలోకం బధిగమించినవారికి మూఁడుగతులు గలుగు. పుణ్యాతిశయమున నాలోకముసాధించినవారికి వేఱొకకల్పమునఁ బుణ్యతారతమ్యమున నాధికారికపదంబు లభించుట యొక్కటి. హిరణ్యగర్భు నుపాసించి బ్రహ్మలోకంబు వడసినవారి కాబ్రహ్మతోడ ముక్తికలుగుట మఱియొక్కటి. భగవద్భక్తులై బ్రహ్మలోకంబు గడించినవారి కిచ్చ వచ్చినప్పుడు బ్రహ్మాండనిర్భేదపూర్వకంబుగా విష్ణుపదం బారోహించుట యొండొక్కటి. అందు భగవద్భక్తుండు బ్రహ్మాండంబు భేదించి సర్వాతీతం బైనవిష్ణుపదం బాక్రమించువిధంబు వివరించెద వినుము. అట్లు బ్రహ్మలోకం బధిగమించినభాగవతుండు లింగదేహమునఁ బృథివ్యాత్మతం బ్రాపించి నిర్భయుండై యటఁ బృథివీరూపమున జలాత్మతం జెంది పిదప

జలరూపమున జ్యోతిర్మయత్వంబుఁ గాంచి పదంపడి తేజోరూపమున వాయ్వాత్మతం బడసి త్వరపడక క్లేదదాహాదిశంక లేమింజేసి యచ్చటచ్చటిభోగములం గుడుచుచుఁ గ్రమంబునభోగావసానంబున నవ్వాయువును శబ్దప్రమాపకం బైనయాకాశమునందు లీనంబు గావించి యిట్లు పంచభూతముల నుపసంహరించి యింద్రియోపసంహారపరుండై ఘ్రాణమున గంధతన్మాత్రంబును రసనేంద్రియమున రసతన్మాత్రంబును దృష్టిని రూపతన్మాత్రంబును ద్వక్కున స్పర్శతన్మాత్రంబును శ్రోత్రమున శబ్దతన్మాత్రంబును లయించి ప్రాణమున నాకూతిం బడసి యివ్విధమున స్థూలసూక్ష్మభూతముల నతిక్రమించి యనంతరంబు భూతసూక్ష్మములకు నింద్రియములకును లయస్థానంబై సాత్త్వికరాజసతామసాత్మకంబై క్రమమున వైకారికంబు తైజసంబు భూతాది యని మూఁడువిధములం బరఁగునహంకారం బతిక్రమించి, యర్చిరాదిగమనంబున నయ్యహంకారంబుతోడ్పాటున విజ్ఞానతత్త్వంబును లయించి యంత నఖిలగుణములకు లయస్థానం బైనప్రధానంబు సొచ్చు. అవ్విధమునఁ బ్రకృతిగతుండై యానందమయుండై సర్వోపాధులు క్షయించుటంజేసి శాశ్వతానందపదవాచ్యుం బైనపరమాత్మునం దేకీభవించు. ఇట్లు సర్వోత్తమగతిం గాంచినభాగవతోత్తముఁ డెన్నటికిఁ బునరావృత్తిఁ గాంచఁడు. వేదబోధితంబు లైనయీసనాతనమార్గంబులు రెండు నీప్రశ్న కుత్తరంబుగాఁ జెప్పితి. తొల్లి బ్రహ్మదేవుఁడు భక్తిమై నారాధించి యడిగిన నవ్వాసుదేవుండు దా నతనికి వీనినే బోధించె సంసారమునఁ జొచ్చినవానికిఁ దద్విముక్తిం గాంచ భగవంతుఁ డగువాసుదేవునియందు భక్తియోగంబు సమకూఱ నింతకుఁ గడచిన మేలిమార్గం బొండు లేదు. బ్రహ్మదేవుఁడును వాసుదేవునివలనఁ దా నెఱింగియు నిర్వికారచిత్తుండై ముమ్మాఱు వేదము లెల్ల లెస్స సాకల్యముగఁ బరీక్షించియు భగవద్భక్తిలభింప నిది మేలిమెరవని నిర్ణయించె. దృశ్యము లగుజడపదార్థములకు స్వప్రకాశుం డైనద్రష్ట యొక్కండు లేకుండిన దర్శనంబు నెఱవేఱ దనునంతర్యామిలక్షితలక్షణంబులను, బుద్ధ్యాదిసాధనంబులు స్వతంత్రుం డైన కర్తయొక్కండు లేకుండినం గార్యకరణసమర్థంబులు గాఁజాలవు గావున నన్నింటికిం గర్త యీశ్వరుం డొక్కండు గలఁ డను ననుమానవాక్యం

బులను, నీశ్వరుండు స్వతస్సిద్ధనిత్యసత్తాకుండు గావున నందఱకు నంతర్యామిరూపమున ననుభవగోచరుండ కాని యనుభవదూరుండు గాఁడు. కావున ననుభూతభగవంతునిపైఁ బ్రీతి యెట్లు గలుగు నని శంకింపం బని లేదు. జ్ఞానుల కనుభవగోచరుం డైనభగవంతునియెడ భక్తి చేయుట యప్రతిహతంబై యుండు. కావున సర్వప్రకారముల సర్వదేశములందు సర్వకాలములందును మనుజులకు హరికథాశ్రవణంబును హరినామకీర్తనంబును హరిస్మరణంబును గర్తవ్యంబై యుండు. సజ్జనుల కాత్మరూపుఁడై వెలయుభగవంతుని కథామృతంబు వీనుల దోయిలించికొని తనివి దీఱఁ గ్రోలుపుణ్యాత్ములు విషయవాసనామలినం బైనచిత్తమునకు శుద్ధిఁ గాంచి యాహరిచరణసరోజసన్నిధిం గాంతురు.

### శుకుఁడు పరీక్షిత్తునకుఁ గామ్యోపాసనలఁ జెప్పుట

రాజేంద్రా! భవత్ప్రశ్న కుత్తరంబుగా మనుష్యజన్మ మెత్తి యాసన్నమరణులై యున్నవారికిఁ గర్తవ్యం బైనహరికథాశ్రవణాదికంబు నీకుఁ జెప్పితి. ఇయ్యది నిష్కామువిషయంబు. సకాము లగుదురేని వారికిఁ గామానుసారముగఁ గర్తవ్యములం జెప్పెద. వినుము. బ్రహ్మవర్చసంబుఁ గోరువాఁడు వేదపతి యగుబ్రహ్మను యజింపవలయు. ఇంద్రియపాటవంబుఁ గోరువాఁ డింద్రుని, బ్రజలఁ గోరువాఁడు దక్షాదిప్రజాపతుల, నన్నము మొదలగుభక్ష్యభోజ్యాదులఁ గోరువాఁ డదితిని, స్వర్గముఁ గోరువాఁ డాదిత్యులను, రాజత్వంబుఁ గోరువాఁ డగ్నిని, ధనముఁ గోరువాఁడు వసువులను, బ్రభావముఁ గోరువాఁడు భూదేవిని, బ్రతిష్ఠఁ గోరువాఁడు భూమ్యంతరిక్షములను, రూపముఁ గోరువాఁడు గంధర్వులను, స్త్రీని గోరువాఁ డప్సరోరత్న మగునూర్వశిని, సర్వాధిపత్యంబుఁ గోరువాఁడు పరమేష్ఠిని, యశస్సుఁ గోరువాఁడు యజ్ఞపురుషుని, ధనకోశముఁ గోరువాఁడు ప్రచేతసుని, విద్యఁ గోరువాఁడు శంకరుని, దాంపత్యంబుఁ గోరువాఁడు పార్వతిని, ధర్మముఁ గోరువాఁ డుత్తమశ్లోకుఁ డగువిష్ణుని, సంతతిఁ గోరువాఁడు పితృదేవతలను, రక్షఁ గోరువాఁడు యక్షులను బలముఁ గోరువాఁడు మరుద్గణంబులను, రాజ్యముఁ గోరువాఁడు మనురూపదేవులను, శత్రుసంహారంబుఁ గోరువాఁడు నిరృతిని, గామభోగములఁ గోరువాఁడు సోముని, నిష్కాముండు పరమపురుషుని యజింప

వలయు. పెక్కు లేల? అకాముండైన సర్వకాముండైన మోక్షకాముండై నుదారబుద్ధిం జేసి తీవ్ర మగుభక్తియోగమునం బురుషోత్తముం బూజించుట యొప్పు. దాన నతనికి సర్వార్థంబులు సమకూరును. భాగవతసంగతిం జేసి భగవంతునియెడ భక్తినిశ్చలత్వం బొదవు ననుటింతయే యజనపరులకెల్ల నిశ్శ్రేయసలాభంబుగాని యొండుగాదు. సత్త్వాదిగుణత్రయమునం గలుగురాగాదు లగుపదార్థములకు నివృత్తియుం జిత్తప్రసాదంబు నైహికాముష్మికవిషయవిరాగంబును గైవల్యమునం బేర్కొనం దగుభక్తియోగంబు నెందుం గలుగు సట్టిహరికథాశ్రవణంబునెడ సుఖనిర్వృతుండగు నేమానవుండు ప్రీతి సేయకుండు నని చెప్పుచున్నంత శౌనకుండు సూతున కిట్లనియె.

## శౌనకుండు హరిభక్తిం బ్రశంసించుచుం దద్విషయము సూతు నడుగుట

పౌరాణికాగ్రణీ, యవ్విధమున శుకమునీంద్రుండు సెప్పినవిని పరీక్షిన్నరపాలుం డతని నింక నేయేయర్థంబు లడిగె వానినెల్ల మాకు వివరింప నీ వర్హుండవు. సజ్జనులు సేరినచోట హరికథలకుం బ్రస్తావంబు గలుగుపుణ్యకథలు సెల్లుచుండుం గదా. అప్పాండవపౌత్రుండు రాజమాత్రుండుగాండు. అమ్మహారథుండు పరమభాగవతుండు. అతండు చిన్ననాంటనే తనతోడిబాలురతోడ నాడుచుం బెలియాటలెల్ల నుజ్జగించి కృష్ణుని లీలలే బాలక్రీడలుగా నాడుచుండె. వ్యాసనందనుండైనశుకయోగి యన్ననో వాసుదేవుండే దిక్కని నమ్మినమహాభాగవతప్రవరుండు. అట్టివారిరువు రొక్కచోం జేరి సత్కాలక్షేపంబు సేయంబూనినప్పుడు విష్ణుదేవు నుదారగుణములం బ్రకటించుకథ లెన్నియేనియుం బ్రచారమునకు వచ్చియుండుట తప్పదు. హరికథాప్రస్తావమునం గడచునిముసంబు దక్కం దక్కినపురుషాయుషంబునెల్లం బ్రొద్దు వొడుచుచుం గ్రుంకుచు హరించుచుండుం గావున హరికథలపై మనసు పెట్టనివానియాయువెల్ల వ్యర్థముగం గడచు. ఆయుస్సు గలుగునంతకు జీవించుటయే ఫలం బనితలంచు నెడ నచేతనంబులైనమ్రాఁకులును జీవింపవో? వాని కుచ్ఛ్వాసనిశ్వాసంబులు లేవు గావున వానిం గణింప రాదని తలంతురేని తోలుతిత్తు లుచ్ఛ్వాసనిశ్వాసంబు లొనరింపవో? వాని కాహారాదులు లేవని వానినెన్న రా దనియెంతురేని గ్రామ్యము లగుతిర్యగ్జంతువులు నాహార

మైథునంబులు గావింపవో. వానికిని హరికథావిముఖు లగునరులకును నాకుఁ జూడ నంతరంబు గన్పట్టదు. ఒకప్పుడేని గోవిందునామంబు వీనులం గ్రోలనిమనుజాధముండు కర్ణలవిషయాసక్తంబు లగుకుక్కల కును దుఃఖవిషయంబు లగుగ్రామ్యసూకరంబులకును మహాభారంబు వహించునుష్ట్రములకును గాలఁ దన్నినను బ్రియాత్యాగంబు సేయ నేరనికాముకంబు లగుగాడిదలకును బోల్ప నర్హుం డగు. త్రివిక్రముని వీర్యముల నాలింపనినరునికర్ణపుటంబులు వట్టిబిలంబులు. విష్ణుదేవుని గాథలు వచింపనివానిజిహ్వ కప్పనాలుక. ముకుందునకు మ్రొక్కని వానిశిరంబు రాజ్యపట్టాభిషేకశోభనసంభృతంబయ్యెఁ గిరీటపరిష్కృతం బయ్యె మెడకుఁ గేవలంబు బరువు. హరిపరిచర్య సేయనివానిచేతులు కాంచనకంకణవిలసితంబులైనను బీనుఁగుచేతులు. నారాయణుదివ్య మూర్తి నతసిశంఖచక్రాదిలాంఛనంబులనుం గనుంగొననివానికన్నులు చూపు లేనినెమలిపురికన్నులు. హరిక్షేత్రంబులకు నడువనివాని కాళులు చలనశక్తి లేనిమ్రాఁకులు. భాగవతచరణరేణు వొకప్పు డేనియు సేవింపనివాఁడును హరిచరణములపయిం దనరుతులసిపరి మళంబు నాననివాఁడును బ్రదికియుండినను వానిబ్రదిమి నిష్ఫలంబు. కావున నమ్మనుజాధముఁడు నడపీనుఁ గనంబడు. హరినామములఁ గీర్తిం చునెడ నెవ్వనికి మనస్సు ద్రవింపకుండు, నెమ్మొగమున నుల్లాసమ్ము గ్రమ్మకుండుఁ, గన్నుల నానందజలంబు లురులకుండు, మేను గరుపార కుండు, నక్కటా! యట్టియధమునిహృదయంబు అశ్మఁ జేసియుండ వలయు. సూతనందనా, నీ వంతయు మనఃప్రియంబుగఁ బల్కుదువు. కావున భాగవతప్రధానుండు బ్రహ్మవిద్యావిశారదుండు నగునాశుక యోగీంద్రుం డాపరీక్షిన్నరేంద్రున కేమేమిబోధించె దానినెల్ల సవిస్తర మధురంబుగ మాకుఁ దెలియఁ జెప్పవే యనియడుగుటయును నానైమిశా రణ్యవాసుల కాసూతుం డిట్లనియె.

**హరి ప్రకృతిగుణముల నెట్లు గొనునని పరీక్షిత్తు శుకు నడుగుట**

అభిమన్యుసుతుం డైన పరీక్షిజ్జనపాలుండు వ్యాసనూనుం డైన శుకయోగి యుపన్యసించిన యయ్యర్థంబు విని, యాత్మతత్త్వనిశ్చయం బెఱింగి, కృష్ణుండే సేవనీయుం డని మతి నెలకొల్పి దేహమునందును

దారపుత్త్ర బాంధవాదిస్వజనులయందును ధనపశుగృహాదివస్తువులయం దును నిష్కంటకంబై నరాజ్యంబునందును లెస్స పాదుకొనియున్న మమతం బరిత్యజించి, కృష్ణమహిమాకర్ణనంబున శ్రద్ధవాటించి మహామునుండై బ్రాహ్మణశాపమూలమునం దనకుఁ దక్షకునివలన మృత్యువు వాసన్న మగుట దలపోసి, ధర్మార్థకామములకు సాధనంబులైనసకలకర్మముల సన్న్యసించి, భగవంతుఁ డగువాసుదేవునియెడ నాత్మత్వం బాపాదించి, మీరలు న న్నడిగినయర్థంబె యమ్ముని ని ట్లని యడిగె. బ్రహ్మవిద్వ రేణ్యా, సర్వజ్ఞుం డైననీవచనంబు సమీచీనంబు. నీవు హరికథలు కీర్తిం చుటంజేసి నాయజ్ఞానంబు వాయుచుండెను. ఇంకను భగవచ్చరిత్రంబు విన నామనంబునఁ గోర్కులు గ్రొళ్లువాఱెడు. భగవంతుఁ డెట్లు లాత్మ మాయావేశమున నవతరించి లోకేశ్వరులకు నూహింపరానివిధముగా నీవిశ్వమెల్ల సృజించు నెట్లు పాలించుఁ దుది నెట్లు సంహరించు ? బహు శక్తిసంపన్నుఁ డైనయద్దేవదేవుఁడు లోకసర్గాదివిషయమున నేయేశక్తిం బరిగ్రహించు ? తాను లీలార్థంబు దొడరి బ్రహ్మాదుల నాడించుచు నీ జగంబు బుట్టించుచు దానికి వివిధవికారంబు లొదవించుచుండు. ఇవ్విధ మున నత్యాశ్చర్యచర్య లాచరించు హరిచేష్టితంబు పండితులకును నిక్కం బూహింప నరిది. పురుషరూపమునఁ దా నొక్కరుండయ్యుఁ బలు దెఱంగు లగులీలావతారములం గొని నానా కార్యంబు లొనరించునెడఁ బ్రకృతిగుణములనెల్ల నేకకాలమున నాదరించెడినో లేకున్న గ్రమ క్రమంబున గ్రహించెడినో యనునర్థంబున సందియంబు గదిరెడు. ఇందు నిస్సందేహబోధంబు గలుగఁ దత్త్వార్థంబు వివరింపుము. మునీంద్రా, నీవు శబ్దబ్రహ్మం బగువేదమునందు నిష్ణాతుండవు. మఱియుఁ బరబ్రహ్మ తత్త్వంబు లెస్స యెఱింగినవాఁడవు గావున నీవయ వడసి యియ్యర్థంబు నెఱుంగుదు నని యున్నవాఁడ ననివిన్నవించుటయు శుకయోగీంద్రుండు గోవిందగుణకథనమునం బ్రార్థితుండై యన్నారాయణు నంతస్సన్నిధిం గలిగించుకొని యిట్లని చెప్పం దొడంగె.

**శుకుఁ డుత్తరము చెప్పఁ బూని నారాయణునకు మ్రొక్కుట**

అసద్వ్యాఖ్యాతం బైనయీప్రపంచమున కగుజననస్థితిలయములకుఁ గారణం బైనలీలచే బ్రహ్మాదిరూపమున రజస్ప్రభృతిశక్తిత్రయంబుఁగొని

సర్వాంతర్యామియయ్యు నెల్లవారికి నెఱుంగ నలవిగానియాత్మస్వరూపమున దీపించుచు నపరిమితమహిమోజ్జ్వలుండై సర్వోత్తముండై వెలయు పరమపురుషున కేను మ్రొక్కెద. ధర్మప్రవృత్తు లగుసజ్జనులదుఃఖముల నిరసించుచు నధర్మవర్తులకుఁ జేటు గావించుచుఁ గర్మాచరణపరులకుఁ దత్తద్దేవతారూపములం దత్తత్కార్యానుగుణములగు ఫలములనొసంగుచుఁ బ్రత్యఙ్నిష్ఠారూపం బైనపరమహంసాశ్రమంబున నిరూఢు లైన మహాత్ముల కంతర్నిష్ఠచిత్తంబుతో మీఁదుమిక్కిలి కలుమాలు లరయఁ దగినయాత్మతత్త్వంబుఁ బ్రసాదించుభగవంతున కేను గ్రమ్మఱ నెఱఁగెద. భక్తపరిపాలకుండు, భక్తి లేనికుత్సితయోగులకుఁ దనయున్నదిక్కేనియుఁ దెలియనీనివిధంబున దుర్విజ్ఞేయుండు, దనకు సాటియే లేదన్న నెక్కువ లేదని చెప్ప నేల యట్టినిస్సమాభ్యధికం బైననిజైశ్వర్యమున నిజబ్రహ్మరూపంబున నిరంతరరమమాణుండు నగుదేవదేవున కిదె ప్రణామంబు. ఎవ్వనిఁ గీర్తించినఁ దలంచినం గాంచినం బ్రణమిల్లిన నాకర్ణించినఁ బూజించిన లోకమునకుఁ గల్మషంబెల్ల నాశనంబై పటాపంచ లగు నట్టిపరమమంగళకీర్తికి నమస్కారంబు. వివేకవంతు లెవ్వని చరణారవిందములఁ గొలిచి యైహికాముష్మికంబు లగునుభయవిధవిషయములయెడ మనస్సంగంబు విసర్జించి యశ్రమంబున బ్రహ్మగతిం గాంతు రట్టిభద్రయశునకుఁ బ్రణమిల్లెద. తపము దానము యోగము మంత్రము సదాచారమును లెస్స యనుష్ఠించి కీర్తిఁ గాంచియుఁ దమ చేయువాని. నేభగవంతున కర్పింపకున్న నాకార్యము లయ్యనుష్ఠాతలకు ఫలవంతంబులు గాకుండు; మఱి సకలధర్మములకు నీశ్వరసమర్పణంబుననే ఫలసిద్ధి గలుగు నట్టిమంగళయశునకుఁ గేలు మోడ్చెద. పెక్కులేల? పాపజాతిజనితులు పాపరూపులు నగుకిరాతహూణాంధ్రపుళిందపుల్కసాభీరకంకయవనకషాదు లేభగవంతు నాశ్రయించినభాగవతులం గొలిచినమాత్రఁ జిత్తశుద్ధిమంతులై యర్హత్వంబుఁ గాంతు రట్టిప్రభవిష్ణునకు వందనం బొనర్చెద. ఆత్మవంతుల కధీశ్వరుండై యాత్మస్వరూపుండై వేదవేద్యుండై ధర్మమయుండై తపోమయుండై నిష్కపటభక్తు లగుబ్రహ్మరుద్రాదులకు నవితర్క్యుం డైననిజమూర్తి నొప్పారుపరమపూరుషుఁడు నాయెడం బ్రసన్నుఁ డయ్యెడు. శ్రీపతి

యజ్ఞపతి ప్రజాపతి ధీపతి లోకపతి భూపతి యంధకవృష్ణియాదవులకుం బతియు నాపద్రక్షకుండును సాధుజనులకు గతియు నగుభగవంతుండు నాకుం బ్రసన్నుండగుంగాత. ఎవ్వనిచరణముల ధ్యానించుటయే సమాధిగాంగొని తత్ప్రభావంబునం జిత్తశుద్ధిం గాంచి తమతమయభిరుచికిం బోలినరీతి సగుణనిర్గుణభేదములం బండితు లాత్మతత్త్వంబు గ్రహింతురు మఱి వివరింతు రట్టిముకుందుండు నాయెడం గడుం బ్రసాదించెడు. బ్రహ్మదేవునకుం బూర్వప్రపంచసంస్మృతి నాపాదించువాండై సర్గాదికాలమున నెవ్వండు ప్రేరింప సరస్వతీదేవి శిక్షాదు లగునిజలక్షణంబులతోడ, ముఖమున నావిర్భవించె నట్టిపరమర్షి వర్యుండైనపరమపురుషుండు నాకుం బ్రసన్నుండయ్యెడు. ఎవ్వండు మహాభూతముల నీశరీరముల సృజియించి నిజసృష్టంబు లైనవానిలోం దా నంతర్యామియై చొచ్చి పురుషుం డనంబరంగుచు నేకాదశేంద్రియంబులు పంచతన్మాత్రంబు లనుషోడశగుణములకుం దాన చైతన్యం బాపాదించుచు నాపదునాఱింటికిం బ్రకాశంబును బరిపాలనంబు నొదవించు నాభగవంతుండు మదీయవచనముల కలంకారంబుం గూర్చుంగాక. సౌమ్యు లెవ్వనిజ్ఞానమయం బైనముఖారవిందమధురమకరందంబుం గ్రోలుదు రట్టినారాయణాంశసంభవుం డైనవేదవ్యాసునకు నమస్కారము. తొల్లి నారదుండు బ్రహ్మదేవు నడుగ నావేదగర్భుండు దనకు హరి సాక్షాత్కరించి యుపదేశించినయియ్యర్థంబె యమ్మునికిం దేటపఱిచె.

### శుకుండు బ్రహ్మనారదసంవాదంబు చెప్పం బూనుట

రాజేంద్రా, తొల్లి యొక్కనాండు నారదుండు బ్రహ్మదేవుం గొలిచి యిట్లని యడిగె. దేవదేవా, లోకములకెల్ల నాద్యుండు భూతస్రష్టయు నగునీకు మ్రొక్కెద. ఆత్మతత్త్వంబుం దేటపఱుపం జాలిన యుత్తమజ్ఞానంబు నాకు లెస్స బోధింపుము. ఈప్రపంచ మెవ్వనిచేం బ్రకాశించు నెవ్వనియాశ్రయమున నుండు నెవ్వనిచే సృజింపంబడియెం దుది నెవ్వనిలో లయించు నెవ్వని కధీనం బై యుండు మఱియు నియ్యది యదాత్మకం బై యుండుం దద్విధం బున్నదియెల్ల నాకుం దెలియం జెప్పుము. అతీతానాగతవర్తమానంబులకెల్ల నీవు ప్రభుండవు గావున విశిష్టజ్ఞానమహిమంబున నీజగంబెల్ల నీకుం గరతలామలకం బై యుండుంగదా?

అది యట్లుండె నీ కెవ్వండు విజ్ఞానం బుపదేశించె నెవ్వండు నీకాశ్రయుండు నెవ్వనివశమున నీవు వర్తింతువు? మఱియు నీవు యత్స్వరూపుండవు? తొలుత నియ్యర్థంబు వివరింపుము. నీవే యన్యనిరపేక్షుండవై యాత్మమాయామహిమంబునం బంచభూతములచేఁ బ్రాణులనెల్ల నశ్రమంబున నాత్మశక్తిచే సాలెపురుగు తెఱంగునఁ దనలోన సృజియింతు వనియు, నితరపరాభవంబుఁ గానక నీవు తాన నీబలిమి నీజగంబుఁ బరిపాలింతువనియు, నీలోకమునం దుత్తమమధ్యమాధమలక్షణంబులై నామరూపగుణభావ్యంబు లైనస్థూలసూక్ష్మార్థంబు లన్నియు నీవలననే కలుగుఁగాని యొక్కఁడేనియు లాఁతివలనం గలుగదనియు నే నింతకు మదిలో నెంచియుంటి. నీ విప్పుడు సమాహితచిత్తంబుతో ఘోరతపస్సు చేయుటం జూచి నీకు నుపాసనీయుం డైనయీశ్వరుండు వేఱొక్కరుండుగలుగునో యని శంకించుచు నీయట్టిలోకేశ్వరునకుం బారతంత్ర్యంబు గలిగెఁగా యని వగపు గదిరెడు. సర్వజ్ఞా, సర్వేశ్వరా, యిందు వాస్తవం బెఱింగించి నాసంశయంబు వాపి హితము శాసింపవే యనియడిగిన నారదునకు బ్రహ్మదేవుఁ డిట్లనియె.

### బ్రహ్మ నారదునకుఁ దత్త్వంబు చెప్పఁబూనుట

వత్సా, భగవద్వీర్యప్రకాశనం బగుధర్మముఁ జెప్పఁగ నన్నుఁ బురికొల్పుటం జేసి పెద్దమే లయ్యె. దీన నీవు నాయెడ దయ సూపినవాఁడ వనియెన్నుదు. నాకంటె నధికుఁ డగుపరమేశ్వరు నెఱుంగనికతమున నన్నింతవానిఁగా నీవు పేర్కొనుటయు నత్యంతానృతంబుగాదు. సూర్యచంద్రానలనక్షత్ర తారాగ్రహంబు లట్టు లెవ్వని దివ్యతేజమున వెలుంగఁ జాలినదానినే యే నెవ్వనివెలుంగున వెలిఁగింపఁ జాలుదు నట్టి భగవంతుఁ డగువాసుదేవునకుఁ బ్రణామం బొనర్తును. ఎంతటివారి కైనం గెలువరాని యెవ్వనిమాయంజేసి వాస్తవం బెఱుంగక జనులు నన్ను జగద్గురుం డని పేర్కొందు, రెవ్వనిచూడ్కి కగపడ సిగ్గుపడి యతనిం జెనకఁ జాలక తనంతన తొలంగి పనివడుచుండునిమ్మాయకుఁ జిక్కి మోహాము నెనసి బుద్ధిహీను లేను గర్తను భోక్తనీపదార్థంబులు నాయవి యని యహంతామమతల నారోపించికొందు రతనికి మ్రొక్కెద. ఉపాదానకారణరూపము లైనమహాభూతములు జన్మనిమిత్తం బైన

కర్మంబు కర్మక్షోభహేతు వగుకాలంబు తత్పరిణామకారణం బైనస్వభావంబు కర్మఫలభోక్త యగుజీవుండు నను కార్యప్రకారంబెల్ల గారణాత్ముఁ డగునీశ్వరునికంటె వేఱుగాదు. వేదములు నారాయణువలనం బుట్టి నారాయణతత్త్వంబు బోధించు. సురలు నారాయణుసంగములం బ్రభవించినవారు. స్వర్గాదిలోకములు నారాయణానందాంశంబులు. యజ్ఞములు నారాయణతత్త్వజ్ఞానసాధనంబులు. ప్రాణాయామాదియోగంబు నారయణారాధనంబు. యోగసాధ్యం బగుచిత్తైకాగ్రతారూపం బైనతపస్సు నారాయణగోచరంబు. తపస్సాధ్య మగుజ్ఞానము నారాయణవిషయంబు. తత్ఫలం బగుసిద్ధియు నారాయణపరంబు. సర్వసాక్షి సర్వేశ్వరుఁడు నిర్వికారుఁడు సర్వాత్ముఁడు నగునారాయణునికటాక్షంబునఁ బ్రేరితుండనై యతనిసృజ్య మగునీజగమును దత్సృష్టుండ నైననేను సృజించుచున్నవాఁడ. నిర్గుణుండయ్యు నయ్యీశ్వరుండు విశ్వసర్గస్థితిలయార్థంబు తనంతన నిజమాయచేఁ గొన్న సత్త్వరజస్తమోనామకంబు లైనమూఁడుగుణము లాధిభౌతికాధ్యాత్మికాధిదైవికకార్యనిర్వాహార్థంబు ద్రవ్యజ్ఞానక్రియలకుఁ గారణభూతంబులై నిత్యముక్తుండయ్యు మాయాగోచరుం డైనజీవునకు బంధకంబు లయ్యెడు. వశీకృతమాయుఁ డైనయీశ్వరుండు జీవుల నావరింపఁ జాలునీగుణములకతమునఁ దనవర్తనం బితరులకుఁ దెలియరాని విధమున వెలుంగువాఁ డీజగమున నెల్లవారికి నాకుం బ్రభుండు.

## బ్రహ్మ నారదునకు సృష్టిప్రకారము చెప్పఁబూనుట

మాయానియామకుం డైనయతండే తాను వివిధప్రపంచరూపమున వర్తింపఁ దలంపు గొని నిజమాయచేఁ దనయందు యదృచ్ఛాప్రాప్తం బైనకాలమును జీవాదృష్టరూప మగుకర్మమును స్వభావమునుం గ్రహించె. ఈశ్వరుఁ డధిష్ఠించుటం జేసి యందుఁ గాలమువలనఁ ద్రిగుణక్షోభంబు స్వభావమువలనం బరిణామంబు కర్మమువలన మహత్తత్త్వసంభవంబు నయ్యె. అందు మహత్తత్త్వంబు గుణత్రయమయంబై యుండినను వికారదశను రజస్సత్త్వోపబృంహణంబుఁ గాంచి ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబు తమోగుణప్రధానంబు నగునహంకారమునకుఁ బ్రభవకారణం బయ్యె. అయ్యహంకారంబు వికృతిం బొందుచు సత్త్వ

గుణప్రధానంబై జ్ఞానశక్తిం దనరి వైకారికంబనియు రజోగుణప్రధానం
బై క్రియాశక్తిం బడసి తైజసంబనియుం దమోగుణప్రధానంబై ద్రవ్య
శక్తి నమరి తామసంబనియు భూతాదియనియు మూఁడువిధముల నెప్పె.
అందుఁ దామసాహంకారమువలన ద్రష్టృదృశ్యముల రెంటిని బోధింపఁ
జాలుశబ్దము గుణముగాఁ దనర నాకాశంబు పుట్టె. అయ్యాకాశంబు
వలన స్పర్శగుణంబుతోడ వాయువు జనించి తనకుఁ గారణం బైన
నభంబుగుణమునుం గ్రహించుటంజేసి శబ్దస్పర్శగుణవంతమనం బరఁగి
దేహధారణమునకు శారీరమానసబలంబులకు నింద్రియపాటవంబు
నకుఁ గారణంబై తనర్చె. అవ్వాయువువలనం గాలకర్మస్వభావసహ
కారమునం జేసి రూపగుణముతోఁ దేజస్సు జనించి మీఁదివాని
తోడ నన్వయించి శబ్దస్పర్శరూపగుణవంత మనం జెల్లె. ఆతేజమువలన
రసగుణముతోడ జలము జనించి యుత్తరాన్వయనిమిత్తమునంజేసి శబ్ద
స్పర్శరూపరసగుణవంత మనం బరఁగె. ఆజలమువలన గంధగుణము
తోడఁ బృథివి పుట్టి యుత్తరసమన్వయమునంజేసి శబ్దస్పర్శరూపరస
గంధము లనుగుణము లైదు తనకుఁ గలుగ వర్తిల్లె. వైకారికాఖ్యం
బైన సాత్త్వికాహంకారమువలన మనోధిష్ఠాత యగుచంద్రుఁడును ద్వక్చ
క్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబు లను జ్ఞానేంద్రియపంచకంబున కధిష్ఠాత లగు
దిగ్వాతార్కప్రచేతోశ్వి దేవులును వాక్పాణిపాదపాయూపస్థంబు లను
కర్మేంద్రియపంచకంబున కధిష్ఠాత లగువహ్నీంద్రోపేంద్రమిత్రప్రజాపతులు
ననుపదుండ్రునుం గలిగిరి. తైజసనామధేయం బైన రాజసాహంకారంబు
వలన జ్ఞానేంద్రియంబు లగుచక్షురాదు లైదును గర్మేంద్రియంబు లగు
వాగాదు లైదు నన దశేంద్రియంబులును బుద్ధియుఁ బ్రాణంబును
గలిగె. దశేంద్రియంబులును భూతేంద్రియమనోగుణంబులు నొండొంటం
గలియక ప్రత్యేకంబు బ్రహ్మాండంబు నిర్మింపఁజాలకుండుటయు నట భగవ
చ్ఛక్తిచోదితంబులై వర్షాయుతసహస్రాంతమున నొండొంటం గూడి
ప్రధానగుణభావము గ్రహించి యుదకవర్తి యగుసమష్టివ్యష్ట్యాత్మకం
బైనబ్రహ్మాండశరీరంబు సృజియించె. కాలకర్మస్వభావముల నధిష్ఠించి చైత
న్యంబుఁ గల్పించుపరమాత్ముఁ డప్పు డచేతనములకుఁ జైతన్య మొసంగి
యయ్యండము భేదించి తాను వెలువడియె. అట్టు లయ్యండంబు వెలు

వడినపురుషుండు సహస్రశీర్షుండు సహస్రాననుండు సహస్రాక్షుండు సహ స్రబాహుండు సహస్రోరుండు సహస్రపాదుం డనం బరఁగె. అధోలోకములనేడింటిని కటిపర్యంతముగ నూర్ధ్వలోకసప్తకంబు జఘనంబుమీఁదనుంగా నెల్లలోకము లాపురుషునియవయవసన్నివేశంబు లని పెద్దలు కల్పింతురు. అతనిముఖమున బ్రాహ్మణులు భుజముల క్షత్రియులు దొడల వైశ్యులు పాదముల శూద్రులుం బుట్టిరి. లోకములు పురుషావయవసన్నివేశముగఁ గల్పించునెడ మతభేదంబు గల దెట్లంటేని భూర్లోకంబు పాదములు భువర్లోకంబు నాభి స్వర్లోకంబు హృదయంబు మహర్లోకం బురస్సు జనోలోకంబు కంఠంబు తపోలోక మోష్ఠద్వయంబు సనాతనంబై బ్రహ్మలోక మనం బరఁగినసత్యలోకము మూర్ధం బని యొక్కకల్పన గలుగు నియ్యది సప్తలోకకల్పనాపక్షంబు. ఆపురుషుని కటిప్రదేశమున నతలంబు తొడల వితలంబు జానువుల సుతలంబు జంఘలఁ దలాతలంబు గుల్ఫముల మహాతలంబు పాదాగ్రముల రసాతలంబు పాదతలమునఁ బాతాళంబు నన నధరావయవములందుఁ గ్రిందిలోకంబు లేడును మున్ను వివరించినవిధంబున నూర్ధ్వావయవసన్నివేశంబున నూర్ధ్వలోకంబు లేడునుం గూడి పదునాలుగులోకము లాపురుషునకవయవసన్నివేశమున నుండెడు నని మఱియొక్కకల్పన చెల్లు నియ్యది చతుర్దశలోకపక్షంబు. భూర్లోకంబు పాదములను భువర్లోకంబు నాభిస్థానంబునను స్వర్లోకంబు శిరంబున ననియు నొండొక్కకల్పన ప్రవర్తిల్లు నిది త్రిలోకపక్షంబు.

### విరాట్పురుషునవయవముల నింద్రియాద్యుత్పత్తిప్రకారము

అస్మదాదివాగింద్రియములకును వాగధిష్ఠాత యగువహ్నికి నాపురుషునిముఖము జన్మస్థానంబు. అట్లే గాయత్రీప్రభృతిఛందస్సుల కతని సప్తధాతువులును, దేవతల కన్నం బైనహవ్యమునకుఁ బితరుల కన్నం బైనకవ్యమునకుఁ దచ్ఛేష మగునమృతమునకు మనుష్యులయన్నమునకును మధురాదిషడ్విధరసంబులకును రసనేంద్రియంబునకును దదధిష్ఠాత యగువరుణునకు నతనిజిహ్వయు, నస్మదాదిప్రాణంబులకు వాయువునకు మోదప్రమోదము లనుసామాన్యవిశేషగంధముల కోషధుల కశ్వినులకు నతనినాసికంబులను, రూపములకును రూపప్రకాశకము లగు

సూర్యాదితేజస్సులకుఁ జక్షురింద్రియంబులకును సూర్యునకు నతని యక్షిగోళకంబులును, దిక్కులకును శ్రోత్రవ్యాంశలకును గర్ణాధిష్ఠానం బులకును నాకాశశబ్దములకు నతనిశ్రోత్రంబును, వస్తుసారముల కెల్ల సౌభాగ్యభాజనంబై నయతనిగాత్రంబును, స్పర్శమునకు వాయువునకు యజ్ఞమునకు నతనిత్వక్కును, యజ్ఞసంభారసాధనంబులైనయశ్వత్థో దుంబరఖదిరపలాశాదిపాదపంబుల కతనిరోమంబులును, మేఘముల కతనికేశంబులును, మెఱుఁగుల కతనిమీసలును, శిలాలోహముల కతని గోళ్లును, లోకపాలకులైనసురల కతనిబాహువులును, భూర్భువస్స్వ ర్లోకంబులకు లబ్ధపరిపాలనంబునకు శరణాగతరక్షణంబునకు నతనిపాద విన్యాసంబును, సర్వార్థసిద్ధి కతనిచరణంబును, నీళులకు రేతస్సునకు సృష్టికిఁ బర్జన్యునకుఁ బ్రజాపతికి నతనిమేహనంబును, సంతానభోగానంద మున కతనియుపస్థేంద్రియంబును, యమునకు మిత్రునకు మలత్యాగ మునకు నతనిపాయ్వింద్రియంబును, హింస కలక్ష్మికి మృత్యువునకు నరకమునకు నతనిగుదంబును, బరాభవమున కధర్మమునకుఁ దమస్సు నకు నతినిపృష్ఠంబును, నదములకు నదులకు నతనినాడులును, మేరు మంధరాదిపర్వతంబుల కతనియస్థిసంఘాతంబును, బ్రధానమున కన్నాది రసమునకు సముద్రములకు లయమునకు నతనియుదరంబును, మన స్సున కతనిహృదయంబును ధర్మమునకు నాకు నీకు సనకసనందనసన త్సుజాతసనత్కుమారులకు భవునకు విజ్ఞానమునకు శుద్ధసత్త్వమునకు నతనియాత్మయు నుత్పత్తిస్థానంబులై పరఁగు. నేనును నీవును శివుం డును సనకాదిమునులును సురాసురులును నరులును నాగఖగమృగసరీ సృపంబులును గంధర్వులు నప్సరసులును యక్షరాక్షసభూతాదిగణం బులును బశువులును బితృసిద్ధవిద్యాధరచారణులును ద్రుమంబులును గ్రహములును నక్షత్రంబులును విద్యున్మేఘంబులును మఱియుఁ బలు దెఱంగులైనజలస్థలాంతరిక్షముల వసించునానాజీవకోట్లును భూతం బాగామి వర్తమానం బనఁ దగునీజగంబెల్ల నాపురుషుండ కాని యొండు గాదు. అప్పురుషుఁ డపరిచ్ఛిన్నుండై ద్వాదశాంగుళమున కధికముగ వ్యాపించి భూమి నావరించి నిజమండలంబులు, మండల

బహిర్భాగమును వెలిఁగించుసాదిత్యునిరీతి బ్రహ్మాండములోపలను వెలుపలను వెలిఁగించుచున్నవాఁడు.

## నానాలోకభోగవివరణప్రకారము

మఱియు నతండు నశ్వరం బైనకర్మఫలము నతిక్రమించుటంజేసి నిత్యమగుపరమానందమునకు నీశ్వరుండై వెలయు. ప్రపంచానభిభూతుం డైనయతనిమహిమం బపారంబు. తదంశభూతము లగునీలోకములందు సర్వభూతంబులు వర్తించు. ముల్లోకములందును గమ్యం బగుసుఖము నశ్వరమేకాని నిత్యంబుగాదు. వీనికి మీఁద నుండుమహర్లోకంబు క్రమముక్తిస్థానమయ్యుఁ గల్పాంతమున నచ్చటివారికిఁ బ్రళయకాలానలదాహసంపర్కము గలుగుటంజేసి పరిత్యాజ్యము గావున నందలిసుఖమును నిత్యంబు గాదు. మఱి యాపరమపురుషుని యమృతాపరపర్యాయం బైనయనశ్వరసుఖ మాలోకముమీఁది జనోలోకంబునందు నతని క్షేమపదవాచ్యం బైనస్థిరసౌఖ్యము దానికి మీఁదితపోలోకంబునందు నతని యభయపదబోధ్యం బైనమోక్ష మాలోకముమీఁది సత్యలోకంబునందును నెలకొని యుండు. నైష్ఠికబ్రహ్మచారి వానప్రస్థపరమహంసాశ్రమంబులు మూఁడును ముల్లోకంబులకు వెలుపలిఫలమునకును బ్రహ్మచర్యవ్రతరహితం బైనగృహస్థాశ్రమంబుఫలము ముల్లోకంబులకు లోపలనుం జెల్లుచుండు. సర్వవ్యాపకుం డైనయప్పురుషుఁ డుభయాశ్రయుండై భోగోపవర్గప్రాప్తిసాధనంబులై కర్మోపాసనాపరపర్యాయంబు లైనవిద్యావిద్యలకుఁ బ్రయోజ్యంబు లైనధూమాద్యర్చిరాదిగతు లనుదక్షిణోత్తరమార్గముల రెంటి నేర్పఱిచె. బ్రహ్మాండమునకుఁ గారణభూతుఁడై యప్పురుషుఁడే యయ్యండమున భూతేంద్రియగుణాత్మకుండై విరాడ్రూపముధరించి తా నావిరాడ్దేహమును దదండము నతిక్రమించి సూర్యునిరీతి వెలయుచుండెడు.

## బ్రహ్మ తా నీశ్వరావయవములనే యజ్ఞముఁ జేయుట చెప్పుట

అమ్మహాపురుషుని నాభిసరోజమునందుఁ బుట్టి యే నమ్మహాత్ముని యజింప నెంచి యతనియవయవములు దక్క మఱియితరము లగుయజ్ఞసంభారములం గానక యతనియవయవములయందే యూపాదుల కుపయోగించువనస్పతులను ఛాగాదిపశువులను యజ్ఞార్హ మగునీభూమిని

యజ్ఞ యోగ్యం బగువసంతాదికాలంబును యజ్ఞకర్మాంగంబు లగుపాత్రసమూహములను వ్రీహ్యాదు లగునోషధులను ఘృతాదిస్నేహపదార్థములను రసములను సువర్ణాదిలోహములను మృత్తికలను జలమును ఋగ్యజుస్సామంబులను బ్రహ్మ హోత యధ్వర్యుం డాగ్నీధ్రుం డనునలుగురు ఋత్విజులకు నిర్వర్త్యం బైనదర్శపూర్ణమాసాదికంబును జ్యోతిష్టోమాదినామధేయంబులను స్వాహాకారాదిమంత్రములను దక్షిణలను వ్రతములను దేవతోద్దేశంబును గర్మపద్ధతిగ్రంథములను సంకల్పము ననుష్ఠానప్రకారంబును గతులను దేవతాధ్యానంబులను బ్రాయశ్చిత్తంబులను భగవత్సమర్పణంబులను మఱియు యజ్ఞమునకు వలయుసమస్తసంభారములను బురుషావయవములనే యొనఁగూర్చి యజ్ఞాత్మకుం డైనయతని సాధనంబులనే యజ్ఞేశ్వరుం డైనయప్పురుషోత్తము నారాధించితి. అంత నాయాచారంబు గాంచి యీనవప్రజాపతులును సమాహితచిత్తులై యింద్రాదిరూపమున వ్యక్తుఁడు స్వరూపమున నవ్యక్తుఁడు నగునయ్యజ్ఞేశ్వరుని యజించిరి. పదంపడి స్వాయంభువుండు మున్నుగా నగు మనువులు మునులు పితరులు సుర లసురులు మనుష్యులును నానాముఖముల నయ్యీశ్వరు నారాధించిరి. తాను నిర్గుణుఁడయ్యు సర్గారంభమునందు మాయఁ గొని బహుగుణంబులం గ్రహించినభగవంతుఁ డగు నారాయణునిలోన విశ్వమెల్ల సమాహితంబై యుండెడు. అతనియానతిం జేసియే యీ ప్రపంచము సృజించుచున్నవాఁడ హరుండు దీనికిఁ దఱితో లయముఁ గావించెడు. అతండు తానే విష్ణురూపమునం ద్రిశక్తి యగు మాయను గొని యీజగముఁ బాలించుచుండెడు. అయ్యా నీ వడిగిన వానికెల్ల నుత్తరంబు సెప్పితి. కార్యకారణాత్మకం బైనసృజ్యపదార్థవర్గ మంతయు నాభగవంతునికంటెఁ బరంబు గన్పట్టదు. పరమభక్తిసముద్రేకమున నేను మానసమునందు హరిధారణఁ గావించితిఁ గావున మదీయవచనం బెన్నఁటను మృషగాదు. మదీయమనస్సు నొకప్పు డేనియు నసత్యంబుపొంతఁ బోవదు. మదీయేంద్రియంబులు నసన్మార్గమునం బ్రవర్తింపవు. అట్టియేను సర్వవేదమయుఁ డఖిలతపోమయుఁడు సర్వప్రజాపతులకుం బూజనీయుం డైనపతియు ననఁ జేసు వడసినవాఁడనయ్యు నత్యంతనిపుణముగ యోగము సాధించి చిత్తసమాధానంబుఁ గాంచియు

నాపుట్టువునకుఁ గారణం బైనయాపరమపురుషుని లెస్స యెఱుఁగ నేర నైతి. మఱి కర్తవ్యేతరచింత దక్కి శరణాగతులకు సంసారతాపనివారకంబు మంగళాత్మకంబు మంగళప్రదంబు నగుతదీయ చరణంబునకుఁ బ్రణమిల్లుదు. ఆకాశము దనయంతమును దాన కానని కైవడి నిజమాయావిభవ మాతనికిని దుర్బోధ మన్న నితరులకుఁ జెప్పనేల? నాకును మీకును వామదేవునకును నతనిపరమార్థస్వరూపంబు గాంచ నశక్యం బన్న నింక నితరనిర్జరులకుఁ జెప్పవలయునే? అందఱును దదీయమాయామోహితబుద్ధులై తమతమమతి ప్రసరించినంతకు నీజగము నాతండు పుట్టించె నతండు జగత్కారణం బని యింత చెప్పుదురు. అతనివాస్తవతత్త్వంబు లెస్స గాన లేకున్న నతనిలీలావతారకృత్యముల నస్మదాదులము కీర్తింతుము. శ్రీభగవంతునకుఁ బ్రణామంబు. అయ్యాదిమపురుషుఁడు ప్రతికల్పంబునందును గర్తృకర్మకరణాధికరణాదు లితరము లెం లేకున్నను దాన తన్నుఁ దనచేఁ దనలో సృజించుచుఁ బాలించుచు నుపసంహరించుచుండెడు. తదీయతత్త్వంబు మనోవాగగోచరంబు. అయ్యది విషయాకారశూన్యం బైనశుద్ధంబు సర్వాంతరంబు సందేహావిరహితంబు స్థిరంబు నిర్గుణంబు జన్మక్షయపరిణామాదిషడ్భావవికారరహితంబు నిత్యపూర్ణంబు సర్వదాద్వైతరహితంబు సత్యంబు నగుజ్ఞానస్వరూపం బై వెలయు. నారదా, ప్రసన్నదేహేంద్రియమానసులై మననశీలు రగు మునులు తదీయతత్త్వంబు నెఱుంగుదురు. ప్రామాణ్యబుద్ధి యుడుగు నసాధుజనులకుతర్కమున కయ్యది గోచరంబు గాదు. తదీయవిప్లవంబుల నాతత్త్వము స్వతోభాసమానం బయ్యు నట్టికుతార్కికులకుఁ దిరోహితం బగు. తదీయతత్త్వం బిట్టిది.

## హరిలీలావతారప్రస్తావప్రకారము

అమ్మహాపురుషుని వివిధావతారములఁ జెప్పెద వినుము. కాలము స్వభావము కార్యకారణాతిరిక్తం బైనప్రకృతి యనుశక్తులును మనసి ప్రభృతికార్యంబులును తత్ప్రభృతిగుణావతారంబులును దక్షాదివిభూతులును మహత్తత్త్వంబును మహాభూతంబులు నహంకారంబును సత్త్వాదిగుణంబులు నింద్రియంబులును సమష్టిశరీరంబులును వైరాజుండును స్థావరజంగమాత్మకం బగువ్యష్టిశరీరంబునుం గలిసి సహస్రశీర్షాననపాదాది

లక్షణంబుల నొప్పున ప్రకృతిప్రవర్తకపురుషావతారంబు పరమపురుషుని ప్రథమావతారంబు. ఏనును భవుఁడును విష్ణువును దక్షాదిప్రజాతులును భవత్ప్రభృతులును స్వర్గలోకపాలకులును పక్షిలోకపాలకులును మనుష్యలోకపాలకులును పాతాళాద్యధోలోకపాలకులును గంధర్వవిద్యాధరచారణయక్షరక్షస్సరీసృపనాగోరగపతులును ఋషివర్యులును పితృప్రవరులును దైత్యేంద్రసిద్ధేశ్వరదానవేంద్రులును భూతప్రేతపిశాచకూష్మాండయాదోమృగపశ్వధీశ్వరులును వెండియుఁ బ్రపంచమునం గల పూజార్హంబు కాంతిమంతంబు వేగవంతంబు దేహబలవంతంబు శాంతిమంతంబు శ్రీమంతంబు హ్రీమంతం బకార్యజుగుప్సావంతంబు సంపత్తిమంతంబు బుద్ధిమంతం బద్భుతవర్ణంబు రూపవంతంబు రూపరహితంబు నగుభూతజాతంబెల్ల నాపరమేశ్వరునివిభూతివిశేషంబ కాని యొండు గాదు. అందుఁ బ్రధానముగ నతనియవతారము లనిపేర్కొన్నయతిసుందరావతారముల వివరించెద. వానిం గ్రోలినఁ గర్ణకషాయంబు శోషించు. తత్ప్రకారం బాకర్ణింపుము.

### బ్రహ్మ నారదునకు హరిలీలావతారములు వివరించుట

నారాయణుండు భూతలము నుద్ధరింపఁగ సర్వయజ్ఞస్వరూపమగువరాహరూపము ధరించి భూమి నుద్ధరించి మహార్ణవమధ్యముం జొచ్చినయాదిదైత్యుండు నాసుప్రసిద్ధుం డైనహిరణ్యాక్షుని సురేంద్రుఁడు వజ్రమున గిరింబోలెఁ దనదంష్ట్రచేఁ జీల్చి పరిమార్చె. రుచి యను ప్రజాపతి కతనిభార్య యగునాకూతియందు సుయజ్ఞనామమున నవతరించి దక్షిణాభిధాన యగు నిజజాయయందు సుయామము లనుసురలం బుట్టించె. మఱియు నతండే యింద్రుండై లోకములపీడ నపనయించినకతనఁ జనమాతామహుఁ డగువసువు పిమ్మట హరి యనిపిల్చుటం జేసి తనతొల్లింటిసుయజ్ఞాభిధానంబుతోడ హరి యనుపేరు నతనికిం జెల్లెడు. అయ్యవతారమున దేవతోత్పాదనంబు లోకత్రయపీడాపరిహారంబు నను రెండు కార్యములు నెఱవేఱెడు. కర్దమప్రజాపతికిఁ దద్భార్య యగు దేవహూతియందుఁ దొమ్మండుగురుస్త్రీలతోడఁ బుట్టి కపిలుఁ డనంబరఁగి తత్త్వవిద్యాచార్యుండై తనతల్లి యగు దేవహూతికి బ్రహ్మవిద్య నుపదేశించెడు. దాన నాసాధ్వి మనోమాలిన్యకారణం బైన గుణపంకంబు నిరసించి యాస్త్రీ

జన్మమందే బ్రహ్మగతిం బ్రాపించెను. పుత్త్రార్థి యగు నత్రిమహాముని తపంబునకు మెచ్చి భగవంతుండు తనకుం దానే దత్తుండ నని పలికిన కతంబున దత్తాత్రేయుం డనం బరంగి తనపాదపంకజపరాగముల నాశ్రయించి పావనులైన యాదవహైహయాదుల కైహికం బగు పశుపుత్త్రధనధాన్యాదిసంపత్తి నాముష్మికం బగు నణిమాద్యైశ్వర్యసిద్ధినిం బ్రసాదించెను. తొల్లి యేను లోకసృష్టినిమిత్తంబు గావించిన తపంబునం జేసి హరి తానే సనశబ్దయుక్తము లగు సనకసనందనసనత్సుజాతసనత్కుమారు లను నాలుగు నామధేయముల నొప్పు పరమర్షివరుల రూపములం దాల్చి పూర్వకల్పప్రళయమునం దుత్పన్నసంప్రదాయం బైన బ్రహ్మవిద్య నీకల్పమునం దమ చిత్తముల సాక్షాత్కరించిన దాని మునుల కుపదేశించెను. ధర్మునకు దక్షపుత్త్రి యగు మూర్తి యను సాధ్వియందు నరనారాయణు లను రెండు మూర్తుల హరి యవతరించి పరమతపోనియమం బనుష్ఠించెను. వారితపమునకు విఘ్నం బొనరింప నెంచి మన్మథసేనాతుల్య లగు కొంద ఱప్సరస లేతెంచి కడుంగడు జతనంబు గావించియు నమ్మునులతపోబలమున వెలువడు తమకుం బోలినరూపవతు లగు నూర్వశ్యాదులం గొందఱం గాంచి వారినియమలోపంబుం జేయం జాలరైరి. అత్యంతవిరక్తులై యంతరరిపర్గముం జయించిన యమ్మహామునులయెడ నియ్యది యద్భుతంబు గాదు. రుద్రప్రముఖు లగు మహాత్ములు రోషమునం జేసి కామదహనంబుం గావించి రది యద్భుతం బని పలుకుదురు. కామమునకుం గారణం బైన రోషమును లోకము నెల్లం గాల్చుచు నేరికి నోర్వరానిదాని నమ్మునులు మూలముట్ట నీఱు చేసిరంట. కామనిగ్రహులకును గామకారణరోషనిగ్రహులకుం గల యంతరంబు చెప్పవలయునే? కామబీజం బైన రోషమునే గెల్చిన వారియొద్దకు కామము చేర నేర దని వేఱ చెప్ప నేల? బాలుండయ్యు హార్యవతారం బైన ధ్రువుండు తన సవతితల్లి యగు సురుచి తండ్రియు రాజు నగు నుత్తానపాదుని చెంగట నాడిన దుర్భాష లను వాఁడితూపులకు నొచ్చి విరక్తుండై యడవుల కేగి తపంబు సలిపి యందఱిమీఁద నుండు ధ్రువపదంబు సాధించి క్రింద నుండు సురలు సప్తర్షులు మున్నగువారు తన్నుం బొగడ నెగడె. దుర్మార్గప్రవృత్తుండై బ్రాహ్మణశాపవజ్రప్రహారమునం జేసి పౌరుషము నైశ్వర్యమునుం గోల్పడి నరకమునం బడుచున్న వేను సుద్ధ

రింప మునులప్రార్థన లాలించి హరియతనికిఁ బుత్త్రుండై పృథుఁ డనుపేర నవతరించి సార్వభౌముఁడై భూతకోట్ల కన్నసమృద్ధిఁ గావింపను యజ్ఞక్రియలు నెఱవేఱను గోరూపధారిణి యగుభూతధాత్రి వలన ధనధాన్యౌషధ్యాదు లనుపాలు పితికి భూమికి వసుమతీత్వంబు సార్థంబుఁ గావించి లోకమెల్లఁ బ్రోచెడు ఆగ్నీధ్రపుత్త్రుండై నాభికి మేరుదేవి యనునామాంతరంబు గలసుదేవియందు హరి ఋషభనామమున నవతరించి ముక్తసరుస్తసంగుండై శాంతేంద్రియుండై స్వస్వరూపనిష్ఠుండై సమదర్శనుండై మునులనెల్లఁ బరమహంసమార్గం బిట్టిది యని వేర్కొన జడునిరీతి నిత్యసమాధితో నవధూతచర్య నడపెడు మదీయయజ్ఞమునం దాభగవంతుఁడే స్వర్ణవర్ణుండు వేదమయుండు యజ్ఞమయుండు సర్వదేవతామయుండునై హయగ్రీవుఁ డన నవతరించెడు. నయ్యజ్ఞపురుషుని నిశ్వాసంబున వేదవాక్యంబు లుద్భవిల్లెడు. వైవస్వతమనువుచూడ్కిఁ గాంచి వసుంధరాశ్రయుండై నిఖిలజీవనికాయంబులకు నాశ్రయుండై యుగాంతసమయంబున మత్స్యరూపంబుఁ దాల్చి మదీయముఖంబు దప్పి విస్ఖలితంబు లైనవేదమార్గములనెల్లం గ్రమ్మఱ సంగ్రహించి యర్ణోశార్ణవసలిలమున విహరించెడు. అమృతముఁ గోరి దేవదానవులు మందరగిరిఁ గవ్వముగా నమర్చి క్షీరసాగరంబుఁ ద్రచ్చునెడ నమ్మందరంబున కాధారంబుగా దామోదరుండు దాను గూర్మరూపం బెత్తి యమ్మందరగిరి దనవీఁపున మోచి యగ్గిరి యిటునటుం గదలునెడఁ గలుగుసంఘర్షణంబు దనకుఁ గండూవినోదనోపాయంబై తనర వెలయుచు నమర్త్యుల కమృతలాభం బొడఁగూర్చె. ముల్లోకముల కత్యంతభీకరం బైనహాసంబును మాటిమాటికి ముడివడుభ్రూభంగంబును దంష్ట్రాకరాళవక్త్రంబునుం గలిగి నృసింహరూపంబుఁ దాల్చి హరి గదఁ గొని తనపై నురువడించి యేతెంచువాని హిరణ్యకశిపునిఁ దనతొడపై నిడుకొని గోళ్ల వ్రచ్చి తెగటార్చెడు. ఆనాఁడాకొలనిలో బలవంతమగుమొసలికాలు వట్టి యీడ్చినం దానిఁ దప్పించికొనలేక గజేంద్రము మత్యంతంబు నొచ్చి వేఱొక్కదిక్కు గానక కమలహస్తంబై 'యోయాదిపురుషా, సర్వలోకనాయకా, పావనకీర్తి, శ్రవణమంగళనామధేయా, నామొఱ యాలించి కావవే' యని వేడికొనిన నవ్వేఁడికోలాలించి యప్రమేయుం డైనయ

ప్పురాణపురుషుండు చక్రపాణియై గరుడునిపైఁ వెక్కి తటాలున నక్కరిం
ద్రంబునకుఁ బొడసూపి చక్రమున నమ్మొసలితల దునిమి దయాభరమున
నాశుండాలంబు మేను నిమిరి దానిబాధ వాయ ననుగ్రహించి యా
కొలను వెడలించి ప్రోచెడు. ఆదిత్యులందఱికంటెఁ దాను చిన్నవాఁడయ్యు
గుణములఁ బెద్దయై హరి వామనావతారం బెత్తి బలిని నిగ్రహింప
నెంచి యంతటివాని యాచనారూపమునం దక్క నొండొక్క వెరవునం
గీడ్పఱుచు టుఱవు గాదని దయార్ద్రచిత్తమున నాలోచించి యతని
మూఁడడుగులకొలంది నేల యడిగి యంత నఖిలలోకములఁ బాదద్వయ
మున నాక్రమించి మూఁడవయడుగు తనతలపై నిడియె. శ్రీహరిచరణ
ప్రక్షాళనపావనజలముఁ దలఁ దాల్చి కృతార్థతం గాంచినబలికి దేవేంద్ర
పదవియు నెక్కుడు గాదు. లాఁతు లెందఱు వల దన్నను బలి వినక తన
పలికినపలుకు బొంకు గావింప నొల్లక యవ్వామనుండు దనకు వైరి
యట్లగా నగపడినను మూఁడవయడుగునకుఁ దనతల యిచ్చె. దానం జేసి
బలిచారిత్రంబు స్తోత్రపాత్రం బయ్యెడు. నారదా, శ్రీవిష్ణుదేవుండు
హంసావతారం బెత్తి భవదీయభక్తిభావమునకుఁ గడు మెచ్చి జ్ఞాన
సాధనం బైనభాగవతయోగము నాత్మతత్త్వప్రదీపం బై వాసుదేవశరణు
లగుమహాత్ములకు వేద్యం బైనదాని నీ కుపదేశించె. నారాయణుండు
మనువంశప్రతిష్ఠాపకం బైనమనురూపంబుఁ దాల్చి దశదిశల నప్రతి
హతం బైననిజతేజోరూప మగునాజ్ఞాచక్రమును మన్వంతరంబులందు
భరించి నిజచరిత్రములం గమనీయం బైనకీర్తిని సత్యలోకంబుదాఁక వెల
యించుచు దుష్టాత్ములగు రాజులయెడ దండముం బ్రయోగించి శిష్టరక్షణం
బొనర్చెడు. లోకక్షయార్థంబు విధి పెంపఁ బెరిఁగి బ్రాహ్మణులకుఁ
గీడు రోయుచు నున్మార్గము బోవుచు నరకబాధలం బడుచున్నక్షత్రియ
కులమును లోకకంటకప్రాయం బైనదాని నున్మూలింప వైకుంఠుండు
పరశురామావతారం బెత్తి యత్యుదగ్రోగ్రవీర్యుండై యాదుష్టక్షత్రియ
జాతి నిరువదొక్కమాఱు తనపరశుధారఁ గెఱ చేసెడు. మాయెడ
ననుగ్రహింప సుముఖుండై వశ్యమాయుం డైనపుండరీకాక్షుండు
నిజాంశమున నిక్ష్వాకుకులమున దశరథునకు రాముఁ డన జనించి
తండ్రినియోగమునఁ దమ్ముఁ డగులక్ష్మణుండును బ్రియపత్ని యగు

జానకియుఁ దోడ రానడవుల కేగి దేవకార్యంబు నెఱవేర్చెడు. అమ్మహాత్మునిచరిత్రం బేమని చెప్పుదు. అతనితోడఁ బగ పాటించి దశముఖుం డగురావణుండు చిక్కువడియెడు. ఆరావణుం బరిమార్ప లంకాపురంబునకుఁ గపిసేనతోడం బోవుచుండునా రామునికోపము నరసి యితండు దనకుఁ దెరువియ్యకున్న మున్ను శివుఁడు త్రిపురములం గాల్చినట్లు తన్నుఁ గాల్చునని తలఁకి తనలోని మొసళ్లు మున్నగుయాదోగణంబులెల్ల నదరిపడఁ దపించి వార్ధి తాన తెరువొసంగి యతనికరుణఁగని బ్రదికెడు. ఐరావతంబుతోడఁ బోట్లాడునెడ దానికొమ్ములతాఁకునం గాయలుగాచిన వక్షస్థలంబుతో నత్యంతగర్వంబు నెనసియున్న రావణాసురుని సైన్యమధ్యమున నారి సారించుచు నురువడించువానిఁ దనభార్య యగుసీతాదేవి నపహరించినవానిం దాఁకి రాముఁడు వానిప్రాణముల బలిఁ గొనియెడు. అసురాంశసంభూతు లైనరాజుల సేనల మోవఁజాలక యిడుమ గుడుచు పుడమి భారం బపనయింప నారాయణుండు నిజాంశము లగు శ్వేతనీలకేశములనంగ యదుకులమునందు రామకృష్ణరూపంబు లెత్తి తననడుచుమార్గం బిట్టి దని జనుల కేరికి నెఱుంగరానితీరున నాత్మమహిమంబు వెలయించుచుఁ దనప్రభావమున కనురూపంబు లైనపెక్కుకార్యము లొనర్చెడు.

## శ్రీకృష్ణావతారలీలానిరూపణము

శ్రీకృష్ణునిచరిత్రంబులు పరమాద్భుతంబులు. పసిబాలుఁడయ్యుఁ జన్నుగుడుచునెపమునం బూతనప్రాణములఁ గొనుటయు. మూఁడునెలల యీడునం గాలఁ దన్ని శకటాసురుం దెగఁజూచుటయు, దోఁగాడుతఱి మి న్నొరయుమద్దిమ్రాఁకుల నేలఁ గూల్చుటయుఁ, గాళియువిషమునం జెడిన యమునాజలంబు ద్రావినవ్రేఁపల్లెలోనివసులను గోపాలుర ననుగ్రహదృష్టి వృష్టిచే బ్రదికించుటయు, నాజలమునకు విషదోషంబు వాపి శుద్ధిఁ గావించి తదుదకంబు సర్వభూతములకుఁ ద్రావ యోగ్యంబు గావింప నెంచి యత్యంతవిషవీర్యదుర్దమం బైనకాళియనాగంబును నిగ్రహించి యయ్యమునానదిమడువు వెడల నడుచుటయు, గ్రీష్మకాలమునం గార్చిచ్చు చుట్టు ముట్టి యేర్చుచుండ నానడుమం జిక్కి రాత్రికాలంబున నిద్దురవోవుచుండి యట దానిం దెలిసి యక్కటా? నేఁ డీ

దవానలంబున కెఱయై పసులతోడఁ బ్రాణములఁ గోల్పోవుదు మనినిశ్చయించి భయార్దితం బైన వ్రజజనంబుఁ గన్నులమూసి పసులతోడ నిమేషమాత్రంబున బలరామసహాయుండై యాదవానలంబు దప్పించుటయు, దధిభాండముఁ బగుల నడిచినదాని కలిగి తల్లి యశోద తన్నుఁ గట్టి వేయఁ దలఁచి యేత్రాఁడు దెచ్చినం గుక్షిస్థాఖిలలోకుం డైనతన మొల కదియెల్ల జాలకుండునట్లు గావించి నావులించి తననోరిలోఁ బదునాలుగులోకము లాయశోదకుఁ జూపి యా నందవనితను వెఱఁగుపఱచి యయ్యంబకుఁ బ్రతిబోధంబుఁ దెల్పుటయు, ద్వాదశినాఁడు స్నానార్థంబు యమునమడుఁగున మునిఁగిననందగోపుని వరుణదూతలు వరుణపాశములం గట్టి వరుణలోకమునకుఁ గొంపోవఁగఁ దాను దోడ నందు మునిఁగి యచ్చటి కేగి వరుణునిపూజలం గ్రహించి నందుని విడిపించి తెచ్చుటయు, మయసుతుం డైనమాయావిదానవుండు గోపాలురనెల్ల నెత్తికొనిపోయి యితరులకుఁ జొరరానియొక్కగుహాలో డాఁచినం దాను వారినెల్ల నచ్చోటునుండి తెచ్చిప్రోచుటయుఁ, బగలు పసులవెంటఁ దిరుగుచు రేలు గూర్చుచు సద్గతిసాధనం బైనజ్ఞానవైరాగ్యము లేమియు నెఱుంగనిగోపాలుర వైకుంఠలోకమునకుఁ జన ననుగ్రహించుటయుఁ, దనమాట విని గోపాలు రేఁటేఁటఁ డా మొనర్చునింద్రయాగం బుజ్జగించినం గోపించి యమ్మహేంద్రుండు నవమేఘముల నొక్కపెట్ట నియమించుటయు ఘోరవర్షము గురియు నెడ నావానకుఁ గొంచెమేనియు గోపాలురకును గోగణంబునకు నిడుమ గలుగకుండఁ దా నేడేండ్లబాలుఁడయ్యు నేడునాళ్లు పుట్టగోఁగు నెత్తుమాడ్కి గోవర్ధనభూధరం బెత్తి దానిక్రింద గోగోపగణంబులకు వర్షభయంబున కెడ లేనిసుఖనివాసం బమర్చి నేగి రాకుండఁ గాపాడుటయు, సాంద్రచంద్రికావదాతం బైనరాత్రివేళ నయ్యడవులలో రాసోత్సవమునందుఁ దనమధురగానమునందలి స్వరారోహణావరోహణముఁకు మన్మథోద్దీపనంబుఁ జెంది మైమఱచినగోపాంగనల ముచ్చిలించినశంఖచూడుని గుబేరానుచరుం డైనవానిం బరిమార్చుటయు, బ్రలంబుఁడు గర్దభాకారుం డైనధేనుకాసురుండు దర్దురుండు కేశి యరిష్టుఁడు చాణూరముష్టికాదు లగుమల్లులు కువలయాపీడం బనుమదగజంబు

కంసుఁడుయవనుఁడు నరకాసురుఁడు పౌండ్రకవాసుదేవుఁడు సాల్వుఁడు ద్వివిదుఁ డనువానరుఁడు పల్వలుండు దంతవక్త్రుఁడు సప్తమహోక్షంబులు శంబరుఁడు విదూరథుఁడు రుక్మియున్నగువారిని మఱియు సమరమునఁ బోటుమానుసు లనఁ బేరొందినమేటివిలుకాం డగుకాంభోజమత్స్యకురుసృంజయకేకయాదినానారాజులను దననిమిత్తముననే తెగటార్చుటయు నసిచూచిన నెంతయు నమానుషకృత్యంబులు శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు గావునఁ జేయఁ గలిగె. నితరుల కలవి యగునే? పయిఁ జెప్పినవారిలోఁ గొందఱఁగృష్ణుఁడును మఱికొందఱ రాముఁడును దక్కినవారిం బ్రద్యుమ్నభీమార్జునాదులును జంపుదు రదియకాని యందఱం గృష్ణుఁ డొక్కరుండే సంహరింపఁ డని శంకింపం బనిలేదు. ఆహరి తానే వారికెల్ల లోకమునం గీర్తి గలుగఁ దాన వారిచేఁ జంపించు. అమ్మహానుభావునిసంకల్పసహాయంబు లేకుండునేని తద్వధంబు వారికి సాధ్యంబగునే? కావునఁ దానే ప్రయోజకకర్తయై వారినెల్ల దెగఁజూచి లోకమునకుఁ బీడఁ దొలఁగించెడు.

## బ్రహ్మ నారదునకుఁ దక్కిన యవతారములఁ జెప్పుట

ప్రతియుగమునం గ్రమమున మానవులకు బుద్ధిబలంబు నాయువును దఱుఁగుటఁ జూచి కలికాలద్విజుల కఖిలవేదాధ్యయనం బశక్యంబని యరసి ద్వాపరాంతమందు హరికృష్ణద్వైపాయనుం డన నవతరించి బహుశాఖలు దనర వేదకల్పశాఖిని విభజించి వేదవ్యాసుఁ డనంబరఁగు. నిగమమార్గమునందు నిష్ఠ దవిలి దానవులు సురలకేనియు నూహింపరానివేగమున నొప్పునయోరజతతామ్రమయంబు లయినత్రిపురముల నార్జించి తత్సహాయమున నెల్లెడలం గ్రుమ్మరుచు లోకముల కుపద్రవంబు నేయుచుండ నట్టివారికి యోగ్యతాత్యాగం బయోగ్యతాపరిగ్రహంబునుం గలుగ హరి తానే బుద్ధరూపమున నవతరించి ధర్మమురీతి నగపడునట్లు పాషండధర్మంబు బోధించెడు. సజ్జనులగృహములందు నెప్పటికి హరికథాప్రచారం బుడుగు నెప్పటికి ద్విజులెల్ల పాషండులై యసత్యవాదనిరతు లగుదు రెప్పటికి క్షత్త్రియవంశంబు మూలముట్ట సమసి శూద్రులే రాజు లగుదు రెప్పటికి యజ్ఞాద్యనుష్ఠానలోపమునం జేసి స్వాహాస్వధావషట్కారములు వినంబడకుండు నిట్లంగ్యవి యన్నియుం

గలియుకలియుగాంతంబున నారాయణుండు తానే కల్కిరూపమున నవత రించి ధర్మము శాసించెడు. సృష్టివిషయతపస్సు గాంచిన నేనును నవ ప్రజాపతులును లోకముల సృజించునెడను, నధర్మమును శ్రీరుద్రుం డును మన్యువశము లగుసర్పాదులు నసురులు మున్నగువారును లోక ముల కంతముఁ గావించునెడను నానాశక్తివిలసితుం డైనభగవంతుని మాయావిభూతులే కాని యొండు గాదు.

## విష్ణుతత్త్వమాయామహిమానువర్ణనము

అస్ఖలితం బైననిజపాదవేగమునం ద్రివిక్రమావతారమునఁ ద్రిగుణసామ్యమున కధిష్ఠానం బైనస్థానముకంటె మిక్కిలి కంపయానం బైనసత్యలోకముదాఁక నెవ్వం డాక్రమించె నావిష్ణుదేవునివీర్యముల నెల్ల లెక్కింపఁగ భూపరాగములనెల్ల నేర్పున లెక్కింపఁగలవానికిని శక్యంబు గాదు. అప్పరమపురుషునిమాయాబలంబున కియ్యది తుది యని నాకును భవదగ్రజు లైనసనకసనందనాదిమునులకు నెఱుంగ రాదు. ఇఁక లాఁతులం జెప్పవలయునే? వేయిమొగములతోడ భగ వద్గుణముల నెల్లపుడుం గీర్తించునాదిశేషుఁడు నిప్పటికిని దదీయ గుణములకుఁ దుదిఁ దెలియనేరఁడు. భగవంతునిమాయ యెఱుంగను దాని నతిక్రమింప నొక్కవెరవు గల దెట్లంటేని కపటము లుడిగి సర్వవిధముల హరిచరణముల నాశ్రయించినవారి కతండు దయసేయు. అట్టివారు దుస్తరం బైనయద్దేవదేవుమాయ యిట్టిదని యెఱింగి యెన్నటి కేనియుఁ గుక్కలకు నక్కలకు నాహారం బైనయీమేనిపై నహంతా మమతలు దొలఁగి తన్మాయఁ దాఁట నేర్తురు. అతనిమాయకుఁ దుది గాన లేకున్న నేనును నీవును సనకాదులును భగవంతుఁ డగుభవుఁడును బ్రహ్లా దుండును స్వాయంభువమనువును దత్పత్ని యగుశతరూపయు నతని కూఁతులును బురందరుండును ఋభుఁడును బృథుపితామహుం డైనయం గుఁడును ధ్రువుఁడును నియ్యది మాయ యిట్టి దని యెఱుంగుదుము. మఱియునిక్ష్వాకుఁ డైలుఁడు ముచికుందుఁడు జనకుఁడు గాధి రఘు వంబ రీషుఁడు సగరుఁడు గయుఁడు యయాతి మాంధాత యలర్కుఁడు శత ధన్వుఁడు రంతిదేవుఁడు దేవవ్రతుఁడు బలి యమూర్తరయుఁడు దిలీపుఁడు సౌభరి యుదంకుఁడు భూరిషేణుఁడు విభీషణుఁడు హనుమంతుఁ డు వేం

ప్రదత్తుఁ డర్జునుఁ డార్ష్టిషేణుఁడు విదురుఁడు శ్రుతదేవుఁడు మున్నగు మహాత్ములు గొందఱును దేవమాయ నెఱిఁగి యతిక్రమింపనేర్తురు. పెక్కులేల! భగవద్భక్తులం గొలిచి తదీయశీలము నేర్చినమాత్రం బాపాత్ములగు స్త్రీశూద్రహూణశబరులును దేవమాయాస్వరూపంబు దెలిసి దాఁటఁగలరు. శాస్త్రాభ్యాసంబుతో భగవంతుని నిరంతరంబు ధ్యానించుపుణ్యాత్ములం జెప్పవలయునే! మాయ యెవ్వనియెదుట నిలువనోపక సిగ్గుపడినట్లుపోలెఁ దనంతన తొలంగి చను నట్టివానికి మాయాకార్యంబు లంటవు గావున నవికార్యంబై, కర్తృకర్మకరణాదిబహుకారకసాధ్యంబైనయుత్పత్త్యాది క్రియార్థమునకు విషయంబు గాక యింద్రియంబుల జ్ఞానాంశమున కభివ్యక్తి గలుగుతెఱంగునం గ్రియల నభివ్యక్త మగునానందమాత్రంబై, యధ్యస్తాపవాదమాత్రంబుననే శబ్దవ్యాపారంబు చెల్లుచు స్వరూపబోధనసమర్థంబు గామిం జేసి కేవలజ్ఞానైకరసంబై, విషయకరణసంగశూన్యంబై, నిర్మలంబై, భేదశూన్యంబై, యభయంబై, సదాప్రశాంతంబై, విశోకంబై, నిత్యసుఖాత్మకంబై యొప్పుపరమబ్రహ్మంబే భగవంతునిపరమపదంబు. చంచలస్వభావమున నటునిటుం బాఱుతెంచుమనస్సును లెస్సగ నందు స్థిరంబు గావించి యత్నవంతులు కృతార్థులై భేదనిరాససాధనం బప్పటికి నిరుపయోగంబు గావున దానిం ద్యజింతురు. పర్జన్యరూపమున వాన గురిపించు నింద్రుఁడు బావిత్రవ్వ సాధనం బైనగుద్దలి నపేక్షించునే? బ్రాహ్మణాదులు శమదమాదిగుణంబులతో నాచరించు శుభకర్మముల కెవ్వఁడు ప్రేరకుండు, మహదాదిభావములపరిణామమున నాకృతివిశేషంబు గాంచునీజగంబున కెవ్వండు నిమిత్తంబు, దేహారంభకము లగుధాతువు లెడసినందోడనే దేహములు సెడినను వానితో జనింపక యజుఁడై యెవ్వఁ డాకాశంబువోలెఁ దాను జెడక నిత్యుండై వెలయు నట్టిపరమేశ్వరుండే స్వర్గాదిఫలముల నొసంగు. నారదా, కార్యకారణాత్మకం బైనజగమెల్ల హరికంటె వేఱుగాఁ దనియుఁ గారణభూతుఁ డైన యప్పరమపురుషుఁడు కార్యముకంటె నతిరిక్తుండనియు నీయర్థము సంగ్రహమున నీకు బోధించితి. వత్సా, భగవంతుఁడు నాకుపదేశించినవిభూతిసంగ్రహమును నీకు బోధించితి నిదియె భాగవతంబు. దీని నీవు విస్త

దించి ప్రచారంబు సేయు మని బ్రహ్మదేవుఁడు నారదమునీంద్రునకుఁ జెప్పె నని శుకయోగీంద్రుండు సెప్పిన విని పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనియె.

**హరితత్త్వమును గుఱించియుఁ గాలాదులను గుఱించియుఁ బరీక్షిత్తు శుకుని నడుగుట**

మునీంద్రా! సర్వాత్ముఁడు సర్వాధారుఁడు నగు హరిపై నరులకు భక్తి యెట్లు లెస్స గలుగుఁ దత్ప్రకారంబుఁ జింతించి నిరూపింపుము. మోక్షఫలప్రదుం డైన కృష్ణునియెడ భక్తి నిరపాయంబై తనర్చునేని దేహమునకు సంబంధించిన దారపుత్త్రాదిభోగముల నేమి ప్రయోజనంబు? అంతియ కాదు. సకలపాపముల నడంపఁ జాలినయధోక్షజుపై భక్తి కుదురునేని వర్ణాశ్రమాచారంబులను దానములను దపములను వేదశాస్త్రాధ్యయనములను నుపయోగంబు గానంబడదు. శ్రీహరిలీలలు వర్ణించువానికి ననుమోదించువానికిని శ్రద్ధతో వినువానికి నాత్మమాయామోహంబు గలుగదు. గుణాతీతుం డైన పరమేశ్వరుని గుణవర్ణనంబు సేయ బ్రహ్మదేవుం డట్లు నిర్దేశింప దేవదృష్టి గల నారదుం డెవ్వరెవ్వరి కేమేమి బోధించె నద్దాని నెల్లఁ దెలియఁ గోరెద. తత్త్వవిద్వరేణ్యా, ఏ నఖిలాత్ముఁ డగు హరిపై మనస్సు నిలిపి యితరసంగము లెల్ల విడిచి యీకళేబరంబుఁ బాయుతెఱంగుగా నద్భుతవీర్యుం డైన హరికథల లోకమంగళంబు లైనవాని వివరింపుము. భగవచ్చరిత్రంబు శ్రద్ధమెయి నిత్యము పఠించువానికి వినువానికి నప్పరమేశ్వరుండు ప్రసన్నుఁడై నాతిదీర్ఘకాలమున వారిచిత్తములందు నిలుచు. నిజభక్తులమనఃకమలంబు శ్రవణరంధ్రమార్గమునం జొచ్చి యచ్యుతుండు వర్షోదకపంకమును శరత్కాలం బెట్టు లట్టుల శోధించి నిర్మలంబు గావించు. అట్లు శుద్ధచిత్తుం డైన భాగవతుఁడు ముక్తసర్వపరిక్లేశుఁడై పథికుఁడు తనగృహమునుంబోలెఁ గృష్ణపాదమూలము విడువఁడు. మహాభూతాదిసంసర్గము లేనియభౌతికుం డైనయాత్మునకు ధాతువులచే దేహారంభ మగు ననుట నిర్నిమిత్తంబో కాకున్నఁ గర్మాదినిమిత్తంబో తెలియనయ్యెద. మునీంద్రా, మీర లందఱితత్త్వం బెఱుంగుదురు గావున నాకు నిస్సంశయంబుగఁ దానిం దేటపఱుపవలయు. లోకరచనాలక్షణంబై యండకోశాత్మక మగు పద్మ మెవ్వనియుదరమున నుద్భవిల్లె నప్పరమపురుషుఁడును సామాన్యజనునిరీతి నియతపరిమాణము లగునవయవములు రచనయుం గలి

గినవాని తెలియంగునఁ బేర్కొనంబడియెడు. అం దతనికిని సామాన్యజనులకు నంతరం బెట్టిదియో యని యూహించియుఁ దెలియక మీవలన దాని రహస్యం బెఱుంగనున్నవాఁడ. వ్యష్ట్యుపాధివిశిష్టము లగుభూతములకుఁ దాను సమష్ట్యుపాధియై నియంతయై వర్తించుహిరణ్యగర్భుఁ డెవ్వని యనుగ్రహమున భూతములఁ బుట్టించుచుండు? భగవన్నాభినాళీకసముద్భవుం డైన చతుర్ముఖుఁ డేకారణమున నతనివిరాడ్రూపంబుఁ జూచె? దానిం దెలుపవలయు. సర్వగుణాశ్రయుఁడు లోకసృష్టిస్థితిలయకారణంబు వశ్యమాయుఁడు నగుసప్పురుషుఁ డాత్మమాయ విడిచి యేరూపమున నుండు నయ్యర్థంబు నెఱుంగఁగోరెద. పురుషునియవయవములచే లోకములెల్లఁ గల్పింపఁబడియె. లోకముల నప్పురుషు నవయవములు కల్పింపఁబడియె నని మున్ను మీరు బోధింప వినియుండుటం జేసి యేది యెట్లని సందియం బయ్యెడు. దీనివాస్తవంబు దెలుపవలయు. మహాకల్పమునకుఁ బరిమాణం బెయ్యది? అవాంతరకల్పములకుం బ్రమాణం బెట్లు? అతీతాగామివర్తమానాత్మకం బైనకాలం బేగతి ననుగమింపఁబడు? బ్రహ్మదేవునియాయుఃపరిమాణం బెయ్యది? కలాకాష్ఠానిమేషాదిసూక్ష్మలక్షణంబులను సంవత్సరయుగకల్పాదిబృహల్లక్షణంబులను రెండుదెఱంగులం గాంచినకాలంబు లక్షణం బెట్టిది? కర్మగతు లెన్ని యెట్టివి? దేవాదిరూపములఁ బడయఁ గోరువారు సత్త్వాదిగుణంబుల పుణ్యపాపకర్మసముదాయము నెట్టు లేవిధిం గ్రహింతురు? భూపాతాళదిగాకాశగ్రహనక్షత్ర పర్వతనదీసముద్ర ద్వీపములయు నందు వసించుభూతములయు సంభవం బెట్లు? బాహ్యాభ్యంతరలక్షణం బైనయండకోశము ప్రమాణం బెయ్యది? మహాపురుషుల చరిత్రం బెట్టిది? బ్రాహ్మణాదివర్ణములయు బ్రహ్మచర్యాద్యాశ్రమములయు ధర్మంబు లెట్టివి? అత్యద్భుతంబు లగుహరియవతారలీల లెట్టివి? యుగలక్షణం బెట్టిది? యుగప్రమాణం బెట్టిది? ఏయేయుగమున ధర్మం బెట్లెట్లు ప్రవర్తిల్లు? మనుష్యుల కనుష్ఠేయం బైనసామాన్యధర్మం బెట్టిది? అందు బ్రహ్మక్షత్రవైశ్యాదులవిశేషధర్మం బెట్టిది? నియతధర్మంబు చెల్లనియాపత్సమయంబున వారి కనుష్ఠేయం బైనధర్మం బెట్టిది? తత్త్వంబు లెన్ని? వానిస్వరూపం బెట్టిది? అయ్యవి యెట్లు కార్యములకుఁ గారణములై ప్రవర్తిల్లు? దేవపూజాప్రకారం బెట్టిది?

అష్టాంగయోగవిధానం బెట్టిది? యోగాభ్యాసపరు లెట్టు లణిమాది సిద్ధులం బడసి యర్చిరాదిగతులం గాంతురు? వారికి లింగశరీరం బెట్లు లయించు? ఋగ్వేదాదివేదములయు, నాయుర్వేదాద్యుపవేదములయు ధర్మశాస్త్రములయు నితిహాసపురాణములయు స్వరూపం బెట్టిది? సర్వభూతములయుత్పత్తిస్థితిలయంబు లెట్లు? యజ్ఞాదు లగునిష్టకర్మములయుం దటాకవాప్యాలయనిర్మాణాదికంబు లైనపూర్తకర్మములయుం గామ్యకర్మములయు ధర్మార్థకామంబులయు ననుష్ఠానవిధానం బెట్టిది? మఱియోపాధు లగుజీవులసృష్టి యెట్టిది? పాషండసర్గం బెట్టిది? జీవునకు బంధమోక్షంబు లెట్టివి? అవి యెట్లు గలుగు? ఆతనిస్వరూపస్థితి యెట్టిది? ఆత్మతంత్రుం డైనభగవంతుం డాత్మమాయం గొని యెట్లు క్రీడించు? ప్రళయసమయమున నాతం డామాయం గొని యుండె విసర్జించి యుండె నెట్లు సాక్షిమాత్రుం డై యుదాసీనుం డై యుండు? ఇది యెల్ల నీశరణుసొచ్చి యడుగుచున్న నాకుం దేటపడ నెఱింగింపుము. బ్రహ్మదేవుం డెట్టు లట్టుల మీర లీయర్థ మెల్ల సాకల్యముగ నెఱుంగుదురు గావున భవద్వచనంబు ప్రమాణంబు. తత్త్వ మితరులు గొంద ఱెఱింగియున్నను వారిజ్ఞానము గతానుగతికం బై యుండుం గాని మీయట్లు సాక్షాన్నారాయణునివలన నెఱింగినబ్రహ్మదేవునితోడం జదివి సత్సంప్రదాయమునం బడసినయది గాదు గావున సంప్రదాయాగతం బైనభవదీయజ్ఞాన మన్నిటిలోనం బ్రమాణం బని చెప్పవలయునే? మునివరేణ్యా, భవదీయముఖారవిందమునుండి వెడలుహరికథామృతంబు గ్రోలుటం జేసి యన్నము వర్జించి ప్రాయోపవేశం బొనర్చిన నీనాప్రాణములు మేను విడిచి పోవకుండెడు. భవదనుగ్రహమున నిస్సందేహముగా నఖిలార్థంబు లెఱుంగనుండెద. కరుణించి వివరింపవే యని విష్ణురాతుం డైనపరీక్షిన్నృపాలుం డడుగుటయు బ్రహ్మరాతుం డైనశుకయోగీంద్రుండు కరుణాసాంద్రుం డై తొల్లి బ్రహ్మకల్పమున భగవంతుండు బ్రహ్మదేవునకు బోధించినవేదతుల్యం బైనభాగవతపురాణంబు చెప్పుదు ననియొడంబడి యప్పాండవపౌత్త్రుం డడిగినవాని కెల్ల నుత్తరంబుగా నానుపూర్విమెయిం జెప్పం దొడంగి యిట్లనియె.

## శుకుడు పరీక్షిత్తునకు జీవేశ్వరతత్త్వముఁ జెప్పుట

రాజేంద్రా, దేహాదివ్యతిరిక్తుఁ డనుభవాత్ముఁడు నగునాత్మ కాత్మమాయాసంబంధము లేకుండునేని స్వప్నదేహసంబంధమువోలె వాస్తవముగ దేహాదిసంబంధము ఘటింపదు. బహురూప మగునమ్మాయ దవిలి యాత్మఁ డరూపుఁడయ్యు బహురూపు నట్లుపోలె మాయాగుణము లగు దేహాదులందుఁ దవిలి యనాత్మ యగు దేహమునం దాత్మాభిమానమునాత్మీయములు గానిదారపుత్త్రాదులయం దాత్మీయాభిమానముం జేయు. కాలమాయలకుం బరం బైనయాత్మమహిమమునం దాత్ముఁడు గతసమ్మోహుండై రమించునప్పు డయ్యనాత్మాత్మీయములమీఁదియహంకారమమతలు విసర్జించి యుదాసీనుండై పూర్ణస్వరూపమున నవస్థితుం డగుభగవంతుఁడు నిర్వ్యాజ మగుతపమునకు మెచ్చి యాత్మతత్త్వజ్ఞానార్థంబు సత్య మగుచిద్ఘనరూపంబుఁ జూపువాఁడై బ్రహ్మదేవున కెయ్యది బోధించె దానిం దెలియఁ జెప్పెద. జీవున కవిద్యాసంబంధమున మిథ్యారూపదేహసంబంధంబు నీశ్వరునకు యోగమాయచేఁ జిద్ఘనలీలావిగ్రహావిర్భావంబు నను నియ్యది విశేషంబు. కావున వశీకృతమాయుం డైనయీశ్వరునిపై భక్తిఁ జేసిన మోక్షంబు గలుగఁగలదు, అయ్యీశ్వరునకును లాఁతులకుంబోలె నియతపరిమాణంబు లగు దేహాదులసంబంధము గలుగుఁ గావున నందఱితోడం దుల్యయోగక్షేముం డైనయతని భజించిన నేమి యుపయోగం బని శంకింపఁ బని లేదు.

## బ్రహ్మ తపస్సు చేయుట

భక్తులకు భక్తిరహస్య ముపదేశింప గురు వగునాబ్రహ్మదేవుఁడు నిజనివాసం బైనపద్మముపయిం గూర్చుండి యిది దేనిపై నుండెడు నని వితర్కించి తదాధారం బరయ నదియుండునేకార్ణవజలంబునం బెద్దదవ్వు క్రిందికరిగి, దానిమొదలు గానక మగిడి యెప్పటియట్లయే తెంచి కూర్చుండి యద్దిరా యిది యెట్లో యెఱుంగరాదే నెట్టులు జగముల సృజింతు నని పెద్దయుం బ్రొద్దు చింతించి సృష్టిసామర్థ్యముఁ గూర్చుప్రజ్ఞ నొందక యరయుచుండునంత నక్కడ స్పర్శవర్ణంబులలో షోడశంబు నేకవింశంబు నగుతప యనువర్ణములు రెండుమాఱు లుచ్చరించినట్లు దనకు వినంబడుటయుఁ "తపతప" యనునాశబ్దములు రెండును దపస్సు

గావింపుమని విధానంబు బోధించుటయు దీనిం జెప్పినవా రెవ్వరై యుండుదురో యని దెసలెల్లం గలయం జూచి యామహార్ణవజలమున వేఱొక్కనిం గానక విచారించి కొండొకవడి కేమహానుభావుండొకో నాకుం గర్తవ్య మగుహితము బోధించెం గావలయు నిందుం దర్కింప నేల ? తత్ప్రకారంబె ననుష్ఠింతు నని తనలో నిశ్చయించి నిజావాసం బైన యప్పద్మమునం గూర్చుండి తపము సేయం బోడంగె. తప మన సామాన్యంబు గాదు. అయ్యది మునులకు ధనంబై యొసంగు. దానం గదా మునులు తపోధను లనం బేరు గాంచిరి. అవ్విధమున బ్రహ్మదేవుండు నిశ్చయించి యమోఘదర్శనుండై వాయువులను మనస్సును నిగ్రహించి జ్ఞానకర్మేంద్రియముల జయించి యఖిలలోకతాపనంబుగా దివ్యవర్షసహస్రములు తీవ్రతపంబు సలిపె.

### హరి చతుర్ముఖునితపస్సునకు మెచ్చి శ్రీవైకుంఠము చూపుట

తాపసులలో నెల్ల నత్యంతతపస్వి యగు నాచతుర్ముఖుని పరమతపమునం బ్రీతుండై భగవంతుండు సర్వోత్తమం బైనదానిం, గ్లేశవిమోహభయములకుం గొంచెమేనియుం దనలో నెడలేనిదాని, నాత్మజ్ఞానవంతు లెంతయుం బ్రస్తుతింపం బెంపారుదాని, రజస్తమోగుణములకును దన్మిశ్ర మగుసత్త్వగుణమునకును జొరరాక శుద్ధసత్త్వగుణమునం జెలంగుదానిం, గాలవిక్రమంబు చెల్లింప నలవిగానిదాని, మాయకును దత్సంబంధిరాగద్వేషాదులకును దుష్ప్రవేశం బైనదాని, నీలవర్ణులయ్యు జగన్మోహనదేహకాంతి నింపారియుం బుండరీకాయతలోచనంబుల నొప్పియుం బీతాంబరంబులం దాల్చియు నధికలావణ్యసౌందర్యములం దనరియు బాహుచతుష్టయముల విలసిల్లియు వివిధోత్తమమణిమయాభరణములం గైసేసి తదీయవివిధప్రభాసంగతిం జేసి ప్రవాళవైడూర్యమృణాళకాంతులం బెరసినట్లు చూపట్టియు మణికిరీటకుండలంబుల ధరించియు హరిరూపాంతరంబు లన నొప్పుచు సారూప్యముం గన్న భగవద్భక్తులగుమహాత్ములు విమానంబుల నారోహించి చుట్టుం జరించుచుండ నెంతయు దర్శనీయంబైనదాని, నత్యంతవిచిత్రకాంతిసంతతి నతిశయిల్లు నుత్తమసీమంతినీరత్నములు మెలంగుటం జేసి మెఱుంగులతళతళలతో నెసంగు జలదపటలంబున నొప్పుమిన్నుకైవడి వర్ణనీయంబైనదాని, నిజలోకం

యైనదాని శ్రీవైకుంఠంబుఁ జూపె. ఏమి చెప్పుదు దాని మహిమంబు! శ్రీదేవి నిజరూపముతో వివిధైశ్వర్యవిశేషముల నావిష్ణుదేవుని బలు దెఱంగులఁబూజించుచు నొక్కొక్కవేళ నిజాంగపరిమళమునకు మూఁగి వచ్చు తేంట్లమ్రోఁత నాలించుచు నుయ్యెలయూఁగుచు నారాయణు లీలలం బాడుచుండు నయ్యది చెప్పఁ గొలఁది గాదు.

## బ్రహ్మ శ్రీవిష్ణుదేవుని దర్శించుట

అట్లాలోకంబుఁ గాంచి కాంచనగర్భుఁ డందు సునంద నందాదు లగుపార్షదులు పరమభక్తిం గొలువఁ గొలువై భృత్యుల నను గ్రహింప నభిముఖుండై స్మేరకటాక్షవీక్షుల నలరించుచు మణికిరీటకుండల ప్రభల దెసలు వెలుఁగించుచు లలితపీతాంబరము మేనికి వన్నె గూర్పఁ దేజరిల్లుచుఁ గౌస్తుభసముల్లసితవక్షస్స్థలంబున లక్ష్మీదేవిని ధరించి యత్యున్నతప్రశస్తసింహాసనమునం గూర్చుండి యాకారంబుఁ గొన్న ప్రకృతిపురుషమహదహంకారంబు లను నాలుగుశక్తుల నేకాదశేంద్రి యంబులు పంచమహాభూతంబులు ననుషోడశశక్తులను బంచతన్మాత్రంబు లనునైదుశక్తులనుం బరివృతుండై యితరసాధారణంబులు గాక యాత్మ నిత్యంబు లైనయణిమాదు లగునిజైశ్వర్యంబులతో స్వస్వరూపమున రమించు శ్రీమన్నారాయణుం గనుంగొని తదీయదివ్యదర్శనాహ్లాదమునం జేసి యుప్పొంగుచు నంతకంతకుఁ గన్నుఁగవం దొరుఁగునానందబాష్ప ములతోడం గరుపారినమేనితో నత్యంతవిరక్తు లగుపరమహంసులకే గాక యితరులకు దుర్లభం బైనశ్రీహరిచరణారవిందములకుఁ జాఁగిలి మ్రొక్కె. అవ్విధమున సాష్టాంగప్రణామం బాచరించినవిరించిం బ్రపం చంబు సృజింపఁ దనశాసనం బెఱుఁగఁ గోరి సన్నిధికి వచ్చినవానిం గరుణించి నారాయణుండు ప్రీతిమైఁ దనకేల నతనిమేను నిమిరి చిఱు నగవుజిగులు మిగుల లలితవచనంబుల నాతని కిట్లనియె. వేదగర్భా, లోక సర్గమార్గంబుఁ దెలియఁ గోరి పెద్దకాలం బత్యంతనియమమున నీవాచ రించినతపంబునకు నేను మెచ్చితి. కూటయోగులకు నన్ను మెప్పింప నలవి గాదు. వరము లొసఁగున న్నభిమతం బగువరం బడుగుము. సత్క ర్మానుష్ఠానశ్రమంబు జనులకు మదీయదర్శనం బగునందాఁకఁగాని పిమ్మటఁ జెల్లదు. నీకోర్కి నెఱవేర్పఁ బూనియే యేను మదీయలోకంబుఁ

జూపితి. నీవు దొలుతఁ గర్మమోహమునఁ బ్రజాసర్గము సలుపనేరక
బ్రమ్మరించుచుండఁ దపం బొనరింపు మని యేన పరోక్షమున నుపదేశిం
చితి. అమ్మాట పట్టి యీవు పరమతపంబు సల్పి మేలుచేసికొంటివి.
తపంబు సామాన్యంబు గాదు. అయ్యది మదీయహృదయంబు. ఏను
దపమున కాత్ముఁడను. తపముననే యేను జగముల సృజింతుఁ బాలింతుఁ
దుది హరింతు. దుశ్చరతపం బన్న మదీయవీర్యంబకాని యొండు గాదని
బోధించిన విని విధి హరి కిట్లనియె.

### బ్రహ్మదేవుఁడు తత్త్వార్థంబు శ్రీహరి నడుగుట

మహాత్మా, నీవు సర్వాధ్యక్షుండవై సర్వభూతములహృద యగు
హాలం దంతర్యామివై ప్రజ్ఞానమున సర్వభూతములయభిప్రాయం బెఱుం
గుదువు గావున నే విన్నవింపనేల? ఐన నో లోకనాథా, ప్రార్థనాపరుం
డైననాకోర్కి చిత్తగింపుము. రూపరహితుండయ్యు రూపవంతునట్లు
దోఁచు నీ దగుస్థూలసూక్ష్మరూపంబుల నే నెట్లు లెఱుంగఁజాలుదు నని
యుండెద. తత్ప్రకారం బెఱింగింపుము. ఆత్మమాయాయోగమున
నాత్మేచ్ఛంజేసి నానారూపములం గ్రహించి నానాశక్తిసముపబృం
హితం బైనవిశ్వమును నీ వెట్లు సృజియింతువో పాలింతువో
సంహరింతువో యెఱుంగనయ్యెద. తద్విధంబు దేటపఱుపుము. తంతు
నాభము లూఁతిసాధనములం గోరక తనంతన తంతుసంతాన మల్లు తెఱం
గున నీ వన్యసాధనంబు లెవ్వియు లేకున్న నాత్మసాధనముల నాత్మలీలల
నమోఘసంకల్పుఁడవై యెట్లు లొనరింతు వవ్విషయమున మదీయ
మనీష చెల్లునట్లు ప్రసాదింపుము. నీవు శాసించువిధముఁ గొని యాల
స్యము మాని తత్ప్రకారం బే నాచరించెద. నీయనుగ్రహమునం జేసి
ప్రజాసర్గ మను విశేషమునం దవిలియు నేను బంధములకుఁ దప్పుదు.
దేవా, నీవు నన్నుఁ జెలికాని నెట్టు లట్టులు కరస్పర్శనాదుల నాదరిం
చుటం జేసి భవత్పరిచర్యారూప మగుప్రజాసర్గమున నుండియు జనులలో
నుత్తమమధ్యమాధమతారతమ్యం బేర్పఱుచుటం జేసి యం దే నజుఁడను
సృష్టికర్త ననుమద ముదయింపకుండఁ బ్రసాదింపు మనిన భగవంతుఁడు
బ్రహ్మ కిట్లనియె.

### భగవంతుఁడు బ్రహ్మకు భాగవతం బుపదేశించుట

సురజ్యేష్ఠా, యనుభవజ్ఞానంబుతోడి శాస్త్రజ్ఞానంబును భక్తియోగంబును దత్సాధనంబును బరమరహస్యం బైనను నీకుఁ జెప్పెద నాకర్ణింపుము. ఏ నెట్టివాఁడ నెవ్విధంబువాఁడను మదీయగుణకర్మంబు లెట్టి వగుఁ దత్ప్రకారంబెల్ల నున్న దున్నట్టులు నాయనుగ్రహమునం జేసి యెఱుంగఁగలవు. ఈ ప్రపంచము సృజించుటకుమునుం దే నొక్కఁడన యుంటిఁగాని స్థూలముగాని సూక్ష్మముగాని యీరెంటికిం బరం బగు ప్రధానంబుగాని లేదు. ఏనును గేవలసత్తామాత్రమున నుంటిఁగాని మఱి యేకార్యముం జేయనైతి. సృష్టికిఁ బిమ్మటను బ్రపంచరూపమున నేన యుండుదు. ప్రాఁకులలోనికొమ్మలయు జెమ్మలయు నాకులయు సందునం జందురుఁడు దా నొక్కరుండయ్యుఁ జూచువారికి వాస్తవముగ నిద్దఱు చంద్రు లుండునట్లు దోఁచురీతి వాస్తవముగ లేనిదయ్యు నధిష్ఠానమగు నాత్మునియెడ నుండున ట్లెయ్యది తోఁచు, గ్రహమండలంబున నుండియు రాహు వగపడనివిధమునం బ్రాతిభాసికముగ నుండియుఁ బారమార్థికముగ నెయ్యది యయ్యాత్మునియెడ లేకుండు నయ్యది యాత్మమాయ యని యెఱుంగవలయు. నానావిధము లగుభూతములలోనం బంచమహాభూతములు వానిలో నుపలబ్ధిం జేసి సృష్టికిఁ బిమ్మటఁ బ్రవిష్టములయ్యు ముందే కారణరూపముననుండియు నప్రవిష్టంబులట్లు తోఁపంబడు నట్లయే నఖిలభూతములలో నంతర్యామిరూపమునం బ్రవేశించియుఁ దద్గత వికారాదుల నొందమింజేసి యప్రవిష్టునట్లు దోఁపఁజేయుదు. ఇయ్యది భూతజాలములోని మదీయసత్తాప్రకారంబు. సర్వకాలములందును సర్వదేశములందును గార్యములలోనం గారణరూపమున నన్వయంబును సమాధ్యాదులందు వ్యతిరేకంబునుం గలిగి యెయ్యది నిత్యసత్తాకంబై వెలుంగు నయ్యదియే యాత్మస్వరూపంబు. ఆత్మతత్త్వంబు నెఱుంగఁ గోరువాని కింతయే జిజ్ఞాస్యంబు. ఇయ్యది నామతంబు. దీనిం బరమసమాధితో ననుష్ఠింపుము. ఇంత లెస్స యెఱుంగుదేని యీవు మహాకల్పములందు నవాంతరకల్పములందు నొకప్పుడేనియు మోహముఁ బొందవని భగవంతుండు పరమేష్ఠి కుపదేశించి యతండు చూచుచుండ నంతర్ధానంబుఁ గాంచె.

## శుకుఁడు పరీక్షితునకు భాగవతసంప్రదాయంబు చెప్పుట

అవ్విధమున నంతర్హితుం డైనహరికిఁ బరమభక్తిం గేలుమోడ్చి యతని నంతస్సన్నిధిం జేసికొని సర్వభూతమయుం డైనపితామహుం డీజగమెల్లఁ బూర్వకల్పమున నెవ్విధి నుండె నాకరణిని సృజియించె. అట్లు లోకసర్గవ్యాపారమునం బ్రవృత్తుండై ధర్మపరిపాలకుం డైనప్రజాపతి ప్రజలమే లరయుచు నాత్మప్రయోజనేచ్ఛతో యమనియమంబులు నడపుచుండ నొక్కనాఁ డాత్మపుత్త్రులలోనెల్ల నత్యంతప్రియుండు నిత్యానువ్రతుండు నగునారదుం డరుగుదెంచి శీలశమదమవినయాదు లెంతయు నెసకమెసఁగఁ బరిచర్యఁ గావించుచు వశ్యమాయుం డైన విష్ణుదేవునిమాయ యెఱుంగఁగోరి తండ్రిచిత్తము మెప్పించుచు నాలోకపితామహుండు తనకావించినసేవనలకుఁ దుష్టిఁ గాంచి చందంబుఁ దన మదిలో నూహించి మహాభాగవతుం డైనయాదేవర్షి నీవు నన్నడిగినట్టు లప్పరమేష్ఠి నడిగె. విధాత యతనికిఁ బ్రీతుండై తనకు భగవంతుం డుపదేశించిన దశలక్షణం బగునీభాగవతము బోధించె. నారదమునీంద్రుండు సరస్వతీనదీతీరమునం బరబ్రహ్మధ్యానపరుం డైనయమితతేజుఁ డగువేదవ్యాసునకుఁ జెప్పె. మాతండ్రియనుగ్రహమున నేను నేర్చితి. ఇట్లు సత్సంప్రదాయాగతం బైనయీభాగవతంబు నీకేను జెప్పెద. అందుఁ దొలుత భగవత్ప్రశ్నానుసారంబుగా వైరాజపురుషునివలన నీజగము దొలుత నెట్టు లుద్భవిల్లె నను ప్రశ్నమున కుత్తరంబు చెప్పెద నని చెప్పి శుకయోగీంద్రుఁ డాపరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

## శుకుఁడు పరీక్షిత్తునకు దశలక్షణముల వివరించుట

నరేంద్రా, యిందు సర్గము, విసర్గము, స్థానము, పోషణ, ఊతులు, మన్వంతరంబు, లీశానుకథలు, నిరోధము, ముక్తి, యాశ్రయం బనఁ బదిలక్షణంబులు గలవు. దశమ మగునాశ్రయముతత్త్వము దెలియఁగ మహాత్ములు సృష్ట్యాదులయెడ శ్రుతిప్రతిపాద్యరూపమున విస్పష్టముగను దదాఖ్యానములందుఁ దాత్పర్యవృత్తినిం దక్కినతొమ్మిదింటికి లక్షణంబు వర్ణింతురు. సర్గాదిలక్షణం బెట్లంటేని వినుము. గుణములపరిణామమునం జేసి బ్రహ్మనుండి యాకాశాదిపంచభూతములయు శబ్దాదితన్మాత్రంబులయు జ్ఞానకర్మేంద్రియంబులయు మహదహంకారం

బులయు విరాడ్రూపమున సంభవంబు సర్గ మనంబడు. విరాట్పురుషుని వలనం గలుగుచరాచరభూతసర్గంబు విసర్గ మనంబడు. సృజింపఁబడిన భూతములఁ దత్తన్మర్యాదమెయిఁ బాలించునెడ భగవంతునిసర్వోత్కర్షంబు స్థితి యనంబడు. నిజభక్తులయెడ భగవంతుఁ డొనరించు ననుగ్రహము పోషణంబునాఁ బరఁగు. భగవదనుగ్రహము వడసినమన్వంతరాధిపతులు కావించుధర్మములు మన్వంతరంబు లనంబడు. కర్మవాసన లూతు లనంబరఁగు. భగవంతునిలీలావతారచరిత్రంబులును హరిభక్తులగుమహాపురుషుల నానాఖ్యానోపబృంహితంబు లగుపుణ్యకథలు నీశాను కథ లనంబడు. పరమాత్ముని యోగనిద్ర ననుసరించి జీవులకు నిజోపాధు లగుశక్తులతోడ నతనిలో లయించుట నిరోధ మనంబడు. అవిద్యాసంగమున నధ్యస్తము లగుకర్తృత్వభోక్తృత్వాదుల విసర్జించి జీవుఁడు బ్రహ్మైకత్వానుసంధానంబుఁ గాంచుట ముక్తి యనంబడు. జగములకెల్ల నుత్పత్తిలయము లెవ్వనివలనం గలుగు బ్రహ్మపరమాత్మశబ్దవాచ్యుం డైనయతండే యాశ్రయం బనంబరఁగు. ఈయాశ్రయం బాధ్యాత్మికాధిదైవికాధిభౌతిక భేదమునఁ ద్రివిధత్వంబు నొందు నెట్లం జేని చక్షురాదికరణాభిమానియై ద్రష్ట యగుజీవుఁ డాధ్యాత్మికుఁ డనంబరఁగు. ఇతండే చక్షురాద్యధిష్ఠాతయై యాధిదైవికుఁ డనఁబరఁగు. సూర్యాదిపురుషుఁ డగుంగాని యీయిద్దఱకుఁ బారమార్థిక భేదంబుగలుగదు. ఈద్వయంబున కెందు విచ్ఛేదంబు గలుగు నట్టిచక్షుర్గోళకాదులం గూడినదేహ మాధిభౌతికంబు. ఇయ్యాది పురుషుఁ డగుజీవున కుపాధి యగుటంజేసి యుపచారమునఁ బురుషపదవాచ్యుం బై ప్రవర్తిల్లు. ఇం దొక్కండు లేకుండిన నొండొక్కండు దోఁపమింజేసి యీత్రితయంబునకుఁ బరస్పరాశ్రయం బెడఁబాయకుండు నెట్లంజేని. దృశ్యమగునాధిభౌతికంబు లేకుండినం ద్రష్ట యగునాధ్యాత్మికునకును దృష్టిసాధనేంద్రియాధిష్ఠాత యగునాధిదైవికునకు నట్లే ద్రష్ట యగునాధ్యాత్మికుండు లేకుండిన నింద్రియార్థసన్నికర్షమున కధిష్ఠాత యగునాధిదైవికునకును దృశ్యం బగునాధిభౌతికమునకు నారీతి సాధనేంద్రియాధిష్ఠాత యగు నాధిదైవికుఁడు లేకుండిన ద్రష్ట యగునాధ్యాత్మికునకును దృశ్యం బగు నాధిభౌతికంబునకుం బరస్పరక్రియాసామర్థ్యంబు చెల్లనేరదు. కావునఁ

బరస్పరాశ్రయం బగు నీత్రితయము నాత్మప్రత్యయమున సాక్షియై చూచుచు నితరాశ్రయనిరపేక్షుండై తా నఖిలమునకు నాశ్రయుండై పెంపు గాంచు పరమాత్ముం డాశ్రయంబనం బరగు. వైరాజపురుషుని వలన నీజగంబు పుట్టినవిధంబు చెప్పెద వినుము.

### శుకుండు పరీక్షిత్తునకు సృష్టిప్రకారంబు చెప్పుట

వైరాజపురుషుం డండము భేదించి వెలువడి తనకు నిలువం జోటరయుచుం దాను శుద్ధుండు గావున శుద్ధము లగుజలముల సృజించి యందు సహస్రవత్సరంబులు వసించె. పురుషపదవాచ్యుం డైననరుని వలనం గలుగుటం జేసి జలములు నారము లనంబడియె. అట్టినారము లయనముగాం బడయుటం జేసి పురుషోత్తముండు నారాయణుం డనంబరంగె. ఉపాదానకారణములగుపృథివ్యాదిద్రవ్యంబులు నిమిత్తకారణము లగుపుణ్యపాపకర్మంబులును గాలంబును స్వభావంబును భోక్త యగు జీవుండు నెవ్వనియనుగ్రహమునం గార్యక్షమతం గాంచు నట్టిపరమపురుషునిమహిమంబు చెప్పవలయునే? అతండు దా నొక్కరుండయ్యు నానావిధముల భాసింపం దలంపు గొని యోగశయ్య విడిచి లేచి ప్రకాశబహుళంబై హిరణ్మయమని చెప్పంబడునిజగర్భరూపదేహమును మూండువిధముల నాత్మమాయచే సృజించె. అయ్యదియే యధిదైవ మధ్యాత్మ మధిభూత మనంబడు. ఇట్లు త్రిధావిభక్త మగు కార్యమున నొక్కటియే యయ్యుం బురుషుని క్రియాశక్తియు మూండుతెఱంగులం గాంచె. ఎట్లంటేని: క్రియాశక్తిం గొనిచేష్ట లొనర్చునప్పురుషునియంతశ్శరీరము నందలి యాకాశమునుండి యింద్రియశక్తి దేహశక్తి మనశ్శక్తి యనశక్తిత్రయం బుదయించె. ఇట్టి త్రివిధక్రియాశక్త్యాత్మకం బయినసూక్ష్మరూపమునుండి సూత్రాఖ్యంబై ముఖ్యంబై సర్వభూతములకుం బ్రాణంబైన ప్రాణము జనించె. అఖిలజంతువులందు నాప్రాణము చేష్టావంతంబై యుండిన నింద్రియములెల్లం గ్రియావంతము లయ్యెడు. కావునం బ్రాణేంద్రియములకు రాజభృత్యసామ్యంబు ప్రవర్తిల్లెడు. అప్పురుషునిప్రాణము శరీరాంతరాళమునం జలించుటయుం గ్రియాత్మకము లగుక్షుత్పిపాసలుదయించె. వానిచే నాపురుషుం డాహారముం బానముం గొన నిచ్ఛయిం

చుటయుఁ దొలుత నోరు జనించె. నోర జిహ్వేంద్రియాధిష్ఠానం బైన తాలువులును జిహ్వేంద్రియంబును జిహ్వాగమ్యము లగునానారసము లును జనించె. అధిష్ఠాత యగువరుణుఁడును వానితోడ నుదయించె. అప్పురుషుఁడు వచింపఁ దలంచుటయు నతనినోర వాగింద్రియంబును సంభాషణంబు జనించె. వానితోడ నధిష్ఠాత యగువహ్ని యుదయించి పెద్దకాలం బానీళుల నివసించుటం జేసి యతనికిఁ బ్రచారనిరోధం బయ్యె. అతనిప్రాణవాయు విటునటుం జరించుచు నుచ్ఛ్వాసనిశ్వాసంబు లొనరించుటయు నాసికంబులు పుట్టె. అందు గంధము గ్రహింప నతనికిఁ గోర్కి వొడముడు ఘ్రాణము గంధ మధిష్ఠాతృదేవత యగువాయువు నుదయించె. దర్శనశూన్యత్వంబు సరిగా దని యతండు చూడ నెంచు టయు నేత్రములు చక్షురింద్రియము రూపము నుద్భవిల్లె. వానితోడ నధిష్ఠాతృదేవత యగుసూర్యుఁడుం బ్రభవించె. సురలు బోధించు నాత్మప్రబోధనంబు విన నతండు మనసు పెట్టుటయుఁ గర్ణములు శ్రోత్రేంద్రియంబు శబ్దగ్రహణం బధిష్ఠాతృదేవత యగుదిక్కులును జనించె. పదార్థములమృదుత్వముఁ గఠినత్వము లఘుత్వము గురు త్వము నుష్ణత్వము శీతలత్వమునుం గ్రహింప నతండు దలంచుటయుఁ ద్వగింద్రియంబు నధిష్ఠాతృదేవత యగువృక్షములుం బుట్టె. అందును ద్వగుపలబ్ధగుణంబై వాయువు లోపలను వెలుపలను నావరించియుండెను. త్వగింద్రియంబే వెలుపలికందూతితోడిస్పర్శముఁ గొనునెడ లోమశబ్ద వాచ్యం బగు. అప్పుడు మహీరుహంబు లధిష్ఠాతృదేవత యగు. అయ్యది యే యాంతరబాహ్యస్పర్శములం గ్రహించునేని త్వక్పదవాచ్యంబగు. అప్పుడు వాయు వధిష్ఠాతృదేవత యగు. ఇం దియ్యది విశేషంబు. అతండు నానాకార్యములం జేయం బూనుటయు హస్తములు బల మాదాన క్రియయుఁ గలిగె. తోడ నధిష్ఠాత యగునింద్రుఁడు గలిగె. అతఁ డిష్ట గతింబోవ నెంచుటయుఁ బాదములుగలిగె.పాదములతోడ యజ్ఞపురుషుఁ డధిష్ఠాతయై యుద్భవిల్లి మనుష్యులకర్మంబుల హవ్యములం జేయించు. అతండు సంతానోత్పాదనసుఖముఁ గోరుటయు శిశ్నముగలిగె. తోడన యుపస్థేంద్రియంబు నధిష్ఠాత యగు ప్రజాపతియు జనించుటయు నా యింద్రియదేవతలనాశ్రయించి గామసుఖమునుంగలిగె. అతండు ధాతు

మలంబు విసర్జింపఁ బూనుటయు గుదంబు గలిగె. దానివెంటఁ బాయ్వింద్రియమునకు నధిష్ఠాత యగుమిత్త్రునకుఁ దదుభయాశ్రయం బైనమలోత్సర్గమునకు నుత్పత్తి గలిగె. అంత నొక్కదేహము విడిచి యొండొక్కదేహమునకుఁ బోవ నుద్యమించుటయు నాభిద్వారంబు గలిగె. అందపానంబును దాన నధిష్ఠాతృదేవత యగుమృత్యువు నుభయాశ్రయంబై ప్రాణాపానబంధవియోగరూపం బైనమరణంబునుం గలిగె. అంత నన్నపానముల గ్రహింప నెంచుటయుఁ గుక్షియు నంత్రములు నాడులు నధిష్ఠానదేవత యగునదీసముద్రంబులును దదుభయాశ్రయంబు లగుతుష్టిపుష్టులునుం గలిగె. అంత నాత్మమాయను మిక్కిలి చింతింపఁ బూనుటయు హృదయంబు గలిగె. దాన మనస్సునకధిష్ఠాత యగుచంద్రునకుఁ గామసంకల్పములకు నుద్భవం బయ్యె. స్థూలం బగుత్వక్కు, సూక్ష్మం బగుచర్మంబు, మాంసము, రుధిరము, మేదస్సు, మజ్జ, యస్థులు ననునీసప్తధాతువు లాకాశజలవాయుసంభూతంబులై భూమ్యప్తేజోమయంబులై సప్తప్రాణము లనంబరఁగు. ఇంద్రియంబులు శబ్దాదివిషయములయెడ నభిముఖము లగు. శబ్దాదివిషయము లహంకారకల్పనం జేసి శోభనస్వభావంబులై తోఁచు. మనస్సు సర్వవికారములకు నాత్మయై వర్తించు. బుద్ధి తాదృశార్థవిజ్ఞానరూపంబై చెల్లు. ఇయ్యది యే పంచభూతములు మహదహంకారములు ప్రకృతియు ననునెనిమిదియావరణముల వెలుపల నావృతం బైనభగవంతునిస్థూలరూపంబు నీకుఁ జెప్పితి. దీనికిఁ గారణభూతంబై సూక్ష్మంబై యవ్యక్తంబై నిర్విశేషణంబై యుత్పత్తిస్థితిలయశూన్యంబై యేమిట నేవికారమునుం గాంచక సదైకరూపంబై యిది యిట్టి దని వచియింపను మనస్సునకైన నూహింపను శక్యంబుగానియది సూక్ష్మరూపంబు. ఇప్పుడు నీకేనుబోధించినయీరెండురూపములును మాయాకల్పితంబులే కాని వాస్తవములు గావని పండితులు సత్యముగా వీని నంగీకరింపరు. సృష్టివిషయమున బ్రహ్మరూపము ధరించి భగవంతుఁడు దాను వస్తుగతిం గర్మరహితుండయ్యు మాయాయోగమునఁ గర్మసహితునట్లు భాసించుచు వాచ్యత్వమున రూపములను వాచకత్వమున నామములను గ్రియలను సృజియించు. మఱియు నతండే లోకనిర్వాహార్థంబు ప్రజాపతులను సిద్ధచారణగంధర్వులను

విద్యాధరాసురగుహ్యకులను గిన్నరాప్సరోనాగసర్పకింపురుషులను మాతృరక్షుగ్గపిశాచప్రేతభూతవినాయకకూశ్మాండోన్మాదవేతాళయాతుధానగ్రహఖగమృగపశువృక్షగిరిసరీసృపగణంబులను మఱియుఁ జరాచరాత్మకంబులై ద్వివిధత్వంబును జరాయుజాండజస్వేదజోద్భిజ్జలక్షణమునం జతుర్విధత్వంబునం గాంచుచు జలస్థలాంతరిక్షంబుల వసించును త్తమమధ్యమాధమంబు లగునానాభూతములను సృజించె.

## కర్మగతివిచిత్రత్వప్రతిపాదనము

కర్మగతివిచిత్రత్వంబుఁ జెప్పెద వినుము. సత్త్వరజస్తమంబులు మూడు నితరేతరసంపర్కంబుఁ బొందక కేవలంబులైనం గ్రమంబున దేవభోగ్యము లగుస్వర్గాదులకు మనుష్యభోగ్యంబు లగుపశుపుత్త్రధాన్యాదులకు నరకవాసుల కనుభావ్యము లగునరకములకుం గారణం బగు. సత్త్వాదిగుణములే యొండొంట నుపహతిం జెందునేని సాత్త్వికాదిగతులకును త్రిప్రకారంబులు గలుగు. జగదీశ్వరుం డైనయాభగవంతుఁడే బ్రహ్మరూపమున నివ్విధిం బ్రపంచంబు సృజించి యట ధర్మరూపమునఁ దిర్యఙ్మనుష్యదేవావతారంబు లెత్తి పాలించు. అతండే కాలాగ్నిరుద్రరూపములం గొని తనసృజించినజగముం దత్తత్కాలముల మహామారుతంబు మేఘపటలంబు నెట్టు లట్టుల రూపుమాపు. ప్రపంచసృష్టిరక్షాసంహారకర్తృత్వరూపమున భగవంతునిమహిమంబు చెప్పితి. పండితులు నిత్థంభూతరూపమున గేవలుఁ డగుపరమాత్ముఁ జూడఁ జాలరు. ఇట్టివాఁడయ్యు హరి యీజగము సృజించుట మున్నగువానియెడఁ బారమార్థికంబుగఁ గర్త గాఁ డని కర్తృత్వప్రతిషేధార్థంబు పెద్దలు వచింతురు. పరికించిచూచిన నకర్తయు నభోక్తయు నగునీశ్వరునిపైఁ గర్తృత్వాదిధర్మములు మాయచే నారోపింపఁబడు నింతియకాని వాస్తవంబు గాదు. అవాంతరకల్పసహితంబుగా బ్రహ్మకల్పంబు నీకుఁ జెప్పితి. మహాకల్పంబునందుఁ బ్రాకృతమహదాదిసర్గంబులు నవాంతరకల్పంబునందు స్థావరాదిసర్గంబులు ననునీప్రకారం బితరమహాకల్పంబులందును సాధారణంబై ప్రవర్తిల్లెడు. స్థూలసూక్ష్మలక్షణం బైనకాలపరిమాణంబును గల్పస్వరూపంబు నవాంతరకల్పమన్వంతరాదివిభాగంబును ముందు వివరించెదఁగాని యిప్పుడు పద్మోద్భవపూర్వకం బగుటం జేసి పాద్మ మనం

బరఁగు బ్రహ్మకల్పంబు వివరించెద, వినుమని శుకయోగి పరీక్షిన్నృపాలునకుఁ జెప్పుచున్నంత శౌనకముని సూతు దెస మొగంబై యో రోమహర్షణనందనా! విడువరాని బాంధవుల విడిచి భాగవతోత్తముం డైన విదురుఁ డెట్లు తీర్థయాత్ర నడిపె? ఎచ్చోట నా విదురునకు మైత్రేయునకు నధ్యాత్మవిద్యావిషయమున సంవాదంబు నడచె? విదురుఁ డడిగిన దాని కా మైత్రేయమునీంద్రుఁ డేమి చెప్పె? ఆయర్థంబును బంధుత్యాగనిమిత్తం బైన విదురుని చేష్టితంబు నాతండు గ్రమ్మఱ నెట్లు దమవారియొద్దకుఁ జనియెఁ దత్ప్రకారంబు నెఱింగింపుమనియడుగుటయు సూతుఁడు మునీంద్రా! యీ ప్రకరణంబున మీరు నన్నడిగిన యర్థంబె పరీక్షిన్నృపాలుఁడు శుకయోగీంద్రు నడిగిన నమ్మునీంద్రుఁ డా నరేంద్రునకు విదురమైత్రేయసంవాదపూర్వకంబుగాఁ దదీయప్రశ్నానుసారముగ నుత్తరములు వివరించుచుఁ బురాణార్థ మెల్ల వివరించె. తత్ప్రకారంబుఁ జెప్పెద వినుఁ డని సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పం దొడంగి యిట్లనియె.

మ. నిజమాయావిభవంబుచే గుణసమున్మేషంబుఁ దాఁ గాంచి స
ర్వజగద్వర్గము సర్గరక్షణలయవ్యాపారముల్ లీలమై
నటగోవిందగిరీశనామములఁ బర్యాయంబునం జేయుచున్
నిజశుద్ధాత్మత నిష్క్రియుం డనఁగ నిర్ణీతుం బరుం గొల్చెదన్.

గద్యము. ఇది శ్రీమదుభయభాషాకవిత్వకలాభిరామ సీతారామకవిలలామ పుత్త్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్త్ర, శాలావత్సగోత్రాపస్తంబసూత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామధేయ విరచితం బైన శ్రీమదాంధ్రవచనభాగవతమునందు ద్వితీయస్కంధంబు సర్వంబు నేకాశ్వాసము.

---

శ్రీ ర స్తు

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్రవచనభాగవతము

## తృతీయస్కంధము



క. శ్రీమాయాసంగతిదృ
శ్యామేయచరాచరాత్మ కాఖిలభువన
స్తోమాకృతిపరిణతస
ద్ధామవిరాణ్మూర్తిఁ గొలుతు బోధస్ఫూర్తిన్.

బ్రహ్మానందానుభవనిస్తంద్రుం డైనశుకయోగీంద్రుఁ డాపరీక్షిన్నరేంద్రున కిట్లనియె. సర్వసంపదలఁ బెంపొంది పాండవధార్తరాష్ట్రులకు సంధి సేయఁగ ధర్మజుపంపున దూతకృత్యంబు నడప విచ్చేసినసర్వేశ్వరుం డైనశ్రీకృష్ణుండు ధృతరాష్ట్రునగరు దొఱఁగి ప్రేమాతిశయంబున విడిది సేయఁగ లోకమునం బ్రశస్తిఁ గాంచినతనగృహము విసర్జించి విదురుం డడవుల కేఁగి యచ్చట సన్నిధి చేసినమైత్రేయమునిం గొలిచి నీవు నన్నడిగిన ట్లడుగుటయు నమ్ముని యవ్విదురున కిట్లనియె ననిచెప్పుచున్నంత నప్పాండవపౌత్త్రుం డప్పారాశర్యపుత్త్రుం జూచి మునిపుంగవా! యెచ్చట నెప్పుడు విదురునకు మైత్రేయునితోడ సమాగమం బయ్యె? అప్పటివారిసంవాదప్రకారం బెట్టిది? విమలాంతఃకరణుం డైన విదుఁ డమ్మహర్షివర్యు నడిగినయర్థంబు సాధువాదోపబృంహితంబై యెల్లవారికి నవశ్యవేదితవ్యంబై యుండుఁగాని యల్పార్థోదయం బగునే? కావున నో బ్రహ్మవిద్వరేణ్యా! తత్ప్రకారం బెల్ల నాకుఁ దేటపడ నెఱింగింపు మని యడిగిన శుకయోగి ప్రీతచిత్తుం డై యయ్యా! దాని వివరించెద వినుమని యారాజసత్తమున కిట్లనియె.

### విదురుఁడు కరిపురంబు విడిచి తీర్థయాత్ర చనుట

ధృతరాష్ట్రుం డధర్మమున మనస్సు పెట్టి వివేకంబు వాసి యసాధువు లగుతనకొడుకుల నాదరమునం బ్రోచుచుఁ దమ్మునితనయు లగు పాండవులఁ దండ్రిసచ్చినవారిం గరుణామై నాదరించు టుజ్జగించి వంచనమై లక్కయింటఁ గాల్పించుటయు, సభలోఁ బాండవధర్మపత్ని యగు పాంచాలిం గొప్పు పట్టి యీడ్చి తెచ్చి తనకొడుకు దుశ్శాసనుఁ డిది గాదనక పరిభవింపఁ బూనినం గుచకుంకుమపంకలేపంబు సెదరఁ గన్నీరు జాలువాఱ నేడ్చుచున్న యక్కోడలియిడుమ లుడుపక సుతుమతంబుఁ జెల్లించుటయు, దుర్యోధనాదులు కపటద్యూతమున నధర్మమున ధర్మరాజు నోడించి యడవులకుఁ బంపిన నాతండు సత్యవ్రతుండు గావున సంకేతంబు దప్పక వనవాసాదినియమములఁ దీర్చి వచ్చి తనభాగం బిమ్మని యడిగినను మోహాగ్రస్తుండై యియ్య కొప్పరికింతసేయుటయు, ధర్మరాజు వేడికొనఁగ జగద్గురుం డైనశ్రీకృష్ణుండు తాన వచ్చి సభలో నున్నభీష్మాదు లగునుత్తమపురుషుల కమృతవర్షమువోలె నాప్యాయనంబులైనసంధిమాటలు ప్రసంగించినం బుణ్యాలవంబేనియుఁ దనకు లేమిం జేసి యాదివ్యవచనంబు లంగీకరించుట మాని వానిం బెడచెవిఁ బెట్టుటయుఁ, బాండవులవలనిభయంబుతోఁ జింత గదుర మంత్రాలోచనంబునకుఁ దన్నుఁ బిల్చి యడిగినప్పుడిప్పటికిని మంత్రవిదులు విదురనీతి యని యత్యంత ప్రమాణంబుగా నాదరించు తెఱంగున "నో రాజేంద్రా! సహింపరానినీ యపరాధ మెట్టులో యోర్చుచున్నయజాతశత్రున కతనిభాగ మొసంగుము. నీమది నెల్లవేళల వెఱఁ బుట్టించువృకోదరుం డనుపాము పేరలుకతో నెప్పుడును రోఁజుచుండెడు. మఱియు రాజాధిరాజుల నెల్ల జయించి యాదవవీరులకుఁ బూజనీయుండై ద్వారవతి నెలవుగాఁ జెలంగుభగవంతుఁ డగుముకుందుఁడు బ్రాహ్మణులు దేవతలును దానును బాండునందనులకుఁ దమవాఁడై వెన్నుప్రాపై వారిమేలు గోరుచుండెడు. నీకొడుకు దుర్యోధనుఁ డన్నవో యాపురుషోత్తమునితోడ ద్వేషించుచు నాకారంబుఁ గొన్నదోషంబ తా ననంగ నొప్పి పుత్త్రవ్యాజమున నీయిల్లు జెఱుపఁ జేరినవాఁడు. నీ వది యరయక వాని పయిం గూర్మి సేయుచుం బ్రోతువు. దాన నీశ్రీ సెడు. కావునఁ బరి

రాజ్యం బైనవాని నొక్కనిం గులక్షేమార్థంబు త్యజింపు" మనుట మున్నుగాఁ బలుదెఱంగులఁ బెక్కులు హితంబులు బోధించునెడ దుర్యోధనుఁ డతిరోషమున నవుడుగఱచి "యోరీ! వీని నెవ్వఁ డిక్కడకుఁ బిలిచె నీనీచుఁడు దన్నుఁ గూడు పెట్టి ప్రోచినవారికిఁ బ్రతికూలుఁడై పగలపైఁగూర్మి నెఱపుచుండెడు నీదాసికొడుకుం బ్రాణములతో నగరు వెడల నడచుట కర్తవ్యం" బని కర్ణ శకుని దుశ్శాసన మతంబున సాధుజనస్పృహణీయశీలుం డైనతన్నుఁ దిరస్కరించి ప్రల్లదంబు లాడినం గొడుకును వారింపక వినుచుండుటయు నరసియు నన్నయెదుటఁ బరమకఠోరము లగుదుర్భాషణబాణముల మర్మంబులఁ గాఁడనేసిన నొచ్చియు నవ్విదురుం డచ్చటఁ గాలునిలుప నొల్లక "యక్కటా! విష్ణుమాయామహిమం బమేయంబు. కాకున్న మదీయహితభాషణంబులు వీరిచెవికిఁ జేఁదగునే? ఇంక నిక్కడ నుండరా" దని తనలోనిశ్చయించి ద్వారసీమం గార్ముకంబు పెట్టి పుణ్య మార్జించువాఁడై కరిపురినుండి తీర్థసేవ సేయ వెడలె.

## విదురుఁడు తెరువున నుద్ధవుం గనుట

కౌరవులభాగ్యస్వరూపం బైనవిదురుఁ డట్లు కరినగరంబు విడిచి సహస్రమూర్తి యగుహృషీకేశుం డధిష్ఠించినపుణ్యక్షేత్రంబులను వనంబుల నుపవనంబులఁ బర్వతంబులఁ గుంజముల నిర్మలసరస్సుల నదుల మఱియుఁ బలుదెఱఁగు లగుతీర్థముల సేవించుచుఁ బావనం బసంకీర్ణంబు నగువృత్తిచే దేహయాత్ర నడపుచు నెల్లతీర్థములం గ్రుంకుచు దేహసంస్కారంబు మాని వల్కలాజినములం గట్టి యథశ్శయనంబు మున్నుగా నియమములనెల్లఁ గొని తన్ను లెస్స దెలిసినతనవారికైనం దెలియరాని యవధూతవేషంబుతో హరిపరితోషణంబు లైనవ్రతముల నాచరించుచు నీభారతవర్షభూమిఁగలయం గ్రుమ్మరుచుఁ బ్రభాసక్షేత్రమునకేతెంచునంతకుఁ బరస్పరసంఘర్షమునఁ బొడమునగ్గిచే వెదురుటడవి గాలినతెఱంగునఁ దనసుహృదు లగుకౌరవపాండవులకుఁ దమలోనత్యంత స్పర్ధ పెరిఁగి దాన నెసంగిన క్రోధానలంబునం జేసి దారుణంబుగా భారతరణంబు ప్రవర్తిల్లినకతనం గృష్ణుండు తోడ్పడ ధర్మనందనుండు కౌరవులం బొరిగొని తనయాజ్ఞాచక్రమున కేమిట నడ్డం బేమియు లేక లేక

ష్పుత్రాధికత్వంబుగా సామ్రాజ్యము వడయుట విని బంధువులచేటునకు వగచుచుఁ గొండొకవడికిఁ దూష్ణీంభూతుండై పశ్చిమవాహిని యగు సరస్వతీనదిం జేర నరిగె. అట నమ్మహానదిఁ దనరుత్రితతీర్థంబు నుశన స్తీర్థంబు మనుతీర్థంబుఁ బృథుతీర్థంబు నగ్నితీర్థంబు నసితతీర్థంబు వాయుతీర్థంబు సుదాసతీర్థంబు గోతీర్థంబు గుహాతీర్థంబు యమతీర్థంబును సేవించి మఱియుఁ జూచినంతన శ్రీవిష్ణుం దలఁపించుచక్రలాంఛనముల నమరుమందిరముల సొంపారు దేవబ్రాహ్మణకల్పితనానావిష్ణ్వాయతనముల దర్శించుచుఁ జనిచని సకలసంపదలఁ బెంపారుసురాష్ట్రదేశంబును మత్స్య సౌవీరకురుజాంగలంబులను గాలక్రమంబున నతిక్రమించి యమునాతటినిం దఱియ నరిగి యచ్చటఁ బరమభాగవతుం డైనయుద్ధవునిఁ గనుంగొనియె అట్లు విదురుం డుద్ధవునిఁ బరమభాగవతునిఁ బ్రశాంతుని బృహస్పతికి శిష్యుండై నీతిశాస్త్రంబు నేర్చినవానిం గాంచి గాఢాలింగనంబున నాదరించి భగవంతునకుఁ బోషణీయు లగుతనబాంధవుల కుశలముం బ్రత్యేకంబ యిట్లని యడిగె.

విదురుఁ డుద్ధవునిఁ దమవారికుశలం బడుగుట

ఉద్ధవా! నిజనాభికమలంబునం బుట్టినసురజ్యేష్ఠుండు ప్రార్థింప భూలోకమునం దవతరించినపురాణపురుషు లగురామకృష్ణులు దేవకార్యంబు దీఱినం దమలోకమునకుఁ జన దత్తావసరులైనవారు భూమికిఁ గుశలంబుఁ గూర్చి యదుకులమున శూరునిసద్మమునఁ గుశలమున్నవారె? తనచెలియండ్రకుఁ దండ్రియ ట్లుదారుండై యభిమతవరంబు లొడఁగూర్చుచుఁ బూజనీయుండైనవసుదేవుఁడు కౌరవులకుఁ బరమసౌహార్దంబుఁ జూపువాఁడు సుఖమున్నవాఁడె? రుక్మిణీదేవి బ్రాహ్మణుల నారాధించి భగవంతునివలనఁ బూర్వజన్మమున మన్మథుం డైనయెవ్వానిం గనియె నట్టియాదవసేనానాయకుండైన ప్రద్యుమ్నుఁడు సుఖముండునే? పుండరీకాక్షుండు రాజ్యభోగంబుపై నాసఁ దొఱఁగి యెవ్వానికిఁ బట్టాభిషేకంబు సేసె నట్టియదువృష్ణిభోజదశార్హపతి యగునుగ్రసేనుఁడు కుశలమున్నవాఁడె? తొలిపుట్టువునఁ బార్వతీదేవిగర్భమునఁ గుమారస్వామియై జనించి యీజన్మమున వ్రతవతి యగుజాంబవతికి శ్రీపతి యనుగ్రహమున సుతుఁడై యుద్భవించి హరిసముఁ డన వాసికెక్కిన

సాంబుఁడు రథికాగ్రణి సేమమున్నవాఁడె? అర్జునుం గొలిచి యమ్మేటివిలు
కానివలన ధనుర్విద్యారహస్యముఁ బడసియు నచ్యుతుని సేవించి యుత్తర
యాదవులకు దుర్లభం బైనతదీయగతి గడించియు వన్నె కెక్కిన సాత్యకి
క్షేమమున్న వాఁడె? శ్రీకృష్ణునియడుగు లంటినభూపరాగంబుపైఁ బ్రేమ
మున ధైర్య ముజ్జగించి భగవంతుఁడే తనకు శరణం బని ప్రపత్తిఁ జెందిన
యక్రూరుఁ డక్రూరచిత్తుండు కుశలం బుండునే? సురలకుఁ దల్లి
యగునదితికి సరివచ్చుచు వేదత్రయి యజ్ఞవితానరూప మగునర్థమునుం
బోలె నిజగర్భమున నఖిలలోకాధారుం డైనదామోదరుని ధరించి పావ
నత్వంబుఁ గన్న దేవకీదేవి కుశలమున్నదే? చిత్తాహంకారబుద్ధిమనస్సు
లనం జతుర్విధము లగునంతఃకరణభేదములలోనం దురీయం బగుమన
స్సున కధిష్ఠాతృదేవత యగుటం జేసి శాస్త్రములకుఁ గారణం బనఁ
జేర్కొనంబడు ననిరుద్ధుఁడు యాదవులకు వాంఛితపూర్తి సేయువాఁడు
కుశలమున్నవాఁడె? అనితరభావమున నాత్మదైవం బగుగోవిందుని
నిత్యపరిచర్యం గొలుచు హృదీకుఁడు సత్యభామాసుతుండు చారు
దేష్ణుఁడు గదుఁడు మున్నగుతక్కినవా రందఱు నెలమి నుందురే? ఆనాఁ
డాసభలో దుర్యోధనునకుఁ బరితాపంబు గావించిన విజయానువృత్తి
లబ్ధం బగుసామ్రాజ్యలక్ష్మి నుల్లసిల్లుధర్మనందనుండు నిజభుజంబు లగు
విజయవాసుదేవులతోడ్పాటున మర్యాద మెయి ధర్మముఁ బాలించుచున్న
వాఁడె? గదఁ గొని వివిధవిచిత్రగతుల నడచునెడ నెవ్వనియడుగుల
తాఁకు పుడమికి నోర్వరాకుండు నట్టియతికోపనుం డైనభీమసేనుండు
దమకుఁ గీడు రోసినవారిపైఁ బన్నగంబువోలెఁ బెద్దకాలంబుగోలె మది
నాటుకొన్నక్రోధాగ్ని నింతకుఁ గ్రక్కకున్నవాఁడకదా? ఎక్కటిబవర
మున వాలంపసోనం గురిసి కుహనాకిరాతుఁ డైనమహేశ్వరు మెప్పించి
మహారథప్రవరులలోనెల్ల మేటి యనఁ బొగడ్తకెక్కినగాండీవి శత్రు
విజయంబు సాధించి సుఖమున్నవాఁడె? సవతికొడుకు లని యొప్పరికిం
పక తనకన్నబిడ్డల కెక్కుడుగాఁ గుంతీదేవి కూర్మిచేసి చన్నిచ్చి పెంపఁ
బెరిఁగి తమయన్నలు కంటికి ఱెప్పవోలెఁ గాచినఁ బ్రోవు గాంచి కుల
మునకు వన్నె దెచ్చిననకులసహదేవు లింద్రరక్షితం బైనయమృతంబు
సాధించుగరుత్మంతునిచాడ్పునఁ దమధనము విక్రమించి సాధించి సుఖం

తురే? అక్కటా! రాజర్షివర్యుం డైనపాండురాజు లోకాంతరమున కేఁగినం గొడుకులతదర్థంబ కుంతీదేవి యొడ లోముకొనుచుండెడు. ఏకవీరుం డైనయప్పాండురాజు వి ల్లొక్కఁడే తనకు సహాయంబుగా నొక్కరథంబుతో నీనేలనాలుగుచెఱఁగులు గెలిచి యేలె నంతటివానిం బోకార్చుకొన్న పృథాదేవి వనట చెప్పఁ గొలఁది గాకున్న నాయమకుఁ దండ్రి సచ్చి దిక్కు గానికొడుకులం గావ మేనుదాల్పవలసె. పాండవులకుఁ గీడు రోసినదానం బరలోకగతుఁ డైనపాండురాజునకుఁ దనతమ్మునికి ద్రోహముఁ జేసియు నెల్లవిధములఁ దన్నుఁ దనకొడుకుల ననువర్తించుచుఁ దమ మేలు చింతించుసుహృదుఁ డగునన్ను నగరు వెడలనడిచియు నాధృతరాష్ట్రుఁడు నిరయమునఁ బడునొకో యని యాతనియాగామిగతిం దలపోసి చింతిల్లుదు. మానుషవేషవిడంబనంబునం జేసి మనుజుల మనోవృత్తులకు భ్రాంతిఁ గూర్చు నాశ్రీహరిమహిమం బరయుచుఁ దత్ప్రసాదంబునం జేసి యితరులకుఁ దెలియరాకుండ గూఢవర్తనుండనై గతవిస్మయుండనై తిరుగుచుండెద. విద్యామదము ధనమదము కులమదమను త్రివిధగర్వములం గన్ను గానక పుడమి గ్రక్కదల సేనల నడపించు కౌరవులనెన్నఁడో తెగఁ జూడ వలంతియయ్యు నయ్యుపేంద్రుండు ప్రపన్నార్తిహరణేచ్ఛం జేసి పెద్దకాలం బుపేక్షించె నంతియకాని యతండు నిక్కంబలిగిన నీశూరమానులవృత్తి లోక మెఱుఁగకుండునే? జన్మశూన్యుండగువానికి జన్మ మెత్తుట దుష్టశిక్షణార్థంబు నిష్క్రియుండైన వానికిఁ గర్మాచరణంబు లోకమునం గర్మసంప్రదాయప్రచారణార్థంబు ఇంతియకాని గుణాతీతుం డైనపరమపురుషునకు దేహయోగంబు కర్మతంత్రంబు ననుట వాస్తవముగా నెట్లు పొసఁగు? ప్రపన్నులగునఖిలలోకపాలురయుఁ దనశాసనము మెయి నడచుతక్కినమహాత్ములయుఁ గార్యములుదీర్ప యదుకులమునం దవతరించి పవిత్రకీర్తిం దనరునమ్మహాపురుషుని చరిత్రం బో సుహృన్మణీ! చెప్పవే యని విదురుం డడిగె.

### ఉద్ధవుఁడు శ్రీకృష్ణనిర్యాణమునకుఁ జింతిల్లుట

అత్తెఱంగున విదురుఁడు ప్రియవృత్తం బడుగుటయు మహాభాగవతుఁ డైనయుద్ధవుఁ డావాసుదేవుం దలంచుకొనుచుఁ దదీయవిరహోత్కంఠాతిశయమునం జేసి యప్పు డతనికిఁ బ్రతివచనంబు సెప్పక మిన్న

కుండె. అవి యట్ల యగు నెట్లంటేని అయ్యుద్ధవుఁ డైదేండ్లప్రాయము ననే తోడిబాలురతో నాడునప్పుడే పెఱయాటలపై మనసు పెట్టక కృష్ణపరిచర్యారూపము లగునాట లాడుచుఁ బ్రాతర్వేళఁ దల్లి కుడువఁ బిలిచిన నయ్యాట విడిచి రాకుండె. అట్లు పిన్ననాఁటంగోలె నే నెపమున నైన వాసుదేవుని సేవించుచు వయసు చెల్లించి తదీయదివ్యచరణము లపైఁ జిత్తం బిడినయప్పావనున కప్పుడు తత్కాలం బడిగిన నాతఁ డంబ నడచినవృత్తంబు వివరింప నెట్లు నోరాడు? కృష్ణచరణామృతమున సుఖించి తీవ్రతద్భక్తియోగమున మగ్నుండైనయుద్ధవుండు ముహూర్త మాత్రంబేమియుఁ బలుకక యూరకుండి మేనెల్ల గగురుపారఁ గన్నుఁ గవం గన్నీరు జాలువాఱ నౌరా! యింతటిపరమభక్తికతన నీతండు కృతార్థుండయ్యె నని యప్పుడు ప్రత్యక్షముగఁ జూచువిదురుఁ డూహించువిధమున భగవంతునిపైఁ దనకుఁ గలస్నేహరసపూరమున నోలలాడుచు మెల్లమెల్లన భగవల్లోకమునుండి నరలోకమునకుఁ దనమనంబు దిగిచి కన్నులనీళులు దుడిచికొనుచుఁ గృష్ణచర్యలు దలపోసి తాన తనమనంబున నబ్బురంబు నందుచు నవ్విదురున కిట్లనియె.

## ఉద్ధవుఁడు విదురునకుఁ గృష్ణనిర్యాణంబు చెప్పుట

కృష్ణభానుఁ డస్తమించినం గాలం బనుక్రూరపన్నగంబువాతఁ బడి సంపద లెడలినమాయిండ్లఁ గుశలం బేమని చెప్పుదు? ఈలోకము భాగ్యశూన్యం బయ్యె. యాదవులన్నను మిక్కిలి యదృష్టహీనులు. క్షీరసాగరంబునందలి మీ లందు జనించి తమతో మెలంగుచుండినచంద్రు నెఱుంగనిచందమునఁ బెద్దకాలంబు సహవాసంబు సేసియు హరి నెఱుంగనేరరైరి. వారు పరేంగితం బెఱుంగ నేర్చినప్రోడ లయ్యుఁ జిరకాలంబు సహవిహారంబు సల్పుచుండియు సర్వేశ్వరునంతటివాఁడని తెలియఁజాలక కేవలము యాదవప్రవరుఁగాఁ దలంచుచుండిరి. యదుకులమునం దవతరించినకారణంబున నమ్మహానుభావుఁడు దమలో నొక్కఁడ యని దేవమాయకుఁ జిక్కి కొందఱు తలపోయుచుండినను శిశుపాలుఁ డాదిగా మఱికొంద ఱాగోవిందునితోడఁ బగ సాధించుచుండినను నాత్మఁ డగుహరిపై నాటినమతి వారియాటలకు భ్రమింపమి నాదుభాగ్యంబు. తపమ్ము లనుష్ఠింపక కన్నులతనివి చెందనిమునులకు

లోకలోచనంబైన నిజబింబముం జూపి యాపరమేశ్వరుండు గ్రమ్మఱ నుపసంహరించె. నిజయోగమాయామహిమంబుం జూపంగ మర్త్యలీలకు సాధనంబుగా హరి తాను గ్రహించిన యాదివ్యమంగళవిగ్రహం బలంకారంబులకు నలంకారంబు, సౌభాగ్యమునకుం బరమాధిష్ఠానంబునై యతనికి నద్భుతంబు గొల్పెడుకరణిం జూడ నొప్పె. ధర్మరాజు రాజసూయమున ముల్లోకములవారును నేత్రానందకందళం బైనయాసుందరగాత్రంబుఁ గనుంగొని విధాతసృష్టిచాతుర్యమెల్ల దీనికిఁ గ్రిందని తలంచిరి. అనురాగమున నెసక మెసంగు లేనగవులం దఱంగలించు లీలావిలోకనములం బడసి యలుక మాని గోపకామిను లాగోపాలునిపై మనసు నిల్పి తమపను లెల్ల నుజ్జగించి తదీయగాత్రవిలాసము నెడ తెగక కనుంగొనుచుండిరి. తనశాంతస్వరూపంబు లగుసజ్జను లితరులవలనిపీడలం గుడుచుచుండ నట్టివారలం బ్రోవ నెంచి కరుణించి తాను జన్మరహితుండయ్యు నాహరి మహాభూతరూపమున నిత్యసిద్ధుండయ్యు నగ్ని సమిత్తులలోనం బ్రత్యేకం బావిర్భవించువిధమున నవ్యక్తయోగమునం బరిచ్ఛిన్నకాయంబుఁ గైకొనియె. జన్మరహితునకు జన్మంబును వసుదేవసదనంబున మానుషవిడంబనంబును ననంతవీర్యునకుం బరులవలనివెఱపు గదిరినట్లు పురము వెడలి వ్రేపల్లియలో విడియుటయుం దల్లిదండ్రులకాళులకు మ్రొక్కి యోయంబ! యోతాత! కంసునకు వెఱచి మీకుం బరిచర్య గావింపని తప్పెన్నక మాయెడం బ్రసాదింపుం డని వేఁడికొనుటయుం దలపోసిన నామనంబు గుందెడు. తన కనర్హము లగుపనులైన లోకానుగ్రహార్థం బమ్మహామహిముం డట్టు లాచరించె. తానించుకయలుకతో బొమముడి పెట్టిన నయ్యవధి యముండై భూభారమెల్ల నపనయింపం జాలె నట్టి యాలోకేశ్వరుచరణారవిందపరాగపరిమళంబు గొన్నవాం డెట్టులు మఱవ నేర్చు? ధర్మజురాజసూయమున నిత్యవిద్వేషి యగుశిశుపాలుండు యోగేశ్వరులు యోగబలమునం బడయం గోరుసిద్ధి నావాసుదేవునివలనం బడయం గాంచుట మీకుం బ్రత్యక్షంబకదా. అట్టివానివియోగం బెవ్వండు సైంపనోపు? అట్లే మఱికొందఱు నానాదేశరాజులు మహాసమరమున నయనాభిరామం బైనకృష్ణముఖారవిందంబుం గన్నులం గ్రోలుచు నర్జునునియస్త్రములం బరిపూతులై తదీయపదం బధిగమించిరి. తనకు

సముఁడధికుఁడును లేమింజేసి తానే సర్వోత్తరుండై లోకేశ్వరు లగుత్రిపురుషులకు నధీశ్వరుండై నిజపరమానంద శ్రీపరిపూర్ణుండై యవాప్తసమస్తకాముఁడై పూజింప వచ్చిన పెద్దకాలంపునాఁటి లోకపాలురెల్ల మస్తకంబులు నేల మోపి తనయడుగులకు మ్రొక్కునెడఁ దదీయకిరీటమణిగణసంఘర్షణంబునం బొడముసులివు స్తోత్రపాఠరవముగాఁ గవ్వు లుత్ప్రేక్షింపఁ బెంపు గాంచియు నా శ్రీహరి తా నొక్కయుగ్రసేనునకుఁ గింకరునట్టు లతండు గద్దియపైఁ గూర్చుండుతఱి నిలిచి "దేవా! యవధరింపు" మనుట మున్నుగా విన్నవించుట పరికించినం దదీయభృత్యు లగు మామనంబులఁ జింత గదిరెడు. అద్దిరా! పూతన తనచన్నులలో విషము డాఁచికొని చంప వచ్చిన నయ్యసాధ్వికి దాది కర్హం బగుగతి నొసంగె. పరమదయాళుం డైనయాపరమపురుషుం బొఱంగి మఱియెవ్వని శరణంబని యాశ్రయింతుము. చిత్తములం గ్రోధావేశసంరంభముసం బేర్చి పోరికి నడచినయసురులును గరుడారూఢుం డైనయాచక్రధరుం గాంచగలుగుటం జేసి భాగవతులే యని తలపోయుదు.

### ఉద్ధవుఁడు విదురునకుఁ గృష్ణచరిత్రసంగ్రహము చెప్పుట

బ్రహ్మదేవుఁడు ప్రార్థింప నీపృథివికి సుఖము గావించువాఁడై భగవంతుఁడు వసుదేవునకు దేవకియందు భోజేంద్రబంధనాగారమున జనించి కంసునకు వెఱచుతండ్రినిమిత్తమున నాతఁడు నందవ్రజమునకుఁ జని గూఢతేజుఁడై యచ్చటబలభద్రునితో నేకాదశవత్సరంబులు వసియించె. అప్పు డచ్చట వీనులకు విందుగా సులివు నేయుపులుఁగుల దండడిం దనరునానాతరునికరములఁ జల్లనీడలు పచరించుయమునాతీరోపవనముల బసిబాలుండై గోపాలబాలురతో నాడుచుఁ గ్రేపుల మేపుచు నొక్కొక్కయెడ నవ్వుటాలకుఁ బలవించునట్లు గన్నట్టుచు నొక్కొకయెడఁ జిఱునగవు దులకించుచు నొక్కొకయెడ గోదమసింగము తెఱంగునఁ జూచుచు బాలక్రీడలఁ బలుతెఱంగుల వ్రేపల్లియవారికిఁ జూపె. అంతఁ గొంతవయస్సు హెచ్చిన బాల్యదశనాతండు సితధేనువృషభసాంద్రం బైనగోకులంబు మేప గోపాలురతో నెలుంగిచ్చుచు నడవుల కరిగి యచ్చట శ్రవణరమణీయం బగు వేణుగానమున నందఱిడెందముల నానందంబు గ్రందుకొల్పుచుఁ గంసుఁడు పన్నిన

మాయచేఁ దన్నుఁ బెగఁ జూడ నేతెంచిన కామరూపు లగుమాయావుల నెల్ల నవలీలం గుమారుండు క్రీడార్థనిర్మితంబు లగుతృణమయసింహాదుల పెఱుచు తెఱఁగునం బెగటార్చె. మఱియుఁ గాళియునివిషము దవిలి చెడియున్న యమునమడుపునీళులు త్రావి దుర్దశం జెందినగోపాలురను గోగణంబులను బ్రదికించి కాళియనాగుని నిగ్రహించి యమ్మడువు వెడల నడిచి యయ్యమునాహ్రదంబు పరిశుద్ధముగాఁ జేసి తదుదకమునకుఁ బానార్హత్వంబుఁ గూర్చె. అతిసమృద్ధ మగుధనమునకు సద్వ్యయంబు కర్తవ్యం బని యెంచి యంతకమున్న గోపాలు రేఁటేటఁ జేయు నింద్రయాగమునకుఁ బ్రతిగా నందగోపునిచే గోపూజ సేయించి దాని కలిగి యింద్రుఁ డొక్క పెట్టు నవమేఘములు ఘోరవర్షము గురియఁ బంచిన నాయతివృష్టి సైరింప నేరక తల్లడిల్లు గోగోపగణంబులఁ గాంచి గరుణించి గోవర్ధనాద్రి నెత్తి యావానవలని సేగి కొంచెమేనియు వారికిఁ గలుగకుండ యవ్వాన వెలియునందాఁక గొడుగురీతి నా కొండఁ ఎసకేల నునిచి కొని దానిక్రింద గోవులనుం గోపాలుర నుండ నియమించి యాపదఁ దప్పించె. శరత్సమయమునఁ దేటవెన్నెలఁ జిగురుఁ దఱఁగలించు మునుమాఁపువేళలందు గోపికాజనమండలమున రాసవిహారంబు సలుపుచు శ్రవణమధురముగ రమణీయవేణుగానం బొనర్చుచుఁ గ్రీడించుచుండె. ఈట్లేకాదశవర్షములు వ్రజమున వసించి యటఁ దల్లిదండ్రులకు సుఖముఁ గూర్పనెంచి బలదేవుఁడును దానును మధుర కరుదెంచి రాజసింహాసనస్థుండైనతనశత్రుని గంసునిఁ గ్రిందఁ బడం ద్రోచి వానిప్రాణములం గొని యంత నిలువక నేలపయి నీడ్చి మాతాపితృమానసంబుల ముదం బొదవించె. ఇట నుపనయనసంస్కారంబు వడసి సాందీపనితోడ సకలవేదముల సాంగముగ సకృదుపదేశమాత్రమునఁ జదివి తత్పుత్త్రుం గొనిపోయి సాగరంబున డాఁగినపంచజనుం డనునసురుని సముద్రమధ్యముఁ జొచ్చి రూపుమాపి గురుపుత్త్రుం దెచ్చి గురుదక్షిణగా సమర్పించి యయ్యాచార్యప్రసాదంబు వడసె. రుక్మిణీస్వయంవరసమయమున మహాలక్ష్మి కైనవచ్చున ద్దేవిరూపసౌందర్యంబు విని కామార్తులై మూఁగిన రాజలోకంబుతలపైఁ గాలువెట్టి పరస్పరానురాగసంభృతప్రీతిధన్యయగు నాభోజకన్యను దనకు భోగ్యంబైనదాని గరుడుఁడు సురల నెల్ల

గెలిచి సుధఁ దెచ్చినకైవడిం గ్రహించె. కోసలేశ్వరుం డైననగ్నజిత్తు తన కూఁతునకు స్వయంవరము పాటించిన నక్కడ కేఁగి యందు శుల్కంబుగా నేర్పఱిచినట్టి ముకుద్రాటం గట్టనిబలవంతంబు లగునాఁబోఁతుల లాఁతు లకుఁజెనక రానివానిం గీటడఁగించి దాన సిగ్గుమాలియు నజ్ఞానమున స్వయంవరకన్యకం గామించువిలుకాండ్రనెల్ల నిజాస్త్రముల నిగ్రహించి యానాగ్నజితిం బెండ్లి యయ్యె. నారదుండు దెచ్చియిచ్చిన పారిజాత కుసుమంబు రుక్మిణీదేవి కొసఁగినదాని కలిగినసత్యభామకుఁ బ్రియము సేయువాఁడై యంతకుమున్న నరకాసురుం డపహరించినయదితికుండ లము లయ్యసురం జంపి సాధించి యద్దేవజనని కర్పింప దివి కేఁగినప్పు డప్పారిజాతపాదపంబు నందనవనమునం గొని తెచ్చునెడ నాఖండలుండు స్త్రీవాక్యముల నాదరించి సేనాయుతుండై యడ్డగించిన నాతనియత్నంబు కొనసాఁగనీక తనపూనికి నెఱవేర్చె తనకు మేలు గూర్చుపరమేశ్వరుని యుద్యమమున కడ్డగింపఁ బూనినయింద్రుఁడు నారీజనంబులకుఁ గ్రీడా మృగప్రాయుం డని వచనీయుం డయ్యె. నరకాసురుని దురమునఁ జక్రాయుధమునఁ దెగఁజూచుటయు వానితల్లి భూదేవి తాన యేతెంచి వేఁడికొనిన నద్దేవికిఁ బ్రియంబుగా నరకాసురురాజ్యముం దత్పుత్త్రున కొసంగి వానియంతఃపురంబులోనికిఁ జొచ్చి యచ్చట నతండు బందివెట్టినం జిక్కువడియున్న రాజకన్యలు తటాలున లేచి కూర్మి సిగ్గు సంతసంబు నొండొంటం బెరయనునుజూడ్కులఁ దన్నుఁ గటాక్షించుటయు దీన దయాళుఁడు పరేంగితజ్ఞుఁడు గావునఁ దాను నిజమాయామహిమమున నయ్యందఱయిండ్లలోనం బ్రత్యేకంబ చూపట్టుచు నందఱనుం బెండ్లి లిగ్గై: తననగరికిఁ గొని వచ్చి యెవ్వరియెడ నేనియు నించుకేనియుఁ బర స్పరభేదము దోఁపని తెఱంగున నందఱియెడఁ దుల్యానురాగంబు నెఱ పుచు భోగసుఖముల వారలం దనుపుచు నొక్కొక్కకన్యయందు వేఱు వేఱ పదుగురుపదుగురుకొడుకులం దనకు సాటివచ్చువారిం బడసె. కాల యవనుఁడు జరాసంధుఁడు సాల్వుఁడు మున్నుగాఁ గొందఱు నగరు ముట్టడించిన నావీర్యదుర్దములం గెల్చి ముట్టడిం బాపి తనవారికిఁ దేజు గూర్చె. మఱియు శంబరుఁడు ద్వివిదుఁడు బాణుఁడు మురుఁడు పల్వ లుఁడు దంతవక్త్రుఁడు మున్నుగాఁ బెక్కండ్రుక్కుమిగిలి చెనక వచ్చు

టయు వారి నెల్లఁ జంపించె. పుడమి గడగడ వడఁకఁగఁ దమ సేనలు నడిపించు కొనుచు దుర్మంత్రపరిపాకమునం జేసి శ్రీయు నాయువుం దఱిఁగిన నీయన్న కొడుకగు దుర్యోధనునకుఁ గర్ణశకునిదుశ్శాసనమతంబు చెల్లించువానికి బాసటయై కురుక్షేత్రమునం గూడిన నానారాజలోకంబుఁ దెగఁజూచి తుదివృకోదరుగదాఘాతంబునం దొడలు విఱిఁగి నేలం గూలిన యా దుర్యోధనుం జూచియు భీష్మద్రోణులయు భీమార్జునులయు బలమునం దెగినమూఁక

**ఉద్ధవుఁడు కృష్ణుని యదుకులోపాయచింతనంబు చెప్పుట**

లెల్ల బదునెనిమిదియక్షౌహిణులకాని యిది యొక పెద్దగాదు, దీనం బృథివికి భారం బపనయించినట్లు గాదు, యదుకులమువలని భారము భూదేవికి దుర్భరంబై యుండెడు నని తనమది నెంచి దుర్యోధనుండు దెగుటకు నంత సంతసింపక యాదవవినాశమునకు వెరవు వెదకుచు వీరిలో నన్యోన్య కలహంబు పుట్టి వీరొకళ్లొకళ్ల బరిమార్పఁ బూనినం గాని యీ పెద్ద భారము దీర్పరాదు, దానికి నేను బూనవలయు నప్పటికి వీరెల్ల మాయ మగుదు రింతకంటె నొండు వెరవు లేదని నిశ్చయించె. అట్లు కృతనిశ్చయుండై పుండరీకాక్షుండు ధర్మరాజును నిజసామ్రాజ్యంబున సుప్రతిష్ఠితుం గావించి సాధుమార్గంబు నెఱపి సుహృదులకు సంతసంబుఁ గూర్చి యుత్తరాగర్భమున నున్న యభిమన్యుని తేజంబు నశ్వత్థామబ్రహ్మాస్త్రమునం జెడకుండఁ గాచి పాండవకులంబున కంకురంబు నాటి యట నజాతశత్రునిచే మూఁడశ్వమేధములు సేయించె. అప్పాండవజ్యేష్ఠుండును దమ్ములసహాయమున నిస్సపత్నముగ ధర్మము దప్పక రాజ్య మేలుచుఁ గృష్ణు నఖిలవిధముల ననువర్తించియుండె. భగవంతుఁడును లోకవేదమార్గానుగామియై మందహాససుందరవిలోకనంబున నమృతసమమధురవచనంబులను నిర్దోషచారిత్రంబునను శ్రీనిలయ మగు గాత్రమునను నీలోకంబు నాలోకంబును విశేషించి యాదవుల నుల్లసిల్లఁ జేయుచు రేలు పరమోత్సవపర లగు నుత్తమసీమంతినులకుఁ జెలిమి వాటించుచు ద్వారవతీనగరమునందు సంసారమునం దత్యంత సక్తునియట్లు గన్పట్టుచు వస్తుగతిం బ్రకృతిపురుషవివేకలక్షణం బైన సాంఖ్యమునం బరినిష్ఠితుండై యుత్తమగృహస్థవర్తనంబు నడపుచున్నంత బహువర్షములు సనియె. అంత నతనికి భోగములపై విరాగంబు

వాఁడవె. స్వాధీనభోగములందు భగవంతునకే విరక్తి గలిగెనన్న పైవాధీనభోగములయెడ పైవాధీనుం డగుపురుషునకు నిర్వేదంబు గలుగవలయు నని చెప్పవలయునే? యోగమున యోగేశ్వరుం డైన శ్రీహరి ననువర్తించునుత్తముఁడు నశ్వరము లగుభోగములపై విరక్తిం గొనుట నిసర్గజంబు. అంత నొక్కనాఁడు ద్వారవతిలోనం గ్రీడించుచు యదుభోజకుమారకులు వివేకంబు దప్పి యపచారం బొనర్చుటయు మునులు భగవంతునిపూర్వోక్తనిశ్చయం బెఱింగినవారుగావునఁ దన్మతానుసారమున వారికి శాప మొసఁగిరి. అటఁ గొన్ని నెలలకు యదువృష్ణిభోజాంధకాదులు దైవమోహితులై ప్రభాసక్షేత్రమునకు బహుళద్రవ్యములం గొని సంతసంబున నరిగి యటఁ దీర్థస్నానము లొనర్చి పితృతర్పణంబులుదీర్చి బ్రాహ్మణులకు పయశ్శీలాదిబహుగుణోపేతంబు లగుగోగణంబులను హిరణ్యరజతములను శయనీయంబులను జేలాజిన కంబళంబులను రథగజతురంగంబులను గన్నియలను సస్యపుష్టంబై చాలినంతవృత్తిఁ గల్పింపఁ జాలినమాన్యక్షేత్రంబులను జవిఁ దనరు మృష్టాన్నంబు నిచ్చి భగవదర్పణంబుఁ గావించి తమప్రాణములు గోబ్రాహ్మణపరిరక్షణార్థం బని నిశ్చయవంతు లగునయ్యాదవులు ప్రణమిల్లిరి.

**ఉద్ధవుఁడు విదురునకు యదుక్షయంబుఁ గృష్ణనిర్యాణంబును సూచించుట.**

యాదవు లవ్విధమున విప్రులం బూజించి తదనుమతి వడసి వారుణిఁ ద్రావి తత్పానమునం గైపెక్కుటయు వివేకం బెడలి దుర్వచనములం బరస్పరంబు నొంచుచున్నంత విపర్యంతుండు పడకురఁ గ్రుంకునప్పటికి సురాపానవిషమీకృతచేతస్కు లగునయ్యదువీరులకుఁ దమలోఁ బరస్పరసంఘర్షమునం జేసి వెదురుటడవికింబోలెఁ గ్రోధానలంబు పెచ్చుపెరిఁగి యొండొరులఁ బరిమార్పఁ జొచ్చె. అప్పుడు భగవంతుఁ డాత్మమాయాయోగమునం గలిగినతదవస్థం గాంచి తనలో మెచ్చుచుఁ దాను సరస్వతీనదికిఁ జని యం దాచమించి శుచియై తరుమూలమునఁ గూర్చుండఁ బోవుచుఁ దనకుల ముపసంహరింపఁ బూనినయాభక్తార్తిహారుండు బదరీవనంబునకుఁ బొమ్మని నాకుఁ జెప్పిన నిప్పు డెయ్యది కాఁగలదో చూతు నని యెంచి తత్ప్రకారంబు నడుపు టుజ్జగించి యాభగవంతునిచరణారవిందములఁ బాయ నొల్లక యే నతనివెంటఁ జని

యానసరస్వతీనదీతీరమునం గోమలం బగునొక్క యశ్వత్థపాదపమూల మున నొక్కండ డాకలితొడపై వలపలిపాదం బిడి కూర్చున్న వాని నిరాశ్రయుం డైనవాని శ్రీసమాశ్రయుం డైనవాని నీలవర్ణుం డయ్యు దేదీప్యమానదివ్యతేజమునఁ దేజరిల్లువాని రజోగుణరహితుం డైనవాని శాంతరూపుం డైనవానిఁ జారులోచనుం డైనవానిఁ బీనాయతబాహా చతుష్టయమున విలసిల్లువాని లలితపీతకౌశేయాంబరంబుల వెలుంగు వాని విషయసుఖముల వర్జించినవాని నాత్మానందపరిపూర్ణుం డైన వానిం గన్నులారఁ గాంచితి. అట్టియెడ నచ్చటికిఁ బరమభాగవతుండు పారాశర్యసఖుండు పరమసిద్ధుండు నగుమైత్రేయమునీంద్రుండు లోక ములఁ ద్రిమ్మరువాఁడు యదృచ్ఛమైఁ జనుదెంచె. నిత్యభక్తుం డైన యమ్ముని ప్రమోదభావమునం దల వాంచి వినుచుండ నప్పుండరీకాక్షుండు ప్రేమమునఁ దళుకొత్తులేనగవు మిగులుక్రేఁగంటిచూపుల నాపరితా పంబు వాపుచు నా కిట్లనియె. ఉద్ధవా! నీవు పూర్వజన్మమున వసువు లలో నొక్కండవు. అప్పుడు విశ్వస్రష్ట లగువసువు లందఱు గూడి యొన ర్చినసత్త్రమున నీవు మదీయసిద్ధిఁ గోరి నన్నుఁ బూజించితివి. నీమనమునఁ గలకోర్కి యే నెఱుంగుదు. అయ్యది యితరులకు దుర్లభం బైన నీ కొసంగెద. నరలోకము విడిచి నిజపరమపదమునకుఁ బోవ నెంచి యేకాం తంబున నున్న నన్ను శుద్ధభక్తిం జూడఁ గలిగి మేలుచేసుకొంటివి గావున నాయనుగ్రహమునకుఁ బాత్రుండ వైతివి. సాధువర్యా! యింక నీకుఁ బునర్జన్మంబు గలుగదు. ఇదియే కడపటిమేను. తొల్లి యాదిసృష్టి సమయమున నేను మదీయనాభికమలమునఁ బుట్టినబ్రహ్మకు బోధించిన మదీయతత్త్వప్రకాశం బగుజ్ఞానము పండితు లెల్లపుడు భాగవతం బని పేర్కొనంగ నొప్పారునది నీమదిఁ బోఁచెదు మని యప్పరమపురుషుండు పరమాదరమునం బలికిన నాజగన్నాథుని ప్రతిక్షణానుగ్రహమునకు భాజనం బైతి నని యేన నామదిలో నుప్పొంగుచుఁ బులకాంకిత గాత్రుండనై కన్నుల నానందబాష్పములు గ్రమ్ముదేర డగ్గుత్తిక వెట్టి యప్పరమేశ్వరున కిట్లని విన్నవించితి. సర్వేశ్వరా! నీపాదముల నాశ్రయించువారికి ధర్మార్థకామమోక్షములం దొక్కటేనియు దుర్ల భంబు గాదు. భవదీయపాదపరిచర్యయే కోరుచుండు నేను వానినొల్లను.

నిష్క్రియుఁడగునీకుఁ గర్మాచరణంబును జన్మరహితుఁడగునీకు జన్మంబును గాలాత్మకుఁడవై యెల్లవారు నీకు వెఱవ నిజనిరుపమానవీర్యమునఁ దేజరిల్లునీకు శత్రుభయంబును దాన నన్యదేశగమనంబును దుర్గసమాశ్రయంబును నాత్మారాముఁడగునీకు స్త్రీశతసహస్రసేవనంబును నప్రతిహతం బగునఖండాత్మబోధమున నొప్పునీకు మంత్రాలోచనమున నాయట్టివానిం బిలిచి ముగ్ధునివిధమున నేకాంతమునం దవధానమున నడుగుటయు ననునిట్టివి నీ వెందుల కాదరింతువో గాని సర్వజ్ఞుఁడు సర్వేశ్వరుఁడు సర్వాత్ముఁడు నగునీవు నిట్టిచేఁతలపైఁ జిత్త మిడు నెడ విద్వాంసులును నిశ్చయం బెఱుంగనేరక సంశయప్రాప్తు లగుదురు. నీవు పరమేష్ఠికిఁ దొల్లి బోధించినస్వాత్మరహస్యప్రతిపాదకం బైనపరమసంపూర్ణజ్ఞానముఁ దెలియ నే నర్హుఁడ నని యెంతు వేని నాథా! యెఱింగింపుము. అనాయాసమున సంసారసాగరంబు దాఁటుదు నని నామది నున్నది విన్నవించుటయు వెన్నుండు నన్నాదరించి యాత్మపరమగతి నుపదేశించె.

## ఉద్ధవుఁడు విదురుని వీడుకొని బదరికారణ్యమున కరుగుట

లోకారాధితపదుఁడై యాచార్యుఁడైనయాభగవంతునివలన నాత్మతత్త్వబోధమార్గం బెఱింగి యే నమ్మహాత్మునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి తదీయదివ్యదర్శనంబునఁ బరమాహ్లాదంబుఁ దద్వియోగంబున నార్తినిం గని తదీయదివ్యక్షేత్రం బై తొల్లి నరనారాయణులు మృదుతీవ్రంబుగ దీర్ఘతపం బనుష్ఠించినబదరికాశ్రమమునకుఁ బోవుచున్నవాఁడ నని యుద్ధవుండు సెప్పిన విని విదురుం డోర్వరానిసుహృద్వధంబునకుఁ గొండొకవడి శోకించి యట నిజసమాజవిజ్ఞానవిభవంబున దైవతంత్రంబునకు వగవం బని లే దని యూఱడిల్లి కృష్ణభక్తులలో నుత్తముఁడు భాగవతసత్తముఁడు నగునయ్యుద్ధవుని బదరీవనమునకుఁ జనుచున్నవానిం బిలిచి విశ్వాసముతో నిట్లనియె. మహాత్మా! యోగేశ్వరుం డైనసర్వేశ్వరుండు నీ కుపదేశించిన యాత్మతత్త్వప్రకాశక మగు నాజ్ఞానము నాకుఁ బ్రసాదింపుము. విష్ణుభక్తులు దమభృత్యులకార్యములు నెఱవేర్పనకదా పుడమిలోఁ జరింతు రనియడుగుటయు నయ్యా! మర్త్యలోకంబు విడువఁ బూని పురుషోత్తముఁడు నీ కాత్మజ్ఞానంబు స్వతస్సిద్ధమైయున్న నాహార్యోపదేశమున నయ్యది మఱింత యర్థవంతం బవు

ననితలంచి కాఁబోలు నాకుమున్న నాకని మైత్రేయునికి నిర్దేశించెఁ గావున నమ్మునిఁ నుపాసించి యాత్మవిద్య నీ వధిగమించుట లెస్స యని చెప్పి హరికథాసుధాస్వాదనంబునఁ దాపంబు నీఁగుచు నారేయి యుద్ధవుండు విదురునితో యమునానదీపులినతలమునం గడపి యట వేఁకువం బదరి కారణ్యమున కరిగె ననుచున్నంతఁ బరీక్షితుండు శుకయోగీంద్రుం జూచి మునివరేణ్యా! మహారథప్రవరులలో నుత్తము లగుయాదవవీరు లెల్లను బ్రహ్మాదు లగుమువ్వురు లోకనాయకులకుం బ్రభు వగుశ్రీకృష్ణుండును దేహముల విసర్జించిన నుద్ధవుం డేల మిగిలియుండెడు నని యడిగిన నా యభిమన్యునందనునకు వ్యాసనందనుం డిట్లనియె. నరేంద్రా! బ్రహ్మ శాపము నెపమునం గాలముచే సర్వసమృద్ధ మగునిజకులము నుపసంహ రించి తన దేహముఁ జాలింపఁదలంచి దామోదరుం డే నీలోకంబు విడిచిన పిదప మదీయతత్త్వజ్ఞాన మధికారులకు బోధింప నాత్మవంతుఁ డగునుద్ధవుఁ డొక్కరుండే యర్హుఁడు. సత్త్వాదిగుణవిక్షోభంబుఁ గాంచనికారణ మున నాతండు నాకంటె నెందునుం దక్కువ గాఁడు. కావున మదీయ జ్ఞానము నీలోకమున వెలయించుచు నాతం డిచ్చటన యుండెడు నని నిశ్చ యంబుసేసి యతని నద్దాని కియ్యకొలిపిన నయ్యుద్ధవుండు శాస్త్రకార ణంబగునా త్రిలోకగురునానతిఁ దలఁ దాల్చి బదరీవనంబున కరిగి సమా ధితో నీశ్వరు నారాధించె.

## విదురుఁడు గంగాతీరమున మైత్రేయుం గాంచుట

విదురుఁడును లీలార్థంబు మానుషాకారంబుఁ గొన్నహరిమహా నీయచరిత్రంబులను ధీరులకు ధైర్యసంపాదకంబు జ్ఞానహీనులై విహ్వ లాత్ములైనయితరుల కత్యంతదుష్కరంబు నగుతదీయదేహన్యాసంబును నాభగవంతుఁడు దాను నరలోకంబు విడుచునెడఁ దనపైఁ జిత్తం బునిచి యాదరించుటయు నుద్ధవునివలన నెఱిఁగి యయ్యుద్ధవుఁ డరిగినపదంపడి ప్రేమవిహ్వలుండై తదీయవియోగమునకుఁ గొంతవడి చింతించి యటఁ గొన్నినాళ్లకుఁ గాళిందీతటంబు వాసి మైత్రేయమునీంద్రుండు వసియించు మందాకినీతీరమునకుఁ జనియె. చని గంగాద్వారమున సుఖాసీనుఁడై యున్నయమ్మైత్రేయమునీంద్రునిఁ గోలఁది యిడరానిమహాబోధమున వెల యువాని భగవద్భక్తిపరిపూర్ణితుం డైనవాని సౌశీల్యాదిగుణముల నిత్య

తృప్తుం డైనవానిం గాంచి విదురుండు మెల్లమెల్లన డాయ నరిగి ప్రణ
మిల్లి యిట్లని యడిగె.

### విదురుఁడు మైత్రేయుని నాత్మతత్త్వవిషయం బడుగుట

మునీంద్రా! నరుఁడు సుఖములఁ గోరి కర్మముల నాచరించినను
దాన నాతండు సుఖమునొందఁడె దుఃఖక్షయమునొందఁడె నాత్యంతికముగఁ
బొందక క్రమ్మఱ దుఃఖముఁ గుడుచుచుండు. ఇట్టిసంసారమునందు మా
కెయ్యది కర్తవ్యంబై యుండు నద్దాని నీవు సర్వజ్ఞుఁడవు గావున నిరూ
పింపుము. పురాకృతకర్మపరిపాకమునం జేసి శ్రీకృష్ణసేవావిముఖులై యధ
ర్మాసక్తులై యత్యంతదుఃఖితు లగుజనుల ననుగ్రహించుతదర్థంబ కాదె
పరోపకారశీలు రగుమీయట్టిపరమభాగవతులు నిక్కం బీలోకమునం
జరింతురు. కావున నోసాధుశేఖరా! మాకు సుఖరూప మగుమార్గము
బోధింపుము. ఆమార్గమున నేము భగవంతు నారాధింతుము. దాన
నాపరమేశ్వరుండు భక్తిపరిపూత మగుహృదయంబున సన్నిహితుండై
యనాదివేదప్రమాణం బగునాత్మాపరోక్షజ్ఞానముఁ బ్రసాదించు. త్రిగుణ
మాయానియామకుఁ డవుటం జేసి యాత్మతంత్రుఁ డైన భగవంతుఁడు
పురుషావతారం బెత్తి యేకర్మముల నొనర్చె? మఱియుఁ దాను నిరీ
హుఁడయ్యు నెట్టు లీవిశ్వముం దొలుత సృజియించె? సృష్టం బైనదాని
నెట్లు వృత్తిఁ గావించె? తుది నెట్లు వృత్తినివృత్తిం గొని యాత్మహృ
దయాకాశములో నీలోకము నెల్లం జొనిపి యోగమాయలో శయనించు?
యోగేశ్వరులకు నధీశ్వరుం డైనయాతండు దానొక్కరుం డయ్యు
నెట్టులు బహువిధము లగుబ్రహ్మాదిరూపములం గొనియె? గోబ్రాహ్మణా
మరులకు క్షేమముఁ గూర్ప నెట్లు మత్స్యకూర్మాద్యవతారములం
గ్రహించి క్రీడించుచు నేయేకార్యములం జేసె? పుణ్యకీర్తివీర్యుం డైన
యాపరమపురుషునిచరిత్రామృతంబు లెప్పటికిం గ్రోలవలయు ననియుండుఁ
గాని మన స్సొకప్పుడేనియు నం దిఁకఁ జాలు నన తనవిఁ జెందకుం
డెడు. తత్తత్కర్మాధికారభేదమున నధికృతం బైనసత్త్వసత్త్వసముదా
యమునకు నాధారము లగునండగోళాంతర్బహిర్భాగముల నొప్పునా
నాలోకములను లోకపాలురను నాలోకపాలేశ్వరుం డెట్టులు కావించె?

ఆత్మకారణుండై విశ్వము సృజించునయ్యాదినారాయణుండు దేవతమ
స్వభావశక్తిస్వరూపముల నానాభిధానములం గాంచు జీవుల కెట్లు భేదము
గల్పించె? నదియెల్ల నాకు వివరింపుము. త్రైవర్ణికులకును దదితరు లగు
శూద్రులకును ననుష్ఠేయము లగుకర్మముల నేను వేదవ్యాసమునీం
ద్రుండు వివరింపఁ బలుమాఱులు వింటిని. అందుఁ గృష్ణకథామృతం
బును గొంచెము సూచింపఁబడియె. అది యొక్కండు దక్కఁ దక్కిన
యాధర్మములెల్లఁ దుచ్ఛసుఖము నొసఁగుఁ గావున వానియెడఁ దృప్తి
గలుగదయ్యెడు. మీయట్టిమహానుభావులు గూడినచోట వర్ణింపఁబడు
భగవచ్చరిత్రామృతప్రవాహము నెడ నెవ్వనికైనం దనవిదీఱునే? అయ్యది
చెవి సొచ్చినంతమాత్రన పురుషునకు సంసారకారణం బైనగృహాద్యా
సక్తి నాశనంబు నొనరించుఁగదా. భవత్సఖుం డైనకృష్ణద్వైపాయన
మునీంద్రుండు మోక్షధర్మముల మాకుఁ జెప్పఁ బూని మహాభార
తము రచియించి యందు గ్రామ్యసుఖములఁ బ్రతిపాదించునుపాఖ్యాన
ముల ననువదించుచు హరికథపై మతిగలుగునట్లు బోధించె. శ్రద్ధావం
తుఁడ కావున హరికథాభిరతి యప్పటప్పటికిం బెరిఁగి హరిచరితశ్రవణసంతృ
ప్తితో విషయవిరక్తిం గూర్చి యతిశయమున సమస్తదుఃఖధ్వంసంబుఁ
గావించు. అక్కటా! భాగవతతాత్పర్యం బెఱుంగనిమూఢుల కేను
వగచెద; వారు నిక్కంబ శోచనీయులు. భాగవతతాత్పర్యంబుఁ దెలిసియు
హరికథయెడ విముఖు లగువా రత్యంత శోచనీయులు. వారి కేను బెద్దయు
వగతు. వాగ్దేహమనోవ్యాపారముల వృథ పుచ్చుచున్నయట్టిశో
చ్యులయాయువునెల్లఁ గాలము వ్యర్థముగ హరించు. సంసారదుఃఖార్తులఁ
బ్రోవ బాంధవుఁడు పవిత్రకీర్తియు లోకరక్షణసుఖప్రదుండు నగుశ్రీ
హరికథను గథలలోనెల్ల సారమైనదానిం బువ్వులలో మకరంద మేర్ప
ఱుచు తేఁటితెఱంగున నెత్తి చెప్పుము. జగంబులఁ బుట్టింపను బ్రోవను
బొలియింపను గృహీతశక్తియై యవతరించి యయ్యీశ్వరుం డతిమాను
షంబు లగునేయేకార్యముల నొనర్చె. దానినెల్ల నో మునివరేణ్యా!
నాకుఁ గరుణించి చెప్పవె యని పురుషులనిశ్రేయసంబుఁ గోరి యడుగు
టయు విదురు నభినందించుచు మైత్రేయుఁ డిట్లనియె.

## మైత్రేయుఁడు విదురునకు సృష్టిప్రకారంబు చెప్పఁ బూనుట

సాధుపుంగవా! లోకములకు లెస్స యనుగ్రహముఁ గావింపను విష్ణుదేవునిపై నాత్మ యిడిన తనకీర్తిం బ్రకటింపను లెస్స యడిగితివి. బాదరాయణవీర్యమున జనించి యనన్యభావమున నీశ్వరుఁ డగుహరిం గ్రహించిన నీయెడ నియ్యది చిత్రంబు గాదు. మాండవ్యమునిశాపమునం జేసి సాత్యవతేయమునీంద్రునకు భ్రాతృక్షేత్రంబుగా నెన్నఁబడిన దాసికయందుఁ బుట్టిన ప్రజ్ఞాసంయమనుం డైనయముఁడవుకదా నీవు. అనుచరసమన్వితుం డై భగవంతునకు నీవు నిత్యసమ్మతుండవు. దానం గాదె శ్రీకృష్ణుఁ డీలోకము విడిచి యరుగునప్పుడు నీకు జ్ఞానముపదేశింప నన్ను నియమించె. కావున యోగమాయోపబృంహితములు విశ్వసృష్టిస్థితిలయవిషయంబులు నగుభగవల్లీలల నానుపూర్వి మెయిం జెప్పెద నాకర్ణింపుము. ఆత్మమాయానువృత్తి గలిగిన ననేక ద్రష్టృదృశ్యాదిమతుల నుపలక్షితుండు జీవులకాత్మభూతుండు విభుఁడు నగుపరమాత్ముఁ డొక్కరుండే యీప్రపంచ మేర్పడుటకుమును దుండె. ఏకస్వరూపుఁడు స్వప్రకాశుఁడు ద్రష్టయు నగునతం డప్పుడు లీనమాయుఁడు గావున వ్యక్తశక్తికుం డయ్యు దృశ్యద్రవ్యంబు లేమిం జేసి తన్ను లేనివానిం బోలెఁ దలంచె. కార్యకారణాత్మకంబు దృశ్యానుసంధానరూపంబు నగునాసత్సాక్షిశక్తియే మాయ యనంబడు. దానితోడ్పాటుననే యవ్విభుఁ డివ్విశ్వము నిర్మించె. గుణక్షోభ మొనసినయమ్మాయయందుఁ జిచ్ఛక్తియుక్తుం డైన యప్పరమాత్ముఁడు కాలశక్తిం గొని ప్రకృత్యధిష్ఠాత యగునాత్మాంశభూతపురుషునిచేఁ జిదాభాసం బనువీర్యము ననుసంధించె. కాలప్రేరితం బైన యమ్మాయవలన విజ్ఞానాత్మకం బాత్మగతవిశ్వవ్యంజకంబు తమోనిరాసకంబు నగుమహత్తత్త్వం బుదయించె. నిమిత్త మగుచిదాభాసంబుసాధన మగుగుణములు క్షోభకర మగుకాలంబు ననువీనికి నధీనం బగునామహత్తత్త్వము భగవద్దృష్టిగోచరం బై విశ్వసృష్టి యొనర్చుతలంపున రూపాంతరంబుఁ గొనియె. ఎట్లంటేని. ఆమహత్తత్త్వమే కార్య మగునధిభూతమునకుఁ గారణం బగునధ్యాత్మమునకుఁ గర్త యగునధిదైవతమునకు నాశ్రయం బై భూతేంద్రియమనోమయం బై వైకారికతైజసతామసములన మువ్విధముల నొప్పునహంకారం బయ్యె.

అందు వైకారికతైజసంబులు క్రమంబున సాత్త్వికరాజసము లని
చెప్పంబడు. అందు వైకారికాహంకారమున మనస్సు నింద్రియా
ధిష్ఠాతలై శబ్దాదివిషయప్రకాశంబుఁ గావించు దేవతలును జనించిరి.
జ్ఞానకర్మేంద్రియంబు లన్నియుఁ దైజసజాతంబులు. తామసాహంకారం
బున భూతసూక్ష్మ మగుశబ్దము జనించె. దానఁ గాలమాయాంశ
యోగమునం జేసి భగవద్వీక్షితంబై యాత్మలింగ మగునాకాశ ముద
యించె. నభమువలన స్పర్శము దానివలనవాయువునుంగలిగె. వాయువు
నభంబుతోడంగూడి యత్యంతబలయుతంబై రూపతన్మాత్రముం బుట్టించె.
దాన లోకప్రకాశం బైనతేజస్సు జనించె. తేజస్సు వాయుసమేతంబై
పరమేశ్వరవీక్షితంబై రసముం గలిగించె. దానం గాలమాయాంశయోగ
మున నుదకంబు గలిగె. బ్రహ్మవీక్షితంబై జలము తేజోయుతంబై గంధ
ముం బుట్టించె. దానం గాలమాయాంశయోగమునం జేసి పృథివి యుద
యించె. అట్లు జనించినపంచభూతములకుఁ గారణసంసర్గమునం జేసి యుత్త
రోత్తరగుణాధిక్యంబు గలుగు నెట్లంటేని నభంబున కితరసంసర్గము
లేని దాన శబ్ద మొక్కటియే గుణం బయ్యె వాయువునకు నిజగుణ మగు
స్పర్శము నాకాశ సంసర్గమునం జేసి శబ్దంబును సమన్వితంబయ్యె. కావున
వాయువునకు శబ్దస్పర్శంబులు రెండు గుణంబు లయ్యె. ఈతెఱంగుననే
తేజస్సునకు నిజగుణం బగురూపంబును నభోవాయుసమన్వయంబున
శబ్దస్పర్శంబులునుం గలియఁగ గుణత్రయం బయ్యె. జలమునకుఁ
దనగుణం బగురసమును నభోనిల తేజోన్వయమున శబ్దస్పర్శరూప
ములు మూఁడుం గలిసి గుణచతుష్టయం బొప్పె. పృథివి కాత్మగుణం
బగుగంధమును నభోవాయుతేజస్సలిల సంబంధమునం జేసి శబ్దస్పర్శ
రూపరసంబులును గలిగినదానం గుణపంచకంబు దనరె. కాలలింగ మగు
వికృతియు మాయాలింగ మగువిశేషంబు నంశలింగ మగుచేతనయుం
గలయీమహదాద్యభిమానిదేవతలు విష్ణుదేవునంశములుగాని యొండు
గాదు. వారు పరస్పరన్యూనాధికత్వము లేమిం జేసి యితరేతరసంబంధ
రహితులై బ్రహ్మాండము నిర్మింపనేరక పరమేశ్వరుఁ జేర నరిగి యిట్లని
విన్నవించిరి.

### దేవతలు సృష్టిశక్తిం గానక హరిం జేర నరిగి స్తుతించుట

దేవా! దేనిమూలం బాశ్రయించి యతులు వాస్తవముగ సంసారదుఃఖము నిరసింతు రట్టిప్రసన్న తాపశాంతిచ్ఛత్రం బైనభవదీయపాదారవిందమునకు మ్రొక్కుచున్నారము. పరమేశ్వరా! యీసంసారమునం దాపత్రయమునకుం దవిలి జీవులు సుఖముం గననేరరు. కావున జ్ఞానసహితం బగుభవదీయపాదచ్ఛాయ నాశ్రయింతుము. శుద్ధచిత్తు లగుపండితులు భవద్వదనాశ్రయంబు లగువేదములచే నెద్దానిం గాంతు రెయ్యది పాపము లడంచునదులలో నెల్ల నుత్తమం బగుగంగాప్రవాహమున కుత్పత్తిస్థానం బగునట్టి నీదివ్యచరణంబు శరణుచొచ్చితిమి. శ్రద్ధయు శ్రవణపూర్వక మగుభక్తియు మలము లెల్ల నపనయింపం బరిశుద్ధం బైనహృదయమునందు ధ్యానించి దానం బొడమువైరాగ్యము బలముగా నెసంగుజ్ఞానమున ముముక్షువులు దేనిం గాంతు రట్టి నీయంఘ్రిసరోజము శరణంబుగాం బొందుదుము. స్మరించినంతనే యాత్మభక్తుల కభయ మొసంగు నని లోకసృష్టిరక్షాలయార్థం బవతరించు నీదగుచరణము నేమందఱము శరణుసొత్తుము. ఉపకరణోపేతం బైనదేహమునం దేను నాయది యన నిరుదెఱంగు లగు దురాగ్రహములు గొన్నవారికి నంతర్యామివైయు వారిదేహములలోన నుండిన నత్యంతదూరంబై దుర్లభంబై తోంచుభవచ్చరణకమలం బాశ్రయింతుము. తమయింద్రియములు బహిర్ముఖంబు లగుటయు మనస్సు నీయెడం జొరక తొలంగ నున్మాదంబు గొన్నయధములు భవచ్చరణలీలాకథనంబుల నలరుపుణ్యశ్లోకు లగుభగవద్భక్తులం గాంచనేరరు. దేవా! భవదీయకథామృతంబుం ద్రావి భక్తి వర్ధిల్ల నిర్మలాంతఃకరణు లైనమహాత్ములు తోడన వైరాగ్యసారయుతం బైనజ్ఞానముం బడసి రయమున వికుంఠ మగు భవత్పదంబు నధిగమింతురు. కొందఱు మహానుభావు లాత్మసమాధిసమాకృత మగుజ్ఞానయోగమునం బరమపురుషుం డగునిన్నుం బొందుదురుగాని దాన నిన్నుం జెందునెడం బ్రయాసబాహుళ్యం బగు భవదీయసేవాయోగమున మోక్ష మట్లు శ్రమకరంబు గా దియ్యది యీరెంటికి విశేషంబు దోంచెడు విశ్వము సృజించుతలంపునం ద్రిగుణముల మమ్ముం బుట్టించిన నేము పరస్పరవియోగకారణంబున నీకుం గ్రీడోపకరణం బైన బ్రహ్మాం

షము సృజింపఁ జాలమైతిమి. అట్టియవసరంబుల నీకు బలి నెట్టు లర్పింతుమో యే మన్న మెట్లు భుజింతుమో యెట్టులు నీకును మాకుం గార్యములు సెల్లునో యెట్టు లీజీవులు నిస్సంశయులై నీకును మాకును భాగ మొసంగి యన్నము భుజింతురో యెఱుంగ నేరము. నిర్వికారుఁ డధిష్ఠాత పురాతనుఁడు నగునీవు కార్యములకుఁ గారణం బగుమాకు నాద్యుఁడవు గావున నజుఁడవయ్యు సత్త్వాదిగుణములకును జన్మాదికర్మములకుం గారణంబై జననరహితం బైనమాయలో నిజవీర్యం బగుమహత్తత్త్వము ననుసంధించితివి. పరమాత్మా! మహదాదు లగునేము యదర్థము జనించితి మెద్దానిం జేయవలయు నది యేర్పడ భవదనుగ్రహభాజనం బైనమాకట్టిస్వకీయజ్ఞానమును శక్తిం బ్రసాదింపు మని విన్నవించిరి.

### ఈశ్వరావేశమున మహదాదులు విరాట్సృష్టి చేయుట

విన్నవించుటయు నొండొంటం గలియక ప్రపంచరచనాసామర్థ్యంబుఁ గాననియాత్మశక్తు లగుమహదాదులతదవస్థం జూచి యీశ్వరుండు కాలమున నుద్బోధంబుఁ జెంది ద్యోతనశీలం బైనప్రకృతిని భరించి యేకకాలమునం బ్రకృతితో నిరువదిమూఁడగునాతత్త్వంబులలో నంతర్యామిరూపమునం గ్రియాశక్తితోడం జొచ్చి లుప్త మగుజీవకర్మమునకుఁ గ్రమ్మఱఁ బ్రబోధం బొనర్చువాఁడై నానారూపం బగునాతత్త్వగణమునకుఁ బరస్పరసంయోగంబుఁ గావించె. ఈశ్వరప్రేరణమునం జేసి యాత్రయోవింశతితత్త్వగణము క్రియాశక్తి ప్రబోధంబుఁ బడసి యంశముల నధిపూరుషపదవాచ్య మగువిరాడ్దేహము సృజించె. ఈశ్వరుండు తమలోఁ బ్రవేశించినదాన నాతత్త్వగణ మన్యోన్యాంశమునఁ బరిణతిం గాంచె. దాన నీచరాచరలోకములు పుట్టె. హిరణ్మయుండైన యయ్యధిపూరుషుఁడు సర్వజీవోపబృంహితుండై జలముల నండకోశమునం బహువర్షములు వసించె. మహదాదు లగుజగత్కారణములకుఁ గార్యరూపుఁ డగునావిరాట్టు జ్ఞానశక్తి క్రియాశక్తిభోక్తృశక్తులనొప్పి తానే తనంతన జ్ఞానశక్తియోగమున హృదయావచ్ఛిన్నచైతన్యరూపమున నేకవిధమునను గ్రియాశక్తియోగమునం బ్రాణాపానవ్యానోదానసమానములు నాగకూర్మకృకరదేవదత్తధనంజయము లనుక్రమమున దశవిధములనుం దనరె. ఇయ్యదియే పరమాత్మునియాద్యావ

కారంబు వ్యష్టిరూపు లగుప్రాణుల కాత్మరూపంబై తదంశమున బరఁగు. ఇందే భూతగ్రామమెల్ల విభావితం బయ్యెడు. జగత్కారణము లగుమహదాదులవిజ్ఞానముఁ దలపోసి యీశ్వరుం డాతత్త్వములకు వివిధవృత్తిలాభార్థం బాత్మతేజ మగుచిచ్ఛక్తిచే సృష్టి యిట్లు చేయుదు నని యాలోచించె. అట్టు లాలోచనాత్మకం బగుతపస్సు చేసిన యాపురుషునకుఁ గొన్ని దేవతాస్థానంబు లుదయించె. తత్ప్రకారంబు వినుము. తొలుత నతనికి వక్త్ర మనుస్థానము జనించె. దాని నగ్ని దేవుఁడు జీవులకు శబ్దోచ్చారణసాధనం బైన వాగింద్రియముతోడం బ్రవేశించె. అటఁ దాలుస్థానంబు పుట్టుటయు దానిలో వరుణుఁడు రసజ్ఞానసాధనం బైన జిహ్వేంద్రియంబుతోడం జొచ్చె. అనంతరము నాసికంబులు జనించుటయు నశ్వినులు గంధప్రతిపత్తిసాధనం బగుఘ్రాణేంద్రియముతోడం జొచ్చిరి పిదప నేత్రములు గలుగుటయు నాదిత్యుండు రూపజ్ఞానసాధనం బయినచక్షురింద్రియముతోడఁ బ్రవేశించె. అంతఁ జర్మ మేర్పడుటయు వాయు వంతర్బహిస్స్పర్శజ్ఞానసాధనం బైనత్వగింద్రియముతోడం జొచ్చె. బహిఃకండూతిగ్రహణసాధనం బైనలోమంబుతోడ వృక్షంబులు దానినే ప్రవేశించె. పదంపడి కర్ణములు పుట్టుటయు దిక్కులు శబ్దగ్రహణసాధనం బైనశ్రోత్రేంద్రియముతోడం బ్రవేశించె. అంత మేఢ్రము జనించుటయు నానందప్రతిపత్తిసాధనం బైనరేతస్సుతోడం బ్రజాపతి ప్రవేశించె. గుద మేర్పడుటయు మలవిసర్గాదిసాధనం బైనపాయ్వింద్రియముతోడ మిత్రుఁడు ప్రవేశించె. హస్తములు పుట్టుటయు నింద్రుఁడు జనులజీవికకు సాధనం బైనక్రయవిక్రయాదిశక్తితోడం బ్రవేశించె. పాదములు జనించుటయు గంతవ్యదేశప్రాప్తిసాధనం బైనగతితోడ విష్ణువు ప్రవేశించె. అంత హృదయ మేర్పడుటయుఁ జంద్రుఁడు సంకల్పవికల్పాదివికారప్రతిపత్తిసాధనం బైనమనస్సుతోడం బ్రవేశించె. బుద్ధి యేర్పడుటయు వాగీశుండు బోద్ధవ్యప్రతిపత్తిసాధనం బైనబోధముతోడం బ్రవేశించె. అహంకార మేర్పడుటయు రుద్రుఁడు కర్తవ్యప్రతిపత్తిసాధనం బైనచేతనతోడం బ్రవేశించె. ఆపురుషునిశిరస్సుల దివంబును బాదముల భూమియు నాభివలన నంతరిక్షంబునుం బుట్టుటయుఁ గ్రమంబున గుణావృత్తులం జేసి దేవనరభూతము లందుఁ జొచ్చె. అందు సత్త్వ

గుణప్రాబల్యమునం జేసి దేవతలు దివంబుఁ గొనిరి. రజోగుణస్వభావమునం
జేసి మనుష్యులకును వారి నాశ్రయించియుండు పశ్వాదులకును భూమి
నెలవయ్యె. తమోగుణస్వభావమునం జేసి రుద్రపారిషదభూతాదిగణం
బుల కంతరిక్షం బావాసం బయ్యె. ఆపురుషుని ముఖమువలన వేదము
జనించిన వర్ణములలోఁ బ్రథముఁ డగు బ్రాహ్మణుఁడును వేదాధ్యాపనాది
వృత్తితోడ నందే జనించె. అతని బాహువులవలనఁ బాలనాత్మక మగు
క్షత్రము పుట్టుటయు విష్ణుదేవాంశభూతు లగు బ్రాహ్మణాదులకుఁ
జోరాదిపీడ గలుగకుండఁ బాలించునట్టి యాక్షత్రవృత్తితోడ క్షత్రి
యుండు నందే జనించె. అతని యూరువులవలన లోకజీవికకుఁ గారణం బగు
కృష్యాదివృత్తి పుట్టుటయు మనుష్యవృత్తికర మగు వార్తతోడ నందే
వైశ్యుండు ద్భవించె. అతని పాదములం బరిచర్య పుట్టుటయు హరిపరితోష
కారణం బైన శుశ్రూషతోడ నందే శూద్రుండును పుట్టె. తమతమవృత్తుల
తోడం బుట్టిన యా నాలుగు వర్ణములవా రాత్మవిశుద్ధ్యర్థంబు శ్రద్ధతో
స్వధర్మమున నాత్మగురుం డైనవారి నారాధింతురు. కాలకర్మస్వభావశక్తి
యుక్తుం డైన భగవంతుని యోగమాయాబలంబున నుజ్జృంభిత మగు నీ
విరాట్ప్రపంచమును సాకల్యముగ నిరూపింపఁదలంచుటయు శక్యంబుగాదు.
నిరూపణం బసాధ్యంబని వేఱ చెప్పనేల? అయినను గురుముఖమున విన్న
దానిలో నామతికిఁ దోఁచినంతమాత్ర మన్యాలాపముల నపవిత్రం బైన
నా వాక్కునకు హరికీర్తివర్ణనమునఁ బావనత్వంబుఁ గలిగించికొను తలంపునం
జెప్పుదు. పుణ్యశ్లోకసత్తముఁ డగు హరిగుణవాదము పురుషుల కేకాంత
లాభమనియు శ్రోత్రమునకు భగవత్సన్నిధిసమర్పణం బనియుం జెప్పు
దురు. ఆదికవి యగు బ్రహ్మదేవుఁడు యోగపరిపక్వ మగు బుద్ధిచే సహస్ర
వత్సరంబులు చెప్పినను హరిమహిమ యపర్యాప్తంబయ్యె. అద్దిరా! భగ
వన్మాయ మాయావంతులకును మోహంబుఁ గావించు. దానియంతము
నా దేవుఁడు తాన యెఱుఁగుఁ, గన్న నిఁక నన్యులఁ జెప్పనేల? వాక్కులు
మనస్సును బ్రహ్మరుద్రాదులు నెవ్వనిం గాంచఁ జాలక మఱలుదు రట్టి
పరమపురుషున కేను బ్రణమిల్లుదు నని మైత్రేయుండు సెప్పిన విని విదు
రుండు వినయమృదులవచనములఁ బ్రార్థనారూపమునఁ బ్రీతిఁ గావించు
వానిరీతి నిట్లనియె.

## విదురప్రశ్నోత్తరంబుగా మైత్రేయుఁడు జీవునకవిద్యాబంధాదులఁ జెప్పుట

బ్రహ్మవిద్వరేణ్యా! నిర్వికారుఁడు నిర్గుణుఁడు చిన్మాత్రుఁడు నగు భగవంతునకు లీలచేనైనియు గుణక్రియాసంబంధ మేరీతిఁ బొసఁగు? లోకమున బాలునిఁ గామము క్రీడలలోఁ జొనుపుటయు నాబాలున కితరవస్తుసాధనత్వంబునఁ గ్రీడేచ్ఛయుఁ జెల్లుఁగాని తనంత నెల్లపుడు తృప్తుఁడైన యాత్మునకుఁ గామంబు నితరసంగముఁ బాసి నిత్యనివృత్తుండైన భగవంతునకు సాధనాంతరసాపేక్షం బైన క్రీడేచ్ఛయుఁ బొసఁగఁ గూడునే! మఱియు గుణమయం బైనయాత్మమాయచే భగవంతుఁ డీవిశ్వము సృజించి పాలించుచుండు నిఁకముం దుపసంహరించు ననియు మీవలన నెఱింగితి. దేశకాలములంగాని యవస్థవలనంగాని తనవలనంగాని యన్యనిమిత్తమునంగాని యాత్మజ్ఞానవిచ్యుతిం బడయ నిజీవుఁ డెట్టు లవిద్యాయోగంబుఁ గాంచు? సర్వక్షేత్రంబులందు భోక్తయై వర్తించుజీవుఁడు చిద్రూపమున నద్వితీయుఁ డగునాత్ముఁడే కావున నితని కాత్మానందాదిభ్రంశంబును గర్మబంధంబు నెట్లు గలుగు? ఈయర్థంబున మదీయమనస్సు వాస్తవతత్త్వం బెఱుంగ నేరక యలసియుండెడు. మనోమోహంబు వాయఁ దత్త్వము బోధింపు మని యడిగిన విదురునకు మైత్రేయుండు గతస్మయుండయ్యుస్మయముఁ జూపువానిరీతి నిట్లనియె.

విదురా! యెయ్యది తర్కమునకు విరోధించు నయ్యదియే యచింత్యశక్తి యగుభగవంతునిమాయ యనంబడు. అట్టిమాయాబలిమింగాదె విముక్తుఁ డగునీశ్వరునకుఁ గార్పణ్యబంధనంబులు దోఁచుచుండెడు. యథార్థముగ లేకుండినను స్వశిరశ్ఛేదనాదివ్యాపారములు స్వప్నమందు సాక్షి యగుపురుషునకుఁ దోఁచురీతి జాగరంబునందు నాత్మవిపర్యయంబును మృషాభూతంబులై యుండెడు. నీటఁ బ్రతిఫలించినచంద్రబింబమున కానీళులు గదలినదానం గలుగుకంపాదిగుణములు బింబభూతుఁ డగునభోగతచంద్రునకు లేనివిధమున నసత్తగు దేహాద్యనాత్మధర్మము తదభిమాని యగుజీవునకే తోఁచుఁగాని యభిమానరహితుఁ డగునీశ్వరునకుఁ గలుగదు. అట్టిదేహాద్యనాత్మాభిమానము, నివృత్తిధర్మము భగవదనుగ్రహము భగవద్భక్తియోగ మనునీమూటిచే మెల్ల మెల్లన పాసుపడు. అంతర్యామియు సాక్షిభూతుఁడు పరమాత్ముఁడు నగుహరియందు

సర్వేంద్రియోపరతి యెప్పుడుగలుగు నప్పుడతనికి నిద్రించువానికిం బోలెం క్లేశంబులెల్ల సాకల్యంబుగ నశించు. మురారిగుణానువాదశ్రవణంబే సమస్తక్లేశంబుల నడంచు నన్నం దదీయచరణారవిందపరాగపరిచర్యాసక్తి మనస్సునం బుట్టునదియేని యెప్పుడు చెప్ప నేల యనిన విని విదురుండు వెండియు నిట్లనియె.

## విదురుండు మైత్రేయుని వివిధప్రశ్న లడుగుట

మునీంద్రా! భవదీయసూక్తి యనుశిష్టము నామదిం బొడమిన సందేహముం ద్రెంచె. దాన నాకు నీశ్వరస్వాతంత్ర్యము జీవపారతంత్ర్యమును సయుక్తికములగుటయు జీవున కవిద్యాబంధముం దన్నివృత్తియు సోపపత్తికంబులగుటయు నెఱిఁగి శాస్త్రార్థమునం జొచ్చెదు. హరిమాయానిమిత్తమున జీవున కానందాదిభ్రంశ మపార్థంబయ్యు నిర్మూలంబయ్యు బహిస్స్వప్నశిరశ్ఛేదనాన్యంబయ్యు దేహాదిప్రపంచమునకు మూలం బని లెస్స యుపపాదింపంబడియె. అత్యంతమూఢత్వమున దేహాదులయెడ నాసక్తుండైనవాడును ప్రకృతికతీతుండైన యీశ్వరుం బ్రాపించినయతండును సంసారక్లేశములు లేమిం జేసి సుఖింతురు. సుఖదుఃఖానుసంధానమునం జేసి ప్రపంచమునం జేర నొల్లకయు నాత్మానందసంవేదనము లేమిం జేసి ప్రపంచము విడువంజాలకయు మధ్యస్థుండైన జనుండు క్లేశముం గుడుచు. అనాత్మభూత మగుప్రపంచము పరమార్థమున లేకున్న నుండు నట్లు ప్రతీతి గల్గెను. అట్టి ప్రతీతిని మీపాదసేవచేఁ దొలగించికొన నుండుదును. కూటస్థుండు భగవంతుండు నగుమధుసూదనుపాదారవిందపరిచర్యాసక్తి పరమోత్సవంబును సకలవ్యసనముల నడంపం జాలుదానిం గావించుభాగవతసేవ యల్పతపమున నలభ్యంబు. సత్సంగంబునం గదా జనార్దనకథాశ్రవణంబు నిత్యంబు సమకూరును. విభుం డింద్రియాదివికారములతోడ మహదాదులం దొలుత సృజించి క్రమమునం దదుద్భూతము లగునంశములచే సహస్రపాదోరుభుజాదివిశిష్టంబు సర్వలోకనికాయాధికరణం బాద్యపురుషశబ్దవాచ్యము నగువిరాణ్మూర్తిని సృజించి యందుం దాను తోడన ప్రవేశించి దశవిధప్రాణముల నింద్రియములను విషయముల నింద్రియాధిష్ఠానదేవతలను గలిగించె నతనిముఖము నందే బ్రాహ్మణాదివర్ణంబులకు నుద్భవం బయ్యెననియు మునుపు చెప్పితిరికదా. పుత్త్ర

పౌత్త్రనప్త్రాదులం గూడి విచిత్రాకృతు లగు ప్రజ లీప్రపంచమున వ్యాపించియుండఁ గారణం బైనయావిభునివిభూతివిశేషముల వివరింపుము. ఆవిభుఁ డెందఱఁ బ్రజాపతుల సృజించెనో తత్ప్రకారంబును సృష్టిప్రకారంబులను దద్విశేషంబులను మనువులను మన్వంతరలక్షణంబులను మనుమన్వంతరాధిపవంశ్యవిధంబును వంశానుచరితంబు నూర్ధ్వాథోలోక భూలోక సన్నివేశంబును దత్ప్రమాణంబును దిర్యఙ్మనుష్యదేవసృష్టి విభాగంబును పక్షిసరీసృపసర్గంబును జరాయుజాండజస్వేదజోద్భిజ్జంబులనుచతుర్విధభూతముల యుద్భవంబును వివరింపుము. నిజగుణావతారముల నీవిశ్వమునకు సృష్టిస్థితిలయముల నొనరించుశ్రీనివాసునియుదారవిక్రమంబును వివరింపుము. రూపశీలస్వభావానురూపము లగువర్ణాశ్రమవిభాగములను ఋషులజన్మకర్మంబులను వేదవిభాగంబును యజ్ఞవిస్తరంబులను యమాద్యష్టాంగయోగలక్షణంబును భక్తియోగప్రపంచంబును జ్ఞానస్వరూపంబును సాంఖ్యమార్గంబును భగవదుదితతంత్రప్రకారంబును బ్రతిలోమజాతుల కాచారం బైనపాషండమార్గవైషమ్యంబును గుణకర్మనిమిత్తము లగుజీవుల నానాగతివిభేదంబులను బరస్పరవిరోధము గలుగకుండ ధర్మార్థకామమోక్షము లార్జించునుపాయములను వార్తాస్వరూపంబును దండనీతిప్రకారంబును వ్రతపృథగ్విధానంబును శ్రాద్ధవిధిప్రకారంబును బితృసర్గంబును గ్రహనక్షత్రతారాగణంబులకాలచక్రసంస్థానంబును దానతపంబులయు నిష్టాపూర్తములయు ఫలమును మనుజుఁడు ప్రబలుఁడై యున్నయెడ నాచరణీయం బగుధర్మమును నీతండే యాపద్గతుండై యున్నయెడ ననుష్ఠేయం బగుధర్మము నెట్టిది యాచరించిన నెవ్వరికి ధర్మమూలం బగు జనార్దనుండు సంతోషించి ప్రసాదంబుచేయు నట్టిపరమధర్మంబును నాకుఁ దేటపడఁ జెప్పుము. దీనవత్సలు లైనగురువు లనుసరించియున్న శిష్యులకుఁ బుత్త్రులకు నడుగనియర్థంబైనఁ జెప్పఁ దగినదానిం జెప్పుదురు. మఱియు మహాదాదుల ప్రళయభేదంబును బ్రళయసమయంబున నెవ్వ రాపరమేశ్వరు నుపాసింతురు మఱి తోడన శయనింతు రట్టియుభయప్రకారుల లక్షణంబును జీవతత్త్వంబును బరమేశ్వరస్వరూపంబును జీవేశ్వరుల కైక్యంబు ప్రతిపాదించునౌపనిషద గురుజ్ఞానంబువిధంబు నట్టిజ్ఞానముఁ బడయఁ

శూద్రులు నిరూపించినయుపాయంబులను బోధింపుము. మహాత్ముల సేవింప కుండినం బురుషులకు జ్ఞానభక్తివిరక్తు లెట్టులు గలుగు! హరిలీలల నెఱుంగఁగోరి చేసినయీప్రశ్నముల కెల్ల నవిద్యాభిహతజ్ఞానచక్షుండనై యంధుఁడ నగునాకు మిత్త్రభావమున నుత్తరంబు చెప్పి మదీయసందేహ భయముఁ దీర్పుము. సకలము లగువేదములు యజ్ఞములు తపస్సులు దానములును జీవున కభయ మిచ్చుదానిలోఁ గళామాత్రంబునకుం జాల వని తమప్రధానుం డైనవేదవ్యాసుఁడు పురాణార్థసారం బడుగుటయు మునిప్రధానుం డైనమైత్రేయుండు భగవత్కథాప్రచారంబునం జొని పినదాని కత్యంతసంతుష్టుం డై నగవు మొగమునం దోఁచురీతి నవ్విదురున కిట్లనియె.

## మైత్రేయుఁడు విదురునకు భాగవతపురాణము చెప్పఁబూనుట

విదురా! హరికీర్తిం బునఃపునఃప్రశ్నముల మిక్కిలి క్రొత్తసేయు భాగవతప్రధానుఁడ వైననీవు జనించినకతన లోకముఁ బాలించుపూరువంశము సాధువులకు సంసేవ్యం బయ్యె. అల్పసుఖార్థంబు మహాదుఃఖముఁ బొందునరులకుఁ దద్దుఃఖశాంతి గలుగ భగవంతుఁడు తానే ఋషులకుఁ జెప్పినభాగవతపురాణంబు నీకుఁ జెప్పెద. తొల్లి యొకప్పుడు సనత్కుమారప్రముఖు లగుమునులు సంకర్షణదేవుం బాతాళమున నాసీనుం డైనవాని, నప్రతిహతబోధుం డైనవాని, వాసుదేవసంజ్ఞ మగుపరమానందస్వరూప మనుస్వీయాధారజ్యోతిస్సు ధ్యానించుచు సర్వోత్కర్షమునం బూజించువాని, నంతస్సుఖముగాఁ జేయంబడిననేత్రముకుళనం బాసనత్కుమారప్రముఖుల యభ్యుదయార్థంబు దెఱచువానిం, బ్రణమిల్లుదేవాదుల కిరీటసహస్రములందలి యుత్తమరత్నములకాంతులయొనకంబున వెలుంగు ఫణాసహస్రమునం దేజరిల్లువానిం జేర నరిగి పతికామ లగునాగకన్యకలు ప్రేమబంధురంబుగ నానోపహారముల నర్చింప నొప్పుమీఱునా దేవదేవుని చరణంబుల కుపధానం బగుపద్మము నాకాశగంగాసలిలసేకమునం దడిసిన తమజటాకలాపముల నంటుచుఁ దదీయమహిమం బెఱింగినవారు గావున భక్తిగద్గదంబుగా నతనిచరిత్రంబులఁ బలుమాఱు కీర్తించుచుఁ బరమాత్మస్వరూపంబుఁ దెలియఁ గోరి యడిగిన నాసంకర్షణదేవుండు నివృత్తధర్మరతుం డైనసనత్కుమారునకు దీనిం జెప్పె. అమ్మునివరుండు ధృత

వ్రతుం డైనసాంఖ్యాయనునకు బోధించె. పరమహంసధర్మప్రధానుం డైనసాంఖ్యాయనమునీంద్రుండు భగవద్విభూతివర్ణనంబు వివరించువాఁ డై నిరంతరానువర్తనుం డైనయస్మద్గురుం డగుపరాశరమునీంద్రునకును బృహస్పతికిని జెప్పె. పరాశరమునీంద్రుండు తనతండ్రిని రాక్షసులు భక్షించుట కలిగి రాక్షససత్త్రమునకుఁ దొడరి వసిష్ఠవచనమునఁ గ్రమ్మఱ నప్పని చాలించినం బులస్త్యుఁడు తనకులమునకుఁ గీడు మూడకుండఁ దప్పించినదానికి మెచ్చి పురాణకర్త వగుదు వని యొసఁగినవరమునం జేసి మఱింతసామర్థ్యంబు గదుర నాకు నొయ్యాళుండై బోధించె. ఇట్లు సంప్రదాయాగతం బైనయీభాగవతపురాణమును నిత్యానువర్తనంబు శ్రద్ధయు నొప్పునీకుఁ జెప్పెద నాకర్ణింపుము.

### మైత్రేయుఁడు విదురునకు హిరణ్యగర్భజన్మాదులఁ జెప్పుట

ఈవిశ్వమెల్ల నేకార్ణవజలమున మునిఁగినప్పుడు స్వరూపానందసంతృప్తుఁడు నిరీహుఁ డద్వితీయుఁడు నగునారాయణుండు శేషతల్పమున శయనించి నిద్రావశమునం జిచ్ఛక్తితిరోధానంబుఁ గానక నేత్రనిమీలనంబుఁ గావించి కామాత్మకశక్తిం బ్రేరించుచుం బునస్సర్గమునం బ్రబోధ్యాంబుదారుమధ్యమున గూఢముగ నగ్ని యెట్లట్లు భూతసూక్ష్మముల నంతశ్శరీరమునం దిమిడియుండునట్లు సవరించి నిజాధిష్ఠానం బైనయాజలములందు నిజచిచ్ఛక్తి నొప్పారుచుఁ జతుర్యుగసహస్రంబులు వసించుచు యోగనిద్రాపరుండయ్యు నాత్మయోగప్రేరితం బైనకాలాభిధాననిజశక్తిచేఁ గర్మతంత్రమునెల్ల నెఱవేర్చువాఁడు నిజదేహములో నిమిడియున్నలోకములం గాంచె. లోకసృష్టినిమిత్తం బిది యిట్లు సృజింపం దగు నని సూక్ష్మముగఁ గనుంగొనుదృష్టి నొప్పునప్పరమేశ్వరునతిసూక్ష్మ మగు నంతర్గతార్థము కాలానుగతం బగురజోగుణమున క్షోభ మొంది విశ్వసృష్టిఁ గావింప నాభిదేశమునుండి వెడలె. జీవాదృష్టప్రతిబోధనం బైనకాలమున నాసూక్ష్మార్థంబు సూర్యునిరీతి నిజకాంతి నావిపులజలము వెలిగించుచుఁ బద్మకోశం బై చూపట్టె. జీవుల కుపభోగ్యము లగు సర్వార్థములఁ దోఁపఁజేయు నాత్రిలోకాత్మకపద్మమును విష్ణుదేవుఁ డంతర్యామియై ప్రవేశించె. అట నాపద్మమున వేదమయుం డైనబ్రహ్మదేవుఁడు తనంత నుద్భవించి స్వాయంభు వనం బరఁగె. ఆస్వాయంభువయ్యాం

భూరుహకర్ణికయుం గూర్చుండి లోకములం గానలేక యాకసమునం దిటు
నటు మెడ ద్రిప్పుటయు లోకంబులం జూడంగల లోచనంబులతో నతనికి
నాలుగుదెసల నాలుగుముఖంబు లేర్పడుటయుం జతుర్ముఖుం డయ్యె.
ఆచతుర్ముఖుండు ప్రళయానిలచలత్కల్లోలమాలికాభీలం బైనయయ్యేకా
ర్ణవజలంబున బొడమినయాపద్మముపై నుండియు దానిని లోకతత్త్వ
ముసు ఎన్నను చెప్ప దెలియంజాలక యాకమలకర్ణికపై నే నెవ్వండ
నీయబ్జ మీసలిలము నందునది యెయ్యది యేల యుండెడు దీని కాధారం
బైనపదార్థంబు వేఱొకండు దీని క్రిందం దప్పక యుండవలయు నని తన
లోనం దలపోసి యాకమలంబునాళరంధ్రములమార్గమున నక్కమల
మూలమున కరుగం గ్రుంకి కడిఁదియరిగి దాని కాధారం బైనభగవన్నాభిం
గాంచనేరక చింతించుచున్నంత జలాంతర్గతాంధకారంబున కవ్వల నుండు
నాత్మసృష్టికారణంబు నెఱుకుచున్న యాచతుర్ముఖునకు భూతభవిష్య
ద్వర్తమానరూపావస్థాత్రయాత్మకంబు దేహాలకు భయముం గూర్చుచు
వారియాయువు హరింపహరిచక్రాయుధతుల్యంబు నగుకాలము దోఁచె.
అవ్విధమున నవ్విరించి కమలమూలంబుఁ గాంచనేరక యనవాప్తకాముండై
యట నిజస్థానం బగుపద్మకర్ణికకు మగిడి చనుదెంచి మెల్లన వాయు
నిరోధంబొనర్చి చిత్తము నిగ్రహించి సమాధియోగం బాశ్రయించి
మాత్రేష్ఠ యోగము సాధించి దాన నుత్పన్నజ్ఞానుండై తనకు మున్దు
దోఁపని కారణస్వరూపంబు తనహృదయమందే తోఁచుటయుం జూచె.
అతనిహృదయమునం దోఁచినకారణస్వరూపంబు శ్రీనారాయణమూర్తియే
కాని వేఱుగాదు. తత్ప్రకారంబు వినుము. గోపాంగులపడువున నడుం
పడగలనీడం జూడనొప్పు మస్తకంబులకిరీటములం గలిమణులదీప్తు లయ్యు
గాంతసంతమసంబు నిరసింప నొప్పుగను నప్పయోరాశియునందు మృణాళ
ధవళం బగునాయతశేషతల్పంబున శయనించియున్నవాని, సంధ్యాజల
దపరిధానంబు బహుకనకశిఖరంబులు రత్నజలదౌషధిపుష్పమాలికలు
వేణుదండంబులు పాదపగణంబులునుం గలుగుమరకతమణిగిరికిఁ బీతాం
బరత్వాదిధర్మముల సాటి సేయంజగినవాని, నాయామవిస్తారములం దన
ప్రమాణమున కనురూపంబై లోకత్రయసంగ్రహణంబై విచిత్రాభర
ణాంబరాద్యలంకారములం నొప్పుదివ్యదేహమునం దేజరిల్లువాని, నాత్మాభి

మతసిద్ధినిమిత్తంబు శుద్ధము లగువేదోక్తమార్గములఁ దన్నర్చించుపురు
షుల కభీష్టప్రదం బైననిజచరణారవిందమును నఖచంద్రికావిలసితాంగుళి
పత్త్రం బైనదానిం గృపమై నించుక యెత్తిచూపుచున్నవాని, దివ్యమణి
కుండలంబుల వెలయుచు నధరబింబరాగమున జేవుఱించుచు సముంచిత
భ్రూనాసికావిలసితంబై లోకములయార్తి నిరసించుమందహాసమున
సుందరం బైనముఖారవిందమునం దనరువానిఁ, గమలకింజల్కమువోలెఁ
బచ్చనియుత్తమాంబరంబు పరిధానముగ వెలయువాని, శ్రీవత్సలాంఛనం
బగువక్షస్స్థలంబున దివ్యమణిహారముల నొప్పారువాని, నుత్తమకేయూ
రాదిభూషణముల నొప్పుభుజదండములు శాఖలుగా నహిభోగ
ముల వల్కవేష్టనంబు గలిగి యవ్యక్తమూలం బైనమహావృక్షమున
కుపమింపఁ దగినలోకమయుం డైనవాని, జరాచరాధారత్వంబు సర్వ
బంధుత్వంబు సలిలావరణంబు కిరీటసహస్రంబు పేరిటికనకశిఖరంబులు
లసత్కౌస్తుభరత్నవిద్యోతంబునుం గలిగి యుత్తమగిరికి సరివచ్చువాని,
వేదములు మధుకరంబులై యెల్లపుడు నెడఁబాయక యాశ్రయించి యుని
కిం జేసి యెంతయు విలసిల్లునిజకీర్తిమయం బగువనమాల నిజకంఠమున
వ్రేల విరాజిల్లువాని, సూర్యచంద్రాగ్ని వాయువులకు నగమ్యుం డైన
వానిఁ, గాలత్రయ స్ఫూర్తిమంతంబు లైనసుదర్శనాదిసమరసాధనముల
నితరులకు దురాసదుం డైనవాని నొకపరమపురుషుం గాంచె. కాంచు
టయు నప్పుడే యాజగద్విధాత హరినాభిసరోజంబును దన్నును బ్రళయ
జలంబును బ్రళయకాలవాయువు నాకాశంబునుం జూచెఁగాని యీ
యేనింటికంటె వేఱొక్కదానిం జూడఁడయ్యె. అప్పు డాచతుర్ముఖుఁడు
రజోగుణసముద్రిక్తుం డై మాయావిలాసమార్గమున నభినివేశితచిత్తుం డై
ప్రజల సృజింపఁ దలఁచి నాభిసరోజాదిపంచకంబుననే లోకసృష్టిగావ
లయు నని యూహించి వివిధసృష్టి చేయఁ దనమదిం బరికించి స్తుత్యుం
డైన భగవంతు నిట్లని ప్రస్తుతించె.

### బ్రహ్మదేవుఁడు నారాయణుని స్తుతించుట

దేవా ! పెద్దకాలం బుపాసించి యేను నిన్నెఱింగితి. నీతత్త్వం
బెఱుంగమి దేహులకుఁ బెద్దదోషంబు నీకంటె వేఱొండు లేదు. ఉండు
నట్లు దోఁచిన నాప్రతీతి సత్యంబు గాదు. మాయాగుణయోగమున

జేసి నీ వొక్కండవే నానారూపములఁ దోఁచుచుండుదువు. దృఢభక్తైకవిశ్వాసమున నిత్యనివృత్తము నుపాసకుల ననుగ్రహింపఁ దాలుత నీవు గొన్నదియు శుద్ధసత్త్వాత్మకము లగు ననేకావతారములకు బీజమును మదీయజన్మస్థానం బగునాభితో నొప్పునదియు నగు నీరూపముకంటె నో సర్వోత్తమా! యనావృతప్రకాశంబు భేదశూన్యం బానందమాత్రము నగుభవదీయరూపమన్యము గాదు. కావున నుపాస్యములలో ముఖ్యము సృష్టికారణము విశ్వోత్తరము భూతేంద్రియకారణము నగు నీరూపము నాశ్రయించితి. ఉపాసకులకు శ్రేయముఁ గూర్ప నుపాసనాయోగ్యం బైనదివ్యమంగళరూపంబుఁ జూపిననీకు మ్రొక్కెద. కుతర్కనిష్ఠు లగు నిరీశ్వర వాదులు నరకమున కేఁగుదురు గాని ని న్నుపాసింపనేరరు. వేదములను వాయువులు గొని తెచ్చుత్వదీయపదారవిందపరిమళంబు నాత్మలోఁ జొనిపి పరమభక్తితో నీపాదములఁ బట్టినవారిమనస్సులనుండి నీవు దొలంగవు. ముక్తిప్రద మగునీపాదము నెందాఁక నాశ్రయింపకుండునం దాఁక నే నరునకు ధనగృహసుహృన్నిమిత్తం బైన భయము, వానికి నాశంబు గలిగిన శోకంబు, గ్రమ్మఱ నార్జనేచ్ఛ, దానం బరిభవంబు, దాన నత్యంతతృష్ణ, యేదే నొక వెరవున నయ్యవి గ్రమ్మఱ లభించెనేని భయశోకాదిమూలం బైనమమతయుం గలుగు. దైవవశమున నష్టబుద్ధు లగువారు సర్వానర్థముల నిరసింపఁ జాలుభవత్కథాప్రసంగమునెడ మనసు పెట్టక లోభాభిభూతచిత్తులై దీనులై కామసుఖలేశలవార్థంబు క్షేమంకరములు గానికర్మములఁ జేయుదురు. ఆఁకలి పిపాసవాతపిత్తశ్లేష్మంబులు శీతోష్ణవాతవర్షంబులు పరస్పరభయము దుస్సహం బగుకామాగ్ని యవిచ్ఛిన్న మగుక్రోధము ననువీనిబారిం బడి యిడుమపడుప్రజలం గాంచి నామనంబు విషాదంబుఁ జెందెడు. ఈశ్వరునిమాయాబలంబుననే యీ దేహాదివిభాగంబుగాని వాస్తవంబు గాదని తెలియునంతకు వ్యర్థమయ్యు సంసార ముపరతిం జెందదు. మఱి నరునకు దుఃఖపరంపరలం గలిగించుచుండు. పగ లెల్ల నింద్రియప్రచారంబు రేలు తదుపరమమున నిద్రయుం బొందుచు నుత్తరక్షణమున నిద్రాభంగముం గాంచుచు దైవమునం బ్రతిహతార్థరచనులై భవత్కథాప్రసంగపరాఙ్ముఖు లగువారు వివేకులైన నేమి సంసారమునం బరిభ్రమింతురు. వేదాంతశ్రవణమున మార్గ మెఱిం

గినవారికిభక్తియోగశోధితచిత్తమున వెలయుచుండి నీ వాయాభక్తులు ధ్యానించురూపములనే వారికి సాక్షాత్కరింపఁ జేయుదువు. అద్వితీయుఁడు నానాజనులలో నవహితుఁడు సర్వాంతర్యామి సుహృదుఁడు నగునీ వసాధులకు లభ్యము గానిసర్వభూతదయచే నెట్లు ప్రసాదింతు వట్లు సురలు బద్ధకాములై నానావిధోపచారముల నారాధించినను బ్రసన్నుఁడవుగావు. కావున యజ్ఞాది లగువివిధకర్మములు దానములు తీవ్రతపస్సు వ్రతానుష్ఠానము మున్నగువాని భగవంతునకర్పించి యారాధించుటయే శ్రేష్ఠమగుక్రియాఫలంబు అది యెన్నఁడుం జెడదు. కామనిమిత్తంబయ్యెనేని యాధర్మమాకామము నెఱవేర్చి యటతుయించు. స్వరూపచైతన్యముననే సర్వకాలము భేదభ్రాంతి నిరసించి బోధాశ్రయుండవై వెలుంగుచు లోకసృష్టిరక్షావినాశములకు నిమిత్తమగునిజమాయచేఁ గ్రీడించు పరమపురుషుఁ డగునీకుఁ బ్రణామిల్లుదు. ఎవ్వనియవతారగుణకర్మవిడంబనము లగు దేవకీనందన, సర్వజ్ఞ, కంసారి ప్రభృతినామములం బ్రాణప్రయాణసమయమున వివశులయ్యు నుచ్చరించువా రనేకజన్మార్జిత మగుపాప మెల్ల నాక్షణంబ తటాలునం దెగడి నిరస్తావరణంబైనబ్రహ్మస్వరూపంబుఁ గాంతు రట్టియజుని శరణుసొచ్చెద. సృష్టికర్తయగునేను, స్థితికర్తయగువిష్ణువు, లయకర్తయగు శ్రీకంఠుఁ డనుముగ్గురు పురుషులు మూలంబుగా మరీచ్యాదులును మన్వాదులును శాఖోపశాఖలుగా నాత్మాధిష్ఠానతం బెరిఁగినభువనపాదపరూపుఁ డగునీకు నమస్కారము. విరుద్ధధర్మనిరతంబై లోకము నీ వుపదేశించినకర్మార్పణంబను భవదారాధనకర్మమునందు మనసు పెట్టకయుండునేని యట్టివారి జీవితాశనెల్ల నొక్కమాత్రలోనం ద్రుంపఁ జాలినకాలాత్ముఁ డగునీకుఁ బ్రణామము. సకలలోకనమస్కృతంబై ద్విపరార్థస్థాయియై యొసంగు నుత్తమస్థానం బారోహించియు నే నెవ్వనికి వెఱచి యేపరమపురుషు నెఱుంగఁ బెక్కుయజ్ఞము లనుష్ఠించి పెక్కేఁడులు తపంబు సల్పితి నా యజ్ఞేశ్వరునకుఁ బ్రణమిల్లుదు. విషయసుఖవాంఛ దనకు లేకుండినను దనకావించినధర్మమర్యాదల రక్షింప నాత్మేచ్ఛం జేసి తిర్యఙ్మనుష్యదేవాదిజన్మంబు లెత్తి యాత్మరతిం జెందినపురుషోత్తమునకు మ్రొక్కెద. పంచపర్వావిద్యవలనఁ దన కేయుపహతి లేకుండిన గుణనిక్షేపితాఖిల

ఘోరమునకై నిద్రాసుఖం బిట్టి దని జనుల కెఱింగింప నెంచి కల్లోల మాలాభీలం బైన యేకార్ణవజలమునందు శేషశయనస్వర్ణానుకూలం బైననిద్రం జెందు నెడ నెవ్వని యనుగ్రహమునం జేసి లోకత్రయోపకరణుండనై యే నెవ్వని నాభికమలమునం బుట్టితి నట్టికృత్స్నాఖిలలోకుండు నిద్రావసానవికాసిలోచనుండు నగుపరమపురుషునకుఁ గేలుమోడ్చెద. సమస్తలోకములకు సుహృదుం డద్వితీయుం డంతర్యామియు నగుభగవంతుం డేజ్ఞానము నైశ్వర్యముం గ్రహించి యీజగమునకు సౌఖ్యం బాపాదించు నాభక్తవత్సలుం డేను బూర్వకల్పమున నుండినరీతి జగము సృజించుతఱిం దాజ్ఞానైశ్వర్యముల మదీయప్రజ్ఞలో నావహింపం జేయుం గాక. ప్రసన్నవదనుం డగునాభగవంతుం డాత్మశక్తి యగురమతోడం గూడి గుణావతారములం గ్రహించి యింక నేయేకార్యంబు లాచరించు నయ్యవియెల్ల నామదిం దోఁచుం గాక. లోకసృష్టిప్రవణంబయ్యు నామనం బానారాయణునందే నిత్యయోగంబుఁ జెందుం గాక. కర్మశక్తికృత మగు వైషమ్యము తన్నిమిత్తము లగుపాపాదులును నన్నుం దొలంగుం గాక. సలిలస్థితుం డైనయేయనంతశక్తి పురుషునినాభిసరస్సునుండి మహత్తత్త్వాత్మక మగుచిత్తమున కభిమానినై యేను జనించితి నట్టినాకు విచిత్ర విశ్వసృష్టివివరణముఁ జేయుచుండిన వేదవాగ్విసర్గంబు చెడకుండుం గాక. పరమకారుణికుం డైనయాపరమేశ్వరుండు ప్రేమాతిశయంబున సొంపారుచిరునగవు మెఱుంగులం దులంగలించునపాంగవీక్షణమునం జూచుచు విశ్వవిజయార్థంబును మాకుం బరమార్థంబు చేకూఱను. మధురవచనముల మదీయవిషాదం బపనయించుం గాక. అని యిట్లు తపోవిద్యాసమాధుల నాత్మజనకుం డైననారాయణుని దనమనోవచనములకుం దోఁచినంతకుం బ్రస్తుతించి యలసినవానిరీతి విరమించె. అంతం గల్పాంతజలయోగమునం జేసి లోకసంస్థానవిజ్ఞానమున విషణ్ణచిత్తుం డైనబ్రహ్మయభిప్రాయము నెఱింగి మధుసూదనుండు తదీయమోహంబు వాయురీతి గంభీరవచనంబుల నిట్లనియె.

### భగవంతుఁడు బ్రహ్మకు బ్రసన్నుఁడై సంభాషించుట

వేదగర్భా! విషాదమున నలసత్వంబుఁ గొనవలదు. సృష్టియెడ నుద్యోగింపుము. నీవు గోరినయర్థం బేను మున్నే సమకూర్చితి. నీవింకను

దపంబును మదీయోపాసన ననుష్ఠింపుము. దాన నీ వంతర్హృదయ ములో నత్యంతస్పష్టముగ లోకములనెల్లఁ జూడఁగలవు. మఱియు భక్తియుక్తుండవు సమాహితచిత్తుడవు నైన నీలోపలను లోకమునందును నిండియుండుపరబ్రహ్మస్వరూపుఁ డై ననన్ను నాలో నుండుజీవులనుం గాంతువు. దారువులలో నగ్ని యెట్టు లట్టులు సర్వభూతములలో నంతర్నిగూఢుం డై ననన్నుఁ జూచినంతన లోకము మోహముం ద్యజించు భూతేంద్రియగుణాశయముల విడిచి జీవుఁడు శుద్ధబ్రహ్మముతోడ నేకీభూతుండు గాని యన్యుఁడు గాఁ డని యద్వైతభావన సాక్షాత్కరించు నపుడు నరుఁడు మోక్షముం బ్రాపించు. అయ్యా! నీవు నానాకర్మవితానమున బహుప్రజల సృజింపఁ బూనినను నాయనుగ్రహమునం జేసి నీ చిత్తము వికారముఁ బొరయకుండెడు. ప్రజాసృష్టిఁ జేయఁ బూనుకొన్నను నీమనంబు నాయెడ నత్యంతభక్తిబంధముఁ గావించినకతన నాదిఋషి యగు ని న్నత్యంతపాపమయ్యు రజోగుణము బంధింపఁ జాలదు. భూతముల నింద్రియములను సత్త్వాదిగుణముల నహంకారమునను నేను గూడినవాఁడగా యని తలంచుటంజేసి దేహుల కగోచరుండనయ్యు నీకు విజ్ఞాతుండ నైతి. నీవుమున్ను కమలముపయిం గూర్చుండి దానినాళ మూలంబున దీని కేదేనొక్కయాధార ముండవలయు నట్టికారణం బైన యాధారస్వరూపంబుగలదో లేదో యనుసందియంబున వెదకుటంజేసి సర్వకారణం బే నుండుదు నని నీకు బోధింప బహిర్భాగమున మదీయ రూపముం జూపితి మదీయకథోదయాంకితం బైనస్తోత్రము నీవు చేయుటయుఁ దపమున నత్యంతనిష్ఠఁ గొనుటయు మదీయానుగ్రహంబ. నిర్గుణుఁ డగునన్ను లోకవిజయేచ్ఛంజేసి గుణమయునిఁగావర్ణించుచు స్తోత్రమొనర్చుటంజేసి నీకు మెచ్చితి. ఎవ్వఁ డీస్తోత్రమున నన్ను నిత్యము స్తుతియించుచు భజించు నతనికి సర్వకామవరేశ్వరుం డగు నే నెల్లపుడుం బ్రసన్నుఁడ నగుదు. ఇష్టాపూర్తములు తపస్సులు దానములు యోగములు సమాధి యనువానిచే సిద్ధించునిశ్శ్రేయసం బన్న మత్ప్రీతియే యనితత్త్వవిదులు దలంతురు. ఏనాత్మలకుఁ బరమాత్ముఁడను. ప్రియులకుఁ బ్రియతముఁడను నన్నెజెందినవారికి దేహాదులనిష్టంబులగు. కావున నాయెడ నిత్యప్రీతి కర్తవ్యంబు. సర్వవేదమయము మత్సంభవము నగు

నాత్మరూపము ననన్యనిరపేక్షముగఁ బూర్వకల్పమున నాలో లీనం బైన
ప్రపంచమును బ్రజలను బోల్లింటియట్లు సృజింపు మని యిట్లు ప్రధాన
పురుషేశ్వరుం డైనపంకజనాభుండు నిజరూపముఁ జూపి సృజ్యవిస్తరంబుఁ
జేటపఱచి యంతర్హితుం డయ్యె నని చెప్పిన విని విదురుండు మునీంద్రా!
భగవంతుఁ డంతర్హానముం బొందినపదంపడి లోకపితామహుం డైనబ్రహ్మ
దేవుఁడు కాయికమానసికభేదమున నెన్నిప్రజాసర్గములం గావించెఁ
దత్ప్రకారంబు చెప్పుము. నీవు బహువేదివరుండవు గావునఁ దొలుత
నాయడిగినప్రశ్నములకెల్ల నుత్తరంబులు వివరించి మాసంశయములనెల్లఁ
దీర్పుమని యడుగుటయు మైత్రేయుండు సంప్రీతచేతస్కుండై తనమన
స్సులో నుండువిదురప్రశ్నములకన్నిటికిం గ్రమమున నుత్తరము లిచ్చు
వాఁడై యిట్లనియె.

## మైత్రేయుఁడు విదురునకుఁ గాలసామాన్యలక్షణము ప్రాకృతాదిసర్గములనుం జెప్పుట

బ్రహ్మదేవుఁడు భగవంతుండు సెప్పినచొప్పున నప్పరమాత్మునిపై
మనస్సునిలిపి దివ్యవర్షశతము తపంబు సల్పి నిజాసనం బైనకమలం బా
సలిలంబునం దత్కాలకృతవీర్య మగువాయువునఁ గంపించుట చూచి
వృద్ధినెనసినతపస్సువలనను దనలో నెలకొనియున్న విద్యవలనను విజ్ఞానబల
వృద్ధిం గాంచి యావాయువును జలమునుం ద్రావి యప్పుడు నీళ్లు లేక
తా నుండినయాపద్మము నొక్కదాని మిన్నంటుచున్నదానిం గాంచి
పూర్వప్రళయలీనము లైనలోకములనెల్ల దీనిచేఁ గల్పించితి నని తలంచి
నారాయణుప్రేరణం జేసి యాపద్మకోశములోనం జొచ్చి దానిం ద్రిరూప
ముల విభజించె. అది యొక్కండే పదునాలుగువిధములనుబహురూపము
లను భావింప యోగ్యమై యుండుఁ గావున దానికి రూపత్రయవిభా
గంబు చిత్రంబని యెన్నరాదు. ఆమూఁడువిభాగంబులే ముల్లోకములనం
బడియెడు. ఈత్రైలోక్యనిర్మాణంబే బ్రహ్మదేవునకు మీఁదఁ బ్రతిదిన
సృజ్యం బైనజీవభోగస్థానరచనావిశేషంబు ముల్లోకంబులకు మీఁద
మహర్లోకంబు మొదలుగా సత్యలోకంబుదనుక నుండునితరలోకంబు
లన్నో నిష్కామముగఁ జేయఁబడుధర్మంబునకు ఫలమగుటం జేసి వానికి
నం దుండువారికిని దీర్ఘకాలస్థితి గలుగుఁ గావున దైనందినసృష్టి గలు

గదు. ఈముల్లోకములు కామ్యకర్మఫలరూపంబులు గావునఁ బ్రతికల్పంబునందు నుత్పత్తివినాశములు గలుగుటంజేసి వీనికి వైనందినసృష్టియొప్పెడు ననిన విని విదురుఁడు మునివరేణ్యా! బహురూపుఁ డద్భుతకర్ముఁడు నగుహరికిఁ గాలాఖ్యం బగురూప మొక్కండు గల దని మీరు చెప్పితిరిగదా. సామాన్యవిశేషలక్షణంబులతోడఁ దత్స్వరూపంబు నిరూపింపుఁ డనియడుగుటయు నతనికి మైత్రేయుఁ డిట్లనియె. అయ్యా! గుణములవ్యతికరంబు కాల మనంబడు. అయ్యది నిర్విశేషం బాద్యంతశూన్యంబునై యొప్పు. దాని నిమిత్తముగాఁగొని పురుషుఁడు దన్నే ప్రపంచరూపమున లీలమై సృజించె. విష్ణుమాయాంశసంభృతం బైనబ్రహ్మతన్త్రంబే యీవిశ్వంబు. అవ్యక్తస్వరూప మగు కాలమున నియ్యది పరిచ్ఛిన్నంబై వేఱువేఱుగఁ దోఁచుచుండెడు. ఈవిశ్వ మిప్పు డెట్టులు గన్పట్టుచుండు నట్టులే పూర్వకల్పమునందు నుండె. ఇఁక భవిష్యత్కల్పంబునందు నుండఁగలదు. ఇవ్విధమున లోకపరిచ్ఛేదకత్వంబు కాలసామాన్యలక్షణం బని యెఱుంగుము. కాలవిశేషలక్షణంబు దెలియఁగ దానికి నిమిత్తం బగుసర్గభేదంబు దెలియవలసియుండుఁ గావునఁ దత్ప్రకారంబు వివరించెద వినుము. ప్రాకృతములనియు వైకృతములనియు సర్గంబులు నవవిధంబు లగు. ప్రాకృతవైకృతోభయాత్మకం బైనసర్గము దశమంబై పరఁగు. సర్గమునకుం గాలద్రవ్యగుణములంజేసి ప్రళయము త్రివిధం బగు. శ్రీహరినుండి గుణములకు వైషమ్య మాపాదించుమహత్తత్త్వంబు సృజించుట ప్రథమసర్గంబు. ద్రవ్యజ్ఞానక్రియాత్మకం బైనయహంకారసృష్టి ద్వితీయసర్గంబు. భూతసూక్ష్మసృష్టితోడ మహాభూతములఁ బుట్టించుశక్తిసహాకృతం బైనభూతసృష్టి తృతీయసర్గంబు. జ్ఞానేంద్రియకర్మేంద్రియసృష్టి చతుర్థసర్గంబు. వైకారికనామధేయం బగుదేవసృష్టి పంచమసర్గంబు. మనస్సును దన్మయం బని చెప్పంబడు. జీవుల కావరణవిక్షేపములఁ గావించు పంచపర్వావిద్యసృష్టి షష్ఠసర్గంబు. ఈయాఱును బ్రాకృతసర్గము లనంబడు. ఇఁక వైకృతములం జెప్పెద. ఈసృష్టిప్రకారంబెల్ల సంసారతాపనివారకం బైనలీల నలరుహరిరజోగుణముగ్రహించినం గలుగుచుండెడు. వైకృతసర్గములలో ముఖ్యమగు స్థావరసృష్టి సప్తమసర్గంబు. మీఁదికి వ్యాపించుట యవ్యక్తచైతన్యంబు

వొందుట యుఁ దేహస్పర్శమాత్రం బెఱుంగుట యవ్యవస్థితపరిణామంబు
మున్నగునానాభేదము లొందుటయు ననునివి సాధారణలక్షణంబుగా
నొప్పు స్థావరములు*వనస్పత్యోషధి లతా త్వక్సార వీరు ద్ద్రుమంబు
లన నాఱువిధములఁ దనరుటం జేసి స్థావరవర్గము దనలో షడ్విధంబుల
నెసఁగెడు. ఉత్తరకాలవిచారంబుఁ గానక యాహారాదిజ్ఞానమాత్రంబు
గలిగి ఘ్రాణేంద్రియమున నర్థములం గనుచు దీర్ఘానుసంధానశూన్యంబు
లైనయిరువదియెనిమిదితెఱంగుల నొప్పుతిర్యగ్జంతువుల యష్టావింశతివిధం
బైనసృష్టి యష్టమసర్గంబు. గో, వజము, మహిషము, కృష్ణసారము,
సూకరము, గవయము, రురువు, గొఱియ, యుష్ట్ర మనుద్విశఫంబులు
తొమ్మిదియు గర్దభ, మశ్వ, మశ్వతరము, గౌరము, శరభము, చమరియ
ననేకశఫంబు లాఱును కుక్క, నక్క, తోఁడేలు, పులి, పిల్లి, కుందే, లేదు,
సింహము, క్రోఁతి, గజము, తాఁబే, లుడు, మనుపంచనఖంబులు పండ్రెండును,
మకరాదు లగుజలచరజంతుసముదాయం బొక్కటియుఁ జేర్చి లెక్కిం
పఁగఁ దిర్యగ్జంతువు లిరువదియెనిమిదివిధముల నొప్పెడు. ఖచరంబు
లగుకంకగృధ్రబకశ్యేనహంససారసాదు లగుపక్షిజాతులును దిర్యగ్జంతు
గణంబులోన గణింపవలయు. తిర్యక్సామాన్యసృష్టి యష్టమసర్గంబు. రజో
గుణప్రధానులై కర్మపరులై దుఃఖము సుఖముగాఁ దలఁచు నరులయర్వా
క్స్రోతం బగుసృష్టి నవమసర్గంబు. ఇది యేకప్రకారంబు. ఈమూఁడు
వైకృతసర్గము లనంబడు. దేవసర్గము వైకారికనామధేయంబనియుఁ
బ్రాకృతములలోఁ బంచమంబనియు మున్న చెప్పితింగదా. సనత్కుమారా
దులు దేవభావమునను మనుష్యభావముననుం దనరి పూజనీయులవుటం
జేసి వారిసృష్టి కేవలప్రాకృతంబు కేవల వైకృతంబునుంగాక యుభయాత్మ
కంబై దశమసర్గమనంబరఁగు. వైకృత మగుదేవసృష్టి దేవసర్గంబు, పితృ
సర్గం, బసురసర్గంబు, గంధర్వాప్సరస్సర్గంబు, యక్షరాక్షససిద్ధసర్గంబు,

---

* పువ్వులు లేక ఫలించునశ్వత్థోదుంబరపనసవటాదులు వనస్పతులు. పూచి ఫలపాకము తుదిగాఁ గల వ్రీహి యవముద్గాదు లోషధులు. పూలుగాని పండ్లుగాని గలిగి యారోహణాన పేక్షంబు లైనమల్లికాకారవల్ల్యాదులు లతలు. త్వక్కునందు బలముగల వెదురు మొదలగునవి త్వక్సారములు. లతలే కఠినంబులై యారోహ ణంబు సహించునేని యట్టివి వీరుత్తులు. పువ్వులు పూచి కాయలుగాచునట్టి చూత ప్రభృతులు ద్రుమములు.

చారణవిద్యాధరసర్గంబు, కిన్నరకింపురుషాదిసర్గంబు, భూతప్రేతపిశాచసర్గంబు నన నెనిమిదివిధముల నొప్పెడు. ఇవ్విధమునఁ బ్రాకృతసర్గంబు లాఱు వైకృతసర్గంబులు మూఁడు ప్రాకృతవైకృతోభయాత్మకసర్గ మొక్కటియుం గూడ సర్గంబులు దశప్రకారంబులం బ్రవర్తిల్లు. ఇయ్యవి బ్రహ్మ గావించినసృష్టిభేదంబులు ఇఁక మనుమన్వంతరాదులఁ గ్రమంబునం జెప్పెదు ఇట్లు కల్పాదిసమయంబున హరి రజోగుణముఁ గొని బ్రహ్మరూపము ధరించి యమోఘసంకల్పుఁడై యాత్మేచ్ఛంజేసి తన్నుఁ దాన సృజించుచుండు. ఈకల్పమునం జెప్పినదేవాసురాదులు నదిలోఁ జక్రంబు దిరుగునెడ లోనియరములపౌర్వాపర్యంబు నెట్లట్లు భగవంతుని మాయాప్రభావమునం జేసి యీగుణవ్యత్యయమునం బౌర్వాపర్యంబుఁ గోరరు. వారే మన్వంతరాంతరంబుల నానావిధ రూపములం గ్రహింతురు. సర్గభేదం బిట్టిది. కాలవిశేషలక్షణం బెట్లంటేని.

### మైత్రేయుఁడు విదురునకుఁ గాలవిశేషలక్షణంబు చెప్పుట

కార్యపదార్థం బగుప్రపంచమువంశములలోనం గట్టగడపటిదియై తనలో విభాగంబు సేయనశక్యంబై కార్యావస్థను సముదాయావస్థనుఁ బొందక తదుభయాపగమంబు గలుగుపరమసూక్ష్మపదార్థంబు పరమాణు వనంబడు. అయ్యవి పెక్కులు గూడిన నవయవిత్వవ్యవహారం బగు నని నరులు భ్రమింతురు. పరిణామాంతరంబుఁ జెంది యైక్యముఁ గొని విశేషవివక్షయు భేదవివక్షయుం గొననికార్యప్రపంచము మహత్తనం బడు. అందుఁ గించిద్విశేషభేదవివక్ష గ్రహింపఁబడునేని మధ్యమ మనంబడు. ఇట్లు పదార్థములు సూక్ష్మస్థూలమధ్యమావస్థలు గొనుటయు నుత్పత్త్యాదికుశల మవ్యక్తము భగవచ్ఛక్తియు నగుకాలము పరమాణ్వాది పదార్థములకుఁ బరిచ్ఛేదముఁ గావించుటంజేసి తా నపరిచ్ఛిన్నం బయ్యుఁ బరిచ్ఛేద్యభేదంబునఁ దానుం దత్తదనురూపముగఁ బరిచ్ఛిన్నంబై విశేషంబుఁ గాంచు నెట్లంటేని. పరమాణుపదార్థముఁ బరిచ్ఛేదించు కాలము పరమాణువనియుఁ బ్రపంచసాకల్యపరిచ్ఛేదకంబు మహత్తనియు వ్యవహరింపఁబడు. రెండుపరమాణువులు గూడిన నొక్కయణు వగు. మూఁడణువులు గూడినఁ ద్రసరేణు వగు. అయ్యది గవాక్షరంధ్ర

ముఖంబుం జొచ్చిన సూర్యకిరణంబులలో నగపడుచు మిక్కిలి చులకనగుటం జేసి గ్రహింపంబడక మీఁది కెగయుచుండు. మూఁడు త్రసరేణువులఁ బరిచ్ఛేదించు కాలంబు త్రుటి యనంబడు. త్రుటిశతంబు వేధ నామం బగు. వేధత్రయము లవ మనంబరఁగు. మూఁడులవములు నిమేష మగు. నిమేషత్రయంబు క్షణం బగు. క్షణపంచకంబు కాష్ఠ యనంబడు. పంచదశకాష్ఠలు లఘు వనంబరఁగు. పదియేనులఘువు లొక్కనాడి యగు. అట్టిఘటికాద్వయంబు ముహూర్తం బగు. అవి యాఱు నేడునేని గూడిన నొక్కయామం బగు. ఆఱుపలముల తామ్రపాత్రంబుఁ గ్రిందివైపున నైదుగురిగింజ లెత్తుబంగారమున నిర్మించిన చతురంగుళశలాకాచతుష్టయమున రంధ్రముఁ గావించి దాని నా పాత్రలోనికిఁ బ్రస్థజలంబు సొచ్చి నిండి యప్పాత్ర మునుఁగునంత కాలమొక్కగడియ యని దాని సుస్నానలక్షణంబున నిర్ణయింపఁ దగు. అయ్యెనిమిదిజాము లొక్కయహోరాత్రం బగు. పంచదశాహోరాత్రము లొక్కపక్షంబునాఁ బరఁగు. అదియు శుక్లకృష్ణభేదమున నిరుదెఱంగులఁ బ్రవర్తిల్లు శుక్లకృష్ణపక్షంబులు రెండుగూడిన నొక్క మాసం బగు. మనుష్యమానకల్పితం బైనయామాసము పితృదేవతల కొక్కయహోరాత్రం బగు. రెండునెల లొక్కఋతువగు. మాసంబు లాఱు గూడిన నొక్కయయనం బగు. అయ్యది దక్షిణాయనం బనియు నుత్తరాయణం బనియు ద్వివిధం బగు. నరమానకల్పితంబు లగునయ్యయనంబులు రెండు గూడినం దేవతల కొక్కయహోరాత్రం బగు. పండ్రెండునెల లొక్కసంవత్సరం బగు. ఇట్టిసంవత్సరంబులు నూఱు నరులకుఁ బరమాయు వని నిరూపింపఁబడియె. చంద్రాదిగ్రహంబు లశ్విన్యాదినక్షత్రంబు లితరతారలుం గూడి కాలచక్రము నధిష్ఠించి కాలాత్ముఁడైన యాదిత్యుఁడు పరమాణు వాదిగా సంవత్సరంబు తుదగాఁ గల్పించిన కాలభేదములకుఁ బరిచ్ఛేదకుండై ద్వాదశరాశ్యాత్మకం బైన యీభువనకోశమునుఁ దిరుగుచుండు. అట్టిపండ్రెండు నెలలుగూడిన కాలము క్రమంబున సౌర, బార్హస్పత్య, సావన, చాంద్ర, నాక్షత్రములు సమాన భేదములం జేసి సంవత్సరము పరివత్సర మిడావత్సర మనువత్సరము వత్సర మనుసంజ్ఞలం గాంచు. కాలరూప మగుచాత్మశక్తిం గొని

కార్యము లగునంకురాదులయెడ బీజాదులకు శక్తిఁ బలుదెఱంగుల
గార్యాభిముఖంబుగా నొనర్చుచు సకాములకు గుణమయం బగుస్వర్గాది
ఫలముల యజ్ఞాదుల నొడఁగూర్చుచుఁ దేజోమండలవాసమునసిష్కామ
పురుషుల కాయురాదివ్యయ ప్రదర్శనంబున విషయవైరాగ్యంబు
బోధించి తదీయమోహనివృత్తిఁ గావింప నంతరిక్షమునం జరించుసంవత్సర
పంచకప్రవర్తకుం డైనయాద్వాదశాత్ము నుపాసింపుఁ డనిచెప్పిన విదు
రుండు మునీంద్రా! లోకత్రయాంతర్గతు లగుదేవపితృమనుష్యులయా
యుర్మానంబు వారివారిమానమున నూతేసియేం డ్లని నీవచనంబున నే
నెఱింగితి. బ్రహ్మదేవుఁడు ప్రతిదినము సృజింపఁ గన్పట్టునీముల్లోకములకు
మీఁదిలోకముల నివసించు జ్ఞానులగతి యెట్టిదో యెఱుంగనయ్యెడ.
మహాత్ములు తమయోగదృష్టిచే నీవిశ్వమెల్లఁ జూతురు. కావున భగవ
చ్ఛక్తి యగు కాలములక్షణంబు నీయెఱుంగనిది గాదు. కావునఁ దద్వి
ధంబు దెలియం జెప్పు మని యడుగుటయు మైత్రేయుఁ డతని కిట్లనియె.

## మైత్రేయుఁడు విదురునకు యుగాదిలక్షణంబు చెప్పుట

కృతము, త్రేత, ద్వాపరము, కలి యన నాలుగుయుగములు
పండ్రెండుదివ్యవర్షసహస్రముల నిరూపింపఁబడియె. అందు గృతయుగము
నకు నాలుగువేల యెనమన్నూతేండ్లును ద్రేతాయుగంబునకు మూఁడు
వేలయాఱునూతేండ్లును ద్వాపరయుగంబునకు రెండువేలు నన్నూతేం
డ్లును గలియుగంబునకు వేయు నిన్నూతేండ్లును బ్రమాణం బయ్యెడు.
అందుఁ గృతయుగమున మొదటినన్నూతేండ్లు సంధ్యయనియుఁ దుది
నన్నూతేండ్లు సంధ్యాంశం బనియుఁ ద్రేతాయుగమునను మొదలు ము
న్నూతేండ్లు సంధ్యయనియుఁ గడపట మున్నూతేండ్లుసంధ్యాంశంబనియు,
ద్వాపరయుగమునకు నల్లె యాద్యంతముల వేఱువేఱ శతద్వయవర్ష
ములు సంధ్యాంశంబు లనియుఁ గలియుగమునకు నావిధమున
మొదలినూతేండ్లు సంధ్యయనియుఁ దుదినూతేండ్లు సంధ్యాంశంబనియు
వ్యవహరింపఁబడు. సంధ్యాసమయంబుల నాయాయుగములంద త్తత్కర్మ
ఫలము లనుభవించువారిసృష్టియు సంధ్యాంశావసరంబులందు వారిలయ
మునుం బ్రవర్తిల్లుచుండు. కావున సయాద్యంతసంధ్యాసంధ్యాం
శములు గాక మధ్యగతం బగుకాలమే తత్తద్యుగసంజ్ఞలం బరఁగి

త్రేతాద్యుగముల ననుష్ఠానయోగ్యము లగుగవాలంభాదిధర్మవిశేషంబు లాచరింప యోగ్యం బయ్యెను. కృతయుగమునందు ధర్మము నాలుగు పాదములం బరిపూర్ణంబై ప్రవర్తిల్లెను. త్రేతాదియుగములం గ్రమంబున నధర్మము పెరుగుటం జేసి ధర్మమున కొక్కొక్కపాదము తలంగుచుండెను. ఈలోకత్రయంబునకు మీఁద మహర్లోకంబు మొదలు బ్రహ్మలోకంబు దాఁక నుండువారికిఁ జతుర్యుగసహస్రం బొక్కపగలు నంతమాత్రంబు రాత్రి యు నయ్యెడు. అట్టినిజప్రమాణరాత్రివేళ విధాత నిద్రించు. అద్దేవుఁడు నిశావసానంబునఁ గ్రమ్మఱ మేలుకాంచి త్రిలోకసృష్టి యొనరించు నట్టిబ్రహ్మపవలింటఁ బదునాలుగుమన్వంతరంబు లగు. ఒక్కొక మనువు పరిపాలించుమన్వంతరంబునకుఁ గొంచె మెక్కువగా డెబ్బది యొకండుయుగంబు లగు. ఆయామన్వంతరంబులందుఁ దత్తన్మనువంశసంభూతులు రాజు లగుదురు. సప్తర్షులు వసురుద్రాదిసురులు దేవేంద్రాదులు తదనుచరు లగుగంధర్వాదులును దత్తన్మన్వంతరంబులకు వేఱువేఱ యుత్పాదింపఁ బడుచుండుదురు. ఇయ్యదియే బ్రహ్మ ప్రతిదినంబుగావించు త్రిలోకీసర్గంబు. ఇందే కర్మానుగుణముగాఁ దిర్యఙ్మనుష్యపితృదేవసంభవం బయ్యెడు. మన్వంతరములం దెల్ల నిజావతారము లగుమనుమూర్తుల నాత్మపౌరుషంబుఁ బ్రకటించుచు భగవంతుఁడు సత్త్వగుణముఁ గొని యీ విశ్వము పాలించుచుండు. బ్రహ్మదేవునిపగలు చనుడుఁ దమోగుణలేశంబుఁ గొని విక్రమంబెల్ల నుపసంహరించి సర్వంబుఁ దనలోఁ నిడికొని హరి నిర్వ్యాపారుండై యుండెడు. అప్పుడు బ్రహ్మదేవునిరాత్రి చనుదెంచుటయు సూర్యచంద్రప్రచారంబుఁ గానక యీ ముల్లోకంబు లద్దేవదేవునిలో నంతర్హితంబు లయ్యెడు. అట్టియెడ సంకర్షణానలం బీముల్లోకముల దహించుటయు మహర్లోకవాసు లాతాపంబునం గుందుచు నట నుండనోపక జనోలోకంబున కేఁగుదురు. అంతలోఁ గల్పాంతమునం బొంగినసాగరంబులు చండవాతపరిక్షోభితోల్లోలకల్లోలమాలికాభీలంబులై త్రిభువనం బొక్కమాత్రలో నేకార్ణవంబుగా జలనిమగ్నంబు గావించెడు. అయ్యేకార్ణవజలమున ననంతాసనుండై హరి జనోలోకనివాసు లొనరించు స్తుతివచనంబులు చిత్తగించుచు యోగనిద్రఁ గొని కన్నుఁగవ మూసికొనియుండెడు.

ఇట్లెఱుంగునఁ గాలగతికల్పితంబు లైనయహోరాత్రములపరిగణనంబున నేర్పడుశతవర్షాత్మకంబైన బ్రహ్మాయురవసరంబు నిప్పటికిగతప్రాయంబయ్యె. ఆబ్రహ్మదేవునకు రెండుపరార్ధంబు లాయుఃపరిమాణంబు. అందుఁ బ్రథమ పరార్ధంబు గడచె. ద్వితీయపరార్ధంబు నడచుచుండెడు. ప్రథమపరార్ధంబు మొదల శబ్దబ్రహ్మసంభవనిమిత్తముసంజేసి బ్రాహ్మనామధేయం బైన మహాకల్పం బతిక్రమించె. దానితుది నారాయణునాభిసరస్సునం బద్మము జనించినకతనఁ బాద్మనామధేయం బైనమహాకల్పంబు ప్రవర్తిల్లె. ద్వితీయ పరార్ధంబు మొదల హరి వరాహరూపమెత్తుటం జేసి వారాహనామ ధేయం బైనకల్పం బిప్పుడు నడచుచుండెడు. బ్రహ్మదేవునియాయుర్మానం బుగా గణింపఁబడిన ద్విపరార్ధవర్ష కాలం బెల్లఁ గార్యోపాధిశూన్యుఁ డాద్యంతరహితుఁడు జగత్కారణంబు నగుభగవంతునకు నిమేష మాత్రంబని యుపచరింపఁబడియెడు. పరమాణువు మొదలుగాఁ బరార్ధ ద్వయము తుదిగాఁ జెప్పఁబడు నీకాలము దేహగేహాద్యభిమానులకుఁ బ్రభువగుఁగాని పరిపూర్ణుం డైనసర్వేశ్వరునకుఁ బరిచ్ఛేదంబుఁ గావింపఁ జాలదు. షోడశవికారముల నారబ్ధంబై ప్రత్యేకం బుత్తరోత్తరదశగుణాధి కంబు లగుసప్తావరణముల బహిరావృతంబై పంచాశత్కోటియోజన విస్తృతం బైనయీబ్రహ్మాండకోశంబు మఱియు నెన్నియే నండరాశికోట్లు నెందుఁజొచ్చి పరమాణుప్రాయంబులై తోఁచు నయ్యది సర్వకారణ కారణం బైనపరమపురుషుని యక్షరపరబ్రహ్మస్వరూపం బని బ్రహ్మవిదులు సెప్పుదురు. ఇయ్యది కాలలక్షణంబు

### మైత్రేయుఁడు విదురునకు సనకాదిసృష్టి చెప్పుట

బ్రహ్మసృష్టిప్రకారంబు వినుము. ఆబ్రహ్మదేవుఁడు దొలుతఁ*దమస్సు, మోహము, మహామోహము, తామిస్ర, మంధతామిస్ర మనునవిద్యా వృత్తుల నేనింటినిసృజించి పాపాత్మకం బైనయాసర్గమునకు మెచ్చక భగవద్ధ్యానపరిపూతం బైనమనస్సున నితరోత్తమసృష్టి కుద్యమించి

* స్వరూపాప్రకాశము తమస్సు. దేహాద్యభిమానము మోహము. విషయ భోగేచ్ఛ మహామోహము. దానికి విఘాతము గలిగినం గలుగుక్రోధము తామి స్రము. దేహము నశించినం దాను నశించునట్లు తలఁచుట యంధతామిస్రము.

‡సనిష్క్రియు లూర్ధ్వరేతస్కులు నగుమునుల సృజియించి పుత్త్ర లారా! ప్రజల సృజియింపుఁ డని నియోగించుటయు వారు మోక్షకర్మ లై నవాసుదేవపరాయణులు గావున సృష్టి సేయ నొల్లక నిషేధించిరి. వా రట్లు తనశాసనము నిరాకరించినవానికిఁ గలిగినక్రోధం బావిధాత యెంత నిగ్రహించిన నుపశమింపక యతనిభ్రూమధ్యంబునుండి నీలలో హితుఁ డనం బ్రభవించి యేడ్చుచు నోజగద్గురూ! నాకు నామంబులను స్థానంబులను నిరూపింపు మనియడుగుటయు నప్పద్మసంభవుండు తద్వచ నంబుఁ బరిపాలించుచు మృదుభాషణంబుల నూఱడించుచు నయ్యా! విలపింపవలదు. భయభ్రాంతుఁ డగుబాలునిరీతిఁ దొలుత రోదనము సేయుటంజేసి నిన్నుఁ బ్రజలు రుద్రుఁడనిపలుకుదురు. హృదయమింద్రియ ములు, ప్రాణ, మాకాశము, వాయు, వగ్ని, జలము, భూమి, సూర్యుఁడు, చంద్రుఁడు, తప స్సనునీపదునొకండు నీకు స్థానంబు లయ్యెడు. మన్యు, మను, మహాకాల, మహా, చ్ఛివ, ఋతధ్వ, జోరురేతో, భవ, కాల, వామదేవ, ధృతవ్రతాఖ్యంబు లగునేకాదశనామంబులును, ధీవృ, త్త్యుశ. నోమా, నియు, త్సర్పి, రి, ళాంబి, కేరావతీ, సుధా, దీక్షా, రుద్రాణు లన నేకాదశస్త్రీలును నీ కయ్యెడు. ఈస్థానమును నామములను స్త్రీలనుం గ్రహించి ప్రజలకుఁ బతివి గావున బహుప్రజల సృజియింపు మని నియమించె. తదాదేశంబు మెయి నీలలోహితుఁడు ప్రజాసర్గము నకుఁ దొడఁగి తనబలమునకు నాకృతికి స్వభావమునకుఁ దగినట్లు ప్రజల సృజించుటయు రుద్రసృష్టము లగురుద్రగణములు జగ మంతట నావ రించి మ్రింగుటం జూచి విరించి శంకించి యయ్యా! యతితీవ్రదృష్టుల లోకమెల్లఁ గాల్చుచున్న యీప్రజల నిఁక సృజియింపవలదు. దీనిం జాలించి సర్వభూతములకు సుఖముఁ గూర్చుతప మాచరింపుము. దానఁ బూర్వకల్పమున నున్నరీతి నీవు లోకము సృజియింపఁగలవు. తపం బన సామాన్యంబు గాదు. తపముననే పురుషుండు సర్వభూత హృదంతర్గతుండు పరమజ్యోతీరూపుఁడు నగునధోక్షజుం బ్రాపించు

‡ సనకాదులకుఁ బ్రతికల్పమునందును సృష్టి లేదు. తొలుదొలుత బ్రాహ్మ కల్పమున సృష్టిఁ బొందినవారే ప్రతికల్పంబునను వర్తింతురు. బ్రాహ్మకల్పమున నడచినతదీయసృష్టిదే యిక్కడ ననువదింపఁబడియె.

ననిచెప్పిన నీలలోహితుండు వల్లె యని యతని వలగొని వీడ్కొని తపము సేయ వనమున కరిగె. అటఁ గ్రమ్మఱ సృష్టిఁ జింతించుచున్న యన్నాభిజునకు భగవచ్ఛక్తియుక్తిం జేసి మరీచి, యత్రి, యంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతుఁడు, భృగుఁడు, వసిష్ఠుఁడు, దక్షుఁడు, నారదుఁడు ననుపదుండ్రు పుత్త్రులు లోకసంతానహేతువులై జనించిరి. అందు స్వాయంభువునియుత్సంగమున నారదుఁ, డంగుష్ఠమున దక్షుఁడు, ప్రాణమున వసిష్ఠుఁడు, త్వక్కున భృగువు, కరమునఁ గ్రతువు, నాభిని బులహుఁడు, కర్ణములఁ బులస్త్యుఁడు, ముఖమున నంగిరసుఁడు, నేత్రముల నత్రి, మనస్సున మరీచియుం బ్రభవించిరి. మఱియు బ్రహ్మ దక్షిణభాగంబున నారాయణమూర్తి యగుధర్మంబును, బృష్ఠభాగమున లోకభీకరమృత్యు వగునధర్మంబును, హృదయమునఁ గామంబును, భ్రూయుగ్మమునఁ గ్రోధంబును, నధరోష్ఠమున లోభంబును, వక్త్రమున వాక్కును సముద్రంబులును, మేఢ్రమున నిరృతియుఁ, బాయువు వలనఁ బాపాశ్రయంబును, ఛాయవలన దేవహూతిపతి యగుకర్దముండును జనించుటయు మనోదేహముల నావిధాత విశ్వము సృజించె. అట్లు సృజించుచుఁ దనవక్త్రమునం బుట్టినవాగ్దేవీరూపసౌభాగ్యముఁ జూచి కూఁతు రనియెన్నక కామించిన నధర్మప్రవృత్తుం డగుతండ్రియొద్దకు మరీచిముఖ్యు లగుపుత్త్రులు చని మహాత్మా! కామము నిలుపఁ జాలక తనకూఁతుం గామింపఁ బోలునే? ఇట్టిది నీకుఁ బూర్వు లనుష్ఠించినది గాదు. ఇఁకఁ బుట్టువారు నిట్టిది చేయరు. తేజస్వివర్యులకు నిట్టిది కీర్తికరంబుగాదు. మీయట్టివారియాచారంబు ననుష్ఠించియేకదా లోకము క్షేమముఁ గాంచవలయు. ఇట్టిచర్యలు మీయెడఁ గన్పట్టిన నింక నే మనం గలవారము? ఆత్మప్రకాశమున నాత్మనిష్ఠం బగునీజగంబు నెవ్వఁడు వ్యక్తీకరించె నాభగవంతునకుఁ బ్రణమిల్లుదుము. అతండే ధర్మముఁ బాలించుఁగాక యని పలుకుచున్న తనపుత్త్రులం జూచి ప్రజాపతి సిగ్గువడి యామేనుఁ ద్యజించె. దానిం దిక్కులు గ్రహించె. అయ్యదియే నీహారతమ స్సయ్యె. అంత నొక్కతఱి నెట్టులు సృజింతు నని చింతించునాస్రష్ట నాలుగుముఖములనుండి చతుర్వేదంబులు దోఁచె. ఇట్లు ఈజనులకుఁ గ్రియావిశేషంబుఁ గల్పింతునని యాలోచించునాబ్రహ్మ

ముఖములఁ జాతుర్హోత్రం బైనయజ్ఞవిస్తారం బుపవేదములు న్యాయములు నాలుగుధర్మపాదములు వర్ణాశ్రమచతుష్టయంబునుం గలిగె ననిన విని విదురుండు మహాత్మా! వేదాదుల నవ్విధి సృజించునెడ నేయే దాని నేయేముఖమున సృజించెఁ దత్ప్రకారంబు దేటపఱుపు మనియడుగుటయు నతం డతని కిట్లనియె.

### మైత్రేయుఁడు బ్రహ్మముఖముల వేదాదులసృష్టి చెప్పుట

విదురా! బ్రహ్మదేవుఁడు దొలుతఁ దనపూర్వాదిముఖములం గ్రమమున ఋగ్యజుస్సామాథర్వవేదముల సృజించి యటఁ దద్వేదసాధ్యము లగు నప్రగీతమంత్రస్తోత్రం బైనశస్త్రం బను హోతృకర్మంబు, నిజ్య యను నధ్వర్యుకర్మంబును, సంప్రగీతస్తోత్రం బైనస్తుతియుఁ దదర్థఋక్సముదాయం బైనస్తోమంబు ననునుద్గాతృకర్మంబును, బ్రాయశ్చిత్తరూపం బైనబ్రహ్మకర్మంబును నాముఖంబులనే వరుస సృజియించె. మఱియు నాయుర్వేదంబును ధనుర్వేదంబును గాంధర్వవేదంబును *స్థాపత్యవేదంబును నాక్రమంబుననే పుట్టించె. పంచమవేద మగునితిహాసమును బురాణమును సర్వముఖములఁ బుట్టించె. కర్మతంత్రము లగుషోడశ్యుక్థ్యయాగములను, జయనాగ్నిష్టోమముల, నప్తోర్యామాతిరాత్రములను, వాజపేయగోసవంబులనుం గ్రమంబున ముఖానుపూర్విని సృజించి, వెండియు శౌచము దయ తపస్సు సత్యము ననుధర్మపాదముల నాలుగింటిని దత్తద్వృత్తులతోడ బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయంబునుం గ్రమంబున సృజించె. చతురాశ్రమంబులకుం బ్రత్యేకంబు నాలుగుభేదంబులు గల వెట్లం టేని; †ప్రాజాపత్యము బ్రాహ్మము బృహత్తు నైష్ఠికంబు నన

* స్థపతి యనఁగా శిల్పి, తత్సంబంధివేదము స్థాపత్యము. శిల్పవిద్యయని భావము.

† ఉపనయనము మొదలు త్రిరాత్రము గాయత్రి చదువుట ప్రాజాపత్యము. వ్రతముల నాచరించుచు సంవత్సరనియమముఁ గొనుట బ్రాహ్మము. వేదగ్రహణాంతము వ్రతాచరణము బృహత్తు. వివాహము మాని జన్మాంతనిష్ఠగొనుట నైష్ఠికము. అనిషిద్ధకృష్యాదివృత్తి వార్త. యాచనాదివృత్తి సంచయము. అయాచితవృత్తి శాలీనము. వెన్నుల నేఱి బ్రదుకుట శిలము. గింజ లేఱి జీవించుట ఉంఛము. దున్నక పండునీవారాదుల జీవించువారు వైఖానసులు. క్రొత్తది దొరికినం బూర్వముఁ ద్యజించువారు వాలఖిల్యులు. తఱువాతఁ జూచినదెసం గొని తెచ్చిన

బ్రహ్మచర్యంబు నాలుగువిధములను, వార్త సంచయము శాలీనము శిలోంఛ మన గృహస్థాశ్రమంబు చతుర్విధములను, వైఖానస వాలఖిల్యౌదుంబర ఫేనపనామముల వానప్రస్థాశ్రమము నలుదెఱంగులను, గుటీచక బహూదక హంస పరమహంససంజ్ఞలఁ దురీయాశ్రమంబు ప్రకారచతుష్టయమునకుం బ్రవర్తిల్లు. ఆన్వీక్షికి త్రయి వార్త దండనీతి యనుమోక్షధర్మకామార్థవిద్యలు, వ్యస్తము లగువ్యాహృతులు మూఁడు సమస్తము లగునయ్యవి మూఁడన నొక్కటి యగుతురీయంబునుం గ్రమంబున బ్రహ్మపూర్వాదిముఖముల నుద్భవిల్లె. ప్రణవం బతనిహృదయాకాశమున నావిష్కృతం బయ్యె. ఛందస్సులలో నుష్ణిక్ఛందస్సు తదీయలోమములను, గాయత్రీఛందస్సు త్వక్కునను, త్రిష్టుప్ఛందస్సు మాంసమున, యనుష్టుప్ఛందస్సు స్నాయువువలనను, జగతి యస్థులను, బఙ్క్తి మాంససారమునను, బృహతి ప్రాణమునను నుద్భవిల్లె. అతనికి స్పర్శవర్ణములు జీవంబుగా, స్వరములు దేహముగా, శషసహలింద్రియంబులుగా యరలవలు బలంబుగా నమరె. షడ్జాదిస్వరంబు లేడు నతనిక్రీడ వలనం జనించె. వ్యక్త మగువైఖరివృత్తియు నవ్యక్త మగుప్రణవము నాత్మగా నొప్పి శబ్దబ్రహ్మాత్మకుండై బ్రహ్మదేవునకుఁ బరుఁడై నానాశక్తిసముపబృంహితుండై పరమేశ్వరుండు వెలయుచుండెను.

### మైత్రేయుఁడు స్వాయంభువమనుసృష్టి చెప్పుట

అట్టియెడ లోకపితామహుం డప్పటికిఁ దనకావించిన మునిసర్గము విస్తృతము గాదని తలపోసి యింకను సృష్టిఁ గావింప నెంచి మున్ను దాను విడిచినదేహముకంటె నుత్తరం బగు దేహాంతరంబుఁ గొని యద్దిరా! యేను సృష్టివిషయమున నిత్యవ్యాపృతుఁడనై యుండిన నయ్యది లెస్స నెఱవేఱకుండెను. దైవవిఘాతం బిదే యుండవలయు నని తనలో నాలోచించుచు శబ్దవాచ్యుఁ డగునా బ్రహ్మదేహమున ద్వైధాదృశ్యమానంబైనకాయం బొక్కఁ డుద్భవిల్లె. ఆరెంటిలో నొక్కటి పురుషరూపంబు నొండొక్కటి స్త్రీరూపంబునై మిథునం బయ్యె. అందుఁ బురుషుఁడు

---

ఫలాదుల జీవించువా రౌదుంబరులు. తమంతన రాలినఫలాదుల బ్రదుకువారు ఫేనపులు. స్వాశ్రమకర్మప్రధానుఁడు కుటీచకుఁడు కర్మప్రాధాన్యంబుఁ గొననిజ్ఞానప్రధానుఁడు బహూదకుఁడు. జ్ఞానాభ్యాసనిష్ఠుఁడు హంసుఁడు. బ్రహ్మతత్త్వజ్ఞాని పరమహంసుఁడు.

స్వాయంభువుం డగుమనువును స్త్రీ యతనిభార్య యగు శతరూపయు నై రి. అప్పుడు మొదలు మైథునధర్మమునం బ్రజావృద్ధిప్రవృత్తం బయ్యె నట్లుం డేని స్వాయంభువమనువునకు శతరూపయందుం బ్రియవ్రతుం డుత్తానపాదుం డను నిరువురుపుత్త్రుల, నాకూతి దేవహూతి ప్రసూతి యనముగ్గురు కూఁతులనుం గని యాకూతిని రుచికిని దేవహూతిని గర్దమునకుం బ్రసూతిని దక్షునకు నిచ్చె. వారిసంతతుల నీజగంబు పరిపూరితం బయ్యె నని చెప్పిన విని విదురుండు వాసుదేవకథామృతుండై మైత్రేయున కిట్లనియె. మునివరేణ్యా! బ్రహ్మప్రియసుతుం డైనస్వాయంభువమనువు ప్రియపత్నిం బడసి యామీఁద నేమేమి చేసె? రాజర్షి యై భగవంతునాశ్రయించిన యయ్యాదిరాజుచరిత్రంబు సవిస్తరంబుగ వివరింపుము. పెద్దకాలము శ్రమ కోర్చిచదివినవిద్యలపరమార్థం బెల్ల ముకుందుభక్తులగుణానుశ్రవణంబనుటయే కాని యొండుగాదని యడుగుటయుఁ గృష్ణుండు తనపాదములందొడలపయిం జాఁచి మన్నింప వెలసి భగవత్కరుణాభాజనం బైన యవ్విదురుండు దన్ను భగవత్కథాప్రస్తావమునకుం జొనుపుటకు మిక్కిలి యుల్లసిల్లుచు మైత్రేయుం డతని కిట్లనియె. స్వాయంభువుం డైనమనువు దనభార్యతోడం బుట్టి యట సర్వేశగర్భునకుం బ్రణమిల్లి కేలుమోడ్పు ఘటియించి దేవా! నీవలన నందఱు జనించుటం జేసి నీవే యందఱకుఁ దండ్రి వి మఱి రక్షకుండవు. నీకు మావలనం గలుగుకార్య మెద్దియు లేకుండినను నేదేనొక్కదాని నేము చేసినం గదా యేము నీకుం బరిచర్యంగావించి కృతార్థత గాంతుము. కావున మాశక్తికిం దగిన పనులలో నెయ్యది చేసిన నీమది కెక్కెడునో యెయ్యదియుభయలోకములం గీర్తిగావించునో యట్టిదాని నేర్పఱిచి మమ్ము నియోగింపుమని యడుగుటయు బ్రహ్మ మనువున కిట్లనియె. క్షితీశ్వరా! నిష్కపట మగుచిత్తమున నీవు తనంత నొకపని చెప్పుమని నన్నుం గోరికొనుటం జేసి నీకు మెచ్చితి. మే లయ్యెడు మత్సరంబు మాని యాదరంబుతో నేమఱక గురువులయాజ్ఞం గొను టనుటయే పుత్త్రులు దండ్రులయెడం జూపు పూజ యయ్యెడు. నీకుం దగినకార్యంబు సెప్పెదం జేయుము. నీవు నీకు సర్వగుణముల ననుగుణ మగుసంతానము నీశతరూపయందుం బడసి ధర్మమున భూమి నేలుము. యజ్ఞముల యజ్ఞపురుషు నారాధింపుము.

నీవు ప్రజల లెస్స రక్షించిన నప్పుడియ మదీయపరిచర్య యయ్యెడు. భగవంతుఁ డగుహృషీకేశుఁడును దాన నీయెడఁ బ్రీతుఁ డయ్యెడు. యజ్ఞమూర్తి యగుజనార్దనుఁ డెవ్వరియెడఁ బ్రీతి సేయఁ డట్టివారి శ్రమ మెల్ల నిరర్థకంబ యగు. మఱియు నట్టివా రాత్మానాదరంబు చేసినవా రగుదు రనిన విని మనువు దేవా! నీయానతిమెయిఁ బ్రవర్తిల్లుదు. సర్వ భూతములకు స్థానం బగుభూమి నీట మునిఁగియున్న కతనఁ బ్రజలకు నాకును నిలువ నెడ గలుగకుండెడు. కావున భూదేవి నుద్ధరింప యత్న మొనర్పవలయు నని నివేదించె.

## హరి వరాహావతారమున భూమి నుద్ధరించుట

అవ్విధమున స్వాయంభువమనువు నివేదించిన నాకర్ణించి విరించి జలనిమగ్న యగుభూమి నెట్టు లుద్ధరింతునని పెద్దయుం బ్రొద్దుతనలోఁ జింతించుచు నక్కటా! యేను దొలుదొలుత నొక్కతూరి జల మెల్ల ద్రావి భూమిని లెస్స నిలిపి దేవాసురపితృమనుష్యపశుపక్షిసరీసృపనగ నాగాదిరూపము లగునానావిధభూతముల సృజించుచుండఁ గ్రమ్మఱ నిప్పు డేలొకో పుడమి నీట మునిఁగి పాతాళముఁ జొచ్చె. సృష్టికార్య నియోజితు లగుమా కప్పు డెయ్యది కర్తవ్యంబో తెలియనేరనయ్యెద. నన్నుఁ బుట్టించిన దేవదేవుఁడే యిప్పుడు చేయవలసినదానిం జేయుఁగాక యనిధ్యానించుచున్నంత నాహిరణ్యగర్భునినాసావివరమునుండి యంగుష్ఠ ప్రమాణంబుతో వరాహపోతం బొక్కండు వెలువడి క్షణమాత్రలో నతండు చూచుచుండఁగ నంతరిక్షమునఁ బొడగట్టుచు నేను గంత పెరిఁ గిన నయ్యది యద్భుతంబయ్యె. అట్టియెడ విధాతయాసూకరరూపంబుఁ గాంచి మరీచిప్రముఖులును సనకాదులును మనువును దానుం దద్విధం బరయనేరక పలుదెఱంగులఁ జింతించుచు నాహా యిది యేమి సూకర వ్యాజమున దివ్యసత్త్వంబు దోఁచె. మఱియు నియ్యది దొలుత మదీయ నాసికంబున నంగుష్ఠమాత్రంబై వెలువడి యాక్షణంబ పరమాశ్చర్యం బుగాఁ బెద్దకాయంత యయ్యె. పరికించిన నయ్యజ్ఞేశ్వరుండు మదీయ చిత్తమరయ నిట్టిరూపమునం బొడగట్టెగావలయు నని బ్రహ్మదేవుఁడు పుత్త్రులు దానుం దమలో వితర్కించుచున్నంత నున్నతపర్వతాకారంబై యాసూకరంబు బ్రహ్మకుఁ దక్కినవారికిం బ్రహర్షముఁ గూర్పుచు

దిక్కులఁ బ్రతిధ్వనం బెసఁగ ఘుర్ఘురించె. తమసంశయచ్ఛేదకములైన జాలిన యమ్మాయాసూకరంబు సేయు ఘుర్ఘురధ్వని విని జనస్తపస్సత్యలోకవాసు లగువారు పవిత్రము లగు ఋగ్యజుస్సామమంత్రముల నమ్మాయావరాహమూర్తి యగు నారాయణుఁ బ్రస్తుతించిరి. ఆత్మగుణానువాదంబైన తదీయస్తుతుల నాలించుచు నవ్వేదమూర్తి గ్రమ్మఱ గర్జిల్లి గజేంద్రలీలఁ దోఁప నాకాశచారియై కఠోరుఁడై సటాకటంబు విదుర్చుచు ఖరరోమములు చర్మమం దెల్ల నిగుడించుచు ఖురముల జలదమండలంబుఁ దన్నుచు ధవళదంష్ట్రాప్రకాశంబు వెలిఁగించు నాత్మనిరీక్షలోకంబు నెఱపుచు విబుధోదయార్థంబు పృథివి నుద్ధరించువాఁడై ఘ్రాణేంద్రియమున భూమి జన్న తెరువు వరయుచుఁ గరాళదంష్ట్రుఁ డయ్యు నకరాళవీక్షణంబునఁ దన్నుఁ బ్రస్తుతించు మునుల మన్నించుచు నాజలంబులోనికిం జొచ్చె. చొచ్చుటయు వజ్రపర్వతముచాడ్పున నతికఠిన మగు నమ్మాయావరాహగాత్రంబు తాఁకునం గర్భము వ్రీల సాగరమున ఘోరధ్వని పెల్లెసంగుటయు నాస్వనంబు సముద్రుఁ డత్యంతఘోరపాతవేగం బోర్వఁజాలక యార్తుఁడై తరంగహస్తములఁ జాఁచి యోయజ్ఞేశ్వరా! నన్నుఁ గావవే యని మొఱ పెట్టువిధమున నుత్ప్రేక్షింప నొప్పె. సవనత్రయంబు పర్వత్రయిగా నమరుమాయాసూకరం బగు నయ్యజ్ఞమూర్తి తుర ప్రకఠోరము లగు ఖురముల నయ్యపారవారిపూరంబుఁ బాయ వడంజేసి యాలోన మున్ను దాఁ బ్రళయసమయమునఁ దనలో నిడికొన్న సర్వజీవాధారం బగు భూమిం గాంచి యట దానిం దనదంష్ట్రాగ్రమున నెత్తి రసాతలంబునుండి గొనివచ్చి యందుఁ దన్నడ్డగింప గదఁ గొని తలపడిన యాదిదైత్యుం డగు హిరణ్యాక్షు నసహ్యపరాక్రముం డైనవాని మృగేంద్ర మేనుఁగు నెట్టు లట్టు లవలీల నలుకమై జక్రాయుధమున నఱికి వాని నెత్తుటఁ దోఁగినగండతుండములతో దరి గూరాడునెడ ధాతురాగమునఁ జేవుఱించిన గజేంద్రంబులీల ననుకరించుచుఁ బరమదర్శనీయుం డయ్యె. తమాలనీలుఁ డయ్యు సితదంష్ట్రాప్రకాశంబు నెల్లెడల నడరించుచు వారణక్రీడఁ జూడ నొప్పుచు భూమి నుద్ధరించుచున్న యమ్మాయావరాహుం డైన నారాయణుం గృతాంజలులై పద్మజాదులు వేదవాక్యసమము లగు వచనముల నిట్లని స్తుతించిరి.

## బ్రహ్మాదులు వరాహమూర్తి యగుహరిం బ్రస్తుతించుట

అజిత! యజ్ఞేశ్వరా! నీవ జయించితివి. రోమరంధ్రములలో నంబుధు లీంకునట్లు నిజదేహము విదిర్చు కారణసూకరాత్మకుం డైననీకు నమస్కారము. యజ్ఞమయం బైననీయీరూపము దుష్కృతాత్మకుల కదృశ్యంబు. నీత్వక్కునందు ఛందస్సులు, లోమములందు బర్హిస్సు, చక్షుస్సునందు సంస్కృతం బైనయాజ్యము, పాదములందుఁ జతుర్హోత్ర కర్మంబు, తుండమునందు స్రుక్కు, నాసికంబులందు స్రువ, ముదరమున * నీడ, కర్ణరంధ్రమున † జమసము, లాస్యమునఁ ‡ బ్రాశిత్రంబు, నోటిబిలమున గ్రహములు, భక్షణంబున నగ్నిహోత్రం, బప్పు టప్పటియభివ్యంజనమునందు దీక్షణీయేష్టి, కంఠమున నుపసత్తు లను నిష్టులు మూఁడు, కోఱలఁ బ్రాయణీయోదయనీయేష్టులు, జిహ్వను బ్రవర్గ్యంబు, శిరస్సున సభ్యావసథ్యము లనునగ్నులు, ప్రాణముల నిష్టకాచయనంబులు, రేతస్సున సోమంబు, బాల్యాద్యవస్థలఁ బ్రాతస్సవనాదులు, త్వఙ్మాంసాదిసప్తధాతువుల నగ్నిష్టో, మాత్యగ్నిష్టో, మోక్థ్య, షోడశీ, వాజపే, యాతిరా, త్రాప్తోర్యామంబు లనుసప్తసంస్థలు, శరీరసంధుల ద్వాదశాహాదిసత్త్ర యాగంబులు నై యమర యజనంబు బంధనంబుగా నసోమంబు లగుయజ్ఞములు నసోమంబు లగుక్రతువులును నీకు రూపంబయ్యె. అఖిలమంత్రదేవతాద్రవ్యాత్ముఁడు సర్వక్రతుస్వరూపుఁడు వ్యాపారసామాన్యరూపుఁడు విరక్తివలనఁ గలుగునకామ్యకర్మసాధ్య మగుశుద్ధి నొదవుభక్తివలన నెసఁగుచిత్తస్థిరత్వమున ననుభావ్య మగు జ్ఞానమున సాక్షాత్కరింప నర్హుఁడు జ్ఞానప్రదుఁ డైన గురువు నగునీకుఁ బ్రణమిల్లుదుము. దేవా! నీదంష్ట్రాగ్రమునఁ బర్వతసహితం బైనపృథివీ మండలంబుఁ దాల్చుటం జూడఁ గమలాకరంబున విహరించుచు వనగజం బందలి పంకముతోడం బెకలించి నిజదంతంబుపయి నిడికొన్న పద్మలతఁ దలఁపించెడు. మఱియు దంష్ట్రాధృతం బైన భూమండలమున భవద్రూపంబు నిజశిఖరంబునఁ దాల్చినమేఘమునఁ గులపర్వతంబుమాడ్కిఁ జూడ నయ్యెడు. తండ్రీ! స్థావరజంగమభూతములకాధారంబుగా నీపత్ని

---

* పురోడాదిభక్షణపాత్ర. † చతురశ్రము అగుసామపాత్రలు. ‡ బ్రహ్మభాగపాత్ర ♦ ఊర్ధ్వాకారము అగుపామపాత్రలు.

యగుభూమి నొక్కచోఁ బ్రతిష్ఠింపుము. యాజ్ఞికులు మంత్రముల నరణిలో నగ్ని నుంచినట్లులు నీవు భూమిలో నిజ తేజంబు నిక్షేపించితివి. మాతంద్రి యగునీతో నస్మజ్జనని యగునవనికి మ్రొక్కుదుము. పాతాళంబు సొచ్చినభూమి నుద్ధరించి తేర నీవు దక్క నొండొకఁ డుత్సహింపఁడు. అతిచిత్రం బైనయీజగము నిజమాయావిధమున సృజించిన నీకీభూమ్యుద్ధరణం బాశ్చర్యంబు గాదు. వేదమయ మగునిజదేహము విదిర్చునెడ నీపటల నెగయుపుణ్యసలిలము సోఁకుటయు జనస్తపస్సత్యలోకవాసు లగుమేము పావనుల మైతిమి. అపారకర్ముఁ డగునీకర్మంబులకుఁ దుదియరయుదు నను వాఁడు భ్రష్టమతి యనుట నిస్సంశయంబు. భవచ్చరిత్రంబు దుర్బోధంబు. నీయోగమాయవలనం గాదె యీవిశ్వమెల్ల మోహముఁ జెందెడు. జగమునకు మేలు చింతింపుమని యిట్లు బ్రహ్మవాదు లగుమునులు ప్రస్తుతించుటయు నమ్మాయాసూకరుం డైనహరి నిజపాదఖురాక్రాంతం బైనయాజలమునం బుడమి నునిచి యంతర్హితుం డయ్యె. వర్ణనీయమాయావిలాసుం డైననారాయణునిమంగళం బగునీ వరాహావతారచరిత్రంబు భక్తిమెయి విన్నవారికి జనార్దనుండు హృదయమునఁ బ్రసన్నుం డగు. సర్వార్థములకుఁ బ్రభు వగునాసర్వేశ్వరుఁడు ప్రసన్నుఁ డైన నెయ్యదియు దుర్లభంబు గాదు. తుచ్ఛవాంఛలం బ్రయోజనం బేమి? అనన్యభావమున భజించువారిహృదయంబుల హరి తాన చొచ్చి వారి కాత్మగతిం బ్రసాదించు. హరిపూర్వచరిత్రంబులో నమృతప్రాయంబు సంసృతినివర్తకంబు నగు నీమాయావరాహకథను వీనుల దోయిలించుకొని తనివి దీఱఁ ద్రావి యర్థసారవిదుఁ డగునేపురుషుఁడు విరక్తిఁ జెందకుండు? అట్టివాఁడు గలుగునేని యయ్యధముఁడు పశువ కాని మనుజుండు కాఁ డని చెప్పిన విని విదురుఁడు హరివరాహావతార చరిత్రం బాకర్ణించి యింక నందుఁ దా నడుగఁ దలఁచి నాతితృప్తుఁడై యిట్లనియె.

## హిరణ్యాక్షసంహారకథాప్రారంభము

మునీంద్రా, నారాయణుఁడు వరాహావతారమున హిరణ్యాక్షుని వధించెనని మీర లింతకుమున్ను చెప్పితిరి. భూమి నుద్ధరించునెడ నా దైత్యునకును భగవంతునకు నేల పో రయ్యె? వానిజన్మవిస్తరంబుతో

నెల్లయు శ్రద్ధాభక్తులు గలనాకుఁ దేటపఱుపుము. భగవత్కథలు విను నెడ నాకప్పటప్పటికి గుతూహలంబు దొరఁగెడుఁగాని తనివి పుట్టకుం జెపు మని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె. వీరవర్యా, మర్త్యులకు మృత్యుపాశమోచనంబుఁ గావించుహరిచరితవిషయ మగుటం జేసి భవదీయప్రశ్న ముపపన్నంబు. తొల్లి యుత్తానపాదునిపుత్త్రుఁ డగు ధ్రువుఁడు బాలుఁడయ్యు నారదమునీంద్రువలన నారాయణచరితం బాకర్ణించి కృతార్థుండై మృత్యువుతలపయిం గాలు వెట్టి హరిపదం బధిరోహించె. నీ వడిగిన హిరణ్యాక్షువధకథావిషయమునం దొల్లి సురలడుగ బ్రహ్మదేవుఁడు వారికి వివరించినకథాసంవిధానం బితిహాససంభవ ప్రవర్తిల్లె. దానిం జెప్పెద నాకర్ణింపు మని మైత్రేయుండు విదురున కిట్లనియె.

## దితి కశ్యపప్రజాపతిం బుత్త్రార్థ ముపసర్పించుట

తొల్లి దాక్షాయణి యగుదితి సంధ్యాసమయమునందు సూర్యుఁడు గ్రుంకుతఱిఁ బయస్సున నగ్నిహోత్రంబు దీర్చి యజ్ఞేశ్వరు నారాధించి యగ్నిశరణంబున సమాహితచేతస్కుఁడై యున్నమరీచిపుత్త్రుం డైనకశ్యపప్రజాపతిఁ దనపతిం జేర నరిగి మదనతాపంబు సైఁపనోపక పుత్త్రార్థినియై యిట్లనియె. మునీంద్రా, వీఁడె మన్మథుఁడు గృహీతకోదండుఁడై మతంగజము కదళింబోలె నన్ను నీనిమిత్తం బేఁచుచున్నవాఁడు. మఱియుఁ బుత్త్రవతు లగుసవతులపెంపు మిక్కిలి గాఱించెడు. అనుగ్రహించి నాకుఁ బుత్త్రుం బ్రసాదింపుము. సంతానరూపమునఁ బతిం దమగర్భమునం గని భర్తబహుమానంబు వడసినవనితల యశంబు లోకముల నెల్ల వెలుంగు. తొల్లి దుహితృవత్సలుం డైనమా తండ్రి దక్షుఁడు సంతానభావనుండై మత్ప్రభృతు లగుతనకూఁతుల నందఱ వేఱువేఱ మీ రెవ్వనిఁ బతిఁగా వరింతు రనియడిగి వారిలోఁ ద్వాదశీలమున నాశపడినవారి నాతోడఁ బదుముగ్గురను నీ కొసంగె. పద్మలోచనా, కావున నాకోర్కి కల్యాణంబు గావింపుము. మహాత్మా, భవాదృశు లగునుత్తములయొద్ద దీనులయుపసర్పణం బమోఘంబుగదా యని దైన్యంబు గదురఁ బెక్కులు పలుకుచున్న మదనవేదనావిహ్వల యగు భార్యకుఁ బ్రియవచనముల ననునయంబుఁ గావించువాఁడై కశ్యపుఁ డిట్లనియె. కామినీ, యిదె యేను నీకుఁ బ్రియము సేయ

పలికెదను. త్రివర్గసాధనంబైన పత్ని కోర్కి నెఱవేర్పక యెవ్వఁ డుజ్జ
గించు? కళత్రవంతుఁడు తనగృహస్థాశ్రమమున సర్వాశ్రమములవారిం
బోషించుచు జలయానముల నర్ణవము నెట్లట్లు వ్యసనసాగరము నతిక్ర
మించు. గృహస్థుఁడు తనభారమెల్ల నెవ్వతెపై నిడి చింతఁ బాయు నట్టి
భార్య శ్రేయస్కాముఁ డగుతన కర్ధశరీరం బని పెద్దలు పల్కుదురు.
ఇతరాశ్రమముల గెలువరానియింద్రియము లనుశత్రువులం గృహ
స్థులు భార్యం బడసి దుర్గపతి దస్యువులంబోలె నవలీలం గెల్తురు.
గృహేశ్వరి, సర్వవిధముల నుపకరించుజాయకుఁ బ్రత్యుపకారం
బాయుస్సు గలయంతకాలముననైన నొనర్ప నేమ కాదు మాకంటె
నధికగుణాభిలాషులును జాలరు. ఐన ముహూర్తమాత్రంబు పెక్కులు
పలుక నోరకుండుము. అటఁ బుత్రార్థంబైన నీకామము నెఱవేర్చెద.
ఇయ్యది ఘోరరూపులకు ఘోరదర్శనంబైన సంధ్యాసమయంబు
ఘోరంబై ప్రవర్తిల్లెడు. ఇందు భూతేశ్వరానుచరంబు లగుభూతములు
సంచరించెడు. వెండియు నీసంధ్యావసరంబున భూతభావనుండు నీకు
బావయు నగుభూతేశ్వరుండు భస్మోద్ధూళనప్రస్ఫురద్గాత్రుండై శ్మశాన
వాత్యాసముత్థితధూళిధూమ్రవికీర్ణజటాకలాపుఁడై వృషభమెక్కి భూత
పార్షదగణంబులతోఁ దిరుగుచుఁ దననేత్రత్రయమునఁ జూచుచుండెడు
అమ్మహేశ్వరుఁడు సర్వసముఁడు గావున నాతని కొక్కండు దనవాఁడాద
రణీయుఁడనియు నొండొక్కఁడులాఁతి ద్వేష్యుఁడనియు భేదముపొసఁ
గదు. అతండునిర్మాల్యంబురీతిదూరమునం ద్యజించినభుక్తభోగమగుమా
యామయైశ్వర్యంబును మనము వ్రతానుష్ఠానములఁబడయఁగోరుదుము.
అవిద్యాపటలంబు భేదింపఁ దలంపు గొన్నవారు సజ్జనగతి యగునమ్మహా
దేవుఁడు నిరస్తసామ్యాతిశయుఁడయ్యుఁ దాను విడంబనార్థంబు పిశాచ
చర్యనాదరించు నని విషయాసక్తిసూన్యం బగుతదాచారముం బ్రశం
సింతురు. తుదిఁ గుక్కల కెఱయగుశరీరమునం దాత్మభావంబుఁ దలఁచి
వస్త్రమాల్యాభరణానులేపనాదులఁ దత్సంస్కార మొనర్చుచు నుపలా
లించునిర్భాగ్యు లగుమూఢులే స్వాత్మనిరతుం డైనయమ్మహేశ్వరుని
హితం బెఱుంగక పరిహసింతురు. ఎవ్వనిధర్మమర్యాదలు బ్రహ్మాదులు
పాలింతు రెవ్వఁ డీవిశ్వమునకుఁ గారణం బెవ్వనియానతిఁ దలఁ దాల్చి

మూయు నెఱవేర్పు నద్దిరా యట్టిపరమేశ్వరుపిశాచచర్య విడంబనంబ కాని యొండనం దగునే! యని కశ్యపుం డెంత యుక్తి చెప్పినను దితి మన్మథోన్మథితేంద్రియయై కాలవిళంబ మోర్వం జాలక వృషలివోలె సిగ్గు విడిచి పతివస్త్రంబు పట్టుటయు నిషిద్ధకార్యమునం దన్ను భార్య యవ్విధమున నిర్బంధించుట యెఱింగి దైవమునకు మ్రొక్కి యేకాంత దేశమున కాపత్నితోడ నరిగి తదీయాభిమతంబు నెఱవేర్చె. అట నచ్చోటు వాసి యాకశ్యపముని స్నానాదు లొనరించి శుచియై మౌనియై ప్రాణాయామంబు సేసి రజోరహితం బగుభర్గశబ్దవాచ్యం బైనబ్రహ్మముం జింతించుచు సనాతనబ్రహ్మంబైన గాయత్రిని జపించు చున్నంత దితి యాకర్మదోషమునకు లజ్జితయై యాబ్రహ్మర్షి నుపసర్పించి యధోముఖియై యిట్లనియె. బ్రహ్మర్షివర్యా, తన కపరాధ మొనర్చిన దాని కలిగి భూతేశ్వరుఁడు నాగర్భమునకుం జేటు గావింపకుండవలయు. రుద్రమహాదేవోగ్రమీఢ్వచ్ఛివన్యస్త దండధృతదండాది పదవాచ్యుం డైనయాశంకరునకుం బ్రణమిల్లెద. నాకు బావయు మహానుగ్రహుఁడు సతీపతియు నగునాభగవంతుఁడు బోయకైనం గరుణింపవలసినస్త్రీజాతి యగునాయెడం బ్రసన్నుం డయ్యెడు మని తనగర్భమునకు మేలుగోరుచు భయకంపిత యగుదితికి నిర్వర్తితసంధ్యానియముండై కశ్యపమునీంద్రుం డిట్లనియె.

### దితిగర్భమున రాక్షసులు జనింతు రని కశ్యపుఁడు చెప్పుట

చండీ, నీచిత్తము పరిశుద్ధంబు గామియు, సంధ్యాకాలంబు సంక్రమించుటయు, నాయాజ్ఞ నతిక్రమించుటయు, రుద్రానుచరులను హేళన మొనర్చుటయుం గారణంబులుగా నీగర్భమునం బుత్త్రాధము లిరువురు పుట్టి ముల్లోకములకుం బీడఁ గావింతురు. వారు నిరపరాధులు దీనులు నగుప్రాణులం జంపియు నువిదల నిగ్రహించియు మహాత్ముల నలిగించియు రాక్షసకృత్యంబులు సేయుచుండ లోకేశ్వరుం డైనవిష్ణు దేవుం డలిగి యవతారంబెత్తి పర్వతముల వజ్రధరుం డెట్లట్లు పోర వారిం బరిమార్చెడు నని చెప్పిన విని దితి మహాత్మా, యింక నేమి సేయు దాన దుష్పుత్త్రప్రవృత్తు లగునాకొడుకులు బ్రాహ్మణక్రోధము బారిం బడక తప్పి చక్రాయుధుచే మృతి నొందుట యాశాస్యంబయ్యెడు

బ్రహ్మాండదగ్ధునకును భూతభయప్రదునకు నేజన్మ మెత్తినను నరకంబున నైనను సుఖంబు గలుగ దని విన్నవించినం గశ్యపుండు భార్యకు మఱియు నిట్లనియె. చేసినతప్పిదంబునకుం జింతించుచుం దోడన యుక్తాయుక్తముల విమర్శించుటం జేసియు భగవంతునియెడ భక్తి కలిమిం జేసియు శివునెడను నామీఁద నాదరంబుఁ జూపుటం జేసియు నీపుత్త్రు లుత్పథప్రవృత్తులైనను వారిలో నొక్క నిపుత్త్రులలో నొక్కరుండు సాధుసమ్మతుండు గాఁగలఁడు. విమల మగునతనికీర్తి భగవద్యశంబుతో సమంబుగాఁ గీర్తింపఁబడఁగలదు. సాధువు లతనిశీలం బనుసరింపఁ గోరి నిర్వైరాదియోగముల వన్నెతక్కువ యగుబంగారము నగ్నిపుటములం బోలె నాత్మచిత్తంబు శోధింతురు. యదాత్మక మగునీవిశ్వ మెవ్వని ప్రసాదమునఁ బ్రసన్న మగు నయ్యాత్మసాక్షి యాభవత్పౌత్త్రునియనన్య నిష్ఠకు మెచ్చెడు. మహాత్ములకు మహిష్ఠుండు మహానుభావుండు నగు నమ్మహాభాగవతుండు భక్తియోగంబు పెంపునం బ్రక్షాళితమలంబై పరమపరిశుద్ధం బైనతనచిత్తమున భగవంతు నునిచికొని దేహాద్యభిమానంబు విడువఁగలఁడు. ఆశారహితుండు సుస్వభావుండు గుణాకరుండు పరులమేలిమికి సంతసించువాఁడు పరులకు దుఃఖము దోడరినం దాను దుఃఖించువాఁడు నగునయ్యభూతశత్త్రుండు నిదాఘతాపముఁ జంద్రుఁ డెట్టు లట్టుల లోకశోకంబు పరిహరించెడు. లోపలను వెలుపలను నిర్మలుండు కమలలోచనుండు నిజభక్తులకోర్కి కనుగుణముగ నాయారూపముల ననుగ్రహించువాఁడు స్ఫురితకుండలమండితాననుండు నగుశ్రీనాథుని నీమనుమఁడు సూడఁగలఁడని కశ్యపుండు సెప్పిన విని దితి తనకొడుకులకు హరిచేఁ జావుగలుగుట కుత్సహించుచు మనుమఁడు భాగవతుఁ డగుటకు మిక్కిలి మోదంబుఁ జెందె.

## దితిగర్భమువలనఁ గ్రమ్మినచీఁకటి కలికి సురలు బ్రహ్మకు నివేదించుట

అట్లు దితి పరతేజోహారం బైనకశ్యపప్రజాపతితేజముఁ గర్భమున శతవర్షములు ధరించి యాగర్భము సురలు చెఱుపఁ జూతు రని శంకించుచున్నంత నాగర్భతేజమున లోకమునం బ్రకాశ ముడిగి చీఁకట్లు గ్రమ్మినం బ్రతిహతతేజస్కులై లోకపాలురు మున్నగునమరులు దానిం బ్రహ్మదేవునకు విన్నవింప నరిగి యిట్లనిరి. దేవా, మాకు వెఱపు పుట్టిం

చుచు నీతమంబు గ్రమ్ముచుండెడు. కాలస్వరూపంబుఁ గాననిజ్ఞానప్రవాహమున వెలయునీకుఁ దెలియకుండునే? దేవదేవా, జగన్నాథా, లోకనాథశిఖామణీ, పరాపరభూతములభావమెల్ల నీ వెఱుంగుదువు. విజ్ఞానబలమున నలరారియు మాయవలన నీమేనుం బూని రజోగుణంబుఁ గొన్న జగత్కారణం బగునీకుఁ బ్రణామము. సమస్తభువనములఁ దనలో నిడికొని కార్యకారణాత్ముఁడై దానికిఁ బరుఁడై యాత్మభావనుఁడై యున్న నిన్ను నిష్కామం బగుభక్తియోగమున ధ్యానించుజితశ్వాసేంద్రియాత్ము లగుసుపక్వయోగులకు భవత్ప్రసాదముసంజేసి దేనివలన నేనియుఁ బరాభవంబు గలుగదు. గోవులు త్రాటనె ట్లట్లు లెవ్వనివాక్కున నియంత్రితులై వశులై ప్రాణు లెవ్వనిపూజఁ గావింతు రట్టిముఖ్యుఁ డగునీకు నమస్కారము. తిమిరవ్యాప్తింజేసి లుప్తకర్మంబు లగులోకములకు మేలు గూర్పుము. కృపాపరిపూర్ణదృష్టి నాపన్నులఁ జూడ నర్హుండవు. ఇయ్యది దితిగర్భస్థం బైనకశ్యపుతేజంబు దెసలనెల్లఁ జీకట్లు గ్రమ్ముచు సమిత్తున నగ్నివోలె వర్ధిల్లుచుండెడు నని చెప్పిన విని బ్రహ్మదేవుఁడు నవ్వుచు మధురవచనంబుల వారికిఁ బ్రీతిఁ గావించుచు నిట్లనియె.

## బ్రహ్మ హిరణ్యాక్షహిరణ్యకశిపుల జన్మకారణంబు చెప్పుట

సురలారా, మీకుఁ బూర్వజాతు లైనమదీయమానసపుత్త్రు లగుసనకాదులు లోకములందు విగతస్పృహులయ్యు యదృచ్ఛాగతి నాకాశమున నెల్లలోకములఁ జరించువా రొక్కనాఁడు సర్వలోకనమస్కృతం బైనవైకుంఠమునకుఁ జనిరి. అందు వసించుపురుషు లందఱు ఫలాభిసంధిరహితం బైన ధర్మమున హరి నారాధించుచు విష్ణుమూర్తులై వెలయుదురు. వేదాంతవేద్యుం డైనభగవంతుఁ డగునాదిపురుషుఁడు రజోరహితం బగుశుద్ధసత్త్వముఁ గొని నిజభక్తులకు సుఖముఁ గూర్పు ధర్మస్వరూపుఁడై నెలకొనియుండు. అందు సర్వర్తుశ్రీసమృద్ధిఁ దనరి సమస్తకామముల నొడఁగూర్చునుత్తమద్రుమముల నిబిడంబై మూర్తి దాల్చినకైవల్యంబనఁగనై శ్రేయసం బనునుపవన మొక్కండు గలదు అందలికొలంకులసలిలాంతరంబున నొలయులేఁదెమ్మెరలకమ్మతావిని నిరంతరసిద్ధ్యన్నకరందసుందరమాధవీపరిమళమునఁ దిరస్కరించుచు విమాన

ఘాషలు లలనలతో సొగియుచు లోకపావనిరసనంబు లైనహరిచరిత ములఁ గీర్తింతురు. అశ్యామలంకులలోన వీనులకు విందుగ నెలుం గెప్పు కోకిలపారావతసారసచక్రవాకదాత్యూహహంస శుకతిత్తిరిమ యూరప్రముఖంబులు నచ్చటితుమ్మెదలు హరికథలు నిజఝుంకారాకార ముగం బాడునట్లు లుత్ప్రేక్షించి నిజకోలాహలంబు కొంతవడవు చాలించెను. అవ్వనంబునందలి మందారకుందకురవకోత్పలచంపకపున్నాగ పారిజాతాదులు పరమపురుషుఁడు తులసీగంధముపయింగూర్మి సేయుటఁ జూచి దానితపంబు మెచ్చెడు. మఱియు నాలోకంబున సుందరాం గులపరిహాసవిలాసాది చేష్టితములఁ దమకుఁ గామముఁ గలిగింపఁ జాలని తెఱఁగున నిగృహీతేంద్రియు లైనభాగవతులు భగవచ్చరణప్రణామ మాత్రలబ్ధము లగురత్నకాంచనమయవిమానముల నెల్లెడల దండడిం దిరుగుచుండుదురు. అన్యు లత్యంతయత్నమునం గాని తనయనుగ్రహము బడయఁ జాలనిపరమభాగ్యంబున సమస్త శ్రీదేవి రూపముఁ గొని ముక్త దోషయై యాహరిసదనంబునఁ గనకఖచితస్ఫటికకుడ్యమున నూపుర క్వణనంబుఁ గావించుచు లీలారవిందమున సమ్మార్జనంబు సేయునట్లు చూపట్టెడు. వెండియు నాలోకమాత దాసీపరివృతయై తనతోఁటలోఁ దులసీదళముల నీరు నర్పించుచు విమలమధురసలిలపరిపూరితంబులు ప్రవాళతటములు నగుదిగ్గియలలోనం బ్రతిఫలితం బైనవంతకుతచిహ్ని తం బగుతననెమ్మొగమ్ముఁ గాంచి కాంచనాంబరుప్రసాదంబుఁ బడయఁ జాలితి నని మదిలో నుప్పొంగెడు. భగవచ్చరిత్రప్రశంస మాని మతి పాపము లగునితరకుకథల వినువారి కాలోకంబు గమ్యంబు గాదు. అట్టి దుష్కథల వినువారు దానం బ్రక్షీణపుణ్యులై నిర్భాగ్యులై నిరా శ్రయము లగునరకములం బడుదురుగాని యట్టివారుం గడ తేర నేర్తురే? బ్రహ్మవాదులకు నాశాస్యం బైనధర్మతత్త్వజ్ఞానసాధనం బగునరజన్మ మెత్తియు వారి నారాధింపనివారు భగవన్మాయామోహితులు కాని యొండు గాదు. భగవత్పరిచర్య జేసి యమునకు దూరులై స్పృహ ణీయస్వభావులై పుణ్యాత్ములు దమలో నొకళ్లొకళ్లతోడ భగవల్లీలలఁ జెప్పికొనుచు గరుపారెడుమేనులతో నాకు మీఁద నుండునాలోక మున కరుగుదురు. అట్టిభువనైకవంద్యము విబుధవర్యవిచిత్రవిమానవిభా

విలసితము విశ్వేశ్వరావాసం బపూర్వంబు నగువైకుంఠలోకము నష్టాంగ యోగప్రభావమున సనకాదు లుపసర్పించి భగవదవలోకనోత్కంఠాతి శయమునం జేసి యక్కడియద్భుతములపై నాసక్తి చేయక యాఱు కక్ష్యాంతరంబులు గడచి సప్తమకక్ష్యకుం జని యందు గదాపాణులు కేయూరకుండలకిరీటాదిభూషణములఁ గై సేసి నీలచతుర్భుజాంతర మున నళిఝంకారచారువనమాలికల ధరించి కుటిలభ్రూయుగంబున నుచ్ఛ్వాసనిశ్వాసము లొనర్చునాసాద్వయమున రక్తేక్షణమునం గోప మించుక ప్రకటించువక్త్రమున నొప్పుచున్న ద్వారపాలకుల నిద్దఱంగాంచి కాంచనవజ్రకవాటశోభితం బై నయాలోకమునమున్నుదా మతిక్రమించి వచ్చినద్వారములం దెట్లట్లు సమబుద్ధిం జేసి నిశ్శంకులై తమ కడ్డము గలుగు నని యరయక యాద్వారమునను జొచ్చిరి.

### సనకాదులు వైకుంఠద్వారపాలకుల శపించుట

అప్పు డాద్వారపాలకు లిద్దఱు వృద్ధులయ్యు నై దేండ్లయర్భకుల రితిం జూడ నొప్పువారు దిగంబరులు విదితాత్మతత్త్వులు నగునాసనకాది కుమారులం గాంచి వారితేజంబు నపహసించుచు భగవదభిప్రాయము నకుఁ బ్రతికూలముగఁ జేతిబెత్త మదలించుచు నడ్డగించిరి. అనిమి షులు సూచుచుండ నట్లు తమపూజార్హత్వ మెన్నక భగవద్ద్వారపాల కులు దమ్ము నిరోధించినదానం బరమేశ్వరదర్శనమునకు భంగ మయ్యె నని యించుక కోపము గదురఁ గన్నుఁగవ జేవుటింప వారలం జూచి యోరి యెవ్వఁ డిక్కడ భగవత్పరిచర్యం జేసి యీలోకము సాధిం చియు వైకుంఠవాసు లగుసమదర్శనులకుఁ బ్రతీపముగ విషమస్వభావ మున వర్తిల్లెదు? గతద్వేషుఁ డగునాప్రశాంతపురుషున కెవ్వఁడు గీడు రోయునో యని యాత్మదృష్టాంతమునఁ గపటస్వభావుఁ డూహించినఁ జెల్లుఁగానియట్టివి యిక్కడనుం బొసఁగునే? అట్లు చింతించువారునిక్కంబ ధూర్తులు గావలయు. విద్వాంసులు కుక్షిస్థలోకుఁ డగునీభగవంతునిలో నంతరం బేమియు లే దనియు మహాకాశమందు ఘటాకాశ మెట్లట్లు లేశమాత్రులో నాత్ముఁ డంతర్భూతుఁడనియుఁ జూతురు. దేవరూపముఁ దాల్చిన మీ కేల యాపరమపురుషునియెడ నితరరాజాదులయెడ నెట్లట్లు భయం బయ్యె? కావున మీ రిచట వసింపఁ దగదు. వైకుంఠ

నాథునకు మీరు భృత్యులు గావున మీకుం దగినదానిం జింతించితిమి. ఇటుం బాసి కామక్రోధలోభము లనుపాపరూపు లగునంతశ్శత్రువులకు నెలవైనక్రిందిలోకములకుం జనుం డని శాపం బిచ్చిరి. అస్త్రములనైన వారింపరానిఘోర మగునాబ్రహ్మదండరూపం బైనశాపంబు విని యా ద్వారపాలు రతిభయంబున వారిపాదములం బట్టుకొనుచు సాష్టాంగదండ ప్రణామం బాచరించి మహానుభావులారా, పాపకారు లగుమాకు మీ శాసించినదండనంబు సమీచీనంబు. అయ్యది బ్రాహ్మణావమానంబునకుం బ్రాయశ్చిత్తం బయ్యెడు. మే మధోలోకములకుం జనినం బశ్చాత్తాప కారణమునం జేసి హరిస్మరణంబు నడంచుమోహమ్ము మమ్ము గ్రమ్మకుండు నట్లు ప్రసాదింపుం డని నివేదించుచున్నంతం దదుదంతం బెఱింగి భగవంతుం డగునరవిందనాభుండు పరమహంసులకు మహామునులకు నన్వేషణీయము లగునిజచరణములం గదలించుచు శ్రీదేవితోడ నచ్చటికి విచ్చేసె.

### దౌవారికుల శపించుసనకాదులకు హరి సన్నిధి చేయుట

అట్లు సన్నిధి చేసినవారి, నాత్మసమాధిభాగ్యమునం బ్రత్యక్ష గోచరుం డైనవానిం, బరిచారకులు దెచ్చినఛత్రపాదుకాదుల నమరువాని, రాయంచలకు సరివచ్చువింజామరలచాడ్పునం గదలుచంద్రబింబానుకారి యగువెలిగొడుగుముత్తెపుసరుల వెలిపడుశీకరంబులం జల్లువాని, నచ్చట నుండుమునులు దౌవారికులు మున్నగువారిం బ్రసాదింప సుముఖుం డై నెగడువాని, స్పృహణీయగుణములకు స్థానం బైనవానిం, బ్రేమకటాక్ష వీక్షణంబునం జిత్తమునకు సుఖం బొడంగూర్చువాని, విశాలసీల మగు నురస్థలమున వెలుంగుశ్రీదేవిచే నూర్ధ్వలోకశిరోరత్నం బైననిజలోకము వెలుంగించువానిం, బృథునితంబమున నమరుపీతాంబరమున నలరుకాంచన కాంచి నొప్పారువాని, భ్రమరఝంకారభాసురం బైనవనమాల నుల్ల సిల్లువాని, స్వర్ణవలయవిలసితం బైనయొక్కకరము గరుడునంసముపయిం బెట్టి యితరకరమునం గమలముం ద్రిప్పుచున్నవాని, మెఱుంగుతళతళల నిరసించుమకరకుండలముల సొంపారుగండస్థలంబు నున్నతనాసికంబు నొప్పు నత్యంతసుందర మగువదనమున దర్శనీయుం డైనవాని, భుజదండ మండమధ్యమున నమర్చినయుత్తమహారమునం గంఠ ప్రాలంబి యగుకౌస్తు

భమునను దేజరిల్లువాని, లోకమున నాసౌందర్య మెక్కడనునిండి గన్వ మిందుఁ గిడ్పడియె నని భక్తులు దమలో వితర్కించునంతటి యత్యంతసుందరత్వమున శోభిల్లువాని, నాకు నీశ్వరునకు మీఁకుంగా నిజమూర్తిం బ్రకటించువానిఁ బరమేశ్వరుం గాంచి తనివి నసక సనకాదులు భక్తివినమ్రులై శిరంబుల మ్రొక్కిరి. అట్టియెడ నమ్ముకుందుని పదారవింద కింజల్కమిశ్రతులసీమకరందపరిమళమిళత్పవమానం బక్కుమారులలోనం జొచ్చి బ్రహ్మానందానుభవపదులై సుఖాదుల నెలుంగకున్నను వారిచిత్తములం బ్రహర్షంబు గాత్రముల రోమాంచమునుం గావించె. సుందరతరం బైన యధరమునం గుందకుసుమధవళం బైన మందహాసంబు భాసింప నొంపారుదామోదరువదనాసితపద్మకోశముం గాంచి లబ్ధమనోరథులై యమ్మును లరుణనఖమణికిరణముల వెలుంగుతదీయ చరణద్వయంబు ధ్యానించుచు యోగమార్గముల నుత్తమగతి నన్వేషించుమహాపురుషులకు ధ్యానాస్పదంబై తత్త్వదర్శననిష్ఠులకు సమ్మతంబై నయనాభిరామం బైనపురుషరూపంబుఁ జూపుచున్న యప్పురుషోత్తము ననన్యసామాన్యములు నిత్యసిద్ధములు నగుసణిమాదుల నెసంగువాని నిట్లని స్తుతించిరి.

**సనకాదులు సాక్షాత్కరించినహరిం బ్రస్తుతించుట**

అనంతా, సర్వప్రాదియాంతర్యామివయ్యు నిపు దురాత్ముల కంతర్హితుఁడ వగుదువు. మా కట్లు గాక నయనగోచరుఁడ వైతివి. ఇంతకు మున్న నీవలనం బుట్టినమాతండ్రి యగుబ్రహ్మదేవుని రహస్యోపదేశమునఁ గర్ణగోచరుఁడ వైతివి. ఆపరమేష్ఠి యుపదేశించిన యమాయామయం బైనపరమాత్మతత్త్వంబే నీ వనియు శుద్ధసత్త్వమూర్తిచే భక్తులకుఁ బ్రతిక్షణంబు రతిఁగావింతువనియు నేమెఱుఁగుదుము. భవదీయకరుణావిజ్ఞాతము లగుశ్రవణకీర్తనాదిభక్తియోగప్రకారముల నహమ్మానమును దెగడి విషయవిరక్తు లైనమహామునులు నిట్లె నిరూపింతురు. భవదీయచరణంబే శరణం బని యాశ్రయించి కీర్తనీయపవిత్రకీర్తి యగు నీకథలరస మెఱింగినరుశలులు మోక్షము నంతయెక్కుడుగా భావింపరు. భవద్భ్రూభంగమాత్రమున భయ మెనయుస్వర్గాదిసుఖముల గణింప రని వేఱ చెప్ప నేల? దేవా, మే మింతకుఁ బాపంబు నేయ

నన్ను నిన్నుఁ నీపరిచరుల రోషించుటఁ జేసి నీకపరాధులమై పాపాచా రుల మైతిమి. దీన నరకజన్మంబు గలుగునేనియు భవత్పదభక్తి యుండుఁగ నుండునేని కంటకాదిపీడ యున్నను మధుకరమునకుఁ బుష్పవాస మెట్లట్లు మాకయ్యది మేలయ్యెడు. మా వాక్కులును దులసిరీతి భవ త్పాదములకు శోభఁ గాంచునేనియుఁ గర్ణరంధ్రము భవదీయగుణ గణములఁ బరిపూరితం బగునేనియు నంతకంటె మేలొండు గలుగదు. అనాత్ములకు గోచరింపరానినీవు ప్రసన్నుఁడవై సాక్షాత్కరించి చూపిన భవదీయదివ్యస్వరూపంబుఁ గన్నులారఁ గాంచి పరమసుఖముఁ బ్రాపించితిమి అట్టినీకుఁ బ్రణామిల్లుదు మని యిట్లు ప్రస్తుతించినయమ్మునులు ప్రశంసించుచు వైకుంఠనిలయుం డైనహరి యిట్లనియె.

### భగవంతుఁడు సనకాదిమునుల నూరార్చుట

అయ్యా, వీరిరువురు జయవిజయాభిధానులగు మదీయపార్షదులు. నను వ్యర్థత్వంబు గలుగ మీకుఁ బెద్దయు నపరాధంబు చేసిరి. నన్ననువర్తించిన మీరు వీరికిఁ గావించిన దండనంబు దేవహేళనకారణంబున నాకభిమతంబు. బ్రాహ్మణులు నాకుఁ బరదైవంబు గావున మీప్రసాదంబుఁ గోరుదు. నాపరిచరులు చేసినయపచారం బేన చేసినట్లుతలంతు. లోకమున భృత్యుఁడు తప్పిదం బొనర్చునెడఁ దత్స్వామిపేరు గొనిసంగలుగునయ్యసాధువాదం బతనిశ్వేతకీర్తిం గుష్ఠరోగము చర్మము నట్లట్లు చెఱచు. మదీయనిర్మలకీర్తిసుధాశ్రవణావగాహనము చండాలురు తుదిగా నెల్లవారికిఁ బావనత్వంబుఁ గావించినట్టి వైకుంఠుడనయ్యు నేను మీవలన నట్టియశము వార్జించినవాఁడ నగుటం జేసి నాభుజమేనియు మీకుఁ బ్రతికూలముగఁ బ్రవర్తించునేని ఛేదింతు. తనకటాక్షవీక్షణలవలాభంబుఁగోరి యితరులు పెక్కునియమంబులతోఁ దన్నుపసర్పించు సౌభాగ్యమున వెలయుశ్రీదేవి యేనువిరక్తుండ నైనను బ్రాహ్మణసేవనమునం బవిత్రుండనై నిరస్తనిఖిలమలుండనై ప్రాప్తసుశీలుండ నైనమదీయచరణరేణువు నల్లపుడు విడువక యాశ్రయించియుండెడు. నాయందర్పించిన నిజకర్మఫలములఁ బరితుష్టుండైన బ్రాహ్మణుఁడు ఘృతప్లుతాన్నము భుజించునెడఁ బ్రతికబళమునఁ దన్ముఖమున నయ్యన్నముఁ గొని తనియునట్లు యజ్ఞములందు యజమానులగ్నిముఖమున వేల్చుహోమములం

దనివి చెందనయ్యెద. అవిచ్ఛిన్న మప్రతిహతము నగుయోగమాయా విలాసరూపవిభూతిఁ దనరునేను గిరీటములం బ్రాహ్మణపాదపరాగంబుఁ దాల్చెద. వారిపాదప్రక్షాళనజలంబు చంద్రమౌళితోడిలోకములకుఁ బావనత్వం బొదవించు. అట్టిబ్రాహ్మణు లపకృతి చేసిన నెవ్వఁడు సైరింప గుండు? మదీయరూపాంతరము లగు బ్రాహ్మణులను గోవులను శరణరహితము లగుభూతములను భేదబుద్ధిం జూచుపాపనష్టదృష్టు లగుదురాత్ముల మదీయాజ్ఞాకరుం డైనదండధరుపరివారం బగు గృధ్రలు పరమతీవ్రక్రోధమునఁ జూచెదు. నాకయి నెట్టిబుద్ధి గల దట్టిమతిచేఁ బరుషములు పలికి నను బ్రాహ్మణుల నర్చించుచు సంతుష్టచిత్తులై చిఱునగవు తేనియ లొలుకుమోముదామరల ననురాగమధురంబగుమృదుభాషణమున నాత్మజుం బోలె నేను భృగుమునిని మిమ్ము నెట్టు లట్టుల పలుకరించువారి కేను వశుండ నయ్యెద. కావునఁ దమప్రభు వగునాయభిప్రాయం బరయక మీా కపచారంబు చేసినదానికిఁ దగినగతిఁ దత్క్షణంబ పొంది క్రమ్మఱ నాసన్నిధికి వీరు వత్తురుగాక. ఇయ్యది నాయనుగ్రహంబు. శీఘ్రంబ వీ రిటఁ బాసి యరుగు టొప్పు నని నారాయణుండు చెప్పినమంత్రప్రవాహరూపంబై ప్రియం బైనతదీయవాణీమాధుర్యంబుఁ గ్రోలియు సనకాదులు క్రోధవిషవ్యాప్తిం జేసి యాత్మతృప్తిం గాంచఁ జాలరైరి. మఱియు మితాక్షరంబయ్యు, బహుళార్థగంభీరంబై యత్యంతశ్రేష్ఠం బైనభగవద్భాషితంబు వినియుఁ దచ్చికీర్షితంబుఁ దెలియ నేరరైరి. మఱి ప్రహర్షోత్కర్షమునఁ బులకాంకితదేహులై యంజలిబంధంబు ఘటియించి యోగమాయావిష్కృతపరమైశ్వర్యం బైనయాహృషీకేశుని కిట్లని విన్నవించిరి.

### సనకాదులు నారాయణునకు విజ్ఞాపనం బొనర్చుట

దేవదేవా, నీ వేమి సేయఁదలంచితో గాని దాని మే మెఱుంగఁ జాలము. సర్వాధ్యక్షుండవయ్యు నీవు నీకితరు లనుగ్రహంబు చేయు నట్లు భాషింతువు. బ్రహ్మణ్యుం డగునీకుం బ్రాహ్మణులు పరదైవంబు గాఁబోలు. దేవతలకు దేవు లగుబ్రాహ్మణులకు నీవకాదె యాత్మదైవంబు. సనాతనం బైనధర్మము నీవలనం బ్రభవించి భవదీయావతారములఁ బరిరక్షితం బయ్యెడు. నీవు ధర్మమునకుఁ బరమగోప్యుఁడవు నిర్వి

కాకుండ వని పెద్దలమతంబు. ఎవ్వనియనుగ్రహంబుఁ గన్న నివృత్తిప్రధానులై యోగులు తత్క్షణంబ మృత్యుపదవాచ్య మగుసంసారముం దరింతు రట్టినీ వితరుల కనుగ్రాహ్యుండ వగుదువే? అర్థార్థు లగునితరులు శిరస్సులం దనపాదరేణువుల ధరించి సేవింప నెసఁగులక్ష్మి ధన్యు లర్పించిన తులసీవనమాల్యమున నుండుతుమ్మెదనెలవు దాఁ గోరినతీరున నిన్నే వేళఁజూచిన ననుసర్పించుచున్నం బరమభాగవతులతోడి ప్రసంగమునం జేసి పరిశుద్ధపరిచర్యల ననుసరించునద్దేవి నంత యాదరింపక భజనీయగుణాశ్రయుండవై తనరునీకు ద్విజపాదరజంబును శ్రీవత్సచిహ్నంబును పావనత్వంబుఁ గావించునే! మఱి వాని నీవు భూషణార్థంబు దయతో గ్రహించితివి. షడ్గుణసముల్లసితుండవై ధర్మస్వరూపుఁ డైననీవు మాకు వరము లొసఁగు నీసత్త్వమూర్తిచేఁ దద్విరోధకము లగురజస్తమస్సుల నిరసించి నిజపాదముల నీచరాచరాత్మక మగువిశ్వమును ద్విజదేవతాస్థంబకదా భరింతువు. నీకు రక్షణీయం బైనబ్రాహ్మణకులము నుత్తమపూజలను సూనృతవచనంబులను నీవు సత్కరింపకుండిన నాక్షణంబె పుణ్య మగుభవదీయవేదమార్గము నశించు నని లోకశిక్షణార్థంబ కాఁబోలు నీవు బ్రాహ్మణుల నట్లు ప్రస్తుతింతువు. లోకమునం బెద్ద లాచరించినదియే చిన్నవారికిఁ బ్రమాణంబుగదా. ఆయుధపాణు లగునిజాంశము లైనరాజులచేఁ బ్రజలకు క్షేమముఁ గావింపఁ దలఁచుసత్త్వనిధి యగునీకు వేదమార్గనాశ మభీష్టంబు గాదు. బ్రాహ్మణులం బొగడినంతన నీతేజమునకుఁ గొఱంత యేమయ్యెడు? నీవు బ్రాహ్మణులయెడఁ జూపువినయము వినోదమాత్రంబు. ఈదౌవారికులకు దండమొండె నిర్వ్యళీకపరిపాలనమొండె నీవు సేయఁ దలచినను నిరపరాధు లగు వీరికి శాపం బిచ్చినపాపమునకుఁ దగినట్లు మమ్ము దండించినను మాకు మిక్కిలి సమ్మతం బని వినయమున విన్నవించిరి. వారివిన్నపం బాకర్ణించి విష్ణుదేవుఁడు విప్రులారా, వీ రిప్పుడే రాక్షసగతిం బొంది యత్యంత సంరంభమున నొదవునేకాగ్రత నతిదృఢ మగుయోగమునం గ్రమ్మఱ నచిరంబ నాసన్నిధి కరుదెంచువారు. మీ రిచ్చినశాపము దొలుత నేను నిశ్చయించినదియ కాని యొండుగా దని యానతిచ్చిన నాకర్ణించి యాకుమారులు నయనానందభాజనం బైనయాపురుషోత్తముని దదధిష్ఠానం

వైనయాలోకమును వలగొని మ్రొక్కి యద్దేవదేవుని వీడుకొని తత్పభా వము బ్రశంసించుచుఁ బ్రముదితచిత్తులై యట మఱలి యరిగిరి.

భగవంతుఁడు నిజదౌవారికులం బిలిచి శాపమునకు వెఱవం బని లేదు. సమర్థుండనయ్యు బ్రాహ్మణశాపంబు మఱలించి తదీయ తేజము నకుఁ గొఱంతఁ గావించుట నియ్యకొనను. మున్నొకతూరి మీరు నేనుపారతుండనై యుండ తఱి వచ్చుచున్న రమాదేవినివారించిన నా దేవియు మీయెడ నలిగి యిట్టుల కాఁగ నిర్దేశించెఁ గావున నియ్యది మీ కనుభావ్యంబకాని పరిహార్యంబు గాదు. నాపై సంరంభయోగమునం జేసి మీరల్పకాలమునం బ్రాహ్మణపరిభవపాపఫలంబు నిస్తరించి నాస న్నిధిఁ జేరగలవా రని ద్వారపాలకుల నిర్దేశించి హృషీకేశుఁడు విమాన శ్రేణిభూషణంబై సర్వోత్తమశ్రీవిలసితంబైననిజధామంబున కరిగె.

### జయవిజయు లసురులై దితిగర్భంబునం బుట్టిన నుత్పాతములు దోఁచుట

అట విష్ణుదౌవారికులైనయా జయవిజయులు బ్రాహ్మణశాప మునం బ్రక్షీణతేజస్కులై ప్రతిహతగర్వులై వైకుంఠలోకమునుండి విమానాగ్రముల హాహాకారంబు లెసఁగఁ గ్రిందఁబడిరి. హరిద్వారపాలు రగువారే యతిదుస్సహ మగు కాశ్యపవీర్యమున దితిగర్భము నొచ్చిన వారు. కవ లగునయ్యిద్దఱితేజమున మీతేజము ప్రతిహతం బయ్యె. దీనికిఁ బ్రతివిధానంబు భగవంతుఁడు దాన చేసెడు. విశ్వస్థితిలయో దయకారణంబై యోగీశ్వరులకు నతిక్రమింపరానిమాయ వెలయం జేయుచుఁ ద్రిగుణముల నియమించునయ్యాదిపురుషుఁడే సత్త్వగుణో త్కృష్టకాలమున మనకు మేలు సమకూర్చెడు. మనవిమర్శమునం బ్రయో జనం బే మని విరించి వివరించినం దిమిరవ్యాప్తికారణంబు విని యము రులు నిశ్శంకులై బ్రహ్మను వీడుకొని త్రిదివమునకు మఱలి యరిగిరి. దితియుఁ బతియాదేశమున లోకములఁ బీడించు తనగర్భమున కేమి సేగి యగునో యని శంకించుచు నేర్పునం గాపాడి నూఱేండ్లు నిండినం గొడుకుల నిద్దఱఁ గవలఁ గనియె. అప్పుడు భూమిలోనం దివంబున నంతరిక్షమునను లోకభీకరంబులైనయుత్పాతంబులు పెక్కులు దోఁచె. కొండలతోడం బుడమి వడఁకె. దెసలెల్లఁ బ్రజ్వరిల్లె. కొఱవులు పిడు

గములం బడియె. ఉల్కాకరంబు లగుధూమకేతువు లుదయించె. ప్రచండ మారుతమ్ము దుమ్ము రేఁపుచు వృక్షములఁ గూల్చుచు ఘూత్కారముల నెఱపుచుఁ గఠినస్పర్శంబుగా వీచె. మింట మెఱుఁగులతో మబ్బు గ్రమ్మి సూర్యాదిప్రకాశం బావరించి చీఁకట్లు గావించె. సాగరము ప్రమాణాతీతముగ సంక్షుబ్ధంబై కల్లోలమాలికోల్లోలంబై యుప్పొంగె. వాపీకూపసరస్సరిత్కాసారంబులు కమలంబులు వాఁడ గలఁకఁ బాఱె. గ్రామములందు నోట నిప్పు గ్రక్కుచు నక్కలయు గూబలయు నార్పులతో వఱళు లఱచె. కుక్కలు మెడ లెత్తి పాడినట్టు లేడ్చినట్టులును వెలుచ మొఱఁగె. గాడిదలు ఖరఖురములం బాతాళం బగలఁ ద్రొక్కుచు ఘోరముగ నఱచుచు మదించి గుంపులుగుంపులై యిటునటుం బాఱు లెంచె. పక్షు లారావభయంబుల కలికి గూళ్లనుండి పడియె. అడవులను మందలను బసులు మూత్రపురీషముల విసర్జించె. గోవులు నెత్తురు పితికె. మేఘములు చీము గురిసె. దేవతాప్రతిమలు విలపించె. గాలి లేకున్నను వృక్షములు విఱిఁగి పడియె. క్రూరగ్రహములు శుభగ్రహముల నతిచారగతిం దాఁటి వక్రగతిం గ్రమ్మఱి పోరె. మఱియుం బెక్కులు మహోత్పాతంబులు చూపట్టె. వీనిం జూచి బ్రహ్మపుత్త్రులగుమునులు దక్కఁ దక్కినవారు దానితత్త్వం బరయ నేరక విశ్వప్రళయ మయ్యెడు నని భీతిల్లిరి.

### కశ్యపుఁడు వారికి హిరణ్యాక్షహిరణ్యకశిపునామము లిడుట

అట్లు జనించి యయ్యాదిదైత్యు లిరువు రశ్మసార మగుకాయమునఁ గొండలువోలెఁ బెరుగుచు నాత్మపౌరుషముఁ బ్రకటించుచుఁ గనకకిరీటకోటుల మి న్నొరయుచు మణికేయూరభూషితభుజముల దెసలాక్రమించుచు నడుగడుగునం గాళ్లఁ బుడమిం గ్రక్కదలించుచుఁ గాంచీపముజ్జ్వల మగుకటిప్రదేశపరిమాణంబుననే యర్కమండలంబు మీఱిరి. కశ్యపుఁ డయ్యిద్దఱిలోఁ దొలుత గర్భాధానంబునఁ దనమేని నుండి వెడలినవానికి హిరణ్యకశిపుఁడనియు దితి దొలుతఁ గన్నవానికి హిరణ్యాక్షుఁడనియు నామధేయంబులు పెట్టె. అందు హిరణ్యకశిపుఁడు తపమునం బ్రహ్మదేవు నుపాసించి తద్వరమునంజేసి తనకు మృత్యు

భయంబు లేదని యుద్ధతుండై భుజబలమున లోకపాలురతోడి ముల్లోకములం దనవశమునం జేసికొనియె. వానితమ్ముండు హిరణ్యాక్షుండు దనుదినం బతనికిఁ బ్రీతిం గావించుచు యుద్ధాసక్తిం జేసి తనతోడం బోరాడువారి నెమకుచు గదాపాణియై జవంబున కరుగుటయుఁ గాంచనసూపురధ్వని యొసంగ వైజయంతి యనుపుష్పమాలవికాసంబు నెలంగ నంసదేశమున మహాగద యమర్చికొని వచ్చి మనోవీర్యబలోత్సేకమున నప్రధృష్యుండై యకుతోభయుం డైనయాదైత్యుం జూచి యాదిత్యులు గరుడునిఁ గన్నపాములువోలె వెఱచి పఱచి డాఁగిరి. అట్లు తనతేజమున కింద్రాదినిర్జరులు డాఁగి రనియెఱింగి వారిం గానక మదించి పెలుచ నార్చుచు నటఁగ్రమ్మఱి ఘోరస్వనంబై గంభీరం బైనసాగరంబు మత్తమాతంగంబుమాడ్కిం గ్రీడార్థంబుసొచ్చె. చొచ్చుటయు నచ్చటనున్న వరుణసైనికయాదోగణంబు లతనితేజము దమకుఁ జేటుగావింపకున్న నభిభూతంబులై వెఱచి బుద్ధి సెడి దవుదవ్వులం బాఱె. అప్పు డయ్యసురయక్కడఁ బెక్కేండ్లు వాతేరితం బైనసముద్రోర్మి సంఘాతంబుఁ దన యాయసగదాదండమునం గొట్టుచుండి యట నొక్కనాఁడు వరుణునావాసం బైనవిభావరీపురిం జేర నరిగి యందు యాదోగణేశ్వరుం డైన యయ్యసుర లోకపాలకుం గాంచి నవ్వుచుఁ బరిహాసార్థంబు మ్రొక్కి-యోరాజాధిరాజా, సమర మొసఁగుము. నీవు వీరమానులగుదుర్మదులమద మడంచుమహాకీర్తి యగులోకపాలుండవుగదా. మఱియు నీవు దైత్యదానవుల జయించి రాజసూయ మాచరించినవాఁడవుగదా యని నీచునట్లు పలికిన నతనిపరిహాసమున కలుగక వరుణుఁ డయ్యా యుద్ధాదుల యెడ మాకిప్పు డుత్సాహంబు లేదు. మఱి యుపశమంబుఁ బొందితిమి. రణమార్గనిష్ఠితుం డైన నిన్నుఁ బోర నారాధింపఁగ భవాదృశమనస్విస్తుత్యుం డైనయాపురాణపురుషుఁ డొక్కనిం దక్క నింకొక్కనిఁ జూడను. అమ్మహాత్మునొద్దకుఁ బొమ్ము. అప్పరమేశ్వరుం దాఁకి మదముడిగి వీరశయనమునం బడి కుక్కల కెఱ యగుదువు. నీయట్టియసాధువులఁ బరిమార్చను సాధువుల ననుగ్రహింప నప్పురుషోత్తముండు నానావతారము లెత్తెడు నని నిరూపించె.

## హిరణ్యాక్షుఁడు రసాతలమున వరాహమూర్తి నెదిరించుట

అట్లు వరుణుండు సెప్పిన విని హిరణ్యాక్షుఁడు దన్ను మార్కొనం గలవాఁడు గలఁ డనుటకుఁ బొంగి యట సయ్యాదిపురుషువలనం బావక్ష్మాకు నన్న పలు కెన్నక దుష్టుండై యాదేవదేవుఁడు రసాతలమున నున్నవాఁడని నారదమునివలనం దెలిసి యతిత్వరితగతిం జని యచ్చట దంష్ట్రాగ్రమునం బుడమి నుద్ధరించి నిజనేత్రారుణమరీచుల నరాతి తేజము హరించుచున్న మాయావరాహరూపుఁ డగుహరిం గాంచి యాహా! వనచరంబగుమృగం బని పరిహసించి యిట్లనియె. అజ్ఞా! రమ్ము. పుడమి విడువుము. ఇయ్యది పాతాళవాసు లగుమాకు బ్రహ్మయిచ్చినసొమ్ము. సురాధమా! గృహీతసూకరాకృతీ! యేను జూడఁగ నీవీభూమివిడువవేని మేలు వొందఁజాలవు. మాపగవారు నిన్ను మాయభవమునకై భరింపఁ బరోక్షజయశీలుఁడవై మాయచే మమ్ముఁ బరిమార్తువు. యోగమాయాబలుఁ డల్పపౌరుషుఁడు నగునిన్నుఁ బొరిగొని నాసుహృదులశోకం బుడిగింతు. నాగదతాఁకునఁ దల వ్రయ్యలుగా నీవు పడిన నిప్పుడు నీకు బలిపూజాదు లర్పించునింద్రాదిదేవులును ఋషులును నిర్మూలతం జెందకుండుదురే యని ప్రల్లదంబులు పలికె. అట్లు దురుక్తితోమరముల నయ్యసుర గసలించిన నలిగియు వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రధృతంబైన ధరణి భీతిల్లుటం జూచి యప్పటి కించుక సైరించుచు మకరాభిహతంబైనకరేణుయూథపంబువిధమున జలము వెడలి వచ్చుటయు నేచుఁగును వెంబడించుమీనునకై పడి నాహిరణ్యాక్షుఁ డమ్మాయాకిటిరూపుం బిలిచి కరాళదంష్ట్రాప్రకాశంబు నిగిడించుచుఁ బిడుగుల సాటి యగునార్పులొనరించుచు నోరా! వెఱచి పఱవఁ జనునే యని యధిక్షేపించె. సర్వేశ్వరు నట్లధిక్షేపింప వానికిఁ దగునే యని శంకింపం బని లేదు. సిగ్గు మాలినయసాధువుల కెయ్యది నింద్య మగు? అంత నవ్వరాహమూర్తి యోగ్యస్థానమున ధాత్రిం బెట్టి తనయాధారశక్తి నం దావిష్కృతంబు గావించి యరాతి సూడఁగ బ్రహ్మాదివిబుధులు పుష్పవర్షమునఁ బూజింపఁ దదర్పణం బంగీకరించుచు మర్మములు గాఁడఁబలు దెఱంగులఁ బ్రల్లదంబులు పలుకుచు దారుణగదాదండ మంసదేశమున నమర్చి

కొని తన్ను వెన్నడించి వచ్చుచున్న యన్నరాశిను ననేకభూషణకనక కవచోజ్జ్వలుం డైనవానిం బిలిచి యలుక గదిరియు నవ్వుచు నిట్లనియె.

### వరాహమూర్తి హిరణ్యాక్షుని మార్కొనుట

అయ్యా! యేము నిక్కంబ వనచరమృగములము. మీయట్టి గ్రామసింహములం బొరిగొన వెదకుచుండుదుము. ధీరులు మృత్యుపాశబద్ధుం డగునీవగుననుచితశ్లాఘనంబు లాదరింపరు. రసాతలవాసు లగు మీని క్షేపంబు హరించి నీగదకు వెఱచి పఱచియు బలియుం డగునీతోడి పగవలన నెయ్యెడకుం బోవం జాలక పోరి కాయితంబై యుండుదుము. పదాతియూథనాథులలో నగ్రగణ్యుండ వగు నీవు వేగమార్కొని మమ్ము సమయించి నీపలికినట్లు స్వజనశోకం బుడిగింపుము. తనపూనిన ప్రతిజ్ఞ చెల్లింపనియతండు సభ్యుండు గాం డని నీవ యెఱుంగుదువుగదా? యని భగవంతుండు పరుషముగ నధిక్షేపించి యపహాసించినం గ్రీడగాంబలికిన నప్పలుకుల కయ్యసుర పాముతీరునం బెలుచ నలిగినిట్టూర్పు నిగిడించుచు మన్యుప్రచలితేంద్రియుండై మార్కొని గద యెత్తి హరి నడిచె. తన యొమ్ముపయిం బడుచున్న యతనిగదాప్రహారంబును యోగారూఢుండు తను నెట్లట్లు తిర్యక్ప్రసారమునం దప్పించిన నాదైత్యుం డత్యమర్షమున నవుడుగఱచి గద గిరగిరం ద్రిప్పి క్రమ్మఱ వైచుటయు నారాయణుండు వలపలియంసప్రదేశమునం బడుచున్నయాగదం దనగదచే నడిచిన నప్పుడు హరికిని హిరణ్యాక్షునకుం బరస్పరవిజిగీషాసంరంభముం జేసి దారుణం బైనగదారణంబు సెల్లె. మత్తశుండాలయూథపంబులమాడ్కి నత్యంతసంరంభావష్టంభమునం జెచ్చి యితరేతరవిజిగీషా మనీషం జేసి స్పర్థవెల్లునం బోనీక తలపడి యొకల్లొకళ్ల తాంకుం దప్పించికొన వివిధ విచిత్రమండలాదిగతులం దిరుగుచు నన్యోన్యగదాప్రహారమునం బరస్పర గాత్రంబులు నెత్తుటం జొత్తిల్ల రక్తగంధాఘ్రాణమునం బెల్లడరునలుక పెంపున నుడివోనిచలమున నయ్యాదిదైత్యుండు. మాయాగృహీత వరాహమూర్తి యగునచ్యుతుండును బెద్దయుం బెనంగుచుండ నయ్యెడ కయ్యాయోధనంబుం జూడంగ ఋషులతోడం జతుర్ముఖుం డేతెంచి, మడించి వెఱ పుడిగి చేసినదాని కెల్లం బ్రతి సేయుచు నేత్తెఱ మెఱయు నాదైత్యుం జూచి మాయామయసూకరాకారుం డైననారాయణున

పల్కెను. దేవా! యీదైత్యుండు భవత్పాదమూలం బాశ్రయించిన దేవతలకు బ్రాహ్మణులకు గోవులకు నిరపరాధము లగుసర్వభూతములకు భయదాయకముగం జేసి కీడు రోయుచు వెఱపు పుట్టించుచు దుష్కృతం బొనర్పుచుం దన్నుం బోర మార్కొనువాని వెదకుచు లోకములకుం గంటకం బగుచు దిరుగుచుండెను. మత్తుండు మాయావి నిరంకుశుండు దుర్వృత్తుండు నగువీనిం బామునుంబోలె మర్దింపవలయుం గాని బాలుని పోలికిం గ్రీడింపరాదు. ఈదారుణుండు నిజవేళ నధిగమించి వర్ధిల్లకమున్న నిజమాయాప్రభావమున నిప్పాపాత్ముని రూపుమాపుము. లోకనాశకరంబై ఘోరతమం బైనసంధ్యాసమయ మిదె తఱిసెడు. సురలకు జయంబుం గూర్పుము. అభిజిత్తనుశుభముహూర్తము నడచుచుండ నిప్పుడే నీసుహృదు లగుమాకు క్షేమముం గావింప దుస్తరుం డైనవీని వేవేగ నిస్తరింపుము. ఇతండు దైవమున నాత్మ మృత్యు వగునిన్నుం దాన వెదకుచు వచ్చె. పోర వీనిం దెగటార్చి లోకములకు మేలొనర్చుమని వనజభవుండు విన్నవించె.

### వరాహమూర్తి యగుహరియు హిరణ్యాక్షుండును బోరుట

నాభిభవుం డట్లు నిష్కపటంబై యమృతప్రాయముగం బలికిన పలుకు లాకర్ణించి నారాయణుండు నవ్వుచుం బ్రేమాపాంగవీక్షణంబున నతని మన్నించి తనయెదుర వెఱపు దక్కి తిరుగుచున్న పగతుం గాంచి యయ్యసురహనుప్రదేశంబు గద యెత్తి యడుచుటయు నంతలో నాదితిసూనుం డాత్మగదం, గొని హరిగదం బ్రహరించిన హరికరంబు వాసి కౌమోదకి క్రిందం బడుటయు నద్భుతం బయ్యె. అప్పుడు తఱి యైనను హరి నిరాయుధుండు గావునం బోరరా దని సమరధర్మ మరసి యయ్యసుర మిన్నకున్నం గేశవునకుం గోపం బడరె. హరిగదపాటునకు లోకమున హాహాకారం బెసంగె. అప్పుడు పుండరీకాక్షుండు వెఱవకుండుం డని సురల నూఱడించి చక్రాయుధముం దలంచి సద్యస్సన్నిహితం బైనయమ్మహాసాధనంబుతో నాదైత్యుం దాఁకునెడ విమానచారు లగు ఖేచరు లమ్మహానుభావునిప్రభావం బెఱుంగక దేవా! వీనిం జంపుము; నీకు మే లయ్యెడు నని పలుదెఱంగులం బల్కిరి. అట్టియెడం జక్రపాణియై తనయెదుర నురువడించియున్న పుండరీకాక్షుం గ్రోధవీక్షణంబునం జూచి

హిరణ్యాక్షుండు ఘోరదంష్ట్రల మెఱుఁగుల వెలార్చుచు నవ్వుచు గఱచి
గదయెత్తి యిదె మడిసితి వని పెలుచ నార్చుచు వేయుటయు యజ్ఞసూ
కరాకారుండైన హరి డాపలికాలం బవనజవం బైన యగ్గదం గ్రిందఁ ద్రోచి
యోరీ! కైదువు గొని రమ్ము నీవు గెలువఁ దలఁచువాఁడవుకదా యని
యుల్లసంబాడె. దాని కలిగి యాదైత్యుండు గ్రమ్మఱ గదయెత్తి విష్ణు
పై విసం దనపయిం బడవచ్చుచున్న యాగదను గరుడుండు పన్నగంబోలె
నొడిచి పట్టుకొని, యయ్యా! యిదె నీగద నిచ్చెద దీనిం గొని పోరు
నడువుమని హరి సెప్పినం దనపౌరుషము దానం బ్రతిహతం బయ్యె నని
తలంచి హతమానుండై యమ్మహాసురుఁడు తేజుడిగి హరి యిచ్చుగద
నొల్లక జ్వలితజ్వలనప్రకాశం బైన త్రిశిఖశూలంబుం గొని విప్పిన యభి
చారకృత్యం బొనర్చువానిరీతి నయ్యజ్ఞేశ్వరుపై నేసె. ఏయుటయు
మింట మెఱుంగులీనుచు వచ్చుచున్న యాత్రిశూలంబు నయ్యాదిదేవుఁడు
నిశితధారం బైన చక్రాయుధమునం గరుడునీఁకె నింద్రుఁ డెట్లట్లు నఱికె.
తనశూల మట్లు హరి నడుమన నఱికిన నలిగి హిరణ్యాక్షుఁ డతిరయ
మున డాయ వచ్చి యప్పరమేశ్వరువిశాలవక్షస్స్థలంబుఁ గఠినముష్టిఘాత
మున నడిచి యంతర్ధానంబుఁ జెందె. పూఁదండ తాఁకునకు గజేంద్ర
మెట్టు లట్టు లతనిపిడికిటిపోటున కించుకేనియుం జలింపక వరాహ
మూర్తి యుల్లాసమునం బొదలుచుండె అంత నాదైత్యుఁ డంతర్హి
తుండై యోగమాయేశ్వరుం డైనహరిమహిమం బరయక ప్రజలెల్ల
వెఱచి హరికిఁ గీడగునో యని శంకించు తెఱంగున మాయఁ గావిం
చినం దన్మాయాబలమున నెల్లెడలఁ జీఁకట్లు గ్రమ్మ దుమ్ము రేఁచుచుఁ
బ్రచండవాయువు వీచె. ఒడిసెల రువ్వినతీరున నలుదెసల ఱాలు పడియె.
మింట మబ్బు మెఱుఁగులు నుఱుములుం బెరయ నలమి గ్రహనక్షత్రాది
కాంతులం గప్పి పూయవిణ్మూత్రకేశాస్థిసంఘాతంబుఁ గురిసె. కొండల
నుండి నానాయుధంబులు పడియె. రాక్షసస్త్రీలు వెండ్రుకల ముడి
వీడ జాఱవైచి దిసమొలలతో శూలాయుధములఁ దాల్చి తిరుగునట్లు
గన్పట్టె. పలువురు యక్షరాక్షసవీరులు రథగజతురంగపదాతిగణంబుల
తోడం దలపడి పట్టుఁడు దఱుముఁ డఱుముఁ డేయుఁడు పొడు
పుఁడని పలుదెఱంగులం బలికినట్లు తోఁచె. ఆ తెఱంగున నాతండు

గావించినరాక్షసమాయలం జూచి మాయాక్రోడరూపుం డైననారాయణుండు సర్వమాయాసముచ్చాటనోదగ్రంబై యజ్ఞస్వరూపం బగుచక్రముం బ్రయోగించి యమ్మాయలనెల్ల మాయించె. అప్పుడు దితి పతిభాషితంబుం దలపోసి గాత్రకంపముతో స్తనములం బయస్స్రవింపం బడసె.

### వరాహమూర్తి హిరణ్యాక్షుని సంహరించుట

అట్లు తనమాయలెల్ల నారాయణునుదర్శనమునం బ్రతీర్ణంబు లగుటయు హిరణ్యాక్షుండు పెలుచ నలిగి పోక పెనంగుచుం బిడికిళ్లం బొడుచుచున్న నధోక్షజుండు వీని నొప్పరికింపం జన దని తనలో నిశ్చయించి వృత్రాసురునకై నురునడించుసురపత్నాతి తెఱంగున నేక్షైజ మెఱపి వానికర్ణమూలమునం గరతలమునం బెలుచ నడుచుటయుం దదీయపాణికరాఘాతంబునం గనుగ్రుడ్లు మీఁదికి రాఁగం గరచరణకంధరంబులు వ్రయ్యలుగాఁగం జండవాతవిక్షోభమునం గూలుమహాపాదపంబు మాడ్కిం దెలివి దప్పి గిరగిరం దిరుగుచు నేలం గూలె. అట్లు విగతచేతనుండయ్యు నవుడుగఱపు మానని దంష్ట్రాకరాళ మగువదనంబుతో నేలపయిం బడియున్నయాదైత్యుం గాంచి బ్రహ్మాదు లద్దిరా! యితం డేపుణ్యతేఁ గాంచునో కాని ముముక్షువు లైనయోగులు యోగసమాధిం బూని యెవ్వని ధ్యానింతు రట్టిపరమేశ్వరుకరము సోఁకి యతనియెదుర మేను వోఁజెగె. విచారం బేల? భగవత్పార్షదులయ్యు వీరు బ్రాహ్మణశాపమున నీజన్మముం గాంచిరి. కొన్నిజన్మములనె నిజస్థానంబుం గ్రమ్మఱ నధిగమింతు రని తమలోనం జెప్పికొని భగవంతునివెసం జూడ్కుం బసాకించి, యీశ్వరా! సర్వయజ్ఞప్రవర్తకుండు గృహీతశుద్ధసత్త్వమూర్తియు నగునీకుం బ్రణామంబు. లోకపీడాకరుం డైనయీదైత్యుని మాభాగ్యమునం బరిమార్చితివి. భవదీయపాదభక్తిం జేసి మేము సుఖించితి మని విన్నవించిరి. ఆదిసూకరస్వరూపుం డగుహరి యసహ్యవిక్రముం డగుహిరణ్యాక్షు నట్లు సంహరించి విరించిప్రముఖసురసంస్తుతుండై చిత్తగించుచు నిత్యోత్సవనిరంతరం బైననిజలోకమునకు విచ్చేసె నని మైత్రేయుండు హరియాదివరాహావతారచరిత్రంబు వివరించిన నాకర్ణించి విదు

రుఁడు పరమానందంబుఁ జెందె. పుణ్యశ్లోకు లగునితరులకథలు విన్నంతనే సమ్మద మ్మగుననిన శ్రీవత్సలాంఛనుపవిత్రచరిత్రం బాకర్ణించినం జెప్పనేల! మొసలికిఁ జిక్కి తప్పించికొనలేక నిజచరణాంబుజంబు ధ్యానించినం గరేణుయూథం బార్చుచుండ ద్రుతగతి నేతెంచి యానక్రముం జక్రమున విదలించి గజేంద్రుం బ్రోచినవరదు ననన్యశరణులై ఋజుమార్గమున వర్తిల్లునరులకు సుఖారాధ్యుం డగువాని నసజ్జనుల కారాధింపనలవిగానివానిం గృతజ్ఞుఁ డెవ్వఁడేని సేవింపకుండునే? కారణసూకరాత్ముఁ డగుహరిలీలారూపం బగునత్యద్భుతం బైనహిరణ్యాక్షుసంహారంబు వినినఁ బఠించిన ననుమోదించినం బ్రహ్మహత్యాదిపాపంబుల నరుఁడు విముక్తుం డగు. స్వర్గాదిఫలప్రదంబు పవిత్రంబు ధనప్రదంబు కీర్తికరం బాయుర్వృద్ధిదంబు సర్వార్థసిద్ధిప్రదంబు ప్రాణేంద్రియతర్పణంబు శౌర్యవర్ధనంబు నగునీహరివరాహావతారచరిత్రంబు విన్నవారి కవసానంబున శ్రీనారాయణుండే గతి యగు నని సూతుండు సెప్పిన విని శౌనకుండు సూతున కిట్లనియె.

రోమహర్షణీ! స్వాయంభువమనువు ధరిత్రి స్వస్థానంబుఁ జెందిన పదంపడి పిమ్మటివారిసృష్టికై యెన్నిమార్గము లవలంబించె? కృష్ణున కేకాంతికసుహృదుఁడై కృష్ణభాషితంబు గొననితనయున్న యగు ధృతరాష్ట్రుం దర్జించి కృష్ణునిఁ దదాశ్రయులను విదురుఁడు సేవించెగదా. ద్వైపాయనపుత్త్రుండై యమ్మునీంద్రునకుఁ దక్కువగాని యమ్మహాభాగవతుఁడు తీర్థసేవనంబునం బవిత్రుఁడై గంగాద్వారమ్మున నాసీనుం డైన తత్త్వవిద్వరుం డగుమైత్త్రేయమునివర్యునుపాసించిన నయ్యిద్దఱిసంవాదమున మందాకినీజలంబులువోలె హరిపదాశ్రయంబులై పరమపావనంబులైనబహుకథలు ప్రవర్తించియుండుగదా? కీర్తనీయోదారకీర్తి యగు నాహరికథల మాకుఁ గీర్తింపుము. నీకు మేలయ్యెడు. హరిలీలామృతంబు గ్రోలునెడ రసజ్ఞుఁ డెవ్వఁడేనియు నిఁకఁ జాలు నని తనివి నొందునే? అని యిట్లు నైమిశారణ్యవాసు లగుశౌనకాదిమహామునులడుగ నుగ్రశ్రవసుఁడు భగవదర్పితచిత్తుండై మునీంద్రులారా! వినుం డని యిట్లని చెప్పం దొడంగె. శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

### మైత్రేయుఁడు విదురునకు సృష్టి సంగ్రహముగఁ దెలిపించుట

ఆత్మ మాయాప్రభావమున హరి వరాహరూప మెత్తి రసాతలగతం బైనపృథివి నుద్ధరించి హిరణ్యాక్షుని సంహరించినపుణ్యకథ నాకర్ణించి విదురుఁడు ముదమునం బొదలి మైత్రేయుం జూచి మునీంద్రా! పరమేష్ఠి ప్రజాసర్గము నిమిత్తంబుగాఁ బ్రజాపతుల సృజియించి యటనేమి చేసె! అవ్యక్తమార్గ మెల్ల నీ వెఱుంగుదువు. కావున నీయెఱుంగనియది లేదు. మఱియు మరీచ్యాదులును స్వాయంభువమనువును బ్రహ్మనియోగమున నెట్టు లీజగమునకుఁ బెంపుగావించిరి? భార్యలతోడఁ గూడి యుండెఁ గూడక యుండెఁ బ్రత్యేకముండెవారు కార్యవ్యాపృతులై యెట్టు లీజగంబుం గల్పించిరి? నాకుఁ దేటపడం జెప్పు మని యడుగుటయు నా కౌషారవిమునీంద్రుఁడు విదురున కిట్లనియె. వితర్కింపరానియదృష్టము ప్రకృత్యధిష్ఠాత యగుపురుషుఁడు కాలంబును నిమిత్తంబులుగాఁగ నిర్వికారుఁ డగుభగవంతునుండి జాతక్షోభం బైనగుణత్రయమున మహత్తత్త్వంబు జనించె. దైవచోదితం బై రజోగుణముఁ గొన్నయామహత్తత్త్వమువలనం ద్రిగుణం బైనయహంకారముదయించి యాకాశాదిభూతపంచకముఁ బుట్టించె. అయ్యవి ప్రత్యేకంబు కార్యాసమర్థంబులయ్యెఁ బరస్పరసంయోగంబున దైవయోగమునం జేసి హిరణ్మయం బైనయండముఁ గల్పించె. అయ్యండకోశము నిశ్చేతనం బై వర్షసహస్రంబు సలిలమున నుండినం బ్రహ్మావిర్భావస్థానంబు సర్వజీవనివాసంబు సహస్రసూర్యప్రకాశంబు నగు పద్మ మెవ్వనినాభిలోనం బుట్టెనట్టిపరమేశ్వరుండు దాని నధిష్ఠించుటయుఁ దత్ప్రభావమునం బ్రహ్మ పూర్వకల్పప్రకారమున నామరూపాదివిభాగంబుతో నీజగము సృజించె. అట్లు సృష్టికిం బూని విధాత దొలుతఁ దామిస్ర మంధతామిస్రము తమము మోహము మహామోహమనుపర్వపంచకంబుతోడ నవిద్యను నిజచ్ఛాయం బుట్టించి పాపసృష్టి మెచ్చకతమోమయం బైనయాకాయము విసర్జించె. క్షుత్పిపాసాసముద్భవకారణం బై రాత్రిరూప మగునాతనువును యక్షరక్షోగణంబులు గొని యాఁకటను నీరువట్టునం బెలుచ నలమటం బడి యవ్విధాతను భక్షింపం బోయి తండ్రి యైన నీతని భక్షింపుఁడు రక్షింపవల దని తమలోఁ బల్కుచున్నంతఁ జతుర్ముఖుఁ డుద్విగ్నుం డై నన్ను భక్షింపవలదు రక్షింపుఁడు

మీరు నా ప్రజలుగదా యని చెప్పినం గ్రమంబున వారు యక్షరక్షోనామములం బరఁగిరి. అంత నొండొకద్యోతనాత్మకం బైనమేను పూని పద్మభవుఁడు దేవతల సృజించుటయు వారు ప్రభాత్మకంబై దివసరూప మగు నాతనువుం గొనిరి. అట నతం డొండు తనువు దాల్చి జఘనమున స్త్రీలంపటు లగున దేవుల సృజించుటయుఁ గామప్రాధాన్యమునం జేసి మైథునార్థంబు వారు హసించుచు సిగ్గు విడిచి యాకంజభవుం దఱుముటయు నాతండు వెఱపు నలుకయుంగదురఁ బాఱుతెంచి భక్తానుగ్రహార్థం బను రూపరూపముల ధరించి ప్రసన్నులయార్తిం బరిహరించుహరిం జేర నరిగి పరమాత్మా! నన్నుఁ గావుము. నీపంపున నేను సర్గమునకుఁ బూనితి. నాసృజించిన యీపాపాచారులు గ్రామ్యధర్మోత్సాహమున నన్నుఁ దఱుముచున్న వారు. నీ వొక్కఁడవకదా క్లేశాక్రాంతు లగుభక్తులక్లేశంబులు హరింపను నిన్నాశ్రయింపనివారికిఁ గ్లేశములఁ గావింప నుండుదు వని విన్నవించినం బరేంగితజ్ఞుం డైనహరి యతనిదీనతం గాంచి యయ్యా! ఘోర మగునీతనువుం ద్యజింపు మని నిర్దేశించె. విధివిసర్జితం బైన యా తనువు స్త్రీరూపమున సంధ్య యయ్యె. కటితటమున దుకూలము ధరించి మణికాంచీప్రముఖభూషణములం గైసేసి నీలాలకంబు లున్నతనాసికంబు సుందరదంతములు వదనమునకు సుభగత్వంబుఁ గావింపఁ గ్రిక్కిఱియు చనుదోయి మదనవికాసమునకుఁ బెంపు గూర్ప నందెలమ్రోఁత యలర లజ్జాలలితస్మేరవీక్షణములం జూచుచున్న యాసంధ్యం గామించి యసురు లద్దిరా! దీనిరూపము ధైర్యము ప్రాయము నిట్టు లొప్పునే? మేము కామించినం దా నకామయుపోలెఁ దిరుగుచుండెడు నని తమలో వితర్కించుచు నాసుమతులు దానిం దఱియ నరిగి సుశ్రోణీ! యెవ్వతె వెవ్వరిదాన విక్కడ నీ కేమి యర్థంబు గలదు? దుర్భగు లగుమమ్ము రూపద్రవిణపణ్యమున బాధింతువు. ఎవ్వతె వైన నేమి? భాగ్యమున నిన్నుఁ గాంచితిమి. కందుకక్రీడనంబున మామనంబులఁ గట్టుదువు. సుందరీ! పలుమాఱు కరతలంబునఁ బతత్పతంగసంకాశం బైనచెండాడునెడ నీపాద మొక్కచో నిలుకడఁ జెందకుండెడు. స్తనభారభీతంబై నీనడుము నకనకలాడెడు. చూడ్కి యలసినచందం బయ్యెడు. ముడి వీడినకేశపాశంబు గట్టు మని యిట్లు వారు మూఢబుద్ధులై స్త్రీ

రూపమునం దోఁచుసాయంతనసంధ్యం బట్టికొనిరి. దానికి భావగంభీర
ముగ నవ్వుచు నవ్విభుండు తన తనుమూర్తిని కాంతిచే
గంధర్వాప్సరోగణముల సృజించి కాంతిమంతి యగు నాజ్యోత్స్నాభి
ధానతనువుం ద్యజించుటయు విశ్వావసుప్రముఖులు దానిం బ్రీతిమై
గ్రహించిరి. అలస్యమున భ్రష్టదిగంబరులు ముక్తకేశులు నగుభూత
పిశాచాదులం బుట్టించి వారిం జూచి వోల్లక కన్నులు మూయుటయు
వారు తద్విసృష్టంబైన జృంభణాఖ్యతనువుం గొనిరి. దాన నిద్రయు
నింద్రియవిక్లేదంబును భూతములయెడం జూపట్టెడు అయ్యింద్రియ
విక్లేదకారణంబుననే యుచ్ఛిష్టులగు నసాధువ్రులకు భ్రాంతిం గావించు
భూతము లున్మాదనామమున నెన్నంబడియెడు. అజుండు త న్నస్వా
దుఁగాఁ దలంచుచు నదృశ్యరూపమున సాధ్యపితృగణముల సృజించి
యాకాయము వారి కిచ్చె. కర్మనిష్ఠులు దానినిమిత్తమున శ్రాద్ధాది
రూపంబున సాధ్యపితృగణంబులకు హవ్యకవ్యముల నిత్తురు. అట నా
బ్రహ్మ యంతర్ధానమున సిద్ధవిద్యాధరులం బుట్టించి యయ్యంతర్ధాన
తనువు వారి కొసంగి ప్రతిబింబమునం గిన్నరకింపురుషుల సృజించి
యామేనఁ దనప్రతిబింబముం గాంచి మెచ్చుచు దానిం ద్యజించినం
గిన్నరకింపురుషులు గ్రహించి ప్రభాతవేళల మిథునీభూతులై తదీయ
కర్మములఁ గీర్తింతురు. పాదాదులఁ జాఁచి పవ్వళించి యప్పొరలించి
మిక్కిలి చింతించుచు సర్గవృద్ధిగామిం జేసి యామేను విడుచుటయు దాని
కేశములు సర్పనాగకుటేసృఫణాదిఘేదములతో నహీజాతు లయ్యె.
అప్పటి కాపరమేష్ఠి దన్నుఁ గృతకృత్యునిఁగా నెన్నికొనుచుం దుది లోక
హితకు లగుమనువులమనంబున సృజించి తనపురుషరూపము వారి కొసంగె.
అప్పుడు పూర్వసృష్టు లగువా రాసృష్టిం గాంచి దేవా, వీరిం బుట్టించి
మేలుచేసితివి. ఈసర్గమున నగ్నిహోత్రాదిక్రియలు ప్రతిష్ఠితంబులై
యునికిం జేసి మేము నందు పహావిర్భాగాదుల భుజింతు మని చెప్పిరి.
అంత నయ్యంభోజసంభవుండు తపస్సు విద్య యోగము వైరాగ్యాది
యుక్తమగు సమాధి యనువానితోడంగూడి జితేంద్రియుండై ఋషుల
సృజించి సమాధియోగతపోవిద్యావిరక్తియుక్తంబైననిజదేహాంశము
వారి కిచ్చె ననిన విని విదురుఁడు మునీంద్రా, మిథునధర్మమునఁ బ్రజా

వృద్ధిఁ గావించినస్వాయంభువమనువంశముఁ బరమసమ్మతం బైనదానిఁ జెప్పితిమి. మనుపుత్త్రు లగు ప్రియవ్రతోత్తానపాదు లెట్లు ధర్మమున సప్తద్వీపయగుధాత్రి నిం బాలించిరి? మనుపుత్త్రి యగు దేవహూతి కర్దమ ప్రజాపతికిఁ బత్ని యయ్యె నని చెప్పితివి గదా. ఆయోగి యోగలక్షణాన్వితయగునా దేవహూతియం దెందఱఁ గనియె? రుచియు దక్షుఁడును గ్రమమున మనుకన్య లగునాకూతి ప్రసూతులఁ బత్నులఁగాఁ బడసి యెట్లు భూతసృష్టి యొనర్చిరి? నాకు దీని నెల్లఁ దేటపఱుపు మని యడుగుటయు మైత్త్రేయుఁ డతని కిట్లనియె.

**కర్దమప్రజాపతి తపస్సు చేసి హరిం గని కోర్కు లడుగుట**

ప్రజల సృజించు మని బ్రహ్మ నిర్దేశించినం గర్దముండు సరస్వతీ తటమునం బదివేలేండ్లు తపంబు సల్పి సమాధిసమన్వితం బైనపూజా ప్రకారమునం బ్రసన్నవరదుఁ డగుహరి నత్యంతభక్తి నారాధించుటయుఁ గృతయుగమున నతనితపమునకు మెచ్చి యచ్యుతుండు శబ్దవేద్యబ్రహ్మమయతనువుతో నతనికి సాక్షాత్కరించె. రజోరహితుఁడు రవిప్రకాశుఁడు సితకమలకుముదమాలికాలంకృతుఁడు స్నిగ్ధనీలాలకవ్రాతపరీతవదనుఁడు పీతాంబరుఁడు కిరీటకుండలాదిమండితుఁడు శంఖచక్రగదాధరుఁడు శ్వేతోత్పలక్రీడనకుఁడు హృదయానందకరమందహాసవీక్షణవిలాసుఁడు వక్షస్స్థలోపలాలితలక్ష్మీలక్షితుఁడు కౌస్తుభప్రశస్తకంధరుఁడు గరుడాంసనిక్షిప్తపదాబ్జుఁడు నగునారాయణుఁ డంతరిక్షమున నున్నంతఁ బ్రహర్షమునఁ బుడమిపయి సాష్టాంగదండప్రణామముగఁ బడి లేచి లబ్ధమనోరథుఁడు గావునఁ బ్రీతిస్వభావాత్ముఁడై యంజలిబంధంబు ఘటియించి యిట్లని విన్నవించె. దేవా, సమగ్రసత్త్వనిధి యగు నిన్నుఁ గని నాకన్నులు సఫలంబు లయ్యె. యోగులును బహుజన్మముల యోగారూఢిఁ బొందికాని నిన్నుఁ గాంచఁజాలరు. సంసారసాగరంబు దాఁట నావయై యున్న నీపదాంబుజమ్ముఁ గామలవభోగార్థంబుసేవించి నను సేవకులకోర్కు లనుసరించి నరకములం గలుగునాకామసుఖములనుం గూర్తువు. ఏను నిప్పుడు దురాశయుఁడనై కామసుఖ మపేక్షించి సర్వేష్టప్రదంబై సర్వమూలం బైనభవత్పదపంకజంబు నాశ్రయించితి. నీదగుతంత్రీబంధనమున బద్ధుండనై కదా యేను గామహతుఁడ నైతి.

లోకము ననువర్తించి యేనుం గాలాత్ముఁ డగునీకు ఋణత్రయాపాకరణ రూపం బైనపూజఁ గావించెద. లోకములను లోకానుసారు లగునవివేకు లైనకర్మజడుల ననాదరించి భవచ్ఛరణాతపత్రంబు నాశ్రయించినవారి యాయువును *త్రయోదశమాసము †లరములుగా మున్నూటయఱు వదిదినములు పర్వములుగా నాఱుఋతువు లంచులుగా ననంతము లగు క్షణలవాదు లాకులుగా మూఁడుచాతుర్మాస్యములు సందులుగాఁ దీవ్ర వేగమున నక్షరరూప మగుబ్రహ్మమునం బరిభ్రమించుకాలచక్రంబు లోకమెల్లఁ ద్రుంచుచుఁ బాఱునదియయ్యు హరింపఁజాలదు. నీ వొక్కరుం డవయ్యు లోకము సృజింప సహాయముగా గ్రహించినయాత్మాధికృత మగుయోగమాయాప్రభావమున నాత్మశక్తు లగుసత్త్వాదుల నూర్ణనాభమువోలె నితరసాధనముల నపేక్షింపక యీవిశ్వముఁ బుట్టింతువు పాలింతువు తుది నుపసంహరింతువు. నిన్ను భజించువారికి విషయసుఖముల నొసఁగుట నీకు సమ్మతంబు గాకుండుఁ గాఁబోలు. ఐన మమ్మను గ్రహింప మాకోర్కి యీడేర్పుము. అపరిచ్ఛిన్నుఁడవయ్యు మాయాపరిచ్ఛిన్నరీతిఁ దులసీవిలసితతనుమాడ్కి నీవు గన్పట్టుదువుగదా. జ్ఞానోపరతక్రియాత్ముండవై యాత్మమాయావర్తితలోకతంత్రుఁడు నగునీ యంఘ్రిద్రష్టుఁడు కామవర్షుఁడు నగునీకు మిక్కిలి మ్రొక్కెద నని విన్నవించినం జిత్తగించి యజ్ఞనాథుఁడు గరుడోపరివిరాజమానుండై ప్రేమస్మేరవీక్షణంబు భ్రూవిభ్రమమునఁ జూపుచు నమృతమధురభాషితమున నమ్మునికిట్లనియె.

## నారాయణుఁడు కర్దమునకుఁ గోర్కు లిచ్చుట

కర్దమా, యాత్మనియమంబులతో నన్నర్చించినదాన నీమనోగతం బెఱింగి యే నింతకుమున్న నీకోర్కె నెఱవేఱ సంఘటనం బొనర్చితి. మదారాధనం బొకప్పుడేనియు వితథము గాదు. నాయందుఁ జిత్తము నేకాగ్రముగా నిలిపినమీయెడ విశేషించి చెప్పవలయునే? బ్రహ్మావర్తం బధిష్ఠించి సప్తసాగరపరీతం బైనమహీమండలం బేలుచు సమ్రాట్పదంబుఁ గొన్నవిఖ్యాతసదాచారశీలలక్షణుం డైనస్వాయంభువమనువు

---

* అధికమాసముతోఁ జేర్చినం బదుమూఁడునెల లగు. † అరములన నాకుల సందులు.

రేపు గడవ మఱునాఁడు తనదేవి యగుశతరూపతో నిన్నుఁ జూడ
నిచ్చటికి వచ్చి వయశ్శీలగుణముల వన్నె కెక్కి పతింవరయై యున్నతన
కూఁతు ననురూపవరుఁ డగునీ కిచ్చెడు. బహువర్షములు నీహృదయ
మునకు సమాధానంబుఁ గూర్చుచు నిన్నుఁ గొలిచి యారాజకన్య నీ
వీర్యము ధరించి తొమ్మండ్రుగుకుమారితులం బ్రసవించెడు. ఋషులు
వారలఁ బత్నులఁగాఁ బడసి మదాజ్ఞ ననుష్ఠింపఁగలరు. తుది నీవు సర్వ
కర్మమును నాయందు సమర్పించి దయాన్వితుండవై సర్వభూతముల
కభయం బొసంగి సన్న్యసించి నాలో నాత్మ నాత్మలో నన్ను నీజగం
బునుం గాంతువు. ఏనుం ద్వదీయవీర్యమున నాత్మాంశకలచే నీపత్ని యగు
దేవహూతిగర్భమున నవతరించి తత్త్వసంహితను రచింతు నని చెప్పి
హరి సరస్వతీసరిత్పరివృతం బైనబిందుసరోనామకం బగునాపుణ్యస్థలంబు
నిర్గమించి వైకుంఠమార్గంబు పట్టి గరుడపక్షసముదీర్ణము లగుసామ
సముదాయములను సిద్ధేశ్వరుల ప్రస్తుతివచనములనుం జిత్తగించుచు
వరిగె. భగవంతుండు విచ్చేసినయనంతరము కర్దమమునివరుండు భగవదా
దిష్టమగు కాలము వార్చుచు నచ్చట నుండె.

## స్వాయంభువుఁడు దేవహూతిఁ దోడ్కొని కర్దమునొద్దకు వచ్చుట

అంత హరినిరూపించినయవసరంబున స్వాయంభువుం డైనమనువు
దనకూఁతునుభార్యను స్వస్యందనమునఁ గూర్చుండఁ బెట్టికొని భూతలముఁ
దిరుగుచుండు శాంతవ్రతుఁ డగునాకర్దమమునియాశ్రమమునకుఁ జను
దెంచె. అందలిసరోవరంబునం గరుణాపరిపూర్ణుం డైనభగవంతుని
యానందబాష్పబిందువులు గ్రందుకొన్నకతన సరస్వతీపరివృతం బైనయా
కొలను బిందుసర స్సనంబరఁగి పరమపుణ్యం బై శివామృతసలిలం బై మహర్షి
గణసేవితం బయ్యె. తత్సంబంధమునం జేసి యయ్యాది యున్న యాశ్ర
మంబు నావేశం బరఁగె. సర్వర్తుఫలకుసుమవిసరముల నుల్లసిల్లి పికశుక
మధుపమయూరమధురారావంబుల నొప్పెసఁగుకదంబవంజుళాశోకవకుళ
మందారరసాలపారిజాతాదిపాదపములం జల్ల నీడలు పచరించుతీరముల
నమరియు హంసకారండవచక్రచకోరాదిజలపక్షిసంతానమునఁ జారు
త్వంబుఁ గాంచియు హరిహరిణకుంజరశార్దూలవరాహాదిమృగప్రచారము
లఁదనరుపరిసరారణ్యముల వెలసియుఁ గన్నుల కమందానందంబు గ్రంమ

గొల్చునాత్రిక్త రాజము బజీయుఁ బికవెంట వచ్చినవారితోడఁ జని యుండు బ్రహ్మచర్యమునఁ గర్తవ్య మగునగ్నికార్యముఁ జేసి తపో మహిమనువిద్యోతితవిగ్రహమును జేజరిల్లుచు భగవత్కటాక్షవీక్షణభాష ణామృతశ్రవణములం జేసి యతికృశుండు గాక ప్రాంశుండై జటా ధరుండై సముచితసంస్కారంబు వొరయనికతన మలినం బైనగాత్ర మునం జీరవసనములం బొల్చియున్న యాకర్దమమునిం బద్మపలాశ లోచనుం గాంచె. అమ్మునియుఁ దనయాశ్రమమున కరుదెంచి తనకుఁ బ్రణమిల్లి యెదుర నున్నస్వాయంభువమనువు ననురూపసపర్యల సత్క రించి యతం డాపూజలం గ్రహించి కూర్చుండిన నదంపడి భగవ దాదేశము స్మరించుచు నతనికిఁ బ్రీతి పుట్టించుచు మృదుమధుర వచనముల నిట్లనియె. రాజాధిరాజా, సాధురక్షణంబు నసాధుశిక్షణం బును గావింప నీవు సంచరింతువు. లోకపాలకం బగుహరిశక్తియే నీవు. సూర్యచంద్రానలేంద్రవాయు యమధర్మవరుణరూపముల నాయాస్థాన ముల నంగీకరించి లోక మేలు శ్రీవిష్ణుదేవాత్ముఁ డగునీకుఁ బ్రణామంబు. మణిగణవిభూషితం బైనజైత్రరథ మారోహించి వెన్నడించివచ్చుసేనల పాదఘాతమునం బుడమి గ్రక్కదల నరాతులకు వెఱపుగూర ధనుష్టణ క్వణనంబుఁ గావించుచు నంశుమంతునివిధమున లోకమెల్ల నీవు దిరుగ కుండుదేని యప్పుడే భగవంతుఁ డేర్పఱిచినవర్ణాశ్రమనిబంధనము లగు ధర్మమర్యాదలెల్ల దస్యుజనులు భేదింతురు. నిరంకుశముగఁ గామాసక్తు లగునరులవలన నధర్మంబు వర్ధిల్లెడు. నీవు నిజవ్యాపార ముడిగి నిద్రింతు వేని లోకము దస్యుగ్రస్తంబై నశించెడు. భవత్సంచారం బేతదర్థం బని యెఱింగియు నేమి నిమిత్తంబు గలుగ నిట కరుగుదెంచితి వని యే నడి గెద. హర్షపూరిత మగుమనంబున నీరాక యాదరింతు నని కర్దమముని చెప్పిన నాత్మగుణశ్లాఘనంబునకు సిగ్గువడినట్టు లాసమ్రాట్టు నివృత్తి నిరతుం డైనయమ్మునికిట్లనియె.

### స్వాయంభువుఁడు దేవహూతిం బెండ్లి యగు మని కర్దముని వేఁడుట

మునివరా, బ్రహ్మదేవుఁ డాత్మభూత మగువేదముఁ బరిపాలింప ఛందోమయులు తపోవిద్యాయోగయుక్తు లలంపటులు నగుమిమ్ముఁ దన ముఖమున సృజించి తత్పరిత్రాణార్థంబు బాహుసహస్రమున మమ్ముఁ

పుట్టించె. ఆదేవునకు బ్రాహ్మణుఁడు హృదయ మనియు క్షత్త్రియుఁ డంగ మనియుఁ బెద్దలు వచింతురు. కావున బ్రహ్మక్షత్త్రియుల కిరువురకుం బరస్పరరక్షణంబు కర్తవ్యంబు. సదసదాత్మకుఁడయ్యు నిర్వికారుఁ డైన యాదేవుఁడు దానఁ దాను బ్రహ్మక్షత్త్రరక్షఁ గావించు. రక్షణేచ్ఛుఁ డగునాకు ధర్మము బోధించునిన్నుఁ గన్నంతన మదీయసంశయములెల్ల విచ్ఛిన్నంబు లయ్యె. అకృతాత్ములకుఁ జూడనలవిగానినిన్ను భాగ్యమునం గంటిని. శుభ మగుభవత్పాదపరాగంబుఁ దలఁ దాల్చితి. కమనీయము లగునీమృదుభాషితముల వీనుల నాకర్ణించితి. ధర్మశాసనంబు నీవలన నెఱింగితి. మహాప్రసాదం బయ్యె. మునీంద్రా, దుహితృస్నేహపరిక్లిష్టమానసుం డైననామనవి కరుణించి యాలింప నర్హుఁడవు. ప్రియవ్రతోత్తానపాదులకు సోదరి యగునీమదీయపుత్త్రి వయశ్శీలగుణాదులఁ దగినపతి నన్వేషించుచు నారదమునీంద్రువలన భవదీయశీలశ్రుతరూపవయోగుణంబుల నెఱింగి నీపయి నిశ్చయము చేసికొనియుండెడు. ద్విజోత్తమా, శ్రద్ధతోఁ గానుకగా నే నర్పించునీకన్నియ నంగీకరింపుము. గృహస్థకార్యముల నియ్యది సర్వవిధముల నీకుఁ దగియుండెడు. విషయములైన నప్రయత్నమున వచ్చిన వల దని నిషేధించుట విరక్తునకుం బ్రశస్తంబు గాదు. కామరక్తునకు వేఱ చెప్ప నేల? అయత్నలబ్ధ మగు కామము నిరాకరించి దీనముగ దానికై యెవ్వఁడు లాఁతులయాచించు నట్టివానికీర్తిమానము లవమానహతంబు లగు. నీవు వివాహార్థము యత్నించుచున్నవాఁడ వని యేను విని నీయొద్ద కేతెంచితి. వివాహావధి నియమముఁ బూనునుపకుర్వాణబ్రహ్మచారి వగునీవు నే నొసఁగు నా కూఁతుం బరిగ్రహింపు మని చెప్పిన విని కర్దమముని మనువున కిట్లనియె. నరేంద్రా, నిక్కంబె నుద్వాహంబుఁ గోరుచుండుదు. నీవు నీకూఁతు నింతకు నెవ్వనికి నీకుండుదువు. జగత్ప్రథమికం బైనయీవివాహము మా కిరువురకుఁ దగియుండెడు. వివాహప్రయోగమునం బాణిగ్రహణమంత్రార్థమునం బ్రతీతం బగుసుప్రజాస్త్వరూపం బైనకోర్కి నీ కూఁతునకు లెస్స నెఱవేఱెడు. తనమేనిలావణ్యమున నిందిరాదేవిం దిరస్కరింపఁ జాలినయాసుందరి నెవ్వఁ డాదరింపఁడు? ప్రాసాదతలమున నందెలరవంబు చెలువొందఁ జెండాడుచు నిటునటుం బాఱుతెంచు

సౌధంబునఁ బంతులాడుచుండం గాంచి కామించి విశ్వావసుండు మైమఱచి విమా
నమునుండి పడియె ననిపించుము. ఉత్తమచరణముల సేవించినవారికిం
జూడ నరిదియైన నీకన్యకను నుత్తానపాదసోదరిం దనంతన వచ్చి వరించు
దాని నే నిరాకరింతునే! ఒక నొక్కసమయంబు చేసెద నెట్లంటేని.
సాహచర్యము భరించి నీదుహిత గర్భము ధరించునంతకు నేను గృహస్థ
వృత్తినుండి యటుఁ బరమహంసధర్మం బైనజ్ఞానము నావలంబింప ముఖ్య
ములు హింసారహితములు భగవత్ప్రోక్తములు నగుశమాదుల నను
ష్ఠించెద. ఈవిశ్వమునకు సృష్ట్యాదికారణం బైనభగవంతుండు తాన
ఋణత్రయంబు దీర్చినపిదప సన్న్యాసం బనుష్ఠేయం బని విధించె.
అతండు నాకుఁ బ్రమాణంబు. ఈసమయమున కొడంబాటు గలుగు
నేని నీకూఁతుఁ బెండ్లి యగుదు నని యరవిందనాభుం జిత్తమునం జేసి
కొని పలికి మందహాససుందరవదనవికాసమున దేవహూతిచిత్తం బాక
ర్షించుచుండె.

### కర్దముండు మనుపుత్త్రి యగుదేవహూతిం బెండ్లి యగుట

మనువు నాసంకేతవిషయంబు దనకూఁతునకుం బత్నికి నసుమతం
బగుట లెస్స యరసి గుణగణాఢ్యుం డగుకర్దమమునికిఁ దుల్యగుణ
యగుతనకన్యక నత్యంతసంతుష్టస్వాంతంబుతో నొసంగిన నాతండు
మనుదత్త యగుకన్నియను యథావిధి వివాహం బయ్యె. శతరూ
పయుఁ దనకూఁతునకు నల్లునికి నానావిధము లగునంబరాభరణాదిపరి
బర్హము లరణగా నిచ్చి యయ్యభినవదంపతుల యభిరూపతం గాంచి
సమ్మోదంబున నలరె. అవ్విధమున స్వాయంభువుండు దనకూఁతుం దేవ
హూతిని కర్దమునికిచ్చి కృతకృత్యుండై సమ్మదమ్మున మెచ్చుచుండి యట
నిజరాజధానికిఁ బోవ నెంచి దుహితృవిరహంబు సైఁపనేరక పలుమాఱు
లయ్యాత్మజం గౌఁగిటం గ్రుచ్చి యమ్మ, వత్సా యని మాటిమాటికింబిలు
చుచు శిరంబుమూర్కొనుచు నయనజలముల నాతన్వికేశపాశంబుఁ దడు
పుచు నెట్టకేలకు మనం బొకతెఱంగున దృఢము గావించికొని యమ్ముని
వరు నామంత్రణంబుచేసి పరిచరపరివృతుండై భార్యయుందాను దేరెక్కి
సరస్వతీనదియిరుదరుల నలరుపరమశాంతు లగుఋషులపుణ్యాశ్రమం
బులసంపదలం గాంచుచుఁ దరలి బ్రహ్మావర్తదేశమున వసించుతనప్రజలు

ప్రహర్షమునఁ బ్రస్తుతిగీతవాదిత్రములతో నెదుర్కొనినఁ బ్రేమబంధు
రవిలోకనంబున వారినాదరించుచు నిజరాజధాని యగుబర్హిష్మతీపురంబు
దఱిసె. యజ్ఞవరాహమూర్తి దనమేను విదిర్చునెడఁ బడినతదీయ
రోమము లచ్చటఁ బచ్చనివెలుంగుతోఁ గుశకాశమయం బైనబర్హి
స్సంచయం బగుటం జేసి యాపురి బర్హిష్మతి యనం బరఁగె. వానిం
గొని ఋషులు మఖముల యజ్ఞేశ్వరు నారాధించి యజ్ఞవిఘ్నకారు
లగురాక్షసాదులం బరాభవించిరి. మనువును దత్ప్రధనత్వంబున యజ్ఞ
పురుషుని యజించి మహత్త్వం బధిగమించెఁ గావున నాస్థానంబు స్వర్గము
కంటెఁ బ్రశంసనీయం బయ్యెడు. అట్టిపరమపావనం బైనబర్హిష్మతీ
నగరి కరిగి స్వాయంభువమనువు తాపత్రయనివారణచణం బైనతననగరు
సొచ్చి సురగాయకమిథునంబులు తనకీర్తిగానంబు లొనరింపఁ బత్నియుఁ
దాను బ్రజలతో నితరోపమర్దంబుఁ గలుగకుండఁ గామభోగము లనుభ
వించుచుఁ బ్రభాతంబున భక్తిదృఢం బయినచిత్తంబున హరికథ లాక
ర్ణించుచు ధర్మమున రాజ్య మేలుచుండె. వివిక్తభోగరచనలం గుశలుం
డైనయయ్యాదిరాజునకు భోగములు చిత్తవిభ్రంశంబుఁ జేయఁజాల
వయ్యె. విష్ణుకథల వినుచుఁ బఠించుచు నద్దేవదేవు నెల్లపుడు నిండుమన
మునం జింతించుచున్నయమ్మనువునకుఁ దనమన్వంతరకాలంబునందలి
సూక్ష్మావయవంబు లైనజాములేనియు వ్యర్థములు గాక సాధుయాపి
తంబులయ్యె. వాసుదేవప్రసంగమున జాగరణాదిగతిత్రయంబు మీఱి
యతండు దనయంతరకాలం బైనయేకసప్తతియుగములం గడపె. శారీర
మానసదివ్యమానుషభౌతికక్లేశము లెవ్వియు నతనిం జేరవయ్యె. హరి
నాశ్రయించినవారి నయ్యవి యెట్లు డాయవచ్చు? మునులడుగ నామనువు
సర్వభూతహితముఁ గోరి వర్ణాశ్రమోచితంబులై నరుల కనుష్ఠేయము
లగునానాధర్మముల నుపదేశించె ఇయ్యది స్వాయంభువమనుచరిత్రంబు.
తదపత్యం బైనదేవహూతిమహిమంబు వినుము.

### దేవహూతి పాతివ్రత్యమునఁ గర్దముం గొలుచుట

అవ్విధమునఁ దల్లిదండ్రు లరిగినపదంపడి పతివ్రత యగుదేవ
హూతి పతియింగితం బఱసి కామముఁ గపటము ద్వేషము లోభము
నిషిద్ధాచరణము మదముం ద్యజించి ప్రమాదంబు వొరయక నిత్యోద్య

తనై విస్రంభమున నాత్మశౌచమున గౌరవమున దమమున శుశ్రూషను సౌహృదమున మధురవచనమున భవాని భవు నెట్టు లట్టులు పరమప్రీతితోఁ బరమతేజస్వి యగునమ్మునికిఁ బరిచర్యలొనర్చి యతని చిత్తంబు వడసె. ఆదేవర్షి సర్వేశుఁడును దైవముకంటెఁ బతి యెక్కు డను నిశ్చయంబునఁ దనవలన మహాఫలంబుఁ గోరుచుఁ దన్ననువర్తించి యున్న యమ్మనుదుహితను దీర్ఘకాలవ్రతచర్యావిధానమునఁ గృశించి యున్నదానిం గాంచి ప్రేమగద్గదభాషితంబున నిట్లనియె. మానినీ, భక్తి పరిచర్యల నన్ను సమ్మానించినదానికి నీకు మెచ్చితి. ప్రాణులకుఁ బరమ ప్రీతిభాజనం బైన దేహమును నాతదర్థంబు కృశింపఁ జేసితివి. తపస్సమాధి విద్యాత్మ యోగముల స్వధర్మనిరతుండ నై యేనుసాధించిన భగవత్ప్రసాద రూపము లగుభోగముల నీవును సేవింతువు. దివ్యదృష్టి నొసఁగెద. వానిం జూడుము. భగవంతునిభ్రూవిభంగమాత్రమున నశించునర్థరచనల నొప్పులాంతిభోగములం గణింపనేల ? సిద్ధురాల వైతివి. నిజపతివ్రతా ధర్మార్జితము లితరదుర్లభములు నగువిభవము లనుభవింపుము. ఏము రాజుల మనుచు నభిమానమున నొదవువికారములం బ్రయోజనంబు గలుగ దని పలుకుచున్న యఖిలయోగమాయావిద్యావిచక్షణుం డైన పతిం గాంచి దేవహూతి లజ్జావలోకవిలసితహాసితంబుతోఁ బ్రణయ వినయవిహ్వలభాషితమున నిట్లనియె. ద్విజశ్రేష్ఠా, యమోఘయోగ మాయాధిపుఁ డగునీయెడఁ దాదృశభోగాదిసంపత్తి స్వతస్సిద్ధం బని యే నెఱుంగుదు. నీయొనర్చినసమయంబు మెయిఁ బుత్త్రోత్పాదనంబు పొంటె సకృదంగసంగ మే నభిలషించెద. పతి గలుగం గుణప్రసవంబు సతుల కగు. అయ్యంగసంగమునం గామశాస్త్ర బోధితప్రకారమున సాధ నంబులఁ గల్పింపుము. అభ్యంగభోజనపానాదిరూప మగునాసాధనగణం బుల నీదేహము కుశలంబై మరుబారిం బడి యత్యంతరతి వేఁడుచు దీనయై యున్న నాతనివి దీర్చెదు. ఉత్తమకామభోగముల కనుకూల మగు భవనంబు నాయిత్తపఱుపు మని విన్నవించినం బత్నివిన్నపం బాలించి కర్దముఁ డాప్రియురాలికిఁ బ్రియముఁ గావించువాఁడై యోగమహిమ మున నాక్షణంబ కామగమనం బైనవిమానము నొక్కదానిని సృజించె. అయ్యది సర్వరత్నముల నలంకృతం బై సర్వసమృద్ధుల నుత్తరోత్తరాభి

వృద్ధి నుల్లసిల్లియు మణిస్తంభములను దివ్యపరికరంబులను విచిత్రపట్టికా పతాకావళు లనుమధురమధుపనాద మేదురవిచిత్రమాల్యంబులను క్షౌమ కౌశేయాది నానావస్త్రములను సొంపు పెంపారియు నొక్క చోటికంటె మఱియొక్కచోట నెక్కువగాఁ బైమేడల శయనాసనవ్యజనంబులను నానాశిల్పంబులను మరకతకుట్టిమంబులను విద్రుమవేదికలను ప్రవాళ దేహళీస్ఫురితవజ్రకవాటశోభితద్వారదేశంబులను శాతకుంభకుంభసం భాసమానహరినీలశిఖరంబులను బరమోజ్జ్వలపద్మరాగఖచితవజ్రభిత్తికలను విచిత్రవితానంబులను మహార్హ తోరణంబుల నాత్మసదృశసాలభంజికాగణంబులం జూచి కృత్రిమంబు లని తలపోయక తమయట్టివారని భ్రమించుచు నెల్లపుడు నెక్కియు డిగియు లలితరుతు లొనర్చుహంస పారావతవ్రాతంబులను మహారవమయంబు లైనప్రాసాదంబులఁ బొంపిరి వోయియు యథాసుఖముగ రచితంబు లైనవిహారస్థానంబులు విశ్రాంతి ప్రదేశంబులు భోగాయతనంబులు గృహబహిర్భాగంబులు ప్రాకార బాహ్యభూములు మున్నగువాని నెల్లెడల నిండారియుఁ గన్నులపండువై యుండె.

### దేవహూతి కర్దమునితోఁ గామగమనవిమానమునఁ గ్రీడించుట

అట్లు సర్వాశ్చర్యం బైనవిమానంబు వడసియు దేవహూతి నాతిప్రీతచిత్తమున దానిం జూచుటయు సర్వభూతహృదయవేది యగు నాకర్దముఁడు పత్నిం బిలిచి కల్యాణి, హరి యానందబిందుపతనమునం బవిత్రం బైన నరుల కెల్లకోర్కు లొసఁగు నీబిందుసరస్సునఁ దీర్థమాడి యట నీవిమాన మారోహింపు మనిన నవ్వరారోహ పతిమాట వట్టి యప్పటి తనమలినవసనంబుతో జడగట్టినకేశపాశంబుతో మలపంకిలాంగంబుతో వివర్ణస్తనంబులతో నాజలాశయములోనం గ్రుంకె. క్రుంకి యచ్చట నొక్కభవనంబునం బాల్యవయస్సునున్న పదివేవురుకన్నియలఁ గుముదగంధులం గాంచె. కాంచుటయు వారు తటాలున లేచి కేల్దోయి మొగిచి తల్లీ, యేము నీపరిచారికలము పని పంపు మని నివేదించి పరిమళతైలమునఁ దల యంటి మేన నలుంగిడి పస పార్చి పన్నీటం జలకమార్చి తడి యొత్తి విమలనూతనదుకూలములం గట్టి యుత్తమమణిమయవిభూషణగణములఁ దొడిగి పరిమళచందనమలంది సర్వగుణోపేత

మైనయన్నము నమృతోపమం బైనయాసవముం గుడువఁ ద్రావ నొసఁగి యద్దముఁజూపిరి. దేవహూతి దర్పణమున వివిధభూషణవిభూషితంబై సర్వోపభోగసంభృతంబై సకలపరిచారికాపరివృతం బైనతనయత్యంత సుందర రూపముం గాంచితన ప్రియుం డగుకర్దముని డెందమునం దలంచు నంతలో నమ్మునివల్లభుండు వచ్చుటఁ బరిచారికలు గొలువ వెలయు చుండఁగ నతనిమ్రోల సుందరీసహస్రంబు గొలువఁ దా నుండునట్లును గాంచి యయ్యది యోగగతిప్రకారం బని తలపోసి యబ్బురంబు నొందె. అప్పు డమ్మునిస్నానాలంకరణభోగాదులఁ దొల్లింటికంటె నెక్కు వగఁ దేజరిల్లుచుండినం బూర్వరూపంబుఁ దలఁపించునవయవ సన్నివేశాదుల నమరియున్న యన్నారీమణిని విద్యాధరీసహస్రసేవ్యమాన యగు దానిం గాంచి ప్రేమావేశమున నవ్వియచ్చరవిమానం బెక్కించికొని విద్యాధరకుముదనేత్రాపరివృతుండై కూర్చుండి తారాగణపరీతుండై మింట వెలుంగుపూర్ణచంద్రుం గ్రేణిసేయుచుండె. అవ్విధంబున నవ్విమానం బవ్వనితారత్నంబుతోడ నారోహించి యమ్ముని శిశిరసురభిమంద మారుతసంచారభాసురంబులై మందాకినీప్రవాహారవసుభగంబు లైన యింద్రాదిలోకపాలవిహారస్థానం బగు మేరుగిరిదరులను వైస్రంభకము స్వారసనము నందనము పుష్పభద్రము మానసము చైత్రరథము మున్నగు దేవోద్యానములను లలనాసహాయుండై సిద్ధులప్రసిద్ధస్తోత్రము లాలించుచుఁ దిరుగుచుఁ గ్రీడించుచుఁ దలఁచినట్లు లనిలవేగమునం బోవుచుఁ గామగమనం బగునావ్యోమయానముకలిమిం జేసి వైమానికుల నెల్లమించి వెలసె. సంసారవ్యసననివారణచరణం బైనశ్రీహరిచరణంబు నాశ్రయించినమహాత్ముల కెయ్యది దుర్లభంబు?

### దేవహూతికిఁ గలాదు లగుతొమ్మండ్రు కూఁతులు జనించుట

అవ్విధమునఁ గర్దమమునీంద్రుం డావిమానమున ద్వీపవర్షాదిరచనల నొప్పుభూగోళమెల్లఁ బత్ని యగుదేవహూతికిఁ జూపి బహ్వాశ్చర్యమయుండై నయాయోగి మగిడి తనయాశ్రమమునకుఁ జనుదెంచి తొమ్మిది యాకారములఁ దాను జూపట్టుచుఁ బెక్కేండ్లు ముహూర్తమాత్రం బకాఁ దోఁప సురతోత్సుక యగుదయితం గామభోగములఁ దనుపు

యయు నవ్విమానమున నత్యంతసురతోల్లాసంబుఁ గావించుచు నుత్తమశయ్యమునం దత్యంతసుందరుఁ డగుపతితో నా దేవహూతి రమించె. అట్లు వారు కామలాలసులై రమించుచుండ నల్పకాలంబువోలె శతవర్షంబులు గడచె. అప్పుడు సర్వసంకల్పముల నెఱింగి తత్సంకల్పముల నెఱవేర్ప నేర్పరి యైనయయ్యాత్మవిదుఁ డయ్యతివకుఁ దొమ్మిదిగర్భములు ప్రసాదించుటయుఁ గామసుఖములయెడ ననాసక్తుం డైనయమ్మునివీర్యము కంటె నత్యంతరత్యనురక్త యగునమ్మునితనయశోణితభాగ మెక్కువగ నాగర్భముల సంక్రమించినకతన నత్యంతసుందరాంగు లగుతొమ్మండ్రు గురు కూఁతులు జనించిరి. అట్టియెడ నమ్ముని ప్రవ్రజనంబు సేయ నుద్యమించుట యూహించి లోఁ గుందియు వెలికి నగవు చూపుచు మృదునఖకిరణారుణం బైనచరణంబున నేల గీఱుచుఁ బైపయిం గ్రమ్ము కన్నీటివెల్లువ పెల్లున డగ్గుత్తిక వెట్టి లలితభాషణంబుల దేవహూతి పతి కిట్లనియె. బ్రహ్మర్షివర్యా, ప్రతిజ్ఞచొప్పున మీ రెల్లయు నడపితిరి. ఐన మీశరణు సొచ్చిన నా కభయమియ్య మీ రర్హులరు. ఈకూఁతులకుఁ దగినపతుల వెదకవలసియుండెడు. మీరు వనమున కేఁగినపిదప నాకు విశోకత్వంబుఁ గూర్పఁగ నొక్కపుత్త్రునైనం బ్రసాదించినం గదా యేను వ్యసనంబు నిస్తరింతు. పరమాత్మచింతనంబుపొంతఁ బోవక యింద్రియార్థములం దవిలి యిందాఁక మీతోడ సంగము నొనర్చితింగాని మీపరమప్రభావంబు దెలియనైతి. ఐనను భవదీయసంగంబు నా కభయమొడఁగూర్చెడుఁగాక. అజ్ఞానమున నసాధులతోడఁ జేయఁబడుసంగము సంసృతికారణం బైన నదియే సాధువులతో నొనర్చిన నసంగత్వంబుఁ గావించు నని వినియుండుదు. ఎవ్వనికార్యంబు ధర్మంబునైన వైరాగ్యంబునైన హరిసేవనంబునైన సమకూర్ప దట్టివాఁడు బ్రదికియుండియుఁ జచ్చినవాఁడ యగు. నిక్కం బేను భగవన్మాయకుఁ జిక్కి మిక్కిలి మోసపోయితి. కావున ముక్తిప్రదుం డైననిన్నుఁ బడసియు బంధమోక్షముఁ గాంక్షింపకుండుదునే యని విషయవిరాగంబు గదురఁ బలుకుచున్న యన్నారీమణి నూరార్చుచుఁ గర్దమమునీంద్రుండు భగవదాదేశంబుఁ దనలోఁ దలపోయుచు నిట్లనియె.

## దేవహూతిగర్భమునఁ గపిలాచార్యుఁ డవతరించుట

రాజపుత్త్రీ, విషాదంబు వలదు. ఆతురుఁ డగు భగవంతుఁ డచిరంబు నీగర్భమునఁ జొచ్చెడు. వ్రతములు ధరించి దమము నియమము తపము దానము శ్రద్ధయు ననువానిం గడించి యీశ్వరుం గొలువుము. ఆతండు నీయుదరమున నవతరించి నీయారాధనమునకు మెచ్చి నాకుఁ గీర్తిఁ గావించుచు నీకు బ్రహ్మవిద్య యుపదేశించి హృదయగ్రంథిభేదనం బొనర్చెడు నని చెప్పిన నత్యంతగౌరవంబున విని దేవహూతి తద్వచనంబు లెల్ల నమ్మి కూటస్థుఁడు జగద్గురుఁడు నగు నప్పరమపురుషుని సేవించుచుండె. అట్లు పెద్దకాలంబు సనుటయు మధుసూదనుండు కర్దమముని వీర్యంబు నాపాదించి దారువునం దగ్ని యెట్టు లట్టు లా దేవహూతిగర్భమునం దవతరించె. అప్పుడు దివంబున దేవవాద్యంబులు మ్రోసె. వార్షుకమేఘము లట్టిచర్యఁ జూపె. గంధర్వగానంబు లప్సరోనృత్యంబులు నెసంగె. సురలు కుసుమవర్షంబు గురిసిరి. ఎల్లదెసలు నుదకములు మనస్సులుం బ్రసన్నంబు లయ్యె. అట్టియెడ హిరణ్యగర్భుఁడు మరీచిప్రభృతులతోడ సరస్వతీతీరవిరాజితం బైన యాకర్దమాశ్రమమునకుం జనుదెంచి సాంఖ్యశాస్త్రప్రవర్తనార్థంబు సత్త్వగుణోదయంబున నవతరించిన యప్పరమపురుషుం బరిశుద్ధచిత్తమునం బూజించుచుఁ దచ్చికీర్షితంబు మెచ్చుచు సర్వేంద్రియసంతోషంబు దనరఁ గర్దమున కిట్లనియె. వత్సా, నన్ను బహూకరించి నామాట నడపుటం జేసి నీవు నిష్కపటముగ నన్నుఁ బూజించినవాఁడ వని తలంచెద. గురుత్వమున మాట గొని నడుపుటయే పుత్త్రులకుఁ దండ్రులయెడఁ జేయఁ దగినసేవ యయ్యెడు. ఈ నీకూఁతులు లాత్మప్రభావమునం బలుతెఱంగుల సృష్టివృద్ధిఁ గావించెదరు. కావున శీలమునకుం బ్రీతికి ననురూపముగ నీరి నర్హులైనవారి కొసంగి యశముఁ బడయుము. (భూతముల నిధి యైన యాదిపురుషుండే నిజమాయాయోగమున దేహధారణం బంగీకరించి కపిలముని యన నీకుఁ బుత్త్రుఁడై యుద్భవిల్లెనని యే నెఱుంగుదు) నని చెప్పి యట దేవహూతిదెస మొగంబై యోమనుపుత్త్రీ, కైటభార్దనుండు నీగర్భమున నవతరించినవాఁడు. ఈ పరమాత్ముఁడు జ్ఞానవిజ్ఞానయోగమునఁ గర్మవాసనల నున్మూలించి నీ యవిద్యాసంశయగ్రంథిం ద్రెంచి భువిఁ జరించెడు. సాంఖ్యాచార్యసమ్మతుం

డై నయీయాసిద్ధేశ్వరుఁడు లోకమునఁ గపిలుఁ డనంబరఁగి నీకుఁ గీర్తిఁ గావించెడు నని చెప్పి యప్పరమేష్ఠి హంసవాహనం బారోహించి తనవెంట నేతెంచినమరీచ్యాదుల నట నిల్పి సనకాదిమునులును నారదుండు వెన్నడించిరాఁగ సత్యలోకంబున కరిగె. బ్రహ్మ యట్లరిగినపదంపడి కర్దముఁడు తద్వచనంబు మెయిఁ దనతనయలఁ బ్రపంచసృష్టి సేయఁ జాలినవారి కిచ్చువాఁడై మరీచికిఁ గల, నత్రి కనసూయ, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకు గతిని, గ్రతునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతి, వసిష్ఠున కరుంధతి, నథర్వునకు శాంతినిం గాఁ దొమ్మండ్రు గురుకూఁతుల నాతొమ్మండ్రు గురుప్రజాపతుల కొసంగె. వారునుగృతోద్వాహులై కర్దమునామంత్రణంబు చేసి భార్యలఁ దోడ్కొని సంతసిల్లుచుఁ దమతమయాశ్రమంబులకుఁ జనిరి.

### కర్దముఁడు కపిలుననుజ్ఞఁ బొంది ప్రవ్రజించి ముక్తిఁ గనుట

అంత నొక్కనాఁడు కర్దముఁడు తనసుతుఁ డగుకపిలుఁడు భగవంతుఁ డని యెఱింగినవాఁడు గావున నేకాంతమునఁ జేర నరిగి ప్రణమిల్లి యిట్లని విన్నవించె. దేవా, పూర్వపాపముల సంసారమునం గుందువారికిఁ బెద్దకాలంబునకుఁ గాని దేవతలు ప్రసాదింపరు. (బహుజన్మపరిపక్వం బైన యోగసమాధిచే యతులు వివిక్తస్థానముల నెవ్వనిపాదముఁ గనుంగొన యత్నంబు నొనర్తు రట్టి నీవు వీర లెంతవార లని మమ్ముఁ జులకనం జూడక నిజభక్తులఁ బ్రోచుతలంపున నాత్మవాక్యమునకు సత్యత్వంబుఁ గావింపను భాగవతులకు జ్ఞాన మనుగ్రహింపను గ్రామ్యు లగుమాయింట నవతరించితివి.) అలౌకికము లగుచతుర్భుజాదిరూపములను భక్తులకు రుచించు మనుష్యరూపంబులును రూపరహితుం డైన నీ కభిరూపంబులగు. తత్త్వావబోధనార్థంబు పెద్ద లెల్లపుడుం గొలువ వెలయుపాదపీఠమున నలరుని నైశ్వర్యవైరాగ్యయశోవబోధవీర్యశ్రీపరిపూర్ణుం డైనవానిఁ బ్రకృతిపురుషమహదహంకార కాలేంద్రియదేవతాత్ముఁ డైనవాని, స్వాధీనశక్తిసమన్వితుం డైనవానిఁ, జిచ్ఛక్తియోగలీనప్రపంచుఁ డైనవాని సర్వజ్ఞుం డైనవానిఁ బరమేశ్వరు నాశ్రయించి యొక్కయర్థం బడిగెద. నీవలనఁ బుత్త్రవంతుఁడ నగుటం జేసి పితృఋణము దీర్చితిఁ గావున నాప్తకాముఁడ నైతి. ఇఁక నన్ను మదిం బదిలపఱచికొని విశోకుండనై సన్న్యాసుల

మార్గ మవలంబించి ప్రవ్రజనంబు సేయ ననుజ్ఞ యిమ్మని యడుగుటయు నతనికిఁ గపిలాచార్యుఁ డిట్లనియె. మునీంద్రా, వైదికలౌకిక కార్యంబుల యెడ నేఁ జెప్పినయవి లోకమునకుఁ బ్రమాణంబు. నామాట సత్యము గావింప నీకుఁ బుత్రుండనై యవతరించితి. లింగశరీరము విసర్జించి మోక్షముఁ బడయఁ గోరువారి కాత్మదర్శనమునం బరమసమ్మతం బైన తత్త్వసంఖ్యాప్రతిపాదనంబు సేయ మదీయావతారంబు ప్రవృత్తం బయ్యె. అత్యంతదుర్బోధ మగునీయాత్మతత్త్వమార్గము కాలబాహుళ్యమున నుత్పన్న మగుటయుఁ గ్రమ్మఱ నమ్మార్గమునకుఁ బ్రవర్తనం బొనర్పఁగ నే నీదేహము ధరించితి నని యెఱుంగుము. నాయనుజ్ఞఁగొని సర్వకర్మములు నాయందు సన్న్యసించి ప్రవ్రజ్యఁజేసి దురత్యయం బైన మృత్యువుం దరించి యమృతత్వంబుఁగోరి నన్ను భజింపుము. స్వప్రకాశమున సర్వభూతములహృదయములం దంతర్యామినై యాత్మస్వరూపుండనై వెలుంగుచున్నాత్మలో మనస్సునం జూచుచు విశోకుండవై యభయంబుఁ గాంతువు. సర్వకర్మశమని యగునధ్యాత్మవిద్య నేను దల్లికి బోధించి యద్దేవి సంసారమును దరించునట్లును గ్రహింతు నని చెప్పిన విని కర్దముఁ డానందించు వలగొని వనమునకుఁ జనియె. చని యట్లు కర్దముండు మౌనవ్రతపరుండై యాత్మైకశరణుండై యసంగుండై యనగ్నియై యనికేతనుండై నిరహంకారుండై నిర్మముండై నిర్ద్వంద్వుండై సమదర్శనుండై యాత్మదర్శనుండై ప్రత్యక్ప్రశాంతమతియై ధీరుండై తరఁగ లుడిగినసాగరంబుచందమున నిష్క్రియుండై సదసదతీతంబు గుణావభాసకంబు నిర్గుణంబు దృఢభక్తిభావితంబు నగుబ్రహ్మమునందు మనస్సు నిలిపి క్షోణీతలమునఁ దిరుగుచుండి కొండొకనాఁడు ప్రత్యగాత్ముండు సర్వజ్ఞుండు భగవంతుండు నగువాసుదేవునియెడ నెనసినయేకాంతభక్తియోగమునం జేసి యాత్మలాభముఁగాంచి ముక్తిబంధనుండై సర్వభూతములలో నాత్ముఁ డగుభగవంతుని సర్వభూతముల నయ్యాత్మునందు నపరోక్షముగఁ గనుంగొని యిచ్ఛాద్వేషరహితం బైనసర్వసమచిత్తంబుతో భక్తియోగప్రభావమునం జేసి భాగవతులకు గమ్యం బైనముక్తిం బ్రాపించె నని మైత్రేయుండు సెప్పె నని శుకయోగి చెప్పె ననుచున్నతఱి శౌనకుఁడు సూతున కిట్లనియె. అయ్యా, నరుల కాత్మజ్ఞానంబుఁ గావింప

నాత్మమాయాయోగమునఁ గపిలుఁ డన సాంఖ్యవిద్యాచార్యుండై హరి యవతరించెఁగదా. వృద్ధులకెల్ల వృద్ధుఁడు యోగులకెల్ల యోగియు నగు నా దేవదేవుని చరిత్రంబు విను నెడ నింకను వినవలయు నని యుండుఁ గాని మదీయేంద్రియంబు లొకప్పుడుం దృప్తిఁ జెందవు. భగవంతుఁ డాత్మమాయాయోగమున నాత్మేచ్ఛ మెయి నింక నేమేమి చేసె వానినెల్ల శ్రద్ధావంతుఁ డగు నాకుఁ జెప్పు మని యడిగిన నప్పురాణవిదుఁ డయ్యా విను మని యిట్లనియె.

## కపిలదేవహూతిసంవాదప్రారంభము

శుకపరీక్షిత్సంవాదమున మైత్రేయుండు వెండియు విదురున కిట్లనియె. అవ్విధమునఁ దండ్రి యగు కర్దముఁడు ప్రవ్రజ్య గొని యరణ్యమునకుఁ జన్న పిదపఁ దల్లికిఁ బ్రియము సేయువాఁడై కపిలముని బిందుసరస్సున తదీయాశ్రమమున వసింప నొక్కనాఁడు దేవహూతి బ్రహ్మవచనంబుఁ దలపోసి తత్త్వమార్గపారదర్శి యగు నయ్యాత్మనందనుం జేర సరిగి యిట్లనియె. మహాత్మా, యసద్విషయాభిలాషమునం జేసి వెలుఁగుఁ గానక గాఢాంధకారంబుఁ జొచ్చియుంటి. ఇప్పటి కందు నిర్వేదం బొదవె. దరిలేని యయ్యంధకారముపరిఁ జేర్ప నేర్పరివై సూర్యరూపుఁ డగు నిన్ను నీయనుగ్రహంబుననే బహుజన్మావసానమునం బడసితి. భగవంతుఁ డాదిపురుషుఁడు నగు నీశ్వరుండవు కదా నీవు గాఢసంతమసంబునఁ గన్నుఁ గానని లోకమునకుఁ బ్రకాశముఁ గావింప సూర్యునిరీతి నుదయించితివి. భవన్మాయాబలమున నావేశితం బైన యహంకారమమకారంబు లను సమ్మోహముఁ దొలఁగింప నీవ యర్హుండవు. కావున ధర్మవిద్వరిష్ఠుండై శరణ్యుండై భక్తులసంసారతరువు నఱుకఁ గుఠారం బైన నిన్నుఁ బ్రకృతిపురుషతత్త్వవిజ్ఞానార్థం బాశ్రయించెద నని యడుగుటయుఁ బురుషుల కపవర్గవర్ధనంబు నిరవద్యంబు నగు తల్లి కోర్కిం గొనియాడి యాత్మవంతు లగు సజ్జనులకు గతి యగు నా కపిలాచార్యుఁడు మందహాససుందరవదనారవిందుఁడై దేవహూతి కిట్లనియె.

## కపిలుఁడు దేవహూతి కధ్యాత్మవిద్య చెప్పఁ బూనుట

ఆధ్యాత్మికయోగంబు సుఖదుఃఖములకు రెంటికి నత్యంతోపరతి హేతు వగుటం జేసి నిశ్శ్రేయసార్థంబు పురుషులకు సమ్మతంబు. సర్వాంగ

నైపుణ్యంబు గలయయ్యోగంబుఁ దొల్లి శ్రవణాసక్తు లగుఋషులకుఁ జెప్పితి. దాని నీకుఁ జెప్పెద నాకర్ణింపుము. గుణసంగము గలవానికి బంధమునకుఁ బరమేశ్వరభక్తి గలవానికి మోక్షమునకు నై మనస్సే జీవునకు బంధమోక్షములకు రెంటికిం గారణం బగు. అనాత్మ యగు దేహమునం దాత్మాభిమాన మనాత్మీయము లగుదారపుత్త్రాదులయెడ నాత్మీయాభిమానము ననునీయభిమానద్వయమునం బొడము కామ లోభాదు లనుమలములం బాసి మన స్సెప్పుఁడు శుద్ధంబై సుఖ దుఃఖరహితంబై సమమై ప్రవర్తిల్లు నప్పుడు పురుషుఁడు జ్ఞానవైరాగ్య సహాకృతం బగుభక్తియోగమునం జేసి యాత్ముఁడు కేవలుఁడనియుఁ బ్రకృతికిఁ బరుఁడనియు నిరంతరాత్మజ్యోతి యనియు నపరిచ్ఛిన్నుఁడనియు నక్లేద్యుఁ డవాహ్యుఁడు ననియు నుదాసీనుఁడనియుఁ బ్రకృతి క్షీణబలం బనియు నెఱింగి యప్పరమాత్ముం దాన యాత్మలోనం గనుంగొను. యోగులకు బ్రహ్మసిద్ధివిషయమున భగవద్భక్తియోగముతో సాటివచ్చు నుత్తమమార్గంబు వేఱొండు గనుపట్టదు. సంగము శిథిలము గానిపాశ మైనను సాధుజనులతోడఁ జేయఁబడునేని తెఱచినమోక్షద్వారం బని పెద్దలు సెప్పుదురు. మూర్ఖప్రాణులకును సైరించువారును స్వార్థంబు గోరక పరదుఃఖము నిరసింపఁ దలఁచు కారుణికులును సర్వసుహృదులు నజాతశత్రువులును శమదమాదిసంపన్నులును సాధుశీలభూషణులు నగుసాధువు లనన్యభావమున నాయెడ దృఢభక్తిం జేసి మదర్థంబు పరిత్యక్తకర్ములై త్యక్తస్వజనబాంధవులై మదీయకథలఁ గీర్తించుచు వినుచు సంతసిల్లుచుండుదురు. అట్టిమదధీనచిత్తులం దాపములు తపింపఁ జేయఁజాలవు. తల్లి, వారె సర్వసంగవివర్జితు లైనసాధువులు. సర్వదోషహరు లగునట్టిసాధువులసంగంబు ప్రార్థనీయంబు. సత్సంగమునం గర్ణములకు హృదయమునకును రసాయనం బైనమదీయప్రభావప్రకాశక కథలు ప్రవర్తిల్లు. దానం దత్క్షణంబ యవిద్యానివర్తకుం డైనశ్రీహరిపై శ్రద్ధయుఁ దదాసక్తియు ననంతరము భక్తియు ననుక్రమించు. పురుషుఁడు మదీయలీలానుచింతనంబునం బొడలుభక్తియోగమున విషయవిరాగముదయించుటయు నైహికాముష్మికభోగములయెడనిస్పృహుండై యనాయాసము లగుయోగమార్గములం జిత్తము నిగ్రహించి నాలోనం

జొనిపి ప్రకృతిగుణముల సేవింపక వైరాగ్యవిజృంభిత మగుజ్ఞానమునను నాయెడ నర్పించినభక్తియోగమునను బ్రత్యగాత్ముఁ డగునన్నే ప్రాపించు ననినవిని దేవహూతి మహాత్మా, నీయెడ యోగ్య మగుభక్తి యెట్టిః, నా కెయ్యది గోచరం బగు, దేని నలవఱిచికొనినం దాపత్రయముస్సం గుందునేను వేగంబ నిరతిశయసుఖంబుఁ బొందుదు, భగవంతునకు గుఱి యైనభవతూర్వోక్తయోగం బెయ్యది, తత్ప్రకారం బెట్లు, తత్త్వావబో ధనం బైనదాని కెయ్యవి యంగములు, భవదనుగ్రహమున వీనినెల్ల మందమతినయ్యు నేను సుఖముగ నెఱుంగుదుఁ ననియున్నదానఁ దెలియఁ జెప్పు మని యడుగుటయుఁ గపిలుఁడు నిజదేహజననకారణం బైనతల్లికిఁ గూర్మి సేయువాఁడై భక్తియోగసాంఖ్యతత్త్వామ్నాయప్రకారం బిట్లని చెప్పం దొడంగె.

**కపిలుఁడు దేవహూతికి భక్తియోగంబు చెప్పుట**

జ్ఞానకర్మేంద్రియంబులు నేకాగ్రమనస్సును ఫలాభిసంధి విడిచి యప్రయత్నమున నాయెడ వర్తించుటయే భక్తి యనంబడు. ముక్తి నుత్తమం బైనయాభక్తి భుక్తాన్నంబును జఠరాగ్ని యెట్లు లట్టుల ప్రయత్నమున లింగశరీరమును శిథిలపఱుచు. మదీయపాదసేవారతులై సర్వేంద్రియవ్యాపారముల నాయెడ నర్పించుకొందఱుభాగవతులు పరస్పరము మదీయవీర్యములఁ దమలోఁ గీర్తించుచుఁ బ్రసన్న వదనారుణ లోచనముల నమరువరప్రదమదీయదివ్యరూపములం జూచుచు స్పృహణీయము లగువచనముల వచించుచు మదీయము లగునుదారవిలాసహాసావలోకనభాషితములకుఁ దుర్లభము లగురూపముల నాహృతమనః ప్రాణులై సుఖింతురుగాని భక్తి వారు గోరకున్నను వారికి ముక్తిం గావించు. అవిద్యానివృత్తిం బైనపిదప సత్యలోకాదులఁ దనరుచుణిమాద్యష్టైశ్వర్యములవెంబడిఁ దాము గోరకున్న వైకుంఠలోకము వారధిగమింతురు. నాభక్తులు శాంతరూప మగునావైకుంఠమున శోకప్పాదుం జెడరు. ప్రియుఁడని యాత్ముఁడని పుత్త్రునిరీతి స్నేహవిషయుఁడని సఖునిరీతి విశ్వాసార్హుఁడని గురువుచాడ్పున హితముబోధించువాఁడని సుహృదుని మాడ్కిహితకారియని యిష్టదైవమట్లు పూజనీయుఁడని నన్నాశ్రయించినవారిం గాలచక్రం బెనియుగ్రసింపనేరదు. ఈలోకము నాలోకము సుఖ

యానువర్తనంబు లైన దారపుత్త్రసఖగృహాదులను వర్జించి విశ్వతోముఖుం డగు నన్ననన్యభక్తియోగమున భజించువారికి సంసారతరణంబుం గూర్చెద. ప్రధానపురుషేశ్వరుండ నైన నావలనం దక్క నొండొక్కని వలన సర్వభూతములకుం దీవ్రభయము నివర్తింపదు. నాకు వెఱచి వాయువు వీచు. సూర్యుండు గెండగాయు. ఇంద్రుండు వాన గురియు. అగ్ని దహించు. మృత్యువు నిజకృత్యమునం బ్రవర్తించు. యోగులు జ్ఞానవైరాగ్యసహకృత మగుభక్తియోగమున క్షేమార్థం బకుతోభయం బైన మదీయపాదమూలముం బ్రవేశింతురు. తీవ్ర మగుభక్తియోగమున నాపైఁ జిత్తము స్థిరము గావించు టనునింతమాత్రంబు పురుషులకుం బరమపురుషార్థోదయంబు.

## కపిలుఁడు దేవహూతికిఁ దత్త్వలక్షణము చెప్పుట

తల్లీ, తత్త్వంబులలక్షణంబు వేఱువేఱ వివరించెద. దాని విన్న నరుండు ప్రాకృతగుణముక్తిం బడయును. హృదయగ్రంథిభేదనంబై నిశ్శ్రేయస మొదవించు నాత్మదర్శనరూపజ్ఞానంబును దత్త్వజ్ఞానంబున నుదయించుం గావున దాని నీకుం దేటపఱిచెద. వినుము. ప్రత్యక్ప్రకాశుండు జన్మాదిరహితుండు ప్రకృతికిం బరుండైనయనఘుండు నిర్గుణుండు జ్ఞానవిషయత్వజ్ఞానాధారత్వములను స్వగతచ్ఛేదశూన్యుండు గాని స్వయంజ్యోతి విశ్వప్రకాశకుండు నగునాత్ముండే పురుషుం డనంబడు. ఆతండు దేహాద్యుపాధిసహకారమునం దద్ధర్మము లగుజన్మమరణాదులం బొందునట్లు స్వప్నమునం దత్తద్విషయములంబోలె మిథ్యావలంభమునం దోఁపం జేయుచు వస్తుగతిం బరికింప జన్మమరణాదులం బొందఁడు. అప్పురుషుండు సూక్ష్మము గుణమయము విష్ణుశక్తియు నగుమాయను లీలావశమున యాదృచ్ఛిక భగవత్సంకల్పమునం దనుఁ జేరినదాని గుణసంసర్గమున సమానరూపవిచిత్రప్రజాసృష్టి సేయుదానిం బొంది యాత్మజ్ఞానము నావరించుదానితగులంబునం దన్ను మఱచి ప్రకృత్యధ్యాసమునం జేసి ప్రకృతిగుణక్రియమాణకర్మములం దాను గర్త యని తలంచు. అట్టితలంపే యకర్తయు స్వతంత్రుండును సాక్షియు సుఖాత్ముండు నగునాత్మునకు సంసారమును బంధమును దత్కృతపరతంత్రత్వంబు నయ్యెడు. కార్యకారణకర్తృత్వమునం బురుషునకుఁ బ్రకృతి కారణం బనియు సుఖదుఃఖభోక్తృత్వమునం

ప్రకృతికిఁ బరుండైనపురుషుఁడు కారణం బనియుఁ బెద్దలు దలంతు రనిన విని దేవహూతి యయ్యా, సంసారిపురుషునిఁ దద్ధేతు వగుప్రకృతిని నెఱింగితి. నీజగమునం గలిస్థూలసూక్ష్మరూపకార్యములకుఁ గారణం బగు నీశ్వరునకుఁ దదాశ్రిత యగుప్రకృతికిని లక్షణం బెయ్యది యనియడుగఁ కపిలుం డిట్లనియె. తాను నిర్విశేషమయ్యు విశేషముల కాశ్రయంబై గుణత్రయసమన్వితంబై యవ్యక్తంబై కార్యకారణరూపంబై నిత్యం బైనప్రధానమే ప్రకృతి యనంబడు. ఐదు మరియైదు పది నాలు గనఁ జతుర్వింశతిసంఖ్యావిశిష్టం బైనగణము ప్రధానకార్యం బని బ్రహ్మాదులు పలుకుదురు. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లనుమహాభూతంబు లైదు గంధాదు లగుతన్మాత్రంబు లైదు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థనామకంబు లైనయింద్రియములు పది లక్షణరూప మగువృత్తివలన మనోబుద్ధ్యహంకారచిత్తంబు లనఁ జతుర్విధంబు లైనయంతఃకరణవృత్తులు నాలుగును బూర్వోక్తచతుర్వింశతిగణం బయ్యెడు. ఇయ్యదియే సగుణబ్రహ్మసన్నివేశసంఖ్యానంబు. కాలమును బ్రకృత్యవస్థావిశేషం బని తలంచి కొందఱు దాని నిరువదేనవదానిఁగా గణింతురు. ప్రకృతికిఁ జిక్కి యహంకారవిమూఢుఁడై తానే కర్తయని భావించికొనువానికి భయముఁ గలిగించుకాల మీశ్వరుని ప్రభావం బని కొందఱు దలంతురు. గుణసామ్యంబై నిర్విశేషం బైన ప్రకృతిచేష్టల కెవ్వండు కారణం బగు నాభగవంతుఁడే కాల మని యెన్నఁబడు. భగవంతుఁ డాత్మమాయాయోగమునం బురుషరూపమున లోపలను గాలరూపమున వెలుపలను దత్త్వములలో సమన్వితుండై యుండెడు. అప్పరమపురుషుఁడు దైవమున గుణక్షోభం బెనసి సర్వాభివ్యక్తిస్థానం బైనప్రకృతియందుఁ దనచిచ్ఛక్తి నావేశింపఁ జేసినం బ్రకృతి ప్రకాశబహుళం బైనమహత్తత్త్వమును సృజించె. అయ్యది లయవిక్షేపశూన్యంబై జగదంకురకారణంబై సూక్ష్మరూపమునం దనలో నున్న యీవిశ్వమును బ్రకటింపఁ జేయుచుఁ బూర్వప్రళయమునఁ దనకుఁ బ్రకృతిలో లయముఁ గావించినప్రళయకాలికతమంబు నిజతేజంబునం ద్రావె. సత్త్వగుణంబై స్వచ్ఛంబై రాగాదిరహితంబై భగవదుపలబ్ధిస్థానంబై యుపాస్యరూపవాసుదేవవ్యూహసమన్వితం బైనచిత్తము మహత్తత్త్వ

త్తకంబు. ఫేనతరంగాదిరహితజలమునకు మాధుర్యనైర్మల్యశీతలత్వము
లెట్టు లట్టులు చిత్తమునకు వృత్తిభేదనిమిత్తమునం జేసి స్వచ్ఛత్వావి
కారిత్వము శాంతత్వ మనులక్షణంబులు గలవు. భగవద్వీర్యచోదితంబై
వికృతిం బొందుమహత్తత్త్వమువలన రజోగుణోద్రిక్తం బైనయహం
కారము మనస్సున కింద్రియములకు మహాభూతములకు నుత్పత్తికార
ణంబై వైకారికము తైజసము తామస మనం ద్రివిధంబై పుట్టె.
అయ్యహంకారము సహస్రశీర్షంబై యనంతపదవాచ్యం బైనసంకర్షణుం
డధిష్ఠింప నెసఁగి దేవతారూపమునం గర్తృత్వంబు నింద్రియరూపమునం
గరణత్వంబు భూతరూపమునం గార్యత్వంబును దనకు లక్షణంబులై
యొప్పు సత్త్వరజస్తమోగుణానుసారమునం గ్రమమున శాంతత్వఘోరత్వ
మూఢత్వములం బొందు. అందు వైకారికాహంకారంబువలన సంకల్ప
వికల్పములం గామవృత్తి లక్షణంబుగా నొప్పుమనస్తత్త్వము జనించె.
అయ్యది శారదేందీవరశ్యాముండై యింద్రియాధీశ్వరుండై యోగిసము
పాస్యం బైనయనిరుద్ధునిచే నధిష్ఠితం బగు. తైజసాహంకారమువలనం
బృథివ్యాదిద్రవ్యముల బాహ్యస్ఫురణరూప మగువిజ్ఞానమునకుం గార
ణంబై యింద్రియానుగ్రాహకం బైనబుద్ధితత్త్వ ముదయించె. సంశ
యము విపర్యయము నిశ్చయము స్మృతి స్వాప మనంగ వృత్తిభేదమునం
జేసి బుద్ధికి లక్షణంబు లయ్యెడు. ప్రాణసంబంధి క్రియాశక్తియు
బుద్ధిసంబంధివిజ్ఞానశక్తియుం గలుగుకతనం దైజసము లగుప్రాణబుద్ధుల
సమన్వయమునం జేసి జ్ఞానకర్మేంద్రియములు పదియుం దైజసంబులే యని
యెఱుంగవలయు. భగవద్వీర్యచోదితం బైనతామసాహంకారమున
శబ్దతన్మాత్రంబు జనించె. దాన నాకాశంబు గలిగె. శబ్దము శ్రోత్ర
గ్రాహ్య మయ్యెడు. అర్థముల బోధించుట వ్యవహితవస్తువులం దెలు
పుట నభస్తన్మాత్రత్వం బనునివి శబ్దలక్షణంబులు. భూతముల కవకా
శముం గల్పించి బహిరంతర్వ్యవహారము గూర్చుట ప్రాణేంద్రియమనస్సు
లకు స్థానంబై నాడ్యాదిచ్ఛిద్రరూపమున వర్తించుట యనునివి
యాకాశమునకు లక్షణంబులు. శబ్దతన్మాత్రకం బైనయాకాశమువలనం
గాలగతిం జేసి స్పర్శతన్మాత్రంబును దానవాయువు నుద్భవించె. స్పర్శము
త్వగ్గ్రాహ్యం బయ్యెడు మృదుత్వము కఠినత్వము శీతత్వ ముష్ణత్వము

ఖాయుతన్మాత్రత్వ మనునివి స్పర్శలక్షణంబులు. చాలనము మేళనము సంయోగము ద్రవ్యశబ్దనయనము సర్వేంద్రియోపాద్బలకత్వము వాయుతన్మాత్రత్వ మనునివి వాయులక్షణంబులు. స్పర్శతన్మాత్రకం బైన వాయువువలన దైవప్రేరణంజేసి రూపతన్మాత్రంబును దానం దేజస్సును జనించె. రూపంబు చక్షుర్గ్రాహ్యం బయ్యెడు. ద్రవ్యాకృతిత్వము ద్రవ్యోపసర్జనత్వము ద్రవ్యపరిణామప్రతీతి తేజస్తన్మాత్రత్వమనునివి రూపతన్మాత్రలక్షణంబులు. ప్రకాశనము పచనము పానము భక్షణము హిమమర్దనము శోషణము క్షుత్పిపాస లనునివి తేజోలక్షణంబులు; రూపతన్మాత్రకం బైనతేజస్సువలన దైవచోదనంజేసి రసతన్మాత్రంబును దానం నంభస్సును సంభూతం బయ్యె. రసము జిహ్వాగ్రాహ్యం బయ్యెడు. భౌతికద్రవ్యసంసర్గమునం జేసి రసము దా నొక్కండయ్యు మధురామ్లలవణకటుకకషాయతిక్తభేదమున షడ్విధంబయ్యె. ఆర్ద్రీకరణము పిండీకరణము తృప్తికల్పనము జీవన మాప్యాయనము మృదూకరణము తాపాపనోదనము బహుళీభవన మనునివి జలలక్షణంబులు. రసతన్మాత్రకం బైనయంభస్సువలన దైవచోదనంజేసి గంధతన్మాత్రంబును దానం బృథివియుం బుట్టె. గంధము ఘ్రాణగ్రాహ్యం బయ్యెడు. గంధ మొక్కండయ్యు సంసర్గిద్రవ్యభేదమునం జేసి మిశ్రగంధము దుర్గంధము సురభిగంధము శాంతగంధ ముగ్రగంధ మామ్లగంధ మన షట్ప్రకారంబయ్యె. దేవతాప్రతిమాదిరూపమున నాకారిత్వోపాదనము స్థితియాథారత్వ మాకాశావ్యవచ్ఛేదకత్వము సర్వప్రాణిగుణప్రకటీకరణ మనునివి పృథివీలక్షణంబులు. నభోగుణం బైనశబ్దముం గ్రహించునది శ్రోత్రంబనియు వాయుగుణం బైనస్పర్శముం గ్రహించునది త్వక్కనియుం దేజోగుణం బైనరూపముం గ్రహించునది చక్షుస్సనియు నంభోగుణం బైన రసముం గ్రహించునది జిహ్వ యనియుం బృథివీగుణం బైనగంధముం గ్రహించునది ఘ్రాణం బనియుం జెప్పంబడు. పూర్వాపూర్వభూతముల కుత్తరోత్తరభూతములలో సమన్వయము గలిమిం జేసి పూర్వాపూర్వభూతగుణము లుత్తరోత్తరభూతములలో నన్వయించినం బృథివికి శబ్దస్పర్శరూపరసగంధము లైదు నాకాశేతరముల కొక్కొక్కటి తక్కువగాం దమలో నన్వయించినభూతములగుణములు సంభవమాత్రమునను బరా

స్వరూపము లేమిం జేసి యాకాశమునకు శబ్దగుణ మొక్కండును నొప్పి యుండెను మహదాదికంబు లైనయీయేడు పదార్థసంసర్గముంగ దేవ పురుషాధారంబై భోగాయతనం బైనయండకోశము సృజింపఁ జాల కుండుటయు జగదాది యైనయీశ్వరుఁడు కాలకర్మగుణోపేతుండై తాను బ్రవేశించె. ఈశ్వరానుప్రవేశమునం జేసి మహదాదులు గూడిన సధిష్ఠాతృచేతనసహితం బైనయండ ముద్భవించె. అందే సమష్టిరూపుఁ డగువిరాణ్మూర్తి యావిర్భవించె. విశేషాఖ్య మగునీయండ ముత్తరోత్తర దశగుణాధికంబు లైనజలాద్యావరణములలోపలను బ్రధానావరణమున వెలుపలను నావృతం బయ్యె. అందే లోకవిస్తారరూపం బైనభగవంతుని రూపంబు చూపట్టెడు. సలిలాంతర్గతం బైనయాహిరణ్మయాండకోశము నుండి లేచి యప్పురుషుఁడు దాని నావేశించి బహువిధముల నింద్రియచ్ఛిద్రములఁ గావించె నెట్లంటేని, తొలుత నాపురుషునకు ముఖము నిర్గతం బైనం దోడన వాణియు వహ్నియు నుదయించె. అట నాసికంబులును ఘ్రాణమున ననుస్యూతం బైనఘ్రాణంబును వాయువును, పిదప నక్షిగోళకంబులు నందుఁ జక్షుస్సును సూర్యుండును, పదంపడి కర్ణములు నందు శ్రోత్రంబును దిక్కులు, ననంతరంబు త్వక్కును రోమశ్మశ్ర్వాదులు నోషధులు నంతఁ బురుషాంగ ముపస్థేంద్రియము నుదకములు, నావల గుదము పాయ్వింద్రియమును మృత్యువు, నావెనుక హస్తములు పాణీంద్రియంబైనబలము నింద్రుఁడు, నాపిమ్మటఁ బాదములు గతియు నుపేంద్రుఁడు, నాభిఁద నాడులు లోహితము నదులు, నాపిఱుంద నుదరము క్షుత్పిపాసలును సముద్రంబులునుం బ్రభవించె. అట నతనిహృదయ మేర్పడుటయు నందు మనస్సును జంద్రుఁడును బుద్ధియు బ్రహ్మయు నహంకారంబును రుద్రుండును జిత్తంబును క్షేత్రజ్ఞుండునుం గలుగుటయు నీసమవాయంబెల్ల నయ్యండమునకుఁ బ్రవృత్త్యున్ముఖత్వముఁ గలిగింపఁ గడంగి యగ్ని వాక్కుతో ముఖమును వాయువు ఘ్రాణముతో నాసికంబును సూర్యుఁడు చక్షుస్సుతో నక్షిగోళకంబులను దిక్కులు శ్రోత్రముతోఁ గర్ణముల నోషధులు రోమములతోఁ ద్వక్కును జలము లుపస్థేంద్రియముతోఁ బురుషాంగములు మృత్యువు పాయ్వింద్రియముతో గుదంబు నుపేంద్రుఁడు గతితోఁ జరణంబుల నింద్రుఁడు బలముతో

హస్తములను నదులు లోహితముతో నాడులను సముద్రములు క్షుత్పిపాసలతో నుదరమును జంద్రుఁడు మనస్సుతోడను బ్రహ్మ బుద్ధితోడను రుద్రుఁ డహంకారముతోడను హృదయముం జొచ్చి చేయం గలయంతయుం జేసిన నయ్యండము ప్రవృత్త్యున్ముఖంబు గాకుండె. అట్టియెడ క్షేత్రజ్ఞుఁడు చిత్తముతో హృదయముఁ బ్రవేశించుటయు నాసలిలమునుండి లేచి యయ్యండము ప్రవృత్తిక్షమం బయ్యె. ప్రాణేంద్రియమనోబుద్ధు లన్నియుం గూడియుఁ దమబలమెల్లఁజూపియు నేపురుషునితాదాత్మ్యాధ్యాసంబుఁ గానకనిద్రవోవువానింబోలె నయ్యండమును లేపఁ జాలకుండె నట్టిపరమపురుషుని భక్తివిరక్తిప్రవృత్తంబైన యేకాగ్రచిత్తమునందు జ్ఞానముచేఁ గార్యకారణసంఘాతవివేచన పూర్వకంబుగఁ జింతింపవలయు.

### కపిలుఁడు దేవహూతికిఁ బ్రకృతిపురుషవివేకంబు చెప్పుట

పురుషుఁడు ప్రకృతిస్థుఁడయ్యు నిర్గుణుఁడు గాన నకర్తయుఁ దాన నిర్వికారుఁడు గావున నీటఁ బ్రతిఫలించియు సూర్యుఁడు తజ్జలసంబంధము గాంచనివిధమునఁ బ్రకృతిగుణము లగుసుఖదుఃఖాదులలేపముం బొరయఁడు. అతం డవిద్యాగుణము లగుసత్త్వాదులయెడఁ దాదాత్మ్యాధ్యాసంబుఁ గాంచునేని యహంకారవిమూఢాత్ముఁడై యేను గర్తనని యభిమానించు. దానం బ్రకృతిసంగకృతము లగుధర్మాధర్మములకును రాగద్వేషాదిదోషములకుం దవిలి యుత్తమమధ్యమాధమము లగుదేవమనుష్యతిర్యగ్జన్మంబు లెత్తి మనమునం గర్మాధీనసుఖదుఃఖములం గుడుచుచు నిత్యసుఖముఁ గానక సంసారమార్గమునం బరిభ్రమించు. స్వప్నమున ననర్థాగమంబువోలె వాస్తవార్థంబు లేకున్నను విషయముల నెల్లప్పుడును జింతించుచుండిన నతనికి సంసారంబు నివర్తింపదు. కావున నింద్రియమార్గప్రసక్తం బైనమనస్సును నిరంతరాయ మగుభక్తియోగమున భగవద్ధ్యానంబునకుఁ జొనుపవలయు. యమనియమాదియోగమార్గము లభ్యసించుచు శ్రద్ధగలిగి నాపైఁ దాత్పర్యమునను సత్యవచనమునను మత్కథాశ్రవణమునను సర్వభూత సామ్యమునను నిర్వైరంబునను సంగత్యాగంబునను బ్రహ్మచర్యంబునను మౌనమునను మదర్పితం బగుస్వధర్మానుష్ఠానమునను యదృచ్ఛాలబ్ధసంతుష్టుండై మితభోజనుండై

మునివ్రతుండై వివిక్తదేశనివాసుండై శాంతుండై మైత్రుండై కారుణికుండై యాత్మవంతుండై దేహగేహాదులయెడ నహంతామమతల బరిత్యజించి ప్రకృతిపురుషవివేచకం బైనజ్ఞానంబున జాగ్రదాద్యవస్థలం బాసి యన్యదర్శనములనెల్ల దవ్వునం ద్రోచి చక్షురవచ్ఛిన్నుం డగుసూర్యునిచే నాకాశస్థితుం డైనసూర్యుం గాంచుచందముననహంకారావచ్ఛిన్నుం డగునాత్మునిచే శుద్ధాత్ముం గాంచి యాత్మదర్శనుండై నిరుపాధికంబు మిథ్యాభూత మగునహంకారమునందు సద్రూపమున నవభాసమానంబు ప్రధానమున కధిష్ఠానంబు కార్యప్రకాశకంబు కార్యకారణానుస్యూతంబు పరిపూర్ణంబు నగుబ్రహ్మంబు నరుండు వొందెడు. గగనమున నుండుసూర్యుండు జలమునందుం బ్రతిబింబితుండై తన్మూలమున గృహము గోడలమీందనుం బ్రతిఫలించునపు డాగృహమున నుండువారు దొలుతం గుడ్యబింబితసూర్యునిం దన్మూలమున నట నీటం బ్రతిఫలించినవాని నామీంద నాకాశస్థితుని లక్షించుతెఱంగునం ద్రిగుణంబైనయహంకారము భూతేంద్రియమనోమయంబు లైనయాత్మప్రతిబింబములచే బ్రహ్మాభాసోపలక్షితం బై పరమాత్మజ్ఞానంబునకుం జాలియుండెడు. అప్పరమాత్ముండు సుషుప్తికాలమున భూతసూక్ష్మేంద్రియమనోబుద్ధ్యాదులు లయించి యసత్ప్రాయంబు లగునెడ వినిద్రుండు నిరహంకారుండునై వెలయుచుండెడు. అట్టిసుషుప్తిసమయంబున జీవుండు తొల్లి దాను దేహాదులకు ద్రష్ట యని ప్రతీతిం జెందినవాండు గావున నప్పుడు విషయములతో నహంకారము లయించుటయు నష్టధనుం డైనయాతురుండు దానే నశించినట్లు తలంచుచందమునం దాను వాస్తవముగ నశింపకుండియు నహంకారనాశనిమిత్తమున మృషావ్యవహారంబుగాం దాను నశించునట్లు తలంచు. ఇట్టిమిథ్యాభిమానములకుం గారణంబైనప్రకృతిని గార్యకారణసంఘాతమునకుం బ్రకాశకుండై యధిష్ఠానంబైనపురుషుని వివేకపూర్వకంబుగ విచారించి పరమాత్ముం బ్రాపింపవలయు నని చెప్పిన విని దేవహూతి యిట్లనియె. బ్రహ్మర్షివర్యా, పురుషుండు లేకుండినం బ్రకృతికి స్వరూపలాభము గలుగమిం జేసి ప్రకృతికిం బురుషాపేక్షయుం బ్రకృతి లేకుండినం బురుషున కభివ్యక్తి గలుగమిం జేసి పురుషునకుం బ్రకృత్యపేక్షయు ననునీవిధంబునం బ్రకృతి

పురుషుల కన్యోన్యాశ్రయంబును నిత్యత్వంబును దోఁచుచుండెడు, కావునఁ బ్రకృతి పురుషు నొకప్పుడేనియు విడువకుండెడు. మఱియు గంధమునకుఁ బృథివికిని రసమునకు జలములకు నెట్లట్లు ప్రకృతికిని బురుషునకును వ్యతిరేకస్థితి గానరాదు, అకర్తయగు పురుషునకు యదాశ్రయంబై యీకర్మబంధము ప్రవర్తిల్లు నాప్రకృతిగుణము లుండఁగ వానియెడ నప్పురుషునకు విముక్తత్వంబును కైవల్యంబు నెట్లు గలుగు! వెండియు నొకప్పుడు తత్త్వవిమర్శమున సంసారభయము నివర్తించినట్లు దోఁచినం దన్నిమిత్తమగు ప్రకృతిసంబంధముండుటం జేసి యా సంసారబంధము గ్రమ్మఱఁ దనంత నాపాదింపకుండునే యని యడిగిన దేవహూతికిఁ గపిలాచార్యుఁ డిట్లనియె.

## తత్త్వజ్ఞానమున ముక్తి గల్గు నని కపిలుఁడు దేవహూతికిఁ జెప్పుట

తల్లీ, సాధనసంపత్తి చాలనిచో బంధము గ్రమ్మఱఁ దోఁచుఁగాని సాధనసామగ్రి లెస్స యలవడునేని తత్త్వవివేకికిఁ బ్రకృతిబంధము గ్రమ్మఱఁ గలుగనేరదు; తత్ప్రకారం బాకర్ణింపుము. ఫలాపేక్ష విడిచి వర్ణాశ్రమోచితంబుగా నాచరించిన విహితస్వధర్మానుష్ఠానమునం బరిశుద్ధమైనమనస్సున మదీయకథానిరంతరశ్రవణమున నిరంతరాయముగఁ జిరకాలంబు వర్ధిల్లిన తీవ్రభక్తియోగమునను బ్రకృతిపురుషవివేకమునఁ దనరిన జ్ఞానమునను గాఢవైరాగ్యమునను దపోయుక్తమైన యోగమునను దీవ్ర మగునాత్మసమాధియోగమున నరణిసంభూతం బైనయగ్నిచే నయ్యరణి దగ్ధ మగువిధమునఁ బురుషునకు బంధముఁ గావించు ప్రకృతి నిత్యదగ్ధంబై తనంత నంతర్ధానంబుఁ జెందెడు. భుక్తభోగంబై నిత్యదోషదర్శనమునఁ బరిత్యక్తంబై ప్రకృతి స్వతంత్రుఁడు స్వానందనిష్ఠుఁడు నగునాత్మునకుఁ గ్రమ్మఱ బంధముఁ గావింపఁ జాలదు. నిద్రించువారికి స్వప్నమునఁ దోఁచుశిరశ్ఛేదాదు లనర్థకరములై యుండిన నయ్యవియే యట మేలుకొన్నవాని కట్టివి గానివిధమున నబోధవంతునకుఁ బ్రకృతిదోషము బంధకారణం బైనను సాధనసామగ్రీసంభృతం బైన ప్రబోధము గలిగి ప్రకృతిపురుషతత్త్వము లెస్స విమర్శించి నాపై మనస్సు చేర్చి యాత్మారాముఁ డైనయుక్తమునకుఁ బ్రకృతి బంధ మొకప్పుడేనియుఁ గలిగింపదు, బహుజన్మంబులు గడచినం గ్రమంబునం

గర్మవాసనావశమునఁ జిత్తశుద్ధి వడసి యథార్థాత్మరతుండై బ్రహ్మలోకము దాఁక నన్నియు ననిత్యములేగాని నిత్య మొక్కటియుం గా దను తలంపున నన్నింటియెడ విరక్తుండై మునియై మదీయప్రసాదమున విదిత వేదితవ్యుం డైనమహాత్ముం డాత్మజ్ఞానమున మిథ్యాజ్ఞానము లెల్ల నిరసించి ధీరుండై లింగశరీరక్షపణానంతరము యోగులు దేనిం బొంది పునరావృత్తిం గాంచ రట్టినిరతిశయానందరూపంబై కైవల్యపదవాచ్యంబై మదాశ్రయంబై పరమపురుషార్థరూపంబైన స్వస్వరూపముం బ్రాపించు. యోగసిద్ధుండు యోగలబ్ధంబు లైనయణిమాదిమాయలందు మనస్సు చేర్పండేని మృత్యుగర్వప్రసక్తికవకాశంబు లేనియాత్యంతికమగుమదీయ గతి నధిగమించు. ఇయ్యది తత్త్వజ్ఞానమున ముక్తిం బ్రాపించువిధంబు.

## కపిలుండు దేవహూతి కష్టాంగయోగముఁ జెప్పుట

దేని నలవరించినం జిత్తంబు ప్రసన్నంబై సత్పథంబునం బ్రవర్తించు నట్టిసాలంబనయోగము సలక్షణంబుగా వివరించెద విను మనికపిలుండు దేవహూతికి వెండియు నిట్లనియె. శక్తికొలంది స్వధర్మము నాచరించుట, విధర్మము విడుచుట, దైవమునలభించినదానికిసంతోషించుట, యాత్మవిదుల నర్చించుట, త్రివర్గధర్మనివృత్తి, మోక్షధర్మాసక్తి, మితము శుద్ధము నగు నాహారము భుజించుట, విజనమై నిరుపద్రవ మగు దేశమునాశ్రయించుట, యహింస, సత్య, మస్తేయము, వలసినంతమాత్రము పరిగ్రహించుట, బ్రహ్మచర్యము, తపస్సు, శౌచము, స్వాధ్యాయము, భగవదారాధనము, మౌనము, సదాసనజయమున స్థైర్యము, మెల్లనఁ బ్రాణవాయు వశీక

ణము, మనస్సున నింద్రియముల విషయములం బాఱనీక గుదియి... హృదయమున నిలుపుట, మూలాధారము మున్నగుస్థానములలో నొ... చోటఁ బ్రాణమును మనస్సుతోడ ధరించుట, హరిలీలానుచింతనము, చిత్తైకాగ్రీకరణము ననువాని మఱియు దానాదు లగునుపాయముల నవలంబించి యింద్రియార్థములయెడ నాసక్తిగలిగి దుష్టంబై యపథం బునం బోవుమనస్సును జితప్రాణుండై యనలసుండై బుద్ధిచే సత్... మునం జొనుపవలయు. తత్ప్రకారంబు వివరించెద వినుము. శుచి ప్రదేశమునం గుశాజినచేలోత్తరంబుగా నాసనం బేర్పఱిచి విజి...

నుండై స్వస్తికాసనమునం గూర్చుండి యకుటిలకాయుండై ప్రణవము నభ్యసింపవలయు. పూరకకుంభకరేచకంబులను రేచకకుంభకపూరకంబులను జిత్తము స్వార్థమందు సుస్థిరంబై క్రమ్మఱ జలింపనివిధంబునం బ్రాణమార్గంబు శోధింపవలయు. పుటపాకతప్తం బైన లోహము వాయ్వగ్నుల నిర్మలం బగుతెఱంగున శ్వాసజయమున మనస్సు నిర్మలం బగు. ప్రాణయామముల వాతపిత్తశ్లేష్మాదిదోషములను ధారణలం గిల్బిషములను బ్రత్యాహారముల విషయసంసర్గములను ధ్యానమున రాగాదులను హరింపవలయు. మనస్సున యోగాభ్యాసమున సుస్థిరంబై యెప్పుడు నిర్మలం బగు నప్పుడు దననాసికాగ్రంబె గుఱిసేయుచు భగవన్మూర్తిని ధ్యానింపవలయు. ప్రసన్నవదనారవిందము, దామరఱేకులకు సాటి వచ్చుకన్నుదోయి, కలువచాయకు దీటగునల్లనికాంతి, శంఖచక్రగదాపరిష్కారంబు, పద్మకింజల్కరుచిఁ గొల్చుపీతాంబరంబు, శ్రీవత్సలాంఛనం బైనయురస్థలంబు, కౌస్తుభోజ్జ్వలంబై మత్తమధుకరపరివృతవనమాల నుల్లసిల్లుకంధరంబు, హారవలయకిరీటాంగదనూపురాదివిభూషణమణిగణకిరణప్రసరణంబు కాంచీగుణోల్లసితశ్రోణితటంబునుం గ్రాల నత్యంతదర్శనీయుండై మనోనయనానందకరుండై భక్తమానసావాసుండై పరమశాంతుఁడై యతిసుందరభక్తదర్శనుండై సర్వలోకనమస్కృతుండై తారుణ్యస్థితుఁడై కీర్తనీయ పవిత్రకీర్తియై పుణ్యశ్లోకులకు యశస్కరుండై భక్తానుగ్రహవ్యగ్రుం డైనపురుషోత్తముని సమగ్రాంగములతో నిల్చున్నవిధముననొండె నడచుచున్నరీతినొండెఁ గూర్చున్నక్రమముననొండె శయనించినమాడ్కినొండె శుద్ధచిత్తమున ధ్యానించుచుఁ బ్రేక్షణీయవిలాసుఁ డైనయాగుహాశయునిపై మనస్సు చలింపకుండునట్లు నిలుపవలయు. అద్దేవదేవునిపై మనస్సు సుస్థిరం బగుదు మున తదీయసర్వాంగసంగతం బైనయామనస్సు నొక్కొకయంగమునయిం గ్రమంబునఁ బదిలపఱుపవలయు. నెట్లంటేని వజ్రాంకుశపద్మపతాకాదిరేఖాలాంఛితంబై యరుణనఖరప్రభావిధూతహృదయాంధకారంబై నిజశౌచమునం బాలుగంగానదిం దాల్చినశివునకు శివనామంబు గలిగింపఁ జాలి పరమపావనంబై ధ్యానపరులమనోమలినంబు లనుగిరుల విదళింప వజ్రాయుధంబై యుల్లసిల్లు

భగవంతుని చరణారవిందముఁ దొలుత హృదయమున ధ్యానింపవలయు. అట్టి క్రమంబున బ్రహ్మదేవునకుఁ దల్లియై సర్వలోకవందనములం గాంచిన శ్రీదేవి తనతొడలపై నిడికొని మెల్ల మెల్లన నిజకరపల్లవముల నొత్తిలాలింప సొంపారుజానుద్వయంబును, గరుత్మంతునిభుజములమీఁద నొప్పారు ప్రకాశ మయముల నలరునతసీకుసుమశ్యామంబు లగునూరువులను, వ్యాలంబి పీతాంబరముపై మించు కాంచీకలాపమున నొప్పునితంబబింబంబును, బ్రహ్మ వాసం బైనలోకాత్మకపద్మమున కుత్పత్తిస్థానం బైననాభిహ్రదం బును, మరకతసచ్ఛాయంబై విశదహారమరీచిగౌరం బైన స్తనద్వయం బును, మహాలక్ష్మీనివాసంబై మనోనయనములకు సుఖముఁ గొల్పు వక్షస్థలంబును, గౌస్తుభమణిభూషితం బైనకంఠంబును, మందరగిరి యొరపిడిం గడు నడరి లోకపాలురకుఁ బ్రాపైన భుజచతుష్టయంబు, నందుఁ దేజరిల్లునసహ్యతేజశ్చక్రం బైనచక్రంబును, దదీయకరసరోజ మున రాజహంససదృశంబై యొప్పుశంఖంబు, నరాతిరుధిరకర్దమలిప్తం బైనకౌమోదకిని, మధురమధుపగానబంధురం బైనవనమాలికను, జీవ తత్త్వరూపం బైనకౌస్తుభరత్నంబును, మణిమకరకుండలకాంతు లమల కపోలతలములం బర్వనేత్రపర్వంబై యుదారనాసావిలాసంబై మీన సమలోచనద్వయాభిరామంబై మందహాససుందరంబై భ్రూవిలాసభాసు రంబై కుటిలకుంతలదంతురంబై శ్రీనికేతనం బైనపద్మము నాత్మప్రభా విభవమునం దెగడుచు నళికులపరీతం బైనయాభక్తానుకంపాగృహీత మూర్తివదనారవిందమును, భక్తతాపత్రయశమనార్థంబు సారింపఁబడి పరమప్రసాదప్రదం బైనస్మేరవిలోకనంబును, బ్రణతలోకశోకాశ్రుసాగర శోషణం బైనహాసంబును, మునులతదర్థంబు మకరధ్వజునకు సమ్మోహ నంబుఁ గావింప విరచితంబైన యుదారభ్రూమండలంబు, నధరప్రభారుణ దంతధవళిమోజ్జ్వలంబై ధ్యానాయనం బైనప్రహాసంబును వేఱువేఱ ధ్యానించుచుఁ దనదేహమున నెలకొనియుండు నాహరిపై నత్యంతభక్తి పారమ్యమున నొండొక్కఁడానిం గనుంగొనఁ దలంపరాదు. ఇవ్విధమునం దీవ్రభక్తియోగమున హరిపై భావంబుఁ గొన్న యతఁడు పరమానంద మున బాష్పరోమాంచకంచుకితగాత్రుండై భగవదేకతానసంస్థి యగుచు ధ్యానసాధనం బైనమనస్సు ధ్యేయమునుండి తనంతన తొలంగు,

శ్రయవిషయము నశించినన్మహాభూతరూపమునఁ బరిణమించు తేజస్సు
చేత మనస్సు నిర్విషయంబై ముక్తాశ్రయంబై విరక్తంబై లయించి
బ్రహ్మాకారమునఁ బరిణమించిన నట్టియెడ యోగి దేహాద్యుపాధిరహి
తుండు గావున ధ్యాతృధ్యేయవిభాగశూన్యంబై యఖండితంబై యను
గతంబైనయాత్మస్వరూపముం గాంచు. అతండు పునరావృత్తిరహితం
బైన యామనోనివృత్తిం జేసి సుఖదుఃఖబాహ్యం బైననిజబ్రహ్మమహిమ
మున నిష్ఠఁగాంచి యపరోక్షీకృతాత్మతత్త్వుండై సుఖదుఃఖభోక్తృత్వ
మవిద్యాకృత మగునహంకారమునకే గాక తనకుఁ గలుగ దని నిశ్చ
యించు. మఱియుఁ గల్లు ద్రావినవాఁడు దనమీఁదివస్త్రము దైవవశ
మున నుండినం బోయిన నెఱుంగని తెఱంగున నమ్మహానుభావుఁడు దనకు
స్వరూపప్రాప్త్యుపాయం బైనయోగ మనుష్ఠింప సాధనం బైనదేహ
ముండినం బోయినను దానిం దలపోయఁడు. అట్టిజీవన్ముక్తుని దేహము
దనకుఁ బ్రారంభక మగుకర్మముండునంతకు నింద్రియములతోడ నుండి
ప్రారబ్ధకర్మక్షయం బగుడు నశించు. ఆత్మతత్త్వవిదుఁ డగునాజీవన్ము
క్తుఁడు సమాధియోగము నధిరోహించినవాఁడు గావున స్వప్నదేహ
తుల్య మగునా దేహముం గ్రమ్మఱం గ్రహింపఁడు. అత్యంతప్రీతివిశేష
మున నాత్మాభిమానభాజనం బైనపుత్త్రాదులకంటెఁ దాను లాఁతి
యగువిధమున దేహముకంటె నాత్ముఁడు పరుండు. కొఱవికిని దన
వలనం బొడముస్ఫులింగమునకును బొగకును బ్రకాశకుం డైనయగ్ని
పరుఁ డైనతెఱంగున నిరుపాధికుండై ద్రష్టయై బ్రహ్మపదవాచ్యుఁ
డైన పరమాత్ముఁడు భూతేంద్రియాంతఃకరణములకు సోపాధికజీవుల
కును బ్రధానమునకుం బరుండు. సర్వభూతములలో నాత్మ నాత్మలో
సర్వభూతములను భూతములలోఁ దదాత్మత్వము ననన్యభావమున
యోగి గాంచు ఏకమయ్యు జ్యోతిస్సు దన కాశ్రయము లగు
కాష్ఠముల హ్రస్వత్వదీర్ఘత్వాదిగుణవైషమ్యముం జేసి నానావిధములఁ
దోఁచురీతిఁ బ్రకృతిస్థుఁ డైనయాత్ముఁడు దా నొక్కఁడయ్యుఁ బ్రకృతి
గుణవైషమ్యమునం జేసి నానారూపములం దోఁచు. కావున మహ
దసత్కార్యకారణాత్మకంబై జీవునకు బంధకారణం బైన
యూహింపరాని దేవశక్తి యగుప్రకృతిం బరమేశ్వరు ప్రసాదమున గెలిచి

ప్రహృష్టస్వాంతయై తల్లి యిట్లనియె. మహాత్మా! ప్రకృతిపురుషమహదాదిలక్షణము పరస్పరవివిక్తముగ సాంఖ్యశాస్త్ర ప్రకారముగఁ జెప్పితివి. వానికిఁ బ్రయోజనం బైన భక్తియోగమార్గంబు సవిస్తరముగ వివరింపుము. పురుషునకు విరక్తిఁ బుట్టించు జీవులకవివిధ సంసారమార్గంబు నెఱింగింపుము. దేనికి వెఱచి జనులు పుణ్యమాచరింతు రెయ్యది యన్వయవ్యతిరేకముల సాధ్యసాధ్యవ్యభిచారియైన వ్యభిచారము నైన తత్త్వనిద్రలకు స్మృతివిషయంబు గాకుండు నట్టిపరులకుఁ బరంబైన యీశ్వరరూపం బైన కాలంబులక్షణంబునుం జెప్పుము. అజ్ఞానమునమిథ్యాభూతము లగు దేహాదులయెడ నభిమానముసం జేసి కర్మాసక్త మగుబుద్ధిచే శ్రమించి యపార మగుసంసారతిమిరమునం బెద్దకాలంబు ప్రసుప్తం బైనలోకమునకుఁ ప్రబోధముఁ గావింప యోగప్రకాశకుం డైన భాస్కరుం డగుచుఁగదా నీవావిర్భవించినవాఁడ వని దేవహూతి పలికినం దల్లిమృదుభాషితముం బ్రశంసించి కపిలమునీంద్రుండు ప్రీతుండై కరుణించి యాసాధ్వి కిట్లనియె.

## కపిలుఁడు దేవహూతికి భక్తియోగభేదముల వివరించుట

స్వభావగుణభేదమునం జేసి పురుషులయభిప్రాయభేదంబున భక్తియోగంబు బహుప్రకారముల నొప్పు నెట్లంటేని. హింసనొండె దంభము నొండె మత్సరము నొండె సంకల్పించి క్రోధియై భేదదర్శనముసఁ జేయంబడు త్రివిధభక్తియుఁ దామస మనంబడు. విషయములఁ గోరి యొండె యశముఁ గోరి యొండె నైశ్వర్యముఁ గోరి యొండె భేదబుద్ధితోఁ బ్రతిమాదుల నర్చించుట రాజసభక్తి యనఁ బరగ యిచ్ఛాభేదమునఁ ద్రివిధం బగు. పాపక్షయార్థంబొండె బరమేశ్వరప్రీత్యర్థ మొండె శాస్త్రానుసరణార్థ మొండె భేదమతిఁ జేయంబడు త్రివిధభక్తియు సాత్త్విక మనం బరఁగు. ఈతొమ్మిదింటిలో నుత్తరోత్తరంబు త్తమంబు. మఱియు శ్రవణకీర్తనాదిభేదమున నవవిధం బైన భక్తియోగము పూర్వోక్తనవ భేదములం గుణించిన నెనుబదియొక్కండు భేదంబు లగు. ఇవి యెల్ల సగుణభక్తిప్రకారంబులు. సముద్రమునకు గంగోదకంబునకుంబోలె నాగుణములు విన్నంతన సర్వగుణాశ్రయుం డైన నా యందవిచ్ఛిన్నముగ మనస్సునకుఁ బ్రవృత్తి గలుగ ఫలాపేక్షయు భేదదర్శనంబును

గానక ప్రవర్తించుట నిర్గుణభక్తియోగమునకు లక్షణంబు. అట్టి నిర్గుణ భక్తియోగంబుఁ గొన్నవారు నాసాలోక్యముఁగాని సమానైశ్వర్యము గాని సామీప్యముఁగాని సారూప్యముఁగాని సాయుజ్యముగాఁ, ఇచ్చుచున్నను మత్సేవాసక్తులై యభిలషింపరు. త్రిగుణముల నతిక్రమించి బ్రహ్మభావంబుఁ బడయ నుపాయం బైనయాత్యంతికభక్తియోగ బియ్యది. ఫలాభిసంధిమాని యనుష్ఠించిననిత్యనైమిత్తికకర్మాత్మ స్వధర్మము, శ్రద్ధాసమన్వితంబై నిష్కామంబై యహింస్రం బై పూజావిధానము, మదీయప్రతిమాదర్శనస్పర్శనపూజాస్తుతివందనాకంబు, భూతములయెడ మద్భావనంబు, ధైర్యము, వైరాగ్యము మహాత్ములయెడ బహుమానంబు, దీనులయెడఁగారుణ్యం, బాత్మతుల్యులయెడ మిత్రత్వంబు, శమము, నియమ, మాధ్యాత్మికానుశ్రవణము, నామసంకీర్తన, మకుటిలత్వ, మార్యసంగ, మనహంకారము మున్నగు భాగవతగుణముల సేవించినవానిపరిశుద్ధచిత్తము శ్రవణమాత్రమునఁ దత్క్షణంబ నన్నుఁ బొందు. వాతప్రేరితంబై గంధము దననెల వగు పుష్పాదులనుండి ఘ్రాణేంద్రియము జేరుచందమున యోగరతంబై నిర్వికారం బైనచిత్త మాత్మం జేరు. భూతాత్ముఁ డగునేను సర్వభూతములలో నుండుదు. ఇయ్యర్థం బెఱుంగక మర్త్యుఁడు ప్రతిమార్చనంబుఁ గావించు. సర్వభూతములలో నంతర్యామి యైన న న్నీశ్వరుం దలఁచి ప్రతిమల నర్పించిన నాపూజ భస్మహోమతుల్యం బయ్యెడు. పర కాయముల వసించునాయెడ భేదబుద్ధిం జేసి ద్వేషించుభూతవైరి యైన మానికి మనశ్శాంతి యెన్నఁడుం గలుగదు. భూతనిందకుఁడు నానావిధ ద్రవ్యసంభారముల సంపాదించి క్రియాయోగమునం బ్రతిమల నెంత పూజించినం దాన నేను సంతుష్టిఁ జెందను. సర్వభూతవర్తి యైనయేన తనలో నుండుదు నని యెందాఁక నెఱుంగకుండు నందాఁక నరుఁడు స్వధర్మ పరుఁడై ప్రతిమాదుల న న్నర్చింపఁదగు. తనకుం బరునకు నించుకేనియు భేద మెంచుభిన్నదర్శనున కేనుమృత్యుస్వరూపుఁడనై యత్యంత భయముఁ గావింతు. కావున సర్వభూతాలయుండై భూతాత్ముఁ డైన నన్ను దానమానములను మిత్రత్వమునను సమదర్శనమునసుం బూజించుట కర్తవ్యంబు, అచేతనంబులకంటెఁ జేతనావంతంబులు వానిలోఁ

ప్రాణవృత్తియుతంబులు వానిలో జ్ఞానవంతంబులు వానిలో నింద్రియవృత్తిమంతంబులు వానిలో స్పర్శవేదులకంటె రసవేదులు వానికంటె గంధవేదులు వానికంటె శబ్దవేదులు వానికంటె రూపభేదవేదులు వానికంటె నుభయతోదంతము లైనయశ్వాదులు పాదహీనంబులకంటె బహుపాదంబులు వానిలోఁ జతుష్పదంబు లగుజంతువులుం గ్రమక్రమంబు నుత్తమంబులు. వానికంటెఁ బదద్వయోపేతు లగుమనుష్యు లుత్తములు. మనుష్యులలోఁ జతుర్వర్ణములు ప్రశస్తంబులు. చాతుర్వర్ణ్యంబునందును బ్రాహ్మణులు శ్రేష్ఠులు. బ్రాహ్మణులలో వేదవాదులును వారిలో నర్థజ్ఞానవంతులును వారిలో సంశయచ్ఛేదకు లగు మీమాంసకులును వారిలో స్వధర్మానుష్ఠానపరులును వారిలో నిష్కాము లగు ముక్తసంగులు నుత్తరోత్తరము నుత్తములు, సర్వకర్మములను తత్ఫలములను దేహమును నాకర్పించిన యతండు నా కవ్యవహితుండు గావున నందఱిలో నుత్తముండు. అట్టి కర్తృత్వాభిమానరహితుం డైనసమదర్శనుకంటె నొం డొక్కయుత్తము నే నెఱుంగను. ఈశ్వరుండు జీవకలచే నందఱిలో నున్నవాఁ డని సర్వభూతములం బహుమానించుచు మ్రొక్కవలయు. మనుపుత్త్రీ! భక్తియోగము నష్టాంగయోగముం జెప్పితి. నా రెంటిలో నొక్కటి వట్టిన పురుషుండు పురుషోత్తముం బ్రాపించు.

### కపిలుఁడు దేవహూతికిఁ గాలలక్షణంబు చెప్పుట

ప్రధానపురుషాత్మకంబు తద్వ్యతిరిక్తంబు దైవపదాభిధేయంబు నానాసంసారలక్షణంబు లైనకర్మచేష్టితంబులకుఁ గారణంబు వస్తువుల యన్యథాభావమున కాస్పదం బద్భుతప్రభావంబు నగుపరమాత్మబ్రహ్మరూపంబే కాల మనంబడు. భేదదృష్టి గలుగుమహదాద్యభిమానిజీవులకు భయముఁ బుట్టించుచు సర్వభూతములలోనం దాను జొచ్చి యఖిలాశ్రయంబై యక్కాలము భూతములచే భూతజాలము సంహరించు. యజ్ఞఫలప్రదాయియై విష్ణునామమునం బరఁగునాకాలము వశీకరించువారి కెల్లఁ బ్రభువు. ఆకాలమున కొక్కండు ప్రియుఁ డొండొక్కండు ద్వేష్యుఁడు మఱియొక్కండు బాంధవుఁ డనుట పొసఁగదు. అంతకారి యగునాకాలము దానప్రమాదమునఁ బ్రమత్తజనుల నావేశించు. కాల

మునకు వెఱచియే వాయువు వీచుచుండెడు. సూర్యుఁ డెండగాయుచుం
డెడు. పర్జన్యుఁడు వాన గురియుచుండెడు. నక్షత్రగణము వెలుంగుచుం
డెడు. వనస్పతులు లతలు నోషధులును దఱితోఁ బుష్పాలు పూచి
కాయలు గాచుచుండెడు. నదులు ప్రవహించుచుండెడు. సముద్రము
వేల దాఁటక యాలో నణఁగియుండెడు. అగ్ని ప్రజ్వరిల్లుచుండెడు.
కొండలతోడఁ బుడమి నీట మునుఁగక మీఁదఁ దేలియుండెడు. ఆకా
శము శ్వాస మొనర్చువారికిఁ గ్రింద మార్గ మొసఁగుచుండెడు. మహ
త్తత్త్వమంకురాత్మకంబైనయాత్మ దేహమును సప్తావరణపరివృతంబుగా
విస్తరింపఁ జేసెడు. చరాచరాత్మకంబైన యీలోకముఁ దమవశమునం
జేసికొన్న గుణాభిమానులగు బ్రహ్మాదిదేవులు మాటిమాటికిని జగత్సర్గా
దులం బ్రవర్తింతురు. పితృాదిజనులచేఁ బుత్త్రాదిజనులఁ బుట్టించుచు
నాదికర్తయై మృత్యువుచే నంతకునిం బొలియించుచు నంతకర్తయై తన
కాదియు నంతంబునుం గానక యాకాలంబు వెలయుచుండెడు. చాల
నంబుఁ గాంచుచుండియు మేఘజాలంబు వాయువిక్రమంబు నెఱుంగని
తెఱంగున బలవంత మగు కాలమునం గాల్యమానుఁడయ్యు జనుఁడు తదీ
యమహాప్రభావం బెఱుంగఁ జాలఁడు. అట్టిజనుఁ డత్యంతాయాసమున
సుఖార్థం బేయేయర్థము గొను దానినెల్లఁ గాలంబు చెఱిచెడు. దాన
నాజనుఁడు శోకించుచుండెడు.

## కపిలుఁడు దేహూతికి సంసారిజనులక్లేశము చెప్పుట

అనిత్య మగు దేహమును దత్పరివారం బగుపుత్త్రకళత్త్రాదులను
గృహక్షేత్రధనాదులను సత్యంబు లని భావించుజంతువు తద్భావనం
జేసి యేయేజన్మంబు లెత్తిన నాయాజన్మంబులనెల్లఁ దదీయసౌఖ్యముం
గాంచనేరఁడు. అట్లుండియు వానియెడ విరక్తినిం గొనఁడు. అట్టిప్రాణి
దేవమాయావిమోహితుండై నరకమునకుఁ బోయిన నందు నాదేహము
నకుఁ దగినయాహారాదిసౌఖ్యముల నలవరించికొనుచు నానరకదేహము
నేనియుం ద్యజింప మనసు చేయఁడు. ఆత్మజాయాసుతాగారపశుద్రవిణ
బాంధవులయెడ నిరూఢమూలహృదయుండై తన్నుఁ గృతార్థుంగాఁ
దలంచికొను. వారిం బోషించుచింత వెల్లున సర్వాంగదాహంబు వొడ
మినం దాని సైరించుచు దురాశయుండై యమ్మూఢుఁడు దురితముల నెడ

లెగక చేసెడు. ఆదురాశయుం డసతు లగు స్త్రీలమాయకు మధురభాషణు లగు బాలకుల కపాస్యాలాపములకుం దగిలి మనంబు నింద్రియంబులు నెల్ల పుడుం దదాసక్తి వెల్లునం గూరం గూటధర్మంబులై దుఃఖతంత్రంబు లైన గృహంబులలో నాలస్యంబు మాని పైపై నలముదుఃఖములకుఁ బ్రతి విధానంబు సేయుచు నయ్యది సుఖం బని యెన్నుచుండెడు. అధిక హింసచే నటనట నర్థము లార్జించి యయ్యర్థములం బుత్రకళత్రాదులం బోషించుచుం దత్పోషణంబునకుం జాలి యేమేనియు శేషించు నేని దానం దన్నుం బ్రోచికొనుచు నాత్మపోషణసౌఖ్య మేనియు వలసినంత గానక యధోగతుం డగు. మఱియు నయ్యధముఁడు దనజీవిక లోపించినం గ్రమ్మఱ నెన్ని యేనుపాయంబుల దానంగడింపఁ గడంగియు దుర్బలుండై లోభాభిభూతుండై పరద్రవ్యముల నపేక్షించుచుఁ గుటుంబముభరింపం జాలక మందభాగ్యుండై వితథప్రయత్నుండై క్రియాహీనుండై కృప ణుండై మూఢత్వమున నెల్లపుడుం జింతించుచు బ్రదుకుచుండెడు. అవ్వి ధమునం గుటుంబము భరింప నసమర్థుం డైన యమ్మూఢునిం గృహీతలులు ముదిసినబలీవర్దముంబోలె భార్యాదులు వోల్లింపకుంటి నాదరింపరు. అప్ప టికి నాతండు విరక్తిం గానక తాను బెంచినవారి ప్రాపు వడయుచు ముదిమి వెల్లున వైరూప్యంబుఁ గాంచి కాటికిఁ గాలుసాఁచి యింటిలోనుండి యవమానపూర్వకముగఁ దనముందటఁ బడవేసిన యన్నముం గృహపా లంబురీతిఁ దినుచు రోగపీడితుండై జఠరాగ్నిమాంద్యమునం జేసి యల్పా హారుండై యల్పచేష్టితుండై యుత్క్రాంతివేళం బ్రాణవాయుచలన వేగమునం గనుగ్రుడ్లు మీఁదికిరాఁగఁ గఫవేగముచే నాళంబు లైన నాడు లడ్డగింపఁబడుటయు. శ్వాసోచ్ఛ్వాసాయాసుండై కంఠ మునం గురగురలాడుచుం బరుండి చుట్లుఁ గూర్చుండి యేడ్చుచుండు చుట్టం బులు పలుకరించినం బలుకఁ జాలక కాలపాశవశగతుండై కుటుంబభరణ వ్యాపృతాత్మాఖిలేంద్రియుండై యధికవేదనం బొసు బుద్ధి నశింపఁ దనవా రేడ్వఁ జచ్చెగు. చచ్చునప్పుడు వాఁడు క్రోధవీక్షణు లగు యమదూతల నిద్దఱం దనయొద్దకు వచ్చినవారిం జూచి సంత్రస్తహృదయుండై మూత్రపురీ షములను విసర్జించెడు. అయ్యమదూత లిరువురు రాజభటులు దండ నీయుంబోలె నాతని యాతనాదేహమునం జొనిపి బలిమిమైఁ బాశముల

మెడలోనం గట్టి యదలించుచుం బెద్దయుం దెరువు గొనిపోవుదురు. వారియదల్పులం గుండియ లవియ నాతండు గడగడ వడంకుచుం దెరువునం గుక్కలు దన్నుం బీఁకుచుఁ గాఁడుచుం దినంగ నత్యంతార్తుండై తన పూర్వపాపం బెన్నుచు నాఁకట నకనకలాడుచు డప్పి వెల్లున నలయుచు బీఁతెండకుం గార్చిచ్చునకుం బెనుగాలికిం దపించుచుం దెరువులోనం గనగనం గ్రాఁగిన యినుముపయి నడు గిడ నేరక యుమ్మలించుచు నాదూతలు వీఁపునం గశాఘాతమున నడిచినం బరమకృచ్ఛ్రంబున నెట్లో నడచుచు నచ్చటచ్చట నలసి సొలసి తెలివి దప్పి పడి యటఁ గ్రమ్మఱ లేచుచుం దొంబదితొమ్మిది యోజనంబుల నొప్పి యత్యంతదూరం బైనయాకష్టమార్గంబున నాదూతలు రెండుమూఁడుముహూర్తములలో నడపించి కొనిపోవ నెట్టులో వారితోడ యమలోకంబునకుం జను. చని యందుఁ గొఱవులు మున్నగువానిం జుట్టి తనయొడలు గాల్చుట, తనమాంసముం దాన కోసియొండె నితరులు గోసి పెట్టిననొండె దానిం దినుట, తాను బ్రదికిచూచుచుండఁగఁ గుక్కలం గ్రద్దలం గొలిసి ప్రేగులు వెఱికించుట, పాములను దేళ్లనుం గఱపించుట, సర్వాంగంబులం గండలు గోసి యేనుంగులు మున్నగువానికిం బెట్టుట, గిరిశృంగములనుండి క్రిందఁ బడం ద్రోచుట, నీరిలోనం గుంటలలోనను ముంచి యణంచుట మున్నగుయాతనలం గుడుచు. నరునకైన నారికైన మిథస్సంగమునం జేసి తన్నిర్మితంబు లైనతామిస్రాంధతామిస్రరౌరవాదు లగునరకయాతనలం గుడువక తీఱదు. ఇందే స్వర్గనరకములు రెండునుం గలవు. నరకయాతనల సంక్షేపముగ నీకుఁ జెప్పితి. అట్లు పరమార్థంబుఁ బొంతఁబోవక కుటుంబభరణమున నాసక్తుండై తనయొడ లోముకొనువాఁడు దనకుఁ బ్రియములగు దేహకుటుంబముల రెంటెనిచ్చటన విడిచి పరలోకమున కరిగి యిట్టి ఫలము గుడుచు. అట్లు కళేబర మిటఁ ద్యజించి భూతద్రోహమునం దానార్జించిన పాపమెల్ల బాథేయంబుగాఁ గొనుచు నాతెరువు పట్టి చని నరకమునం బడి సొమ్ము గోల్పోయినయాతురునిరీతి నెల్లపుడును శోకించుచు ధర్మమునకుం దప్పి కుటుంబముం బ్రోచునెడఁ దా నొనర్చిన వానికిం దగినరీతిం దనకు దైవం బొడఁగూర్చినపాపఫలంబుఁ గుడుచుచుండెడు. అట్టివాఁడు నరకములలో నధమ మగునంధతామిస్రమునకుం జని

నరకయాతన లెల్ల ననుక్రమంబున ననుభవించి యంతం బ్రక్షీణపాపుఁడై క్రమ్మఱ నిలకుఁ జనుదెంచెను.

## కపిలుఁడు దేవహూతికి జీవునిగర్భవాసగతి చెప్పుట

అట్లు నరకానుభవమునం దనపూర్వపాపంబు నశించినం బునర్మానవదేహ మెత్తువాఁడై యాతండు దైవప్రవర్తితం బైనకర్మమునఁ బురుషుని రేతఃకణం బాశ్రయించి స్త్రీగర్భముం జొచ్చెను. చొచ్చి యందొక్కనాఁట శోణితసంబంధము నెనసి మూఁడునాళ్లలో వస్తుల రూపంబుఁ దాల్చి దశదినంబులలో రేఁగుపండంతయుండయై క్రమక్రమంబున మాంసపిండాకృతిఁ గొని యొక్కనెలకు శిరస్సును మాసద్వయంబునకుం గరచరణాద్యవయవసన్నివేశంబును మూఁడు నెలలకు నఖరోమాస్థిగర్మలింగరంధ్రసంభవంబును మాసచతుష్టయంబునకు సప్తధాతుసంపత్తిని మాసపంచకంబునకు క్షుత్పిపాసోదయమునుం గాంచి యాఱవనెలను జరాయువేష్టితుండై తల్లిగర్భమున వలపలిదెసం దిరుగుచుండెను. అప్పుడుతల్లి దిన్న యన్నపానాదుల ధాతువృద్ధిం బొరయుచుఁ బ్రతిక్షణము నున్నక్షుధితక్రిమిగణంబులు దనసుకుమారాంగములం బొడిచి తినుటయు దానికిఁ బలుమఱు మూర్ఛిల్లుచు మాతృభుక్తము లగుకటుతీక్ష్ణోష్ణలవణక్షారామ్లాదు లగునుల్బణరసంబులు మేను సోఁకిన నత్యంతవేదనం బడుచుఁ దన్నుఁ గప్పియున్న జరాయువునకుఁ బ్రేగులకుం జిక్కి యక్కడఁ జాలినంతయెడ గలుగమింజేసి వీఁపుతోడఁ దలవాంచి కుక్షిపయిం బెట్టి తనయంగములనైనం గదలింప నేరక పంజరమునం జిక్కువడినపులుఁగుతెఱఁగున నాజీవుఁడు జంతుజన్మస్థానం బైనయామాతృగర్తంబునఁ బడియుండి దైవవశమునఁ బూర్వస్మృతిఁ బడసి జన్మశతోద్భవం బైనతనపూర్వకర్మముఁ దలపోయుచుఁ బెద్దనిట్టూర్పులు నిగిడించుచుండెను. అట్టివాఁ డచ్చట నేమి సుఖముఁ గాంచెడు? విడ్భవం బగుపురువురీతి నట నుండి యాతండు సప్తమమాసంబు వచ్చినమొదలు జ్ఞానం బెనసి ప్రసూతివాతక్షోభంబునఁ గంపించుచుఁ దనకు సప్తధాతువులు బంధనంబు లగుటకుఁ బరితపించుచు గర్భవాసమునకు వెఱచుచుఁ దనకుఁ దద్గర్భవాసంబు గావించినపరమేశ్వరునకుఁ గేలుమోడ్పు ఘటియించి దేహాత్మదర్శి యగునాజీవుఁ డిట్లు స్తుతించెను.

## గర్భస్థజీవుఁడు పరమేశ్వరుం బ్రస్తుతించుట

ఆత్మ సృష్ట మగు నీజగముఁ బ్రోవ నానావతారంబు లెత్తిన భగవంతుని చరణంబు శరణు సొచ్చెద. అసత్ప్రవర్తనుం డైన నాకనురూపముగ నీగర్భవాసగతిం గావించినయాతని ప్రాపుఁ గాంచిన నేమిటను నాకిఁక భయంబు గలుగకుండెడు. భూతేంద్రియాశయమయం బైనమాయ నవలంబించి మాతృగర్భమునం గర్మావరణబంధనంబులకుఁ దాను విషయం బైనవానిరీతిఁ దోఁచుచుండియు వస్తుగతిం బరికింప నట్లు గాక చింతాసంతాపంబు నొందినహృదయములో నుండియు నఖండబోధస్ఫూర్తిం జేసి నిరుపాధియై నిర్వికారుఁడై యుండువానికిఁ బ్రణమిల్లుదు. పంచభూతరచితం బైన యీశరీరమునందు మిథ్యాగతిం బ్రచ్ఛన్నుండ నయ్యు వస్తుగతి శరీరసంగరహితుండనై యింద్రియగుణార్థచిదాభాసాత్మకుఁడనై యుండు నేనట్టిశరీరమున నప్రతిహతప్రభావుఁడై ప్రకృతిపురుషనియంతయై సర్వజ్ఞుండై వెలయు నాపరమపురుషుం గొల్చెద. ఏనుం బరిశుద్ధబోధస్వరూపమునఁ బరమేశ్వరతాదాత్మ్యంబుఁ బడసినవాఁడ నయ్యుఁ దదీయమాయకుఁ జిక్కి బహుళకర్మబంధనం బైనయీసంసారపథమునం బహుళక్లేశములం గుడుచుచుఁ దిరుగుచు నాత్మస్మృతిఁ గోల్పడితిఁ గావున నయ్యాత్మస్మృతిం గ్రమ్మఱ నప్పరమేశ్వరు ననుగ్రహంబు దక్క నింక నేయుక్తిం బొందఁ జాలుదు? ఇప్పుడు నాకుఁ గలిగిన యీత్రైకాలికజ్ఞానం బెవ్వండు ప్రసాదించె, నెవ్వఁడు స్థావరజంగమంబులలో నెల్ల ననుస్యూతుండై యుండెడు నట్టిపరమేశ్వరుని జీవకర్మదవిలి ననువర్తించుచున్న యేను దాపత్రయోపశమనార్థంబు గొలిచెద. మాతృగర్భములో నసృఙ్మూత్రగర్తమునం బడి జఠరాగ్నిం గ్రాఁగుచు నిట వెడలి పోవ నెల లెన్నికొనుచున్న దీనుఁ డైనదేహి యెన్నం డిటనుండి వెలుపరింపఁబడియెడినో? పదినెలలవాని కీదివ్యజ్ఞానంబుఁ గూర్చి యుపకరించిన యాపరమకారుణికుండు దనయుపకృతికిఁ దాన సంతసిల్లుఁగాక. కేలుదోయి మోడ్చు టొక్కండు దక్క నింక నెద్దాని నాపరమేశ్వరునకు జీవుఁడు ప్రత్యుపకారంబుగా నొనర్పఁగలఁడు? పశ్వాదిజీవులు . శరీరసంభవంబు లైనసుఖదుఃఖములనే కుడుచుఁగాని యే నన్నినో యట్లుగాక యప్పరమేశ్వరుం డొసంగినవివేకమ్మున శమధ

మాఢిసాధనసంపన్నుండనై యంతర్బహిఃపరిపూర్ణుండనై యపరోక్షముగ నహంకారాస్పదుం డగుభోక్తరీతిం బ్రతీతుం డైనయప్పురాణపురుషుం జూచుచున్నవాఁడ. పరమేశ్వరా! యే నీగర్భవాసమున బహుదుఃఖములం గుడుచుచున్న నిటనుండి వెడలి రాం గోరను. అంధకూపప్రాయం బైనవెలుపలికి వచ్చినం దోడన మాయ నన్నలముకొనియెడు. అట దేహగేహాదులయెడ నహంకారమమకారరూపం బైనమిథ్యాభిమానంబు దానివెంబడి సంసారచక్రంబును నాకు బంధకంబు లయ్యెడు. కావున నే నిచటన యుండి యవ్యాకులుండనై బుద్ధిసహాయంబున విష్ణుదేవుపాదమూలంబు పట్టి నానాగర్భవాసరూపం బైనయీదుఃఖ మింకం గలుగకుండ నన్ను నేను సంసారమునుండి యుద్ధరించికొనియెద నని యిట్లు తనలోం జింతించుచు నీశ్వరుని ధ్యానించుచున్నంత దశమమాసంబునం బ్రసవసమయంబు డాయుటయుం బ్రసూతివాతం బాక్రమించిన నాతండు తదాఘాతంబునం బలక్రిందై యాతురత్వం బెనసి తనకు గర్భవాసమునం గలిగినవివేకముం గోల్పోయి నిరుచ్ఛ్వాసుండై యతికృచ్ఛ్రమునం గర్భము నిర్గమించి రుధిరజరాయువేష్టితుండై విడ్భవక్రిమివిధమునం జూపట్టుచు నేలం బడి పొరలుచు విపరీతజ్ఞానంబున నేడ్చెడు. అట్లు పునర్జన్మంబుం గాంచి యాతండు పరాభిప్రాయం బెఱుంగని యితరులు దనకోర్కికిం బ్రతికూలముగం జేయువానికిం బ్రత్యాఖ్యానంబు జేయం జాలక తత్పోషణమునం బెరుగుచు జంతుస్వేదజదూషితంబై యశుచి యగుశయనంబునం బరుండం బెట్టిన నిజాంగములం గీలుకొనను గూర్చుండను లేవను నడువను శక్తిం గానక శయనించి తనపచ్చియొడలు మశకమత్కుణాదులు గుట్టిన నేడ్చుచుండెడు. అవ్విధమున శైశవదుఃఖములం గుడిచి యటఁ బంచవర్షోపరితనం బైనపౌగండదశం బ్రాపించి యందు నధ్యయనాదిక్లేశముల ననుభవించెడు.

### కపిలుండు జీవదుఃఖనిరూపణంబుగా స్త్రీసంగమం దూఱుట

పదంపడి యౌవనావిర్భావ మగుడుం గామియై కార్యములకుం గడంగి యందుం దనకోర్కి యీడేఱకుండినం దేహముతోడం బెరుఁగు క్రోధమున నాత్మనాశార్థం బాకాముకులతోడం గలహించుచుం బంచభూతారబ్ధం బైనదేహమునెడ నాత్మభావమును దదీయములయెడ నాత్మీ

యభావంబు గునిచి కుమతియై తదర్థంబు కర్మముం జేయుచున నాతండు గ్రమ్మఱ బద్ధుండై యవిద్యాకర్మబంధనం బైనసంసారమునం దగులువడి తదీయక్లేశము ననుభవించెడు. దుష్టము లగు కామతృప్తిప్రయత్నములం జేసి యా తెరువునం గొనిపోవంబడు నేని యాతండుతదాసక్తుండై తొల్లింటియట్లు నరకమున కరిగెడు. సత్యశౌచదయామానబుద్ధి శ్రీకీర్తిక్షమాశమదమైశ్వర్యంబు లెవ్వరితోడం గూడినం జెడు నశాంతులు మూఢులు ఖండితాత్మ లసాధువులు క్రీడామృగప్రాయులునై శోచనీయ లగునట్టి స్త్రీలతోడ సంగము సేయరాదు. స్త్రీసంగమునను దత్సంసర్గి సంగమునను గలుగునంత మోహబంధము లన్యసంగమునం గలుగవు. ప్రజాపతియంతవాఁడు తనకూఁతుం జూచి దానిరూపలావణ్యముల కచ్చెరువడి కామించిన నది మృగంబై తొలంగుటయుఁ దానును మృగంబై సిగ్గుమాలి దానివెంటం బాఱుతెంచె నఁట. ఇఁకఁ దత్సృష్టసృష్టు లగుమనుష్యులలో నొక్క నారాయణఋషి దక్కఁ దక్కినవాఁ డెవ్వఁడేనియు మతిభ్రంశముఁ బొందకుండునే? స్త్రీమయం బగుమదీయ మాయాబలంబు చూడుము. అయ్యాది భ్రూభంగమాత్రంబున దిగ్విజయకారులనుం దనకుఁ బాదాక్రాంతులం గావించికొను. నన్ను సేవించి యాత్మబోధంబు వడసి యోగపార మారోహింపఁ గోరునతనికి నరకద్వారం బైనస్త్రీలతోడిసంగ మొకప్పుడేనియుఁ దగదు. దేవమాయ నారీరూపమునఁ దన్ను డాయవచ్చిన దానిఁ దృణచ్ఛన్న కూపమనియుఁ దనకు మృత్యువనియు నెన్నవలయు. జన్మాంతరమునందలి నారీసంసర్గమున యోషిజ్జన్మ మెత్తినజీవుఁడు కామోద్రేకభరమునం జేసి తనయొదుర బురుషరూపమునఁ దోఁచుమదీయమాయను మోహమున విత్తాపత్యగృహప్రదుం డైనపతిఁగాఁ దలంచినం జేటు వాటిల్లుఁ గావున మృగములఁ బట్టఁగ వలయొడ్డుబోయ పాట వాడుచు వానినావలలోనం జిక్కించురీతి నాపతి యత్యంతసంగమునఁ దనకు దైవప్రాపితమృత్యువే యనియెఱుంగ వలయు. ఉపాధి యగులింగశరీరములో నొకలోకమునుండి వేఱొక లోకమునకుఁ జనుచుఁ గర్మముల మీఁదమీఁద నొనర్చుచుఁ గర్మఫలముల ననారతంబు నాజీవుఁడు గుడుచుచుండెడుఁగాని యొకప్పుడైన నుపరతిం గాంచనేరఁడు. జీవోపాధి యగులింగశరీర మతని ననువర్తించి

యుండు. భూతేంద్రియమనోమయం బైనస్థూలదేహము భోగాయతనం
బయ్యెడు. ఆ రెంటికి కార్యాయోగ్యత్వంబు జీవునకు మరణం బనియు
నావిర్భావము జన్మం బనియుం జెప్పంబడు. ద్రవ్యోపలబ్ధిస్థానం బైనస్థూల
దేహమునకు ద్రష్ట్యదర్శనమం దయోగ్యత గలుగునేని దేహాత్మాభిమాన
మునం జేసి జీవున కయ్యది మరణ మనంబడు. స్థూలశరీరదర్శనంబు జన్మ
మనంబడు. అక్షిగోళకములకు ద్రవ్యరూపదర్శనమున నయోగ్యత యె
ట్లట్లు చక్షురింద్రియంబునకుం గాచకామాలాదిదోషమున దర్శనాయో
గ్యత యగు. గోళకేంద్రియముల కయోగ్యత గలిగినవిధంబుననే ద్రష్ట
యగుజీవునకును మాయాదోషమున దర్శనాయోగ్యత యయ్యెడుం గాని
వస్తుగతిం బరికించిన జీవునకు జన్మమరణంబులు గలుగవు. కావున మర
ణమునకుఁ దత్తఱపాటును వెఱపును జీవనంబునకు సంభ్రమంబును
దైన్యంబును జేయం బని లేదు. యోగవిరాగయుక్తంబై సమ్యగ్ద
ర్శనం బైనబుద్ధి నిట్టిది జీవగతి యని యెఱింగి ధీరుండై ముక్తసంగుండై
జీవుఁడు మాయావిరచితం బైనయీలోకంబున గళేబరంబుమీఁది
యాసక్తిం దొఱంగి చరించు టొప్పు.

## కపిలుఁడు దేవహూతికిఁ గర్మఫలగతులఁ జెప్పుట

కామకాముఁడై గృహస్థధర్మానుష్ఠానమున నాసక్తుఁడై భగవదా
రాధనరూపం బైనధర్మమునెడఁ బరాఙ్ముఖుండై శ్రద్ధతోఁ గ్రతువుల
సురలం బితృదేవతలం బూజించునతఁడు యజ్ఞసోమపానమహిమంబునఁ
జంద్రలోకమున కరిగి పుణ్యానుగుణంబుగా భోగము లనుభవించి
యాపుణ్యము క్షయించినం బునరావృత్తిం జెందు. అతని కందు నిత్య
త్వంబు గలుగ దనుటే కాదు. మఱి వారికిఁ బ్రాప్యంబులైన యాపుణ్య
లోకములును దైనందినప్రళయంబున నారాయణుండు శేష[illegible]
మునం బవ్వళించునెడ లయించు. నిష్కాములై నిస్సంగులై నిత్యనైమి
త్తికకర్మముల నాచరించి వాని నాకర్పించుచుం బరిశుద్ధచిత్తులై నివృత్తి
ధర్మనిరతి గలిగి నిర్మములై నిరహంకారులైనప్రశాంతులు సూర్య
మండలమార్గమునఁ బరిపూర్ణుఁడు పరాపరేశ్వరుఁడు జగదుపాదానకార
ణంబు సృష్టిలయనిమిత్తకారణంబు నగుపురుషుం బ్రాపింతురు. పరమే
శ్వరభావనమున హిరణ్యగర్భు నుపాసించువారు బ్రహ్మలోకం బధిగ

మించి యుం డాచతుర్ముఖునితో నివసించి గుణత్రయాత్ముం డైన యాపరమేష్ఠి దనకు నియతం బైనద్విపరార్ధాయుఃపరిమాణకాలంబు గడచినం బంచభూతపంచతన్మాత్రదశేంద్రియమనోహంకారాది పరివృతం బైనబ్రహ్మాండము నుపసంహరింపం దలంచి యవ్యాకృతుం డగుపరమేశ్వరుం జెందునెడ జితేంద్రియప్రాణు లైనయవ్విరాగియోగులును గతాభిమాను లవుటం జేసి యావేదగర్భునితోడం బరమానందరూపంబు సర్వోత్కృష్టంబు నగుబ్రహ్మంబు నధిగమింతురు. అభేదదర్శనమున భగవంతు నుపాసించువారు పూర్వోక్తక్రమవిచారంబు లేక వెంటన యపరోక్షముగ భగవత్పదపరమానందంబుం జొత్తురు. కావునం దల్లీ, సర్వభూతహృదయకమలావాసి యైనయాశ్రుతానుభావునిం బరమభావమున భజింపుము. స్థావరజంగమముల కెల్ల నాద్యుం డై వేదగర్భుం డైనచతుర్ముఖుఁడు యోగప్రవర్తకాచార్యులు యోగేశ్వరులు యోగసిద్ధులు నగుసనత్కుమారాదులును బ్రహ్మలోకాద్యనుభవంబుం గాంచియు భేదదర్శనాభిమానములం జేసి యాగామికల్పప్రవర్తనార్థంబు పునరావృత్తిం జెంది నిష్కామకర్మానుష్ఠానమహిమంబున నానాజన్మసంసారమునకుం జిక్కక పూర్వరీత నాధికారికపదవిం గాంతురు. భేదదర్శనమునం బరమాత్ము నుపాసించు బ్రహ్మాదులకే పునరావృత్తి గలుగునన్న హిరణ్యగర్భాదుల నుపాసించువారికిం గ్రమ్మఱ నావృత్తి యయ్యెడునని వేఱ చెప్ప నేల? భేదదర్శనం బంతటివారికి నట్టి దయ్యెడుం గావునం బరమేశ్వరోపాసనమున నభేదదర్శనంబు ప్రధానంబు. కర్మాసక్తులై శ్రద్ధమైం గామ్యకర్మములను నిత్యకర్మములను సాకల్యముగ ననుష్ఠించుచు రజోగుణాభిభూతమానసులై కామాత్ములై యజితేంద్రియులై కామ్యఫలముల నపేక్షించి ప్రతిదినముం బితృపూజ యొనర్చుచుం ద్రివర్గమాత్రపరులై యమృతమధురము లగుహరికథల నుజ్జగించి విడ్భోజనంబులు స్వాద్వన్నంబుం ద్యజించి పురీషముం గొనువిధమున నన్యకథ లాకర్ణించుచు దైవోపహతులు గర్భాధానాదిశ్మశానాంతము లగుసకలకర్మములం జేయుచు సూర్యునకు దక్షిణ మగుమార్గమునం బితృలోకమునకుం జని యచ్చటం గర్మాధీనభోగములం గుడిచి యాపుణ్యము నశించినం బునరావృత్తులై తటాలున విభ్రంశంబుం బొంది పుత్త్రపౌత్త్రాదిరూపమున ననేకజన్మంబు

కెత్తుదురు. కావున నో సాధ్వీ, నీవు స్వభావముల భగవద్గుణాశ్రయం
బైనభక్తిచే భజనీయపదాంబుజుం డైనభగవంతుని భజింపుము. భగ
వంతుం డగువాసుదేవునియెడఁ బ్రయోగించినభక్తియోగము నయమున
వైరాగ్యమును బ్రహ్మదర్శనం బైనజ్ఞానముం గలిగించు. సమము లగు
నర్థములయెడ నింద్రియవృత్తులం జేసి యిది ప్రియ మిది యప్రియం బని
వైషమ్యముం జిత్తము గ్రహింపనప్పు డతండు తాన నిస్సంగుఁడు సమ
దర్శనుఁడు హేయోపాదేయరహితుఁడు పరమానందపదారూఢుఁడు
నగునాత్మం గాంచు. జ్ఞానమాత్రం బైనయాపరమానందస్వరూపం బె
పరబ్రహ్మం బనియుఁ బరమాత్మఁ డనియు నీశ్వరుం డనియుఁ బురుషుం
డనియుఁ జెప్పఁబడు. ఆభగవంతుఁ డొక్కఁడయ్యు ద్రష్టృదృశ్యకరణ
రూపముల నానాత్వమునం దోఁచుచుండెడు. సంగము సాకల్యముగ
వర్జింపవలయు ననుటే యోగులకు సమగ్రయోగమునం బ్రార్థనీయం
బైనయర్థంబు. జ్ఞానమాత్రం బైననిర్గుణబ్రహ్మ మొక్కఁడయ్యుఁ బరాఙ్ము
ఖము లగునింద్రియములం జేసి భ్రాంతిచే శబ్దాదిధర్మబృంహితము లగు
నర్థములరూపమున మహత్తత్త్వ మనియుఁ ద్రివిధాహంకార మనియుఁ
బంచవిధభూతంబు లనియు నేకాదశవిధేంద్రియము లనియు జీవరూపుఁ
డనియు నండకోశశరీరకుం డనియుఁ దోఁచుచుండెడు. శ్రద్ధాభక్తియుక్తం
బైనయోగాభ్యాసమున నిత్యసమాహితుండై నిస్సంగుఁ డైనవిరక్తుఁ డీ
యర్థము లెస్స గనియెడు. ప్రకృతిపురుషవివేచకంబై బ్రహ్మదర్శనం బైన
యీజ్ఞానము నీకుఁ జెప్పితి. మన్నిష్ఠ మగుజ్ఞానయోగము నిర్గుణభక్తి
యోగ మనునీరెంటికిని భగవచ్ఛబ్దవాచ్యుఁ డగునొక్కండే ప్రాప్యస
మార్థంబు. జ్ఞానయోగమున నాత్మలాభము భక్తియోగమునకు భజ
నీయేశ్వరప్రాప్తియుఁ బ్రయోజనములు గావున నారెంటికి నేకార్థ
కత్వం బెట్లని విచారింపం బని లేదు. బహువిధము లగురూపరస
గుణాదుల కాశ్రయ మగుక్షీరాదిపదార్థ మొక్కటి యయ్యు నింద్రియ
పృథగ్భావమునం జేసి చక్షురింద్రియమునకు శుక్లపదార్థం బనియు రస
నేంద్రియమునకు మధురవస్తు వనియుఁ ద్వగింద్రియమునకు శీతలద్రవ్యం
బనియుఁ దోఁచురీతి నాత్మఁ డగుభగవంతుఁ డొక్కఁడయ్యు నా
ధము లగుశాస్త్రమార్గముల ఫలభేదదర్శనపూర్వకంబు లగునుపాస

భేదముల నానావిధముల నిరూపింపఁబడియుండు నింతియకాని యుపాసనాగమ్యుఁ డగునీశ్వరునకుఁ దల్లాభమునకును నానాత్వంబు గలుగదు. శాస్త్రబోధితము లగుభగవత్ప్రాప్తిమార్గంబులు పెక్కులు గల వెట్లనఁగాని ఇష్టాపూర్తములను దానములను దపములను స్వాధ్యాయ మీమాంసలను నిషిద్ధవర్జనంబునను సర్వకర్మసన్న్యాసంబునను వివిధాంగ యోగమునను భక్తియోగమునను బ్రవృత్తినివృత్తిరూపము లగుసకామ నిష్కామధర్మముల నాత్మతత్త్వావబోధమునను దృఢవైరాగ్యమునను సగుణుఁడు నిర్గుణుఁడు స్వప్రకాశుఁడు నగుభగవంతుఁ డొక్కఁడే ప్రాప్యుండు. గుణత్రయాత్మకంబు నిర్గుణం బనఁ జతుర్విధం బైనభక్తియోగ మును జంతువులలో నవ్యక్తగతిం బఱచుకాలస్వరూపంబు నవిద్యాకర్మనిర్మితంబులై యాత్మగతిం జొరనీని జీవులనానావిధసంసృతిగతులను నీకుఁ జెప్పితి. ఖలునకు నవినీతునకు స్తబ్ధునకు దురాచారునకు దాంభికునకు గృహాదిలోలుపునకు నభక్తునకు భాగవతద్వేషునకు నొకప్పుడును నీనిం జెప్పవలదు. మఱి శ్రద్ధావంతునకు భక్తునకు వినీతున కసూయారహితునకు సర్వభూతమిత్త్రునకు శుశ్రూషారతునకు బహిర్జాతవిరాగునకు శాంతచిత్తునకు ధీమంతునకు నిర్మత్సరునకుఁ బరిశుద్ధునకు మదీయప్రియతమునకు నుపదేశింపఁ దగు. తల్లీ, యొకప్పుడేని దీని నతిశ్రద్ధతో వినువాఁడును మచ్చిత్తుండై కీర్తించునతఁడును నిక్కంబు మత్పదముం బ్రాపించు నని చెప్పిన విని దేవహూతి మోహావరణంబు వాసి సాంఖ్యశాస్త్రప్రవర్తకుం డైనయాకపిలాచార్యునకు మ్రొక్కి యిట్లని ప్రస్తుతించె.

### దేవహూతి తత్త్వశ్రవణాంతమునఁ గపిలుం బ్రస్తుతించుట

దేవా, భూతేంద్రియవిషయమనోమయుండై గుణప్రవాహుండై కార్యకారణబీజంబై జలశయనం బైననీరూపమును నీవలనం బుట్టిన యావేదగర్భుఁడే తాను గాంచక కేవలము ధ్యానించె. గుణప్రవాహరూపమున బ్రతిహతసహస్రశక్తుల విభజించి తన్మూలమున నీవు సృష్ట్యాదులఁ జేయుచుండువా డవయ్యు సత్యసంకల్పుఁడవై జీవులకుభోగార్థం బీజగముసృజించితివి. యుగాంతమున మాయాశిశురూపముఁ గొని వటపత్త్రమునం బవ్వళించి నిజపాదచుంబనం బొనర్చుచు నీజగంబెల్ల నిజోదరములో ధరించితివి

స్నెట్టు లేను నాగర్భమున ధరించితినో యెఱుంగనయ్యెద. దుష్టప్ర వాహంబును భవదాజ్ఞావశు లగుశిష్టుల యనుగ్రహార్థంబును నీవు దేహ ములం బరిగ్రహింతువు. కార్యార్థంబు వరాహాద్యవతారంబు లెట్లు లట్లు యీయ్యవతారంబు నధ్యాత్మవిద్యోపదేశార్థం బని తలంచెద. ఎవ్వని నామము వినినఁ గీర్తించిన నెవ్వనిఁ దలంచిన నెట్టి క్కనం జండాలుండైన యజ్ఞముల నాచరింప నధికారి యగు నట్టినిన్నుఁ గన్న నింక నేమని చెప్పుదు? జిహ్వాగ్రమున నీనామ ముచ్చరించువాఁడు చండాలుండైన నేమి యాతండు సర్వోత్తముఁడ యగు. నీనామముఁ గీర్తించువారు తపోహోమతీర్థస్నానస్వాధ్యాయాదు లాచరించినవా రగుదురు. విష యములనుండి మగిడించినమనస్సునఁ బరిచింతనీయుఁడు స్వతేజోవిధ్వస్త గుణప్రవాహుఁడు వేదగర్భుఁడు పురుషోత్తముఁడు పరబ్రహ్మంబు నగునీకుఁ బ్రణమిల్లుచున్నదాన నని యివ్విధంబున దేవహూతి స్తుతిం చినం గపిలమునీంద్రుండు మాతృవత్సలుండై మధురభాషితముల నా జననిం బ్రశంసించి యమ్మా, యేను బోధించిన సాధుసేవనీయం బగుని మార్గము లెస్స యనుష్ఠించిన నచిరంబ జీవన్ముక్తిఁ గాంతువు. బ్రహ్మవాది సేవితం బయినయీమదీయమతంబు నమ్ముము. దీనివలన నీవు నిక్కంబు ముక్తిం బ్రాపింతువు. దానిం దెలియనివారు సంసారమునం బరిభ్ర మింతు రని చెప్పి కపిలాచార్యుఁడు బ్రహ్మవాదిని యగుతల్లిని వీడ్కొని యథేచ్ఛం జనియె.

## దేవహూతి కపిలోపదేశమున జీవన్ముక్తిఁ గాంచుట

అంత నా దేవహూతి యాత్మజాతుం డైనకపిలాచార్యుఁ డుప దేశించినయోగాదే[illegible] పట్టి సరస్వతీనదీతీరవిలసితం బైన యాబిందు సరోనామకాశ్రమంబున: త్రిషవణస్నానకపిశంబులై జడలు గట్టినకుటి లాలకంబులఁ దాల్చియుఁ జీరపల్కలంబులఁ గట్టియు నత్యంతనియమ ములం జేసి దేహకృశత్వంబు నెనసియు యోగసాధనంబునకుఁ బూని గజదంతవినిర్మితంబులై పయఃఫేనసువర్ణతం బొరసి వెలుంగుకనకపరిచ్ఛ దంబు లగుపాన్పులను మృదులాస్తరణప్రస్తంబు లైనకాంచనాసనంబు లను మహామరకతఖచితంబు లై నవిమలస్ఫటికకుడ్యతలంబులందలి రత్న దీపప్రభల నలరుమణిభూషణోల్లసితసాలభంజికాసుశోభితంబు ల[illegible]

గృహములను జంటలై యింపుగ నెలుం గిచ్చుపలుదెఱంగు లగుపుల్గులను మధురముగ మ్రోయుతుమ్మెదకూటువలనుం దనరుకుసుమితబహుకల్పపాదపంబుల నొప్పునుద్యానంబులను విద్యాధరబృందంబు గొలువఁ దనకు విహారస్థానంబులైనయిందీవరగంధివాపికలనుం బొంపిరివోయి కర్దమప్రజాపతితపోయోగవిజృంభితంబై వైమానికులకు నింద్రసుందరులకుం బ్రార్థనీయంబై నిరుపమానంబైనతనగార్హస్థ్యంబుఁ దొఱంగి యంతకుమున్న ప్రవ్రజితుండైనపతినెడఁబాసినదానం గొందలం బందుచుండి యిప్పుడు పుత్త్రవియోగంబును దొడరుటం జేసి తత్త్వజ్ఞానం బెనసియుఁ గ్రేపుఁ గోల్పడినగోవుమాడ్కి వాత్సల్యకారణంబున నాతురయై వదనంబున నొకతెఱం గగువ్యాకులత్వంబు గదురఁ బుత్త్రరూపుఁడైనహరి నెల్లపుడుం జింతించుచుఁ దాదృశగృహాదులయెడ నిస్పృహయై భక్తియోగగాఢవైరాగ్యముల నెసంగినయనుష్ఠానంబున నొదవినబ్రహ్మజ్ఞానమునం బరిశుద్ధంబైనచిత్తంబున స్వానుభూతితిరోభూతమాయాగుణపరిచ్ఛేదుఁడు విశ్వతోముఖుఁడు ప్రసన్నవదనుఁడునై ధ్యానగోచరుం డైనభగవంతుని సమాసవ్యాసభేదమున లెస్స ధ్యానించుచు నాత్మసంశ్రయంబై భగవత్పదవాచ్యంబైనబ్రహ్మము నందుఁ బరినిష్ఠితమతియై జీవభావనివృత్తిఁ గాంచి క్లేశములం బాసి పరమనిర్వృతిం జెంది నిత్యప్రతిష్ఠితసమాధియోగమునం జేసి గుణభ్రాంతిశాంతిం బడసియున్నది గావున మేల్కాన్నవాఁడు స్వప్నదృష్టము నెట్టులట్టులు తనదేహముం దలంపకుండె. ఆబ్రహ్మవేదినిదేహం బప్పుడు పరపోషణంబుఁ గాంచియు మనోవ్యాధులు చేనికతమునఁ గృశింపక మలదిగ్ధంబై పొగ గప్పిననిప్పువోలె నొప్పుచున్నం దపోయోగమయంబైన యయ్యంగము ముక్తకేశము గతవస్త్రము నయ్యుఁ బ్రారబ్ధకర్మమునం బ్రోవుగాంచుచుండెను దాను వాసుదేవునందే మతి నెలకొల్పియునికిం జేసి నిజదేహావర్తనం బేమియు నెఱుంగదయ్యె. అవ్విధమునం గపిలోక్తమార్గంబున యోగంబు సాధించి దేవహూతి నిత్యముక్తుం డైనపరమాత్ముం బ్రాపించి జీవన్ముక్తి వడసె. దేవహూతి జీవన్ముక్తినెనసిన యాచోటు సిద్ధపదం బనం బరమపావనక్షేత్రంబై ముల్లోకంబులఁ బ్రశస్తిఁ గాంచె. అంతట నాదేవహూతిదేహంబు ప్రారబ్ధకర్మావసానంబున యోగ

మహిమంజేసి ధాతుమలంబులెల్ల లయింప నేసై పాటి సిద్ధప్రదంబై సిద్ధులకు సేవనీయం బయ్యె.

మహాయోగి యగుకపిలుండు నట్లు తల్లిని వీడుకొని కర్దమాశ్రమంబునుండి తఱలి సిద్ధచారణగంధర్వాప్సరోగణంబులును మునిబృందములుం బ్రస్తుతింప నీశానదిశం బట్టి యరిగి సముద్రుండు పూజించి చూపినచోటునేఁటి సాంఖ్యాచార్యులు ప్రస్తుతింప లోకత్రయోపశాంత్యర్థము యోగము పూని సమాహితుండై యుండెడు. అనఘా, నీవడిగిన పావనం బైనయీకపిలదేవహూతిసంవాదంబు నీకుఁ జెప్పితి. ఆత్మయోగగుహ్యం బైనయీకపిలమునిమతంబు విన్నవాఁడును పఠించినయతండును గరుడధ్వజం బైనభగవంతునియందు బుద్ధి చేసి భగవత్పాదారవిందంబుఁ బ్రాపించు నని విదురునకుఁ జెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె.

చ. అవహితవృత్తి నన్యవిషయంబులఁ జిత్తముఁ బోవనీక యే
కవిషయతం జిరంబయి తగం గుదియించి విరాగయోగమై
భవపరినిష్ఠ ధ్యాన మనపాయముగా నొనరింప నాత్మలో
నవసితుఁ డౌచిదేకరసు నాత్ముఁ దలంతు ననంతు శాంతునిన్.

గద్యము. ఇది శ్రీమదుభయభాషాకవిత్వకలాభిరామ సీతారామకవిలలామ పుత్త్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్త్ర, శాలావత్సగోత్రాపస్తంబసూత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామధేయ విరచితం బైనశ్రీమదాంధ్రవచనభాగవతంబునం దృతీయస్కంధంబు సర్వంబు నేకాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్రవచనభాగవతము

## చతుర్థస్కంధము



క. శ్రీవిలసితాత్మశక్తిస
మావేశగృహీతబహువిధామలలీలా
భావితనానావిధజ
నావితలోకుఁ భజింతు నాత్మాలోకున్.

దివ్యజ్ఞానసమాననీయుం డైనమైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె.

### మైత్రేయుఁడు విదురునకు మనుపుత్త్రికలవంశములఁ జెప్పఁ దొడఁగుట.

స్వాయంభువమనువునకు శతరూపయం దాకూతి దేవహూతి ప్రసూతి యన ముగ్గురు కూఁతులు జనించిరి. వారిలో నాకూతిని భ్రాతృయుండినను * బుత్త్రికాధర్మమున రుచికి శతరూపానుమతి నమ్మను వొసంగె. బ్రహ్మవర్చసవిలసితుం డైనరుచి యయ్యాకూతియందుఁ బరమసమాధియుక్తుండై యొక్కమిథునంబుఁ గనియె. అందు హర్యవతారం బైనయజ్ఞుఁడు పురుషుఁడును రమావతారం బైనదక్షిణ స్త్రీయు నైరి. అంత వారినిరువుర నమ్మాతామహుండు దనయింటికిఁ దోడితెచ్చి యయ్యిద్దఱకును బెండిలి సేయుటయు నతితోషముఁ బొంసినయయ్యిద్దఱకు దోషుఁడు ప్రతోషుఁడు సంతోషుఁడు భద్రుఁడు శాంతి యిడస్పతి

---

* ఈమెయందు నీకుఁ గలుగువాఁడు నాకుఁ బుత్త్రుఁ డగు నని సంకేతపూర్వముగా భ్రాతృరహిత యగుకన్య నిచ్చుట పుత్త్రికాధర్మము. శ్లో. 'అభ్రాతృకాం ప్రదాస్యామి తుభ్యం కన్యా మలంకృతాం, అస్యాం యో జాయతే పుత్త్ర స్స మే పుత్త్రో భవిష్యతి.'

యిధ్ముఁడు కవి విభువు వహ్ని సుదేవుఁడు రోచనుఁ డనఁ బన్నిద్దఱు కొడుకులుపుట్టి తుషితు లనంబరఁగిరి. స్వాయంభువమన్వంతరమున నా తుషితులు సురలును మరీచిప్రముఖు లేడ్వురు సప్తర్షులును యజ్ఞుఁ డింద్రుఁడు నైరి. మనుపుత్త్రులైన ప్రియవ్రతోత్తానపాదులును దత్పుత్త్ర పౌత్త్రాదులు నామన్వంతరంబున రాజులై యేలిరి. దేవహూతిం గర్దమున కిమ్మను విచ్చె. ఆసాధ్వీచరిత్రంబెల్ల నింతకమున్న వివరించితిఁగదా. ప్రసూతిని బ్రహ్మపుత్త్రుం డైనదక్షున కిచ్చుటయుఁ దదీయసంతానంబు ముల్లోకముల నతివిస్తారంబుఁ గాంచె.

### మైత్త్రేయుఁడు విదురునకుఁ గర్దమదుహితృసంతతి చెప్పుట

కర్దమునికూఁతులు దొమ్మండ్రు బ్రహ్మర్షులకుఁ బత్ను లైరని మున్న చెప్పితిఁగదా. తదీయసంతతి నాకర్ణింపుము. మరీచిపత్ని యగు కళ కశ్యపుని బూర్ణిమునిం గనియె. అందుఁ బూర్ణిముఁడు విరజవిశ్వగాఖ్యు లగుకొడుకుల నిద్దఱను జన్మాంతరంబునం గంగానది యైనదేవకుల్య యను కన్యకనుం గనియె. అత్రిపత్ని యగున నసూయ హరిహరబ్రహ్మాంశములం గ్రమంబున దత్తుని దుర్వాసుని సోమునిం గాంచె ననిన మునీంద్రా, లోకసృష్టిస్థితిలయకారు లైనయమ్మువ్వు రేమి సేయఁగ నత్రియింటఁ బుట్టి రని యడుగుటయు నవ్విదురునకు మైత్త్రేయుం డిట్లనియె. బ్రహ్మవిద్వరుం డైనయత్రిముని బ్రహ్మ దన్ను సృష్టి సేయ నియోగించినం బత్నితోడ ఋక్షం బనుకులగిరి కరిగి సురభికుసుమవిసరవిలసితవివిధతరునికరపరివృతంబై నిర్వింధ్యాతరంగశీకరశీతలం బైనతత్ప్రదేశకాననంబునఁ దపస్సు సేయం బూని వర్షశతంబు ప్రాణాయామమున మనోనియమనం బొనర్చి నిర్ద్వంద్వుఁడై వాయుభోజనుండై యేకపాదస్థితుండై "జగదీశ్వరు నేను శరణు వేఁడెద నాతండు నాకాత్మసమసంతానము నొసంగెడు" మని చింతించుచు ఘోరతపంబు సల్పుటయు నతనిప్రాణాయామమునం బొడమి మిన్నంటినయనలంబున ముల్లోకములు దపించుటం జూచి జగదీశ్వరులు మువ్వురు నప్సరోమునిగంధర్వసిద్ధవిద్యాధరాదులు తమ కీర్తి ప్రస్తుతింపఁ దదాశ్రమంబున కేతెంచినం జిత్తప్రకాశంబు వొడమి లేచి యత్రి హంసగరుడవృషభారూఢులై స్వస్వచిహ్నముల నొప్పి క్షే కరుణావలోకవిలసితవదనులై తనయెదురం బొడగట్టియున్న బ్రహ్మ

విష్ణుమహేశ్వరులం గాంచి సాష్టాంగదండప్రణామం బాచరించి తదీయ మహనీయతేజఃప్రతిహతంబులై కన్నులుమూసికొని చిత్తంబుఁ దదాయత్తంబుఁ గావించి కృతాంజలియై వినయమృదులవచనముల నిట్లని విన్నవించె. ప్రతికల్పంబునను మాయాగుణంబుల విభజించి జగదుద్భవస్థితిలయార్థంబు బ్రహ్మవిష్ణుమహేశ్వరాఖ్యమూర్తిత్రయంబుఁ దాల్చు మీకు ముగ్గురకుం బ్రణమిల్లెద. మీముగ్గురిలో నెవ్వని నేఁ బిల్చితి నద్దేవుఁడు నాకు శరణం బయ్యెడు. ప్రజాసంతతినిమిత్తం బొక్కదేవుని నేఁ బ్రార్థించిన మనస్సునకు నత్యంతదూరులైనమీరు ముగ్గురు నరుదెంచుటకు విస్మయం బయ్యెడు. ప్రసన్నులరై తత్కారణంబు వివరింపుఁడని విన్నవించిన నవ్వుచు వారు మృదుభాషితముల నత్రికిట్లనిరి. బ్రహ్మర్షీ, సంకల్పించినవిధంబున సత్సంకల్పుఁ డగు నీకు భావ్యం బయ్యె. జగదీశ్వర శరణార్థివై నీవు తపంబు సల్పినకతనఁ జద్ధర్మవంతు లగుమేము మువ్వురము నీకు సాక్షాత్కరించితిమి. మాయంశముల లోకవిశ్రుతు లగు మువ్వురుకొడుకులు నీకుఁ బుట్టి భగవత్కీర్తిని విస్తరింపఁ జేయుదు రని వర మొసఁగి యాత్రిమూర్తు లాదంపతులు గావించినపూజలం గ్రహించి యంతర్ధానంబుఁ గాంచిరి. దానం జేసి బ్రహ్మాంశమున సోముఁడు విష్ణ్వంశమున దత్తుఁడు శంకరాంశమున దుర్వాసుఁడు నాతనికిఁ గలిగిరి. అంగిరసునిపత్ని యగు శ్రద్ధ సినీవాలి కుహువు రాక యనుమతి యనఁ బుత్త్రికాచతుష్టయముం గనియె. ఉచథ్యబృహస్పతు లన నిరువురు తత్పుత్త్రులు స్వారోచిషమన్వంతరంబునం వెలసి రది యట్లుండె. పులస్త్యుఁడు హవిర్భుగభిధాన యగుతనపత్నియందు జన్మాంతరమునందు జఠరాగ్ని యగునగస్త్యుం గాంచె. విశ్రవసుఁడు నతనికిఁ బుత్త్రుండయ్యె. విశ్రవసున కిళబిళయందుఁ గుబేరుఁడు కైకసియందు రావణకుంభకర్ణ విభీషణులుం బుట్టిరి. పులహాపత్ని యగుగతి కర్మశ్రేష్ఠుఁడు వరీయస్సు సహిష్ణుఁ డనఁ బుత్త్రత్రయంబుఁ గనియె. క్రతుభార్య యగుక్రియ బ్రహ్మతేజోవిరాజితు లైనవాలఖిల్యుల నఱువదివేవురం గనియె. వసిష్ఠున కూర్జ యనుభార్యయందుఁ జిత్రకేతుఁడు సురోచి విరజుఁడు మిత్త్రుఁ డుల్బణుఁడు వసుభృద్యానుఁడు ద్యుమంతుఁ డన నేడ్వురుపుట్టి సప్తర్షులైరి. అతనికి వేఱొకభార్యయందు శక్తిప్రభృతు లగు పెక్కండ్రు

సుతు లుద్భవించిరి. అథర్వుపత్ని యగుచిత్తి యశ్వశీర్షుం డైనదధ్యంచుం డనుకొడుకును ధృతవ్రతుం డైనవానింగనియె. భృగువు నిజపత్ని యగు ఖ్యాతియందు ధాతయు విధాతయు నను నిరువురుకొడుకులను భగవత్పర యగు శ్రీదేవినింగనియె. మేరుతనయ లగునాయతిని యతినామకన్యకలం గ్రమంబున ధాతయు విధాతయుం బెండ్లియై మృకండుఁడు ప్రాణుం డనుకొడుకులం బ్రత్యేకంబు గనిరి. అందు మృకండునకు మార్కండేయుండును బ్రాణునకు వేదశిరుండును గలిగిరి. శుక్రుఁడును భృగునకుం గుమారుం డయ్యె. కర్దమదుహితృసంతానంబు నీకుం జెప్పితి. శ్రద్ధతో దీని విన్నం బాపక్షయం బగు.

బ్రహ్మపుత్త్రుం డైనదక్షుండు స్వాయంభువమనుపుత్త్రి యగు ప్రసూతిం బెండ్లియై షోడశకన్యకలం గాంచి ధర్మునకుం బదుమువ్వు రగ్ని కొక్కర్తను మిళితు లగుపితరుల కొక్కర్తెను భవచ్ఛిదుం డైన భవున కొకర్తె నొసంగె. అందు శ్రద్ధ మైత్త్రి దయ శాంతి తుష్టి పుష్టి క్రియ యున్నతిబుద్ధి మేధ తితిక్ష హ్రీమూర్తి యనుపదుమువ్వురు ధర్మునకుం బత్నులైరి. అందు శ్రద్ధాదులు పన్నిద్దఱు క్రమంబున శ్రుత, ప్రసా, దాభయ, సుఖ, ము, త్స్మయ, యోగ, ద, ర్పార్థ, స్మృతి, క్షేమ, ప్రశ్రయాఖ్యసంతతిం బడసిరి.

### మైత్రేయుఁడు విదురునకు నరనారాయణజన్మంబు చెప్పుట

మూర్తియందు సర్వగుణోత్పత్తిస్థానం బైననరనారాయణు లనుఋషులు జనించిరి. అప్పుడు విశ్వమెల్ల సుఖించె. మనస్సులు దెసలు వాయువులు నదులు సముద్రములుం బ్రసన్నంబు లయ్యె. దివంబున దేవవాద్యంబులు మ్రోసె. పుష్పవర్షంబు గురిసె. మునులు సంతుష్టులై స్తుతించిరి. గంధర్వకిన్నరులు పాడిరి. అచ్చరలాడిరి. లోకమెల్లం బరమమంగళం బయ్యె. బ్రహ్మాదినిర్జరులు దఱిసి యిట్లని ప్రస్తుతించిరి. గగనంబున గంధర్వనగరంబు నె ట్లట్లు స్వీయమాయాబలంబునం దనలో నీ విశ్వము సృజించి వానికి వెలుఁగు గావింప ధర్మునింట ఋషిరూపమున నాత్మప్రకాశనంబొనర్చిన యప్పరమపురుషునకుం బ్రణమిల్లుదుము. శాస్త్రవేద్యతత్త్వం బైనయాదేవదేవుం డిందిరామందిరం బైనయరవిందముం గ్రిందుపఱుచుకరుణాసాంద్రం బైనలోచనంబున మము జగన్మర్యాదకుం

జేటు వాటిల్లనీక యరయుచుండెం బెసత్త్వగుణమునం దాను సృజించిన మమ్ముం జూచుంగాక యనియిట్లు సురలు స్తుతింప దాని నాలించుచుం దత్పూజలం గొని గంధమాదనంబునకు వారరిగిరి. హర్యంశరూపు లగునాబుషులే భూభారం బడనయింప యాదవకౌరవకులంబులందుం గృష్ణార్జునులై యవతరించిరి. దక్షుకన్య యగుస్వాహా యనునది యగ్ని వలన హుతభోజనులై యగ్న్యభిమానులై నపావకపవమానశుచినామ ధేయు లగుముగ్గురుకొడుకులం గనియె. వారికి నలువదియేవురు సుతు లుద్భవిల్లి పితృపితామహులతోడం గలిసి నలువదితొమ్మండ్రుగనై వేదచోదితయజ్ఞకర్మంబుల నాగ్నేయేష్టులందుం గ్రియానిర్వహణం బొన ర్తురు. అగ్నికరణంబు గలిగి సాగ్ను లయ్యెది లేనినిరగ్ను లన ద్విప్రకారులై నయగ్నిష్వాత్త బర్హిష త్సోమ పాజ్యప నామధేయు లగుపితరులు దాక్షాయణి యగుస్వధ యనునిజపత్నియందు వయు నయు ధారిణియు నన బ్రహ్మవాదినులై జ్ఞానవిజ్ఞానపారగ లగునిద్దఱు కూఁతులం గనిరి. దక్షుకన్య యగుసతి శివుని బరిణయంబై పతి నను వర్తించియు నిరపరాధుం డగుపతియెడం దనతండ్రి ప్రతికూలుండై యునికిం జేసి యాత్మగుణశీలములకుం దగినపుత్త్రుం గనక యప్రౌఢయై యోగ మభ్యసించి మేను దృజించె ననిన విదురుండు మునీంద్రా, దుహిత వత్సలుం డైనదక్షుఁడు గూఁతు నాదరింపక శీలవద్వరుం డైనశివున కేల యలిగె? చరాచరగురుఁడు నిర్వైరుఁడు శాంతవిగ్రహుం డాత్మా రాముఁడు జగమునకెల్లం బరమదైవతం బైనశివునియెడ దక్షునకు విద్వే షంబు గలుగ నేమి కారణంబు. సతీదేహత్యాగమూలం బైనయాజా మాతృశ్వశురవిద్వేషంబుఁ దెలియం జెప్పు మని యడుగుటయు నతనికి మైత్రేయుం డిట్లనియె.

**మైత్రేయుఁడు విదురునకు శివకృతదక్షమఖధ్వంసము చెప్పఁ దొడఁగుట**

తొల్లి ప్రజాపతులసత్త్రంబున సురలు బుధులు మునులును జేరసియుండునెడ నిజతేజంబు సభ వెలిగించుచు రెండవసూర్యుండునాం జూడ నొప్పుచు దక్షుండు వచ్చిన నతనిమహనీయతేజంబునకు వెఱఁగంది విరించియు శర్వుండును దక్కం దక్కినసదస్యులు నగ్నులును దమతమ యాసనంబులు విడిచి లేచి నిల్చినం దదీయసత్కారంబు వడసి దక్షుండు

బ్రహ్మ కెఱఁగి యతనియానతిం గూర్చుండి తనకు మున్న కూర్చుండి యున్నవాని దేవుం గాంచి యది తన కవమానంబుగా గణించి యలిగి కన్నుల నిప్పులు రాల నయ్యభవుఁ జఱచుచుఁ జూచుచు సదస్యులదెస మొగంబై "బ్రహ్మర్షులు సుర లగ్నులు నందఱును వినుండు. సాధుజనుల వృత్తంబు చెప్పెదఁగాని యజ్ఞానముననొండె మత్సరంబుననొండె నేమి యుం బలుకను. లోకపాలురకీర్తిఁ జెఱుచుచు సిగ్గు మాలినయీశివుఁడు స్తబ్ధుఁడై పెద్ద లాచరించినమార్గము దూషించె. బ్రాహ్మణులు నగ్నియు సాక్షులుగా సావిత్రిసమాన యగునాకూఁతుం బెండ్లి యైనకతంబున నాకు శిష్యుండయ్యు నీమర్కటలోచనుండు ప్రత్యుత్థానాభివాదనార్హుం డైననన్నుఁ గని వాఙ్మాత్రముననైన నుచితంబు నడుపఁడయ్యె. ఘోర ములగుభూతప్రేతగణంబులు పరివేష్టింపఁగ శ్మశానభూములందు వెం డ్రుకలు జాఱవైచియుఁ గాటిబూడిద పూసియుఁ బీనుఁగుదండలు నెమ్ము కలునుం దాల్చియు దిసమొలయై యున్మత్తునిరీతి నేడ్చుచు నవ్వుచుఁ దిరుగుచుఁ దమోమాత్రాత్మకాత్ము లగుభూతప్రమథగణంబులకుఁ బతి యనం బేరు వడసి మత్తజనప్రియుండై మత్తుఁడై లుప్తక్రియుండై యశుచియై భిన్నమర్యాదుఁడై యశివుఁ డగునీశివవ్యాజునకు వేద సరస్వతిని శూద్రున కెట్టు లట్టులు పరమసాధ్వి యగుసతిం బరమేష్ఠి చోదనంబునం జేసి యక్కటా! యిష్టము లేకుండిన నిచ్చితి" నని తెగఁబాఱి నోరికి వచ్చినట్లు నిందించి యప్పటికిం బ్రతికూలంబు సేయఁ బూనక శాంతిమై నున్న యియ్యీశ్వరునకు మఱింత యలిగి యాచ మించి శుచియై "దేవగణాధముఁ డైనయీభవుఁడు దేవయజనంబున నింద్రోపేంద్రాదులతో సమానంబుగ యజ్ఞహవిర్భాగంబుఁ బొందకుం డెడు" మని సదస్యముఖ్యు లందఱు నొక్కటియై వలదు వల దని యొత్తి చెప్పి వారించిన నమ్మాటలు గీటునం బుచ్చి శాప మిచ్చిన నచ్చంద్ర మౌళి యలుకవెంపున దిగ్గన లేచి నిజనివాసమునకుఁ జనియె. ఆ శాపం బెఱింగి శివపరివారాగ్రేసరుం డైననందీశ్వరుండు రోషకషాయరూషి తుండై "మర్త్యదేహముమీఁది యభిమానంబునం జేసి తనకుఁ బ్రతి ద్రోహం బొనర్పక శాంతుఁడై యున్నశంకరునకు ద్రోహ మొనర్చిన దక్షుండు భేదదర్శనుండై తత్త్వవిముఖుఁ డయ్యెడు. కపటధర్మము లగు

గృహములలోనం గ్రామ్యసుఖేచ్ఛంజేసి యాసక్తుండై వేదములంగలి యర్థవాదములం బరమార్థ మని నమ్మి బుద్ధి సెడి యెల్లప్పుడుం గర్మతం త్రంబ నడపెడు. అనాత్మభూతములపై నాత్మాభ్యాసంబున నాత్మగతి మఱచి పశుప్రాయుండై యత్యంతస్త్రీలోలుం డయ్యెడు. అచిరంబ బస్త ముఖుం డయ్యెడు. కర్మమయ మగునవిద్యపై విద్యాబుద్ధిం జేయుసీ జడుండు నీతని ననుసరించి శర్వు నవమానించునితరు లందఱును సర్వ కాలంబు సంసృతిచక్రంబునం దిరుగుడువడుదురు. మాధుర్యసౌరభ్యముల వెలయించుచుం బుష్పోపమేయంబులైన వేదార్థవాదవాక్యములం దవిలి కలుషితచిత్తులై శివద్వేషులు నిత్యపమోహంబుం గాంతురు. బ్రాహ్మ ణులును హరతిరస్కారంబు వినుటంజేసి సర్వభక్షులు వృత్త్యర్థంబు విద్యాతపోవ్రతధారులు విత్తదేహేంద్రియారాములు నగుదు" రని దక్షునకు బ్రాహ్మణులకును శాపం బిచ్చె. అప్పుడు బ్రహ్మకులంబును శపించుట కలిగి భృగుండు "భవవ్రతధరులు తదనుసారులును బాషం డులై సచ్ఛాస్త్రశత్రువులై నష్టశౌచులై మూఢబుద్ధులై జటాభస్మాస్థి ధారులై సురాసవప్రధానంబైనశైవదీక్షం గ్రహింతురు. ధర్మసేతు వగువేదమును బ్రాహ్మణులను నిందించినమీరుం బాషండత్వంబు దప్పదు. వేదమార్గంబు సనాతనంబు లోకక్షేమంకరంబు జనార్దన ప్రమాణంబునై యొసంగెడు సన్మార్గంబు పరిశుద్ధంబు నగునాశబ్దబ్రహ్మ మును నిందించి మీరు పాషండులై మీదేవుం డగుభూతపతియొద్దకుం జనుం" డని ప్రతిశాపం బొసంగె. అట్లాసమ్మర్దంబునం గపర్ది లేచి పోయినపదంపడి యెట్లో దక్షుండు సహస్రవత్సరసత్రంబు నిర్వహించి హరి నారాధించి గంగాయమునాసంగమంబున నవభృథం బొనర్చుటయు నందుం గృతావగాహులై సదస్యులు శుద్ధచిత్తంబులతో నిజనివాసం బుల కరిగిరి.

**సతీదేవి దక్షయజ్ఞమునకుం బోవ శివుననుమతి వేఁడుట**

అవ్విధమున నితరేతరవిద్వేషంబున నయ్యల్లునకు మామకును బెద్ద కాలంబు గడచె. అంతం గొంతకాలమునకు బ్రహ్మదేవుండు దనుం బ్రజాపతులకుం బతిగా నభిషేకించినం గర్వించి దక్షుండు వాజపే యంబు సలిపి బ్రహ్మిష్ఠుల కెక్కుడై మించి బృహస్పతిసవం బనునుత్తమ

యాగంబు సేయం బూనిన సమ్మఖమునకు బ్రహ్మర్షులు దేవర్షులు దేవబృందంబులును బితృగణంబులును భార్యాయుతంబుగా నరుగుటయు నభంబునం బోవుచున్న యాఖేచరులవచనంబులం దండ్రియజ్ఞమహోత్సవం బెఱింగియు సిద్ధగంధర్వవిద్యాధరసుందరులు లెస్సలై సేసికొని రమణులతోడం గూడి వేడుక గడలుకొన నరుగుచుండుటం గుఱంగటం గనుంగొనియు సతీదేవి యయ్యధ్వరంబుం జూడ వేడుక గడలుకొనిన మనంబుతోడం దనపతి యగు శంకరున కిట్లనియె: దేవా, మీమామ యగు దక్షప్రజాపతి యిప్పుడు యజ్ఞమహోత్సవమునకుం దొడఁగియున్నవాఁడు. వారె విబుధు లచ్చటికిం బోవుచున్నవారు మీకిష్ట ముండిన మనము నటకుం బోవ మనియున్నదాన నాతోడంబుట్టువులు పతులతోడం సుహృద్దర్శనంబుం గోరి నిక్కం బక్కడ కిప్పు డేతెంతురు. నేను మీతోడం గలిగి యచ్చటికిం జని సత్కారంబుం గొని రాం గోరుదు. పతియుతులైనసాభగినులను మాతృభగినులను స్నేహార్ద్రచిత్త యగు తల్లిని మహర్షులు నడపించునయ్యుత్తమయజ్ఞమునుంజూడ నుత్కంఠాతిశయంబుతో నామనంబునం గోర్కులు గ్రేళ్లువాఱెడు. ఆత్మమాయామహిమంబున గుణత్రయాత్మకంబైనయీజగము సృజించిన మీ కియ్యది యెల్ల నాశ్చర్యము గొలుపకున్నం దత్త్వ మెఱుంగని స్త్రీజాతి యగు నేను దైన్యంబున జన్మభూమిం జూడం గోరుదు. బంధుత్వసంబంధము లేనియితరాంగనలు నలంకృతాంగులై ప్రియులతో నామఖంబునకుం జనుచున్నవారు. అదె చూడుండు నభంబెల్ల హంసధవళంబులైనతద్విమానంబుల సొంపారుచుండెడు. తండ్రియింట నుత్సవం బగుచున్నం గూఁతున కెట్టు లచ్చోటికిం బోవ మనసు గదలకుండు? పిలువకున్నను నెలంతలు పతిగృహంబునకుం బుట్టినింటికి సుహృద్భవనంబునకు బోవం దలంతురుగదా. కావునం గరుణాభరంబున నాకోర్కె నెరవేర్ప మీరు దగుదురు. భవదీయదివ్యకృపాపరిపాకంబునం గాదె యేను త్వదీయదేహార్ధంబు వడయం జాలితి. నావేఁడికోలాలించి యనుగ్రహింపుం డని విన్నవించినం బ్రియావచనంబు విని గిరీశుండు నవ్వుచుం దొల్లి ప్రజాపతులు మున్నగువారియెదుట నాదక్షుం డాడినదుర్భాషణబాణంబుల మర్మంబులు గాఁడం దలంచికొనుచు సతి కిట్లనియె. కల్యాణీ, పిలువ

కుండిన నాత్మబాంధవులయిండ్లకుఁ బోఁదగు నని నీపలికినపలు కనాత్మాభిమానమునఁ జెరిగినకోపమున నంతకుమున్న దోషదృష్టి గలిగింపకుండునేని గ్రాహ్యం బగు. సాధువులకు గుణములయ్యు నసాధువులకు దోషరూపంబు లైనవిద్యాతపోవిత్తవపుర్వయఃకులంబు లనునాఱింటఁ బోతరించి స్మృతి సెడి దృష్టి దప్పి పెద్దలమహిమం బెఱుంగక వచ్చినవారిం గుటిలమతిం జేసి భ్రూవిక్షేపదుర్నిరీక్ష క్రోధవీక్షణంబులం జూచుచు నాదరింపనివారు స్వజనులైనను వారియిండ్లకుఁ బోవందగదు. వక్రమతులగుస్వజనుల దురుక్తులువిని మర్మములునొవ్వహృదయ పరితాపంబుతోఁ బడియుండునట్లు శత్రువులతీవ్రశరప్రహారమునను జనుండు గాఱియ పడఁడు. ఉత్కృష్టగతి యగునాప్రజాపతికి నీవు పుత్త్రికలలో నధికప్రేమభాజనం బని యేనిక్కం బెఱుంగుదు. ఐనను నన్నాశ్రయించినకారణంబున నిన్నతఁ డాదరింపఁడు. అనహంకారులపుణ్యకీర్త్యాదిసమృద్ధులం గాంచి చూపోపక తదీయపదంబు వడయనేరమిం జేసి మనంబు నింద్రియంబులు సెరియ నసురులు హరింబోలె నాతం డట్టిమహనీయులతోడం గలహించెడు. ఆత్మవిదులు ప్రత్యుత్థానాభివాదనాదిపూజలు దేహమునకై చేయరు మఱియంతర్యామి యగుపరమపురుషునకై యొనర్తురు. అంతర్యామి యగునవ్వాసుదేవుఁ డందఱిడెందములందు నిరస్తావరణుండై వెలుఁగుచుండెడు. ఇంద్రియాగోచరుండై సర్వహృదంతరనిరంతరుం డైనయప్పరమపురుషు నేను సంతతము మనంబున నమస్కరింతు. కావున దక్షుండు నీకుఁ దండ్రియైనం జూడఁ దగఁడు. ప్రజాపతుల సత్త్రంబున దుర్వచనంబులఁ దిరస్కరించినయతండును దదనుసారులును నాకు ద్వేషులు. నామాట వినక యరుగుదేనియు నందు నీకు మేలు గలుగదయ్యెడు. మర్యాదమానిసికి స్వజనులవలనితిరస్కారంబు గలిగిన నది మరణాంతం బగు నని చెప్పి శర్వుండు సతి నచ్చటకుఁ బంపినను బంపకున్న నిరుదెఱంగుల గీడు మూడు నని నిశ్చయించి మిన్నకుండె.

### సతీదేవి దక్షయజ్ఞమున నవమానితయై దేహముఁ ద్యజించుట

అంత సతీదేవియుఁ బతి యానతి యొసఁగమిం జేసియుఁ బితృగృహమునకుఁ బోవలయు నను కోర్కి మనంబునం బెల్లలముటయుం జేసియుఁ దా నప్పు డెయ్యదియుం జేయఁజాలక డోలాయమానమానసయై

కొండొకవడి యూరకుండి యట స్వజనావలోకనేచ్ఛాప్రతిఘాతంబునఁ
కలుక వొడమ మేను వడఁక విన్నఁబోవుచుఁ గంటనీరువెట్టి యసమానుం
డైనతనపతిఁ జఱచుఱం జూచుచు వేఁడినిట్టూర్పు నిగిడించుచు స్త్రీజాతికి
సహజం బైనమూఢత్వమునం జేసి తనదేహార్ధం బొసంగి కూర్మి సేయు
చున్నపతిని విడిచి శోకరోషదూనహృదయంబుతోఁ బితృగృహంబునకుఁ
జనియె. తఱలుటయు శివపార్షదులైనమణిమత్ప్రముఖులు పెక్కండ్రా
దేవికి వలయుశారికందుకదర్పణాంబుజమాల్య ధవళచ్ఛత్రచామరాదులం
గొని యద్దేవిని వృషభారూఢం జేసి కొలుచుచు శంఖదుందుభివేణు
ప్రభృతివివిధవాద్యనాదంబులు సెలంగ వెంటనంటి నడచిరి. అవ్విధంబునం
జని సతీదేవి బ్రహ్మఘోషోర్జితయజ్ఞవైశసంబై మృణ్మయదారుమయా
యోమయ హిరణ్మయపాత్రంబులను గుశచర్మపరికరాదులనుం బరి
పూర్ణంబై విప్రర్షివిబుధనీరంధ్రంబై యొప్పునయ్యజ్ఞశాలం జొత్తెంచె.
తల్లియుఁ దోఁబుట్టువులుదక్కఁ దక్కినవా రెవ్వరును దక్షునకు వెఱచి
యద్దేవిని వచ్చినదాని నాదరింపకుండిరి. మాతృతద్భగినీనిజభగినులు
ప్రేమాదరసంభ్రమంబుతో నిండుఁగౌఁగిటం గ్రుచ్చి బంధుభావము
సెఱఁ దగినకుశలప్రశ్నాదులు నడిపి యుచితాసనం బొసంగి సత్క
రింప నున్నంత సతీదేవి తండ్రి యాదరింపనికొఱంత మనంబుఁ ద్రిప్పి
కొలుపుటయు వానిం గొనక రుద్రభాగంబుఁ గల్పింపక తండ్రి యయ్య
జ్ఞము నడిపించి తనపతికి హేళనము సేయం బూనినదానికి లోక
ములనెల్లం గాల్చురీతి నత్యంతక్రోధంబు గదుర దక్షువిధ్వంసనార్థం
బురువడించుభూతగణంబుల నిజతేజంబున నిగ్రహించి కర్మాచరణ
గర్వితుం డైనయాశివద్వేషిని నిందించుచు జగంబెల్ల వినఁగఁ గ్రోధపరు
షాక్షరంబుల నిట్లనియె. దేహులకెల్లఁ బ్రియుం డైనయెవ్వనికి మించిన
వాఁడును బ్రియుఁడు నప్రియుండు నీలోకమునం గలుగఁ డట్టినిర్వైరుం
డైనసర్వాత్మునకు నీవు దక్క మఱియెవ్వఁడు ప్రతికూలముగ వర్తించు?
నీయట్టిసాధువులకుఁ బరులగుణములందు దోషబుద్ధి సేయఁ దగదు.
గుణము లల్పములై యున్నం బెద్ద సేయుమహాత్ములయెడ దోషము నీ
వారోపింతువు. మహాపురుషపాదపరాగము లీసునం జెఱుప నిరస్త
తేజస్కులై దేహాత్మలవాదులైనయసాధుజనులయెడ నియ్యది యాశ్చ

ర్హంబుగాదు. మఱి యట్టివారి కిట్టిదేశోభనంబయ్యెడు. శివ యను రెండ క్షరములు ప్రసంగవశమున నొకపరి యుచ్చరించినం బాపక్షయం బగు. పవిత్రకీర్తి యలంఘ్యశాసనుఁడు నగునట్టిశివునకు శివేతరుఁడవై యలుగుదువు. బ్రహ్మామృతరసముఁ గ్రోలఁ గోరు పెద్దలు హృదయమధుకరంబుల లోకకామితప్రదంబైనయెవ్వనిపాదపద్మంబు నాశ్రయింతు రట్టిలోకబాంధవునకు నీవు ద్రోహ మొనరించితివి. ఆదేవదేవుఁడు శ్మశానంబున జటాకలాపంబు విప్పి భస్మదిగ్ధగాత్రుండై శవమాల్యకపాలధరుండై పిశాచగణంబులతోఁ దిరుగుచుండుట నీకుం బెద్దలగు బ్రహ్మాదులు శివమందురో యశివ మందురో నీ వెఱుంగవు. వారెల్ల నతండు కాలఁ ద్రోచినవానిం దలలఁ దాల్తురు. నిరంకుశులై దుష్టాత్ములు ధర్మపాలకుండైనయీశ్వరుని నిందించునపుడు వారింప శక్తిచాలకుండినం జెవులు మూసికొని యచ్చోటు వాసి యరుగుటొండె శక్తియుండునేని యా నిందకునినాలుక గోయుటొండె నాత్మప్రాణములఁ ద్యజించుటొండె ధర్మంబు. శివదూషకుం డైననీవలనం బ్రభవించినయీదేహము నింక ధరింపఁ బోలదు. మోహమున దుష్టాన్నంబుఁ దిన్న నది యఱుఁగకయ మున్న క్రక్కుట యుత్తమంబుగదా. ఆత్మానందమున రమించుమహామునికిఁ గర్మబోధకవేదవాదంబులు రుచింపవు. దేవమనుష్యులకు గతిభేదంబు లున్నయట్టు లయ్యైవారికిఁ బృథగ్ధర్మంబులు గలవు. అది యరయక స్వధర్మనిష్ఠుం డైనలాఁతి నధిక్షేపింపఁ జనదు. ప్రవృత్తినివృత్తిలక్షణంబై యుభయలింగం బైనధర్మము వేదంబుల నిక్కంబ నిరూపితం బయ్యె. అయ్యవి రెండు నొక్కని కొకప్పుడు చేయ వలనుగాదు. బ్రహ్మరూపుఁ డైనయీశ్వరున కుభయవిధకర్మాచరణంబును గర్తవ్యంబు గాదు. యజ్ఞశాలల నత్యాయాసంబున నీ వార్జించుధూమమార్గానుసారిలోకంబులు మాకుఁ బ్రార్థ్యంబులు గావు. యజ్ఞాన్నతృప్తు లగు ప్రాణధారులే వానిం గొనియాడుదురు. ఇచ్ఛామాత్రప్రభవంబులై బ్రహ్మవిత్సేవితంబు లైనపుణ్యలోకములు మాకుఁ గలవు. హరున కపరాధము సేయువానిదేహమునం బొడమినయీకుత్సితదేహమునం గలుగుఫల మింతకుఁ జాలుఁజాలు. కుజనప్రసంగంబున నాకు సిగ్గయ్యె. మహాత్ములకుఁ గీడు సేయువానిజన్మంబు గాల్పనే? ఈమే

నింకను నేఁ బొట్టునేని వృషధ్వజుండు పరిహాసాదులతఱి "దాక్షా యణీ" యని నన్నుఁ బిలుచునప్పుడు నీపేరు విన్న నత్యంత దుఃఖము నాకయ్యెడుఁ గావున నీయంగమునం బుట్టినశవప్రాయం బైన యీశరీరముం ద్యజింతు నని పలికి విరమించి యించుక యుదగ్దిశ సరిగి పీతదుకూలంబుఁ దాల్చి కూర్చుండి యాచమించి శుచియై కన్నుఁ గవ మూసి యోగపథం బావేశించి యాసనజయం బొనర్చి ప్రాణా పానంబుల రెంటి నూర్ధ్వాధోవృత్తినిరోధమున నేకరూపములం గావించి నాభిచక్రంబునఁ జేర్చి యట నుదానంబు లేపి యవ్వాయు వుల బుద్ధితోడ హృదయంబున నిలిపి యచ్చోటునుండి కంఠమార్గ మున భ్రూమధ్యంబునకుఁ జొనిపి పూజ్యులకుఁ బూజ్యతముండైనమహా దేవుఁడు దనతొడపై నిడికొని యాదరించినయాదేహమును సతీదేవి మనస్వినియై దక్షునిమీఁదికోపావేగమునం ద్యజించి గాత్రంబునఁ బవ నాగ్ని ధారణఁ గావించి యాత్మభర్తృపాదారవిందముల ధ్యానించుచు నొండొక్కయర్థముఁ జూడకుండుటయు నాసమాధియోగాగ్నిచే నా దేహము భగ్గనఁ బ్రజ్వరిల్లుటయు భూమ్యంతరిక్షములం బరమాద్భుతం బయ్యె. హాహాకారంబులు వెలుచ నెసఁగె. కటకటా! దేవదేవుని దేవి యగుసతీదేవి దక్షుఁ డలిగింపఁ బ్రాణములఁ ద్యజించె. చరాచరం బెల్లఁ దనకుఁ బ్రజలుగా నొప్పుదక్షునిదౌర్జన్యం బిట్లగునే? సన్మా నార్హురా లగుకూఁతురు మనస్వినియయ్యుఁ దనతప్పిదంబునకై మేను విడిచె. తనయంగమునం బుట్టినపుత్త్రి తనయపరాధమునకై శరీరత్యా గంబు సేయ నుండ వల దనియుం బలుకకుండె శివద్వేషి యగునీ చూపోపని బ్రాహ్మణాధముఁడు లోకమున మిక్కిలి దురశ్యంబుఁగాంచెడు మని యచ్చట నున్నజనులు పలుకుచున్నంత శివపార్షదులు సతీదేహ త్యాగంబుఁ జూచి కైదువులం బూని దక్షుం జొరిగొనఁ గడంగుటయు వారియురవడిం జూచి యధ్వర్యం డైనభృగుఁడు యజ్ఞఘ్నహారం బగు యజుస్సు పఠించి వ్రేల్చె. వ్రేల్చుటయుఁ దోడన తపోబలమున సోమ ప్రాప్తులైనఋభువు లనునమరు లుద్భవిల్లి కొఱవులఁ గొని తఱిమినం బ్రమథగుహ్యకాదులు బ్రహ్మతేజఃపరాభూతులై పఱచిరి.

## ఈశ్వరుఁ డలిగి దక్షమఖధ్వంసము చేయుట

దక్షునియసత్కారమున సతీదేవి దేహముద్యజించుటయు భృగు హోమోత్పన్ను లైనఋభువులు నిజపార్షదులఁ దఱుముటయు నారదునివలన విని రుద్రుం డుదగ్రక్రోధోద్రిక్తుండై యవుడు గఱచి తటిద్వహ్నిసటాప్రభం బైనజట యొక్కండు వెఱికి యట్టహాసంబుతో గంభీరధ్వానంబునఁ గ్రిందఁ బడ వేయుటయు భుజసహస్రంబు ముగ్గురుసూర్యు లట్టు లొప్పుమూడునేత్రంబులు కరాళదంష్ట్రలు జ్వలితాగ్ని సవర్ణకేశంబులుం దనరి మి న్నంటినమేనఁ గపాలమాలికలఁ దాల్చి వివిధాయుధములం గొని పరమదుస్సహతేజంబుతో వీరభద్రుఁ డుద్భవించి యెదుర నిలిచి బద్ధాంజలియై యేమి సేయుదు నని యడుగుటయు భూతనాథుఁ డయ్యా, నీవు మదీయభటులలో నగ్రగణ్యుండవు. వేగంబ యరిగి మదీయాంశ ప్రభావమున దక్షునిఁ దద్యజ్ఞమునుం బరిహరింపు మని యాన తిచ్చె. . ఆక్షణంబ యతండు వల్లె యని యద్దేవుని వలగొని మహాత్ముల తేజస్సులెల్లఁ దా నోర్వఁ జాలుదు నని తనలోఁ దలపోసి జగదంతకాంతకం బైనశూలంబుఁ గేలంబూని నూపురఘోషంబు ఘల్లని మ్రోయఁ బెలుచ నార్చుచు బహుళరుద్రపార్షదగణంబులు పరివేష్టించిరాఁగ దక్షమఖస్థానంబునకు నడచె. అట్లు వారరిగినం దదీయాంఘ్రిసంఘట్టనోత్థితం బైనధూళిజాలంబుఁ గాంచి యక్కడ యజ్ఞశాల నున్నఋత్విజులు సదస్యు లుత్తరమునం గ్రమ్ము పెనుదుమ్ముపలకించి యిది యేమి యేల యి ట్లయ్యెడు నని యచ్చటి బ్రాహ్మణులును దత్పత్నులు నిట్లని తమలో విచారించుచుండిరి. గాడ్పులు వీవవు. దస్యులు రారు. తత్కాలరాజగు ప్రాచీనబర్హి యుగ్రదండుఁడై బ్రదికియుండెడు. గోగణంబులు తఱుముంబడవు. ఏల యిట్టు లీదుమ్ము పెలుచ రేఁగెడు? లోకమునకుఁ బ్రళయం బయ్యెడునొక్కొ యను చున్నంత దక్షపత్ని యగుప్రసూతి మున్నగువా రుద్విగ్నచిత్తలై యిట్లనిరి. ఇయ్యది ప్రజాపతి యొనర్చినయపరాధంబకాని యొండు గాదు. అతండు గూఁతు లందఱు చూచుచుండ నిరపరాధ యగుసతి న ట్లవమానింపఁ బోలునే? ప్రళయకాలమునం బ్రకీర్ణజటాకలాపుఁడై దిగ్గజంబుల నిజశూలాగ్రమున ధరించి నానాయుధసంభృతంబు లైనబాహు

శాఖలు సాచి దిక్కులు పిక్కటిల్ల నట్టహాసం బొనర్చుచు నృత్యంబు సేయుచున్నసహ్యతేజుం డైనరుద్రుని మన్యువేగఘటితభ్రూకుటీచటులనిటలుం డైనవానిఁ గరాళదంష్ట్రాద్యుతినిరస్తతారద్యోతుం డైనవాని నలిగించినం బ్రహ్మదేవునకైన మేలు గలుగునే? యని పలుదెఱంగులఁ బలుకుచున్నంత దక్షునకు భయావహంబులై నానోత్పాతంబులు పుడమిని మింటనుం దోఁచె. అంతలో నానాయుధధారులు హ్రస్వదీర్ఘాకారులు నానావర్ణులు నానాముఖులు నగురుద్రపార్షదులు యజ్ఞశాల ముట్టడించి కొందఱు ప్రాగ్వంశంబును గొందఱు పత్నీశాలను గొందఱాగ్నీధ్రశాలను గొందఱు విహారంబును గొందఱు పాకశాలను గొందఱు సదస్సు నాక్రమించి యజ్ఞపాత్రల విఱిచియు నగ్నుల నార్పియు నగ్నికుండములందు మూత్రము విసర్జించియు వేదిమేఖలల ఛేదించియు మునుల బాధించియు మునిపత్నుల నదల్చియుఁ గాందిశీకు లైనసురలఁ జిక్కినవారిం బట్టికొనియు బీభత్సంబు గావించిరి. మణిమంతుండు భృగుని వీరభద్రుఁడు దక్షునిఁ జండీశ్వరుఁడు పూషుని నందీశ్వరుఁడు భగునిం బట్టికొనిరి. రుద్రపార్షదులు ఱాల నువ్వీనం బడలేక సదస్యులు ఋత్విజులు సురలు నొకళ్లొకళ్లకుఁ జెప్పక పలుదెసలం బాఱిరి. వీరభద్రుఁడు స్రువహస్తుండై ప్రేల్చుచు సదస్సునఁ బరిహసించుచు మీసలు చూపిన భృగునిమీసలు పెఱికె. దక్షుఁడు ప్రల్లదంబు లాడునెడ నవ్వులకుఁ గనుసన్న చేసినభగునినేత్రంబులు పెల్లగించె. శివునిదూఱునపుడు నగుచుఁ బండ్లు వెలుపలికిఁ జూపినపూషునిదంతము లనిరుద్ధవివాహమునం గళింగదంతములు బలభద్రుం డెట్టు లట్టులు రాల్చె. దక్షునితో మ్మదిమి వాఁడికరవాలంబునం ద్రుంచియు దాని గ్రమ్మఱ నాకర్షింపఁజాలక యనేకశస్త్రాస్త్రంబుల నతనిచర్మంబు ప్రయ్య నేరక విస్మితుండై యావీరభద్రుండు మెడ నులుముట మున్నగుయజ్ఞపశువిశసనోపాయంబులఁ దలంచి యాదక్షునితల నులిమినం బ్రేతభూతపిశాచగణంబుల సాధువాదంబులు నితరులవిపరీతవాదంబులు నప్పుడు విన నయ్యె. అట్లు వీరభద్రుండు దక్షునిశిరంబు గొని దక్షిణాగ్నిలో వ్రేల్చి యజ్ఞశాలం గాల్చి కైలాసంబునకుఁ జనియె.

### బ్రహ్మాదులు దక్షాదిజీవనార్థంబు శివుం బ్రార్థించుట

అట్టియెడ సురలు రుద్రపారిషదులయాయుధంబుల సంగభంగముం గాంచి నొచ్చి భయాకులులై బ్రహ్మపాలికిం జని ప్రణమిల్లి వృత్తాంత మంతయు విన్నవించిరి. అది యట్లు గాఁగలయది యని మున్నె యెఱింగినవారు గావున బ్రహ్మదేవుఁడును విష్ణుదేవుఁడు నాయజ్ఞమునకుఁ బోవరైరి. దేవవాక్యంబువిని బ్రహ్మ వారి కిట్లనియె. అత్యంత తేజస్వి యగుపురుషునివలన నేదేనొకయపరాధము గలిగిన నాత్మక్షేమానుభూతిఁ గోరునితరులకుఁ బ్రత్యపరాధంబు సేయఁదగదు. మీరు నిరపరాధుఁ డగుభవునకు యజ్ఞభాగము నిషేధించి యాదేవున కపరాధంబు సేసితిరి. కావున మీరు యజ్ఞముఁ గ్రమ్మఱఁ గూర్పఁ గోరుదు రేని పరిశుద్ధచిత్తులరై కాళులు పట్టుకొని శీఘ్రప్రసాదం డైనయా వామదేవునిఁ బ్రసన్నుం జేసికొనుఁడు. అతం డలిగిన నీలోకములును లోకపాలురును నశించుట నిక్కువంబు. దక్షుదుర్భాషణంబుల మున్నె యలిగినయాతం డిప్పుడు ప్రియాదేహత్యాగకారణంబున నెంతయుఁ గనలియుండెడు. ఏనును యజ్ఞుఁడును మీరును మునులును మఱియు నితరు లగుదేహధారులెల్ల నాతనిబలవీర్యప్రమాణం బెఱుంగఁ జాలకున్న నయ్యాత్మతంత్రుం బ్రసాదింప నెవ్వాండు వెరవరి యగు నని చెప్పి యప్పద్మసంభవుం డాసురపితృప్రజాపతులతోడ శివసన్నిధానమున కరిగె. అరిగి జన్మౌషధి తపోమంత్రయోగసిద్ధులు గిన్నరగంధర్వులు నప్సరోగణంబులును బెరయవఱలుచు, నానాధాతుచిత్రితంబు లైనవివిధమణిమయశిఖరంబుల నలరుచు, రమణులతోడం గ్రీడించుసిద్ధసుందరులకు విహారస్థానం బైనబంధురకందరంబుల నొప్పుచు, శుకపికమయూరమధురారావంబులఁ బల్కరించునట్లును లలితమారుతాందోళనం జలించు పూఁదెమ్మలఁ జేతులు సాఁచి పిలుచునట్లును దెరువరులకుఁ దోఁపఁ జేయుచుఁ గుసుమవిసరమధురమకరందాస్వాదతుందిలేందిందిరగానంబుల రసికులడెందములం దమందానందంబుఁ గ్రందుకొల్పుచు నల్పేతరరామణీయకంబునం జొప్పట్టు చూతకదంబనీపపున్నాగచంపకపాటలాశోకవకుళకురువక మందారపారిజాత సరళతమాలసాల తాలకోవిదారరసనార్జునాది కామదోహినానాతరునికరంబులను కుందకుటజమల్లికామాలతీవాసంతికాది

లతావితానంబులను నిండారుచుఁ దుమ్మెదమొత్తమ్ముల కామెత సల్పు తియ్యదేనియ లొల్కుచు హంససారసాదుల కావాసంబు లైనకుముదోత్పలకమలకల్హారశతపత్రంబులకింజల్కపరాగంబులం దనరు శిశిరశీకరనికరములం గొనివచ్చుమందమారుతంబు లోలయ రసికులహృదయంబుల నింపుగూర్చుకమలాకరంబులఁ బెంపారుచు, సింహవ్యాఘ్రవరాహశల్యశరభగవయతరక్షుగురుమహిషాది క్రూరసత్త్వంబుల సంచారమున భీకరంబగుచు కపిహరిణాది ప్రచారంబుల వేడుకపుట్టించుఁ గస్తూరీమృగంబులు నిర్భయంబుగఁ దిరుగుటం జేసి తదీయనాభిస్పర్శంబునం దావి పిసాళించు గండోపలంబుల వెలయుచు, సతీదేవి తీర్థమాడినకతంబునం బరమపావనం బైనగంగానది చుట్టుకొని పాఱ నేపారుచు నత్యంతదర్శనీయం బైన కైలాసధరణీధరంబుఁ గనుంగొని బ్రహ్మాదులు పరమాశ్చర్యభరితచిత్తులై యచ్చట నలకాపురంబును సౌగంధికాభిధానంబు లైనసరసీరుహంబులఁ దనరి వైదూర్యవిరచితసోపానంబై కింపురుష సేవితంబై చూడ నొప్పు సౌగంధికాభిధానవిఖ్యాతం బైన యుపవనంబును హరిచరణ రేణుసంస్పర్శపావనంబులై పిపాస లేకున్నం బురుషగజంబులు దమప్రియలకుఁ ద్రావ నియ్యఁగ నభిరామం బైనజలక్రీడాయాతపతి సమేత సురసుందరీకుచకుంకుమపంకసంకీర్ణ జలపూరితంబు లైననందయు నలకనందయు ననుగంగాప్రవాహములనుం గడచి చనిచని దవుదవ్వున యోజనశతోన్నతంబు పంచసప్తతి యోజనాయామశాఖాకదంబనీరంధ్రంబు కులాయరహితంబు సమంతతోపచిత శీతలచ్ఛాయా మేదురంబు తాపవర్జితంబు నగువటభూరుహంబుఁ గాంచిరి. అట మహాయోగమయం బై ముముక్షుశరణం బైన యావటవృక్షంబుక్రింద సునందాదు లగుశాంతసిద్ధులును సఖుఁ డగు కుబేరుఁడును గొలువఁ వ్యక్తాత్ముఁ డైనయంతకునిరీతిఁ బరమశాంతుం డై విద్యాతపోయోగపథం బాశ్రయించి వాత్సల్యంబున లోకమంగళంబుఁ జింతించుచుఁ దాపసాభీష్టంబు లైనభస్మదండజటాజినంబుల ధరించి సంధ్యాభ్రసవర్ణం బైనయుత్తమాంగంబునఁ జంద్రరేఖం దాల్చి దర్భమయాసనంబునందు వామపాదంబు దక్షిణోరుతలంబునను సవ్యభుజంబు వామజానుప్రదేశంబుననుం జేర్చి వీరాసనం బాశ్రయించి కూర్చుండి దక్షిణభుజమణిబంధమున నక్షమాలిక బూని తర్జన్యంగు

ష్ఠాంగుళులయగ్రంబులు సంయోజించి తర్కముద్ర సూపుచుఁ బ్రశ్నో
న్ముఖుం డైననారదునకు సజ్జనులు వినఁగ సనాతనం బైనబ్రహ్మవిద్యయుప
దేశించుచు యోగకక్ష్యం గొని సమాధినిష్ఠుండై బ్రహ్మానందనిర్వా
ణంబు సాక్షాత్కరించియున్న యాదిమునీశ్వరుం డైనమహేశ్వరుం గాంచి
బ్రహ్మాదు లందఱుం బ్రణమిల్లిరి. అప్పుడు గిరీశుండు బ్రహ్మదేవుని వచ్చిన
వానిం గాంచి వామనమూర్తి కశ్యపున కెట్టులట్టులు సురాసురేంద్రవం
దితపదుం డైనయప్పద్మభవునకు మ్రొక్కుటయు నచ్చట నున్నరుద్రా
నువర్తు లగుసిద్ధమహర్షు లందఱును బ్రహ్మ కెఱఁగిరి. అంత నయ్యంభోజ
సంభవుండు నవ్వుచు నాశశాంకశేఖరున కిట్లనియె. ఈశ్వరా, నీ వీ
జగత్తునకుఁ బ్రకృతిపురుషులకుం గారణంబనియు నిర్భేదంబు నిర్వికారంబు
నగు బ్రహ్మం బనియు నే నెఱుంగుదును. నీవకదా యవిభక్తము లగుశివ
శక్తులలోఁ గ్రీడించుచు నూర్ణనాభంబుమాడ్కి నితరసాధనము లపేక్షిం
పక యీవిశ్వమునకు సృష్టిస్థితిసంహారంబు లొనరింతువు. ధర్మార్థంబులఁ
గూర్చువేదత్రయంబు రక్షించుతదర్థంబు నీవకదా దక్షవ్యాజమున నధ్వ
రంబు సృజించితివి. ధృతవ్రతు లైనబ్రాహ్మణులు విశ్వసించుధర్మమర్యా
దల నెల్ల నీవకదా నిర్ణయించితివి. శుభకర్మముల నాచరించువారి కను
ష్ఠానపద్ధతిభేదానుసారంబున స్వర్గాపవర్గంబుల దుష్కర్మంబులఁ జేయు
వారికి నరకంబును నీవకదా యొసంగుదువు. అట్లు నీవు కర్మానుగుణ
ఫలంబు లిచ్చుచున్న నొక్కండువివేకంబు వాసి పాపంబు సేయు నది
యట్లుండె. భవదీయచరణములపయిం జిత్తంబుఁ జేర్చి సర్వభూతంబులలో
నిన్నును సర్వభూతముల నాత్మయందు నపృథగ్భావంబునఁ జూచుమహా
త్ముల నజ్ఞతిరస్కారి యగురోషము చేరరాదు. భేదదర్శను లైకర్మపరు లై
దురాశయు లై పరులయుత్కర్షమునకుఁ జూపోపక దుర్భాషణంబులఁబరుల
నొప్పించు దైవోపహతుల నీయట్టియుదారునకుఁ జంపఁబోలునే? దురంత
మగువిష్ణుమాయకుఁ దవిలి పృథగ్దర్శను లైనమందమతు లేమి నొక
తప్పితంబొనర్చిన నయ్యది దైవవిక్రమంబని తలపోసి సాధువు లట్టివారి
పయిం గరుణింతురు. హరిమాయకుఁ జిక్కనిసర్వజ్ఞుం డైననీవు మాయా
హతాత్ము లైనకర్మ పరులయెడ ననుగ్రహ మొనర్ప నర్హుఁడవు. నీనిమి
త్తమునం బరిపూర్ణత్వంబు వొందనియజ్ఞము నుద్ధరింపుము. యజ్ఞఫల

ప్రసన్నుండైన నీకు యజ్ఞహవిర్భాగముఁ గుత్సితయాజకులు కల్పింపమి తప్పిదంబు. యజమానుఁ డగు దక్షునకు జీవితంబును భగునకు నేత్రంబులను భృగునకు శ్మశ్రుప్రరోహంబును బూషునకు దంతముల నాయుధాశ్మఘాతవికలాంగు లైన దేవఋత్విగాదుల కంగసాకల్యంబునుం గలుగ ననుగ్రహింపుము. యజ్ఞశేషం బెల్ల నీభాగ మయ్యెడు నని చతుర్ముఖుండు ప్రార్థించినం దదీయానునయాలాపములకు నవ్వుచు శంకరుం డిట్లనియె.

## శివుండు సంతుష్టుండై దక్షాదుల ననుగ్రహించి యజ్ఞపూర్తి చేయుట

ప్రజాపతీ, దేవమాయాపరాభూతు లగు బాలకులయపరాధము నేఁ జింతింపను. మఱి యపరాధమునకుఁ దగినదండము విధించితి. దగ్ధశీర్షుండైనదక్షునకు మేఁకతల శిరం బయ్యెడు. మిత్రనేత్రముల భగుండు చూచెడు. పూషుండు యజమానదంతములం బిష్టపురోడాశంబుఁ దినుం గాక. వికలాంగు లైనదేవాదు లశ్వినులబాహువులఁ గృతబాహువులును బూషహస్తములఁ గృతహస్తులునై యంగసాకల్యంబు వొందుదురుగాక. భృగుండు బస్తశ్మశ్రువులఁ గృతశ్మశ్రుండయ్యెడు మని పలికిన నప్పలుకు విని యెల్లవారు లెస్స లెస్స యని పరితోషంబుతో ననుమోదించిరి. అంత నాచంద్రచూడుండును విధాతయు నిలింపులు ఋషులు నయ్యజ్ఞస్థానంబున కరుగుటయు నందు శివోపదిష్టమార్గమునం బ్రతివిధానంబు చేయంబడు నెడ యజ్ఞపశువుతలఁ దెచ్చి దక్షునికబంధము తోడం జేర్చుటయు రుద్రవీక్షణమునం జేసి దక్షుండు నిద్ర మేల్కొన్నవానిచందంబున లేచి శివాపరాధకలుషితాత్ముం డయ్యును నాతండు శివప్రసాదవిలోకనంబు వడసినకతంబున శరత్కాలహ్రదంబుచాడ్పున నిర్మలాంతఃకరణుండై శివుం బ్రస్తుతింపం బూనియుఁ బుత్రీదేహత్యాగంబుఁ దలపోసి ప్రేమోత్కంఠావినిర్గళదశ్రుధారాసారంబునఁ బ్రస్తుతింప మాటలాడ నేరక యెట్టకేల కుపశాంతుండై దగ్గుత్తిక వెట్టి నిష్కపటభావంబున నిట్లనియె. మహానుభావా, యేను బ్రల్లదంబులు పలికినతప్పిదంబునకు దండ మొనరించి యనుగ్రహంబుఁ జూపితి విది శిక్షగాని యుపేక్ష గాదు. నీకును హరికిం బ్రాహ్మణాధములయెడ నుపేక్ష గలుగ దన్న ధృతవ్రతులయెడఁ జెప్ప నేల? నీవు దొలుత బ్రహ్మవై యాత్మముఖములవిద్యాతపోవ్రతపరు లగువిప్రుల నాత్మతత్త్వసంప్రదాయప్రవర్త

నార్థంబు సృజించితివి. కావునఁ బశుపాలుండు పశుగణంబుల నెట్టులట్టులు బ్రాహ్మణుల సర్వాపత్సమయంబులందును నీవు పాలింతువు. తత్త్వదర్శనం బెఱుంగక నాఁడాసభలోఁ దీవ్రబాణతుల్యము లగు దుర్భాషణముల నిన్ను నొవ్వఁబలికిన తప్పిదంబునం జేసి నరకమునం బడకుండ నీ వాతప్పుగొనక కరుణార్ద్రవీక్షణంబున నన్నుఁ బ్రోచినయుపకారమున కేనేమి ప్రత్యుపకారంబు సేయఁ జాలుదు? స్వకృతోపకృతికి నీవే సంతోషింపు మని దక్షుండు సవినయముగ విన్నవించి శంకరు ప్రసాదంబువడసి యద్దేవుఁడును బ్రహ్మదేవుఁడు ననుమతి యొసంగ నుపాధ్యాయబుత్విగ్జనంబులతోఁ గ్రమ్మఱ యజ్ఞానుష్ఠానంబునకుఁ దొడఁగె.

## దక్షయజ్ఞమునఁ బ్రత్యక్షం బైనహరిని దక్షాదులు స్తుతించుట

అట్టియెడ బుత్విజులు యజ్ఞావిచ్ఛేదంబుఁగోరి వీరసంసర్గప్రాయశ్చిత్తార్థంబు త్రికపాలపురోడాశనిర్వపణపూర్వకంబుగా విష్ణుదేవతాకం బైనయిష్టి చేయ నెంచిన నమ్మెయి విశుద్ధబుద్ధితో నధ్వర్యుండు ప్రేల్చి ధ్యానించుటయుఁ బక్షవిక్షేపంబున బృహద్రథంతరసామగీతంబులఁ దనరించుగరుడునిపయిం గూర్చుండి నిజదివ్యతేజంబున దెసలెల్ల వెలిఁగించుచు హరి సాక్షాత్కరించె. కాంచనకాంచీకలాపంబు సూర్యబింబసంకాశకిరీటంబుఁ భ్రమరమాలాసమాననీలాలకపరిష్కృతకనకకుండలమండితాననంబునుం దనర శంఖచక్రపద్మశరచాపగదాఖడ్గచర్మాదిసాధనసంభృతం బైనపీనాయతబాహుచతుష్టయంబున విశాలవిటపవిలసితం బైన కుసుమితకర్ణికారమహీరుహంబుఁ గ్రేణిసేయువిలాసంబు మీఱ వనమాలాపరిష్కృతవక్షస్స్థలంబున లక్ష్మీదేవి తేజరిల్ల సుదారస్మేరవిలోకనంబున లోకం బనుగ్రహించుచు రాజహంసోపమంబు లగువింజామరలు పూర్ణచంద్రాభం బైనయాతపత్రంబు, మున్నగునుత్తమలాంఛనంబులలో సన్నిధి చేసినయాసర్వేశ్వరుం గాంచి బ్రహ్మరుద్రేంద్రాదు లందఱును దదీయతేజఃపరాభూతనిజద్యుతులై తటాలున లేచి మ్రొక్కి మస్తకన్యస్తాంజలులై తదీయమహిమంబున కర్వాచీనవృత్తులయ్యు యథామతి స్తోత్రంబు లొనరించిరి. అప్పుడు తొలుత దక్షుం డుత్తమంబు లగుపూజాసాధనములం గొని పరిశుద్ధుండై యరిగి యంజలిబంధంబు ఘటియించి సునందనందాదిపరివృతుండు యజ్ఞేశ్వరుండు విశ్వసద్గారు

లకుం గురుండు నగునాదేవదేవు నిట్లని ప్రస్తుతించె. దేవా, నీవు స్వప్రకాశమున నిత్యనివృత్తము లగునఖిలమనోవృత్తుల వెలసి చిన్మాత్రఘనుండవై భేదశూన్యుండవై యభయుండవై మాయను నిరసించి స్వతంత్రుండవై యమ్మాయం గొని పురుషనాట్య మభినయించి రాగాదిసహితుండైన యపరిశుద్ధునిరీతి నితరులకుం జూపట్టుచుండుదువు. భవదీయతత్త్వంబు దురూహం బనిన ఋత్విజు లిట్లనిరి. దేవా నిరుపాధికులుండైన నీతత్త్వమును నందీశ్వరశాపమునం గర్మతంత్రమునందే దురాగ్రహముం గాంచుటంజేసి యే మెఱుంగం జాలము. ధర్మోపలక్షణంబని వేదములం బ్రతిపాదింపంబడిన భవదీయయజ్ఞస్వరూపమును నీ వధిష్ఠించియుండుదువని యెఱుంగుదు మనినసదస్యు లిట్లనిరి. అత్యంతాయాసములు దుర్గములుగా నంతకుం డుగ్రవ్యాళంబుగా విషయములు మృగతృష్ణికలుగా నహంకారాస్పదంబైనశరీరంబు మోవరానిబరువుగా ద్వంద్వదుఃఖములు గర్తములుగా శోకము దవానలంబుగా దుర్జను లనుమృగములవలని భయంబు పెల్లై యొప్పునీసంసారమార్గమునం బ్రవర్తించుకామపీడితంబైనయజ్ఞులపాలు రక్షణప్రదం బైనభవచ్చరణస్థానం బెప్పుడు చేరునని పేర్కొనుటయు రుద్రుం డిట్లనియె. వరదా, నిష్కాము లగు మునుల కత్యంతాదరంబున నర్చనీయం బైన నీపాదములమీంద మతి నెలకొల్పిననన్ను విద్యాహీనులు తిరస్కరించినం దిరస్కరింతురుగాక. నేనిట్టివాండ నని నీచిత్తమునం దలపోయుదేని నీయనుగ్రహమునం జేసి యేను గైలాసాదులనుం గణింప ననిన భృగుముని యిట్లనియె. అత్యంతగహనం బైన యుదీయమాయకుం దవిలి బ్రహ్మాదులు నాత్మబోధము దప్పి తమంబు సొచ్చి తమలో నంతర్యామి యగు నాత్మునితత్త్వంబుం దెలియకుండుదు రట్టిభక్తాత్మ బాంధవుండు నాకుం బ్రసన్నుం డయ్యెడు ననిన బ్రహ్మ యిట్లనియె. పదార్థభేదగ్రాహకం బొనర్చునింద్రియములం బురుషుండు నీస్వరూపంబుం గాంచ నేరండు. జ్ఞానమునకును జ్ఞేయ మగుద్రవ్యమునకుం గారణం బైనసత్త్వాదిగుణముల కాశ్రయుండవయ్యు నీవు మాయామయప్రపంచమునకుం బరుండవనిన నింద్రుం డిట్లనియె. ఆయుధోపేతంబులై రాక్షసులం దెగం

జూచు నెనిమిదిభుజములతోడం గూడిన యీభవదీయదివ్యగాత్రంబు విశ్వభావనంబును మనోనయనానందకరంబునై యొప్పెడు నని ఋత్విక్కు లిట్లనిరి. భవదారాధనార్థంబు బ్రహ్మనిర్మించిన యీయజ్ఞమో యజ్ఞేశ్వరా, దక్షునిమీఁద నలిగినపశుపతికోపమునఁ బ్రధ్వంసంబుఁ జెంది శ్మశానప్రాయంబై కన్పట్టుచుండెడి. కమలలోచనముల దీనికిఁ బావనత్వముఁ గావింపు మనిన ఋషు లిట్లనిరి. కర్మముల నాచరించుచుండియు నీవు తల్లేపంబుఁ బొందకునికి యఘటమానం బైన నీయెడఁ జెల్లుచుండెడు. ఇతరులు పలుదెఱంగులఁ దపస్సులు చేసి యత్ప్రసాదంబుఁ గోరుదు రట్టిశ్రీ తాన వచ్చిన నీ వాదరింపకుండుదు వనిన సిద్ధు లిట్లనిరి. అస్మన్మానసకుంజరంబు క్లేశము లను దావానలంబునకుఁ జిక్కి తాపంబు నెంది దప్పిగొని భవత్కథాసుధాప్రవాహమున మునిఁగి బ్రహ్మసంపన్నంబై యాక్లేశములఁ దలంపకుండెడు ననిన దక్షపత్ని యగుయజమాని యిట్లనియె: ఈశ్వరా, నీకు స్వాగతంబు. ప్రసన్నుఁడ వగుము. శ్రీనివాసా, నమస్కారము. శ్రీసమేతుండవై మమ్ముఁ బ్రోవుము. తలలేనిమొండె మెట్లట్లు నీవు లేకుండిన నితరాంగము లెన్ని యుండిన నీసుఖంబు శోభింప దనిన లోకపాలు రిట్లనిరి. ప్రత్యగ్దృష్టిని దృశ్యదర్శి యగునని న్నసద్దర్శనంబు లైనమాయింద్రియముల నెట్లు చూడ నేర్తుము. పంచభూతోపలక్షితుం డైనజీవుని రీతిఁ దోఁచుటయే భవదీయమాయావిలాసం బనిన యోగేశ్వరు లిట్లనిరి. విశ్వాత్ముఁ డగునీయం దాత్మభేదంబుఁ గనువానికంటెఁ బ్రియతరుఁడు నీకుఁ గలుగఁడు. అనన్యవృత్తి యగుభక్తిచే నిన్నుపసర్పించుమమ్మనుగ్రహింపుము. జీవాదృష్టమువంజేసి జగదుద్భవస్థితిలయకార్యముల నిమిత్తమునఁ బలువిధములవిభిన్నగుణములం దనరుచు నుండునాత్మమాయచే నాత్మభేదముఁ గల్పించియు భేదభ్రమగుణనివృత్తిం గాంచిన పరమాత్ముఁ డగునీకుఁ బ్రణమిల్లుదుమనిన శబ్దబ్రహ్మం బిట్లనియె. ఏనును నాకుఁ బరు లగుబ్రహ్మాదులు నెవ్వనిపరతత్త్వం బెఱుంగ నేర మట్టినిర్గుణుండయ్యు సత్త్వగుణం బాశ్రయించి ధర్మాదులకుం బ్రేరకుం డైన నీకు నమస్కారం బనిన నగ్ని యిట్లనియె. ఎవ్వని తేజమున నేను సమిద్ధతేజుండనై యధ్వరముల నాజ్యసిక్తము లగుహవిర్భాగముల

వహింతు నట్టి * పంచవిధయజ్ఞస్వరూపుఁడు † పంచయజుర్మంత్రప్రాప్తుఁడు నగుయజ్ఞమూర్తిం బ్రణుతింతు ననిన దేవత లిట్లనిరి. ప్రళ కల్పాంతమున నీవిశ్వమెల్లఁ దనకుక్షిలోపలఁ దాల్చి మహార్ణవజలంబున శేషతల్పంబునం బవ్వళించి సిద్ధులహృదయంబున నధ్యాత్మవిమర్శమునకు గోచరుండ వగునీవు కరుణాతిశయమున మాకు సాక్షాత్కరించితివి. నీభృత్యు లగుమమ్ముఁ బ్రోవు మనిన గంధర్వు లిట్లనిరి. దేవా, మరీచ్యాదులును బ్రహ్మరుద్రేంద్రాదులును నీయంశాంశంబులు. ఈజగంబు నీకుఁ గ్రీడాసాధనంబు. ఇట్టినీకు నిత్యంబు మ్రొక్కెదమనిన విద్యాధరు లిట్లనిరి. నీమాయకుఁ దవిలి జన్మమెత్తి యీకళేబరమునం దాత్మాభిమానము చేసి యుత్పథప్రవృత్తు లగుస్వీయపుత్రాదులవలన నధిక్షేపంబుఁ గాంచియు నసద్విషయములయెడ నాస చేయుదుర్మతియు భవత్కథామృతంబు సేవించు నేని యాత్మమోహంబు వాయు ననిన బ్రాహ్మణు లిట్లనిరి. యజ్ఞంబు నీవ. హవ్యంబు నీవ. హవ్యవాహుఁడు నీవ. మంత్రంబు నీవ. సమిద్దర్భపాత్రాదిసాధనంబులు నీవ. ఋత్విక్సదస్యులు నీవ. దంపతులు నీవ. అగ్నిహోత్రంబు నీవ. స్వధాసోమాజ్యపశువులు నీవ. ఏనుఁగు పద్మలత నెట్టు లట్టులు తొల్లి యజ్ఞవరాహమూర్తివై యోగులు ప్రస్తుతింపఁ బాతాళగతం బైనభూమండలంబు నవలీల నుద్ధరించితివి. సత్కర్మభ్రంశ మొంది భవద్దర్శనముఁ గోరుమాకుఁ బ్రసన్నుఁడ వగుము. ఎవ్వనినామములు కీర్తించిన యజ్ఞవిఘ్నములు నశించు నట్టినీకుఁ బ్రణామ మని యిట్లు లందఱు దమకుఁ దమకుఁ బోలినవిధముల నయ్యజ్ఞేశ్వరుం బ్రస్తుతించిరి. అంత దక్షుండు రుద్రాభిమర్శితం బైనయయ్యజ్ఞమును హృషీకేశకీర్తనమునం జేసి సాంగముగ నెఱవేర్చె. భగవంతుఁ డాత్మోద్దేశమున ననుష్ఠితం బైనత్రికపాలేష్టిభాగమున సుప్రీతుండై దక్షున కిట్లనియె. ఏనును బ్రహ్మయు శర్వుఁడును జగత్కారణం బనియు నాత్మస్వరూపుల మనియు నీశ్వరుల మనియు సాక్షిమాత్రుల మనియు స్వయంప్రకాశుల మనియు భేదరహితుల మనియు నెఱుఁగుము. గుణ

---

* అగ్నిహోత్రము, దర్శపూర్ణమాసములు, చాతుర్మాస్యములు, పశువు, సోమ మని యజ్ఞభేదము లైదు. † ఆశ్రావయ, అస్తుశ్రౌషట్, యజయే, యజామహే, వషట్కారము అని యజుర్మంత్రము లైదు.

మయం బగునాత్మమాయం బూని యేను జగదుద్భవస్థితిలయముల నొనరించుచుఁ దత్తత్కార్యముల కనురూపము లగుసంజ్ఞల గ్రహింతు. కేవలుఁ డద్వితీయుఁడు పరమాత్ముండు బ్రహ్మస్వరూపము నగు నాయందు బ్రహ్మరుద్రులను భూతములను భేదదర్శనంబున నజ్ఞుఁడు చూచు. ఆత్మాంగము లగుశిరఃపాణ్యాదులయందుఁ బరబుద్ధిం జేయని విధంబున మత్పరుఁడు భూతములలో భేదము గనఁడు. సర్వభూతాత్మ లేకస్వరూపులు నగుమామువ్వురిలో భేదముఁ గననియతఁడు శాంతిం బొందు నని భగవంతుండు బోధించిన దెలిసి దక్షుం డయ్యజ్ఞేశ్వరుని విష్ణుదేవతాకం బైనత్రికపాలేష్టి నారాధించి ప్రధానాంగరూపములై ద్వివిధము లైనయజ్ఞముల సురలం బూజించి రుద్రభాగమున రుద్రు నర్చించి యాకర్మముల శేషపు లగునితరులం దనిపి ఋత్విజులతో నవభృథస్నానం బొనర్చుటయు దానం బ్రాప్తసిద్ధికిఁ డగుదక్షునకు ధర్మమతిస్థిరత్వంబు గలుగ ననుగ్రహించి త్రిదివంబునకుఁ జనిరి. ఇవ్విధంబున దాక్షాయణి యగుసతీదేవి దేహముఁ ద్యజించి యటహిమవంతునిక్షేత్రం బైనమేనయందుఁ బునర్జన్మ మెత్తి ప్రళయలీన మగుశక్తి దఱిలోఁ బరమేశ్వరు నెట్లెట్లనన్యభావమునఁ దనదయితుఁ డగుశివుం బొందె నని విందుము. ఇయ్యది శంభుదేవుని దక్షాధ్వరధ్వంసప్రకారంబు. బృహస్పతిశిష్యుఁడు భాగవతుఁడు నగునుద్ధవునివలన దీని వింటిని. పవిత్రం బైనయీపరమేశ్వరచరిత్రంబు నిత్యంబు వినినం బఠించినను నరుల కాయుఃకీర్తులును బాపక్షయంబును భక్తిపారమ్యంబునుం గలుగు నని చెప్పి విదురునకు మైత్రేయుండు వెండియు నిట్లనియె.

సనకాదులును నారదుఁడును ఋభువు నారుణియు నింద్రియనిగ్రహపరులై నైష్ఠికులై వివాహములు వర్జించిరి. కావున నాబ్రహ్మపుత్త్రులకు సంతానంబు లేకుండె. అధర్మసంతానంబు వినుము. అధర్మమునకు మృష యనుభార్యయందు దంభమాయలు గలిగి మిథునం బగుటయు సంతానంబు లేనినిరృతి వారిం దాను గ్రహించె. అమ్మిథునంబునకు లోభము నికృతియుం గలిగె. ఆయిద్దఱకుఁ గ్రోధహింసలు కలిదురుక్తులుం గలుగుటయుఁ గలిదురుక్తులు మిథునం బైనమ్మిథునంబునకు యాతనానిరయంబు లనుమిథునంబు వుట్టె. ఇయ్యవి సంసారబంధకార

ణంబు లైనయధర్మవృక్షంబుశాఖలు. శ్రేయస్కాముఁడు విశేషించి యుత్తమాశ్రమస్థుఁడు వీని సేవింపరాదు. అధర్మసంతానప్రకారంబు సంగ్రహముగ నీకుఁ జెప్పితి. ఇది యిట్టి దని యెఱింగి వివేకవంతుఁడు వానిపొంతఁ బోవక యాత్మమలంబు నిరసించు.

### మైత్రేయుఁడు విదురునకు మనుపుత్రసంతతిఁ జెప్పఁ బూనుట

హరియంశాంశమున నవతరించినపుణ్యశ్లోకుఁ డగుస్వాయంభువమనువువంశంబుఁ జెప్పెద నాకర్ణింపుము. స్వాయంభువమనువునకు శతరూపయందు వాసుదేవకలచేఁ బ్రియవ్రతోత్తానపాదు లను నిద్దఱు కుమారులు జనించి లోక మేలుచుండిరి. అం దుత్తానపాదునకు సునీతియు సురుచియు నను నిద్దఱు భార్యలైరి. వారిలో సునీతికి ధ్రువుఁడును సురుచి కుత్తముఁడు నను బుత్త్రద్వయంబు గలిగె. ఆయిద్దఱుభార్యలలోఁ జిన్నది యగుసురుచియం దారాజునకుఁ బ్రేమాతిశయంబు మిగిలి యుండె. ఒక్కనాఁ డయ్యుత్తానపాదుఁ డుత్తమునిఁ గుఱు వెక్కించుకొని ముద్దాడునెడ ధ్రువుఁడును దఱిసి తానుం దండ్రి కుఱు వెక్కఁ బోయిన నుత్తానపాదుఁడు వారించుటయు దానికి మిక్కిలి గర్వించి సురుచి సవతికొడు కైనధ్రువుం జూచి రాజు విన నీసున నిట్లనియె. వత్సా, రాజపుత్త్రుఁడై నను నిన్నుఁ గుఱు వెక్కించుకొనన్నైన రాజొల్లమిం జేసి నీవు రాజ్యాసనం బారోహింపఁ దగవు. బాలుఁడవు గావున నన్యస్త్రీగర్భమునం బుట్టిన నీయధికారం బెఱుంగఁజాలక పడయరానియర్థముం గోరుదువు. రాజ్యాధిపత్యముఁ గోరుదేని తపం బనుష్ఠించి పురుషోత్తము నారాధించి నాగర్భమునం బుట్టి కోర్కి నెరవేర్చుకొను మని యధిక్షేపించుటయు సవతితల్లి దుర్భాషణములకు దండాభిహతం బైనపాముచాడ్పున నలిగి ధ్రువుఁడు తండ్రి వారింపమికి శోకంబు పెచ్చుపెరుగఁ బెద్దయు రోఁజుచు నేడ్చుచుఁ దనతల్లియొద్దకుఁ జనిన నాసునీతి పెదవులదరఁ గడురోఁజుచు నేడ్చుచున్నకొడుకుం జేరఁ దీసి తొడపయిం గూర్చుండఁబెట్టికొని బుజ్జగించి తనసవతి పలికినపలుకులు పౌరులవలన విని ధైర్యముఁ దొఱఁగి కార్చిచ్చునం గ్రాఁగుతీఁగమాడ్కి శోకానలమునం గుందుచు సపత్ని భాషితంబు దలపోసితలపోసి తామరరేకులం బోనిలోచనంబులఁ గన్నీరు నించుచుఁ బెద్దనిట్టూర్పులు నిగిడించుచు దుఃఖము

నకుఁ దుది గావఁ జాలక బాలుఁ డయినకొడుకున కిట్లనియె. వత్సా లాఁతులమీఁదఁ దప్పిదంబుఁ దలఁపవలదు. పూర్వజన్మముల నితరుల కొసఁగినదుఃఖము నే జనుఁ డీజన్మమునఁ గుడుచుఁ గావున నియ్యది స్వకృతంబ యని తలపోయుము. రాజు నన్ను భార్య యని చెప్పికొనుటకు లజ్జించుచుండ సురుచివాక్యంబులఁ దప్పిదం బేమి? నిర్భాగ్యురా లగు నా కడుపునఁ బుట్టి నాచన్ను గుడిచి పెరిఁగిననీకు రాజానుగ్రహం బెట్లు గలుగు? కావున రాజ్యాసనంబుపై నాస గలుగునేని మీతల్లి యగు సురుచివాక్యం బవ్యలీకం బని తలపోసి యమ్మాట పట్టి మత్సరం బుడిగి తపంబు సలిపి యధోక్షజపాదపద్మం బారాధింపుము. లోకములం బాలింప సత్త్వగుణము గ్రహించిన యమ్మహాత్మునిపాదపద్మంబుఁ గొలిచి యజుఁడు జితేంద్రియప్రాణుల కభివందనీయం బైనపరమేష్ఠిపదంబు సాధించె. భవత్పితామహుఁ డగుమనువు నమితదక్షిణలతో బహుయజ్ఞముల నేకమతి ననుష్ఠించి యద్దేవదేవు నారాధించి యైహికాముష్మికభోగముల నెల్ల ననుభవించె. కావున ముముక్షుజనసేవ్యచరణారవిందుం డైనయాభక్తవత్సలు ననన్యభావము స్వధర్మాచరణపరిశుద్ధము నగుచిత్తమునందు నెలకొల్పి భజింపుము. ఆపుండరీకాక్షునకంటె నిం కొక్కఁడు దుఃఖనివారకుండు గన్పట్టఁడు. ఇతరు లందఱు నెన్నియే యత్నంబు లొనర్చి తన్ను వెదక నలరులక్ష్మీదేవి యాదేవదేవుం దాన పాణిపరిష్కృతపంకజయై కొలుచుచుండెడు నని బోధించె.

### సపత్నీవచనమున నలిగి ధ్రువుఁడు తల్లి పంపునఁ దపమునకుఁ బోవుట

అర్థాగమకారణం బైనమాతృవచనం బాకర్ణించి ధ్రువుఁడు తాన తనమనంబు దృఢపఱిచికొని తండ్రిపురము వెడలుటయుఁ దదీయచికీర్షిత మెఱింగి నారదమునీంద్రుండు సన్నిహితుండై పాపశమనం బైన తనపాణితలమున నతనిశిరం బంటి విస్మితుండై యబ్బాలున కిట్లనియె. మానభంగ మోర్వనిక్షత్రియులకుఁ దేజం బింత యొప్పునే? బాలుఁడవయ్యు నీవు సవతితల్లిమాట సైరింపవు. సర్వసమృద్ధిసాంద్రం బైనస్వగృహముఁ ద్యజించి నిస్సహాయుండవై వత్సా నీవెక్కడకుఁ బోవుదువు? స్వజనావమానమునం జేసి నీమనంబు తపించుచుండు నని తలంచెద ననిన మునీంద్రా, యియ్యర్థంబు మీరు భగవద్ధ్యానంబునొండె

యోగసిద్ధినొందె నెఱింగితిరి కాఁబోలు. సురుచిపలుకులు వినఁ జాలను. మనము వ్రణ మయ్యె నని ధ్రువుండు చెప్పిన నతనికి నారదుఁడు వెండియు నిట్లనియె. ఆటలలోఁ బడుసీమున నున్నకుమారుఁ డగు నీ కిప్పుడు మానమొండె నవమానమొండె గణింపఁ దగినవివేకము జనించె నని తలంపను. అట్టివివేక మింతకు నుదయింపకుండిన మోహముకంటె నిం కొక్కటి పురుషులకు దుఃఖహేతువు నాకుం జూడఁ దోఁపకుండెను. దుఃఖ మనునది యెట్టివారికి నిజకర్మముల బలమునం గలుగుచుండెడు. ఈశ్వరానుగ్రహంబు లేకున్నం బ్రయత్నములు ఫలకారణంబులు గావని నిశ్చయించి యెంతయర్థము దైవోపపాదితం బగుఁ దావన్మాత్రమునఁ బరితుష్టిఁ బొందుట బుధునకుఁ గర్తవ్యంబు. తల్లియుపదేశముఁ గొని యోగమున హరిప్రసాదంబుఁ గాంతు నని పూనుదేని యతనియారాధనంబు దుష్కరం బని యేను దలంచెద. మునులుం బెక్కుజన్మముల నిస్సంగులై తీవ్రసమాధియోగముఁ బూనియు నాదేవునిపదముఁ దెలియఁ జాలకుండుదురు. కావున శ్రేయస్సమయము సమీపించినపుడు యత్నింతువుగాని యిప్పుడు నిష్ఫలం బైనయీప్రయత్ననిర్బంధ ముడుగుము. సుఖదుఃఖములలో నెయ్యది యెవ్వనికి దైవవిహితం బైయుండు నాతండు దాన నాత్మదోషముఁ బొంది సంసారమోక్షంబు నధిగమించు. తనకంటె నధికగుణుం జూచి ప్రీతియు నల్పగుణుం జూచి కరుణయు సమానుం జూచి చెలిమియుఁ గోరువాఁడు తాపముల నెరియఁ డని చెప్పిన నారదునకు ధ్రువుఁ డిట్లనియె. మహాత్మా, నాయట్టివానికి దురూహం బైనను సుఖదుఃఖహతాత్ములకు హిత మగుశాంతిమార్గము మీరు కృప చేసి బోధించితిరి. ఐనను క్షాత్త్రధర్మముఁ బూని యవినీతుఁడ నగునామనంబున సురుచివచోబాణములఁ గడు నొచ్చి యునికిం జేసి యెక్కకుండెడు. నా పెద్దలు నితరులు నధిష్ఠింపని త్రిభువనోత్కృష్టం బైనయుత్తమపదం బారోహింపఁ గోరునాకు నిరపాయం బైనయుపాయంబు బోధింపుము. మునీంద్రా, బ్రహ్మదేవుని దేహమునం బొడమినమీరలు లోకహితార్థంబు వీణ వాయించుచు నెల్లపుడు సూర్యునిరీతిఁ దిరుగుదురుగదా యనిన నారదుఁ డతని కిట్లనియె.

## నారదుఁడు ధ్రువునకుఁ దపోయోగం బుపదేశించుట

వత్సా, నీతల్లి చెప్పినమార్గంబు నీకు శ్రేయస్కరంబు. పరమభక్తితో భగవంతుఁ డగువాసుదేవుని భజింపుము. నరుఁడు ధర్మార్థకామమోక్షములలో నెద్దానిం గోరినను నన్నిటికిని హరిచరణ సేవనంబె కారణం బగు. కావున నయ్యా, నీవు యమునాతటంబున నమరుమధువనంబునకుఁ జనుము. ఆపుణ్యదేశమున హరి నిత్యసన్నిహితుండై వెలయు. అందుఁ గాళిందీపుణ్యజలమునం ద్రిషవణస్నానంబు సేసి యాత్మోచితము లగుదేవతానమస్కారాదు లొనరించి యుచితాసనంబునం గూర్చుండి పూరకకుంభకరేచకాత్మం బైన త్రివిధప్రాణాయామము లభ్యసించి ప్రాణేంద్రియమనోమలంబునిరసించి ధీరచిత్తంబుతోఁ బ్రసాదాభిముఖుఁడు నిత్యప్రసన్నవదనయుఁడు సుందరనాసాభ్రూకపోలాద్యవయవ సన్నివేశవిలసితుఁడు శ్రీవత్సాంకుఁడు వనమాలాలంకృతుఁడు శంఖచక్రగదాపద్మవిలసితబాహుచతుష్టయోజ్జ్వలుఁడు పీతాంబరధరుఁడు కిరీటకుండలకేయూరవలయకాంచీనూపురాది నానాభరణభూషితుఁడు కౌస్తుభవిభాసికంధరుఁడు నీలనీరదకమనీయగాత్రుఁడు నిజభక్తులహృదయకమలకర్ణికాంతరంబున నఖకిరణారుణచరణంబుల నెలకొల్పి స్మేరకటాక్షవీక్షణామృతంబుఁ జిల్కువాఁడు నగునవ్వాసుదేవుని ధ్యానింపుము. అతనిదివ్యమంగళవిగ్రహం బేకచిత్తంబుతోఁ జింతించువానికిఁ బరమనిర్వృతి గలుగుటయు వేగంబ యితరపదార్థస్మరణము దొలంగెడు. ధ్యానించునెడ వాసుదేవద్వాదశాక్షరమంత్రము జపింపవలయు. దేశకాలవిభాగం బెఱింగి యమ్మంత్రమునఁ బ్రతిమారూపంబున నానావిధ ఫలపుష్పదూర్వాంకురతులసీదళప్రముఖ బహుద్రవ్యంబులం బూజించి యట సలిలాదిద్రవ్యంబులు హరిమయము లని భావించి యందు నర్చించి నియతచిత్తుండై మునియై శాంతుఁడై పరిమితకందమూలాద్యాహారుఁడై హరిలీలావతారములనొనర్చిన లోకహితములఁ జింతించుచు ధ్యానింపవలయు. అర్చించునెడఁ బ్రత్యుపచారమునకు మంత్రభేదంబు గలుగదు. ఆద్వాదశాక్షరీమంత్రమునే యన్నిటియెడ నుపయోగింపఁ దగు. మంత్రమూర్తి యగునయ్యమూర్తిని న్విధమునం ద్రికరణశుద్ధిమై నారాధించిన నమాయు లగుతనభక్తులకుఁ బ్రసన్నుఁడై హరి

యుపాసకులకోర్కి ననుసరించి ధర్మార్థకామములలో నెద్దానిం గోరిన నొసంగు. ఇంద్రియార్థములయెడ విరక్తుండై ముక్తిం గోరి ధ్యానించిన నద్దానిం బ్రసాదించు నని చెప్పి నారదుఁ డతని కావాసుదేవద్వాదశాక్షరమంత్ర ముపదేశించుటయు ధ్రువుఁడు నారదునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి హరిచరణవిన్యాసపావనం బైనమధువనమునకుఁ దపోనుష్ఠానంబునకై చనియె.

### ఉత్తానపాదుఁడు నారదునివలన ధ్రువునితపశ్చర్య యెఱుఁగుట

అంతం దట్లు తపోవనమున కరుగుటయు నారదుఁ డుత్తానపాదు నొద్దకుఁజని యతనిపూజలం గ్రహించి సుఖాసీనుండై యోరాజేంద్రా, వాడినమొగంబుతో నేల పెద్దయుఁ జింతించెదవు? ధర్మార్థకామములలో నెద్దియేనియుఁ జెడియెనే యని యడుగ నమ్మనునందనుఁ డాబ్రహ్మనందనున కిట్లనియె. బ్రహ్మర్షివర్యా, పసిబాలుఁడు ప్రజ్ఞాశాలియు నగు నాకొడుకు ధ్రువుఁ డైదేఁడులప్రాయమువాఁడయ్యు స్త్రీజనము కరుణాహీనత్వమునంజేసి తల్లితోడఁ బురము వెడల నడువఁబడియె. దిక్కులేనియాకుఱ్ఱవాని నలసినతఱినొండె నిద్రించువేళనొండె నాఁకట నకనకలాడుచు మోము వాడ సొలసినపుడొండె వనమృగంబులు మ్రింగకుండునే? స్త్రీజనమునకు లోఁగిననాదుర్వృత్తి నేమని చెప్పుదు? పాపాత్ముఁడనై తొడపైఁ గూర్చుండ వచ్చినకొడుకును నిరాకరించితి ననిన నారదుఁ డతని కిట్లనియె. రాజోత్తమా, దేవరక్షితుం డైననీపుత్త్రుని ప్రభావం బెఱుఁగవు. అతనికి వగవం బనిలేదు. లోకమెల్ల నతని యశంబు నిండె. లోకపాలురకు నరిది యగుమహాకార్యం బొక్కటి సేసి యాతండు నిజకీర్తి వెలిఁగించుచు నచిరంబ వచ్చెడు నని చెప్పి నారదుం డరుగుటయు నుత్తానపాదుఁడు నారదువచనంబు నమ్ముచు రాజ్యలక్ష్మిపై నాదరంబు పెట్టక పుత్త్రుం జింతించుచుండె.

### ధ్రువుఁడు తపస్సు చేసి హరిసాక్షాత్కారంబుఁ గనుట

ధ్రువుఁ డట్లు నారదోపదేశమునఁ దప మనుష్ఠింప మధువనమున కరిగినవాఁ డచ్చటఁ గాళిందీనదిం గృతావగాహుండై యారేయి యుపవసించి యద్దేవముని యుపదేశించినవిధంబుఁ దప్పక యోగ మభ్యసించి హరిధ్యానంబు సేయుచుఁ దొలుత మూఁడేసిదినముల కొక్కనాఁడు

కపిత్థబదరీఫలంబు లుపయోగించుచు నొక్కనెల గడపి రెండవమాస మాఱేసిదివసముల కొక్కపరి జీర్ణతృణపర్ణముల దేహయాత్ర నడపుచు మూఁడవనెల దొమ్మిదేసివాసరముల కొక్కతూరి జలాహారుండై నాల్గవ నెలం బండ్రెండేసిదినముల కొకపర్యాయంబు వాయుభక్షుండై జిత శ్వాసుండై ధారణాయోగమున దేవదేవుని ధ్యానించుచుఁ బంచమ మాసంబున వాయునిరోధంబొనర్చి యేకపాదమున స్థాణువువోలె నిశ్చ లుండై నిలిచి మనంబు విషయముల నన్నిటంగుదియించి భూతేంద్రియా శయుండైనభగవంతునికల్యాణరూపంబ చింతించుచుఁ దదితరం బేమియుఁ గనుంగొనఁడయ్యె. మహదాదుల కాధారంబై ప్రధానపురుషుల కీశ్వరుం డైనయప్పరమేశ్వరు నాబాలుం డేకపాదస్థితుండై గాఢతమయోగమున ధ్యానించునెడ నతనియంగుష్ఠము త్రొక్కనం బుడమి యడఁగి యేనుంగు ద్రొక్కిననావకైవడి డాపలికి వలపలికి నూఁగుచుండె. ముల్లోక ములు చలించె. అబ్బాలుం డట్లు తనప్రాణమును దానిద్వారమును నియమించి హరి నేకచిత్తమునం జింతించునెడ లోకముల కుచ్ఛ్వాస నిశ్వాసములు నిలుచుటయు నెంతయుఁ బీడితులై సురలు లోకపాల పురస్సరులై హరి శరణుసొచ్చి దేవా, సర్వప్రాణిధామం బైనచరాచర మునకు నిప్పు డొదవినప్రాణనిరోధమునకుం గారణం బే మెఱుంగము. ఈసంకటము వాపి లోకక్షేమం బొడఁగూర్పఁ గోరి నీశరణు సొచ్చితి మనిన హరి వారి కిట్లనియె. అయ్యా, వెఱవం బని లేదు. ఉత్తానపాద పుత్త్రుం డైనధ్రువుఁడు నాపైఁ జిత్తంబుఁ జేర్చి ప్రాణము నిరోధించి పరమతీవ్రతపము సేయుచున్నదాన నియ్యది వొసఁగె. అబ్బాలునిఁ దప మునుండి మఱలింతు. మీరు మీమీనెలవులకుఁ జనుఁ డని యాన తిచ్చిన నమరులు వెఱపుడక్కి యక్కమలాక్షునకు మ్రొక్కి త్రివిష్టపంబు నకుఁ జనిరి. అంత భగవంతుండు గరుత్మంతు నధిరోహించి భృత్య దర్శనార్థం బమ్మధువనమునకు విచ్చేసె. విచ్చేయుటయు యోగపరిపాక తీవ్రకమగుబుద్ధిచే హృదయకమలకోశమున వెలుంగుచున్న వానిం జూచు చుండిన యాధ్రువుఁడు వెలుపల గరుడారూఢుం డైనవైకుంఠుం గాంచక యటఁ దిరోహితునట్లు దటాలునం గాంచి తద్దర్శనంబున వీతభయుండై వినయవినమితోత్తమాంగుండై సాష్టాంగదండప్రణామం బాచరించి

కన్నుంగవం గాంచునట్లును గ్రోలునట్లును వదనమునఁ జుంబనముఁ జేయు నట్లును భుజములఁ గౌఁగిలించుకొనునట్లును దద్దర్శనాహ్లాదంబుఁ దనలోఁ బలువెఱుంగుల ననుభవించుచు భగవద్గుణముల వర్ణింపఁ దలఁచియు నత్యంతబాలుండు గావునఁ బ్రస్తుతిప్రకారం బేమియు నెఱుంగక తడఁ బడుచున్న యతనిదశ నెఱింగి సకలహృదంతర్యామి యగుహృషీకేశుఁడు ప్రాంజలియైనయతనికపోలభాగములం దనచేతివేదమయశంఖముఁ దాఁకించుటయుఁ దత్ప్రభావమునం బరాపరతత్త్వనిర్ణయం బెఱింగి వాక్ఛుకత్కారంబు వడసి భక్తిభరత్వరితుండై యమ్మహానీయోరుకీర్తి నిట్లు స్తుతించె.

## ధ్రువుఁడు హరిస్తోత్రము సేయుట

దేవా, లయించిననావాక్కునకును బ్రాణమునకు నింద్రియములకును నాలోనం జిచ్ఛక్తిచే నావేశింపఁజేసి సుజీవనంబుఁ గావించిన పరమపురుషుఁ డగునీకు మ్రొక్కెద. నీ వొక్కరుఁడవయ్యు బహుగుణములఁ దనరుమాయాఖ్యం బగునాత్మశక్తిమహిమంబున మహదాదిమయం బైనయీజగమెల్ల సృజించి దానికిఁ జైతన్యాపాదనార్థంబు దానిలోనం జొచ్చి యగ్ని యొక్కండయ్యు నానాదారుగతుండై తదీయ హ్రస్వత్వ దీర్ఘత్వాదిధర్మముల నెనసినట్లు మాయాగుణములం జేసి నానావిధములఁ దోఁచుచుండుదువు. భవచ్ఛరణుండై చతుర్ముఖుండు నీవు ప్రసాదించినజ్ఞానమున నిద్ర మేల్కాన్నవాఁడు ప్రపంచముంజూచిన తెఱంగునఁ బూర్వకల్ప ప్రపంచమెల్లఁ దనమదిఁ గాంచి తత్ప్రకారంబు దప్పక సృజించె. దీనబాంధవా, యుపకారి యగునీపాదమూలమును ముముక్షుజనులకు శరణం బైనదానిం గృతజ్ఞుఁ డెవ్వఁడైన మఱచునే? సంసారధ్వంసకారణం బై భక్తులపాలిటికల్పవృక్షం బైననీపాదమూలమును నరకవాసులకును గమ్యమై శవతుల్య మగుదేహమున ననుభవింపఁ దగినవిషయసుఖములకాసించి యితరార్థములకై సేవించువారు నిక్కంబ మది మోసపోయినవారు. భవదీయచరణారవిందపరిచర్యాఫలనను ద్వదీయ కథాకర్ణనమునను గలుగుపరమసుఖము మోక్షమునసైనం గలుగఁ జాల దన్న నంతకునసిక్రపాణప్రసరణంబునం బడుస్వర్గాదివిమానముల సుఖము నెన్నవచ్చునే? నీపై నిరంతరభక్తిప్రవాహంబు ప్రసరించునిర్మలా

త్ములతోడ సంగము నాకు నిత్యంబై యొసంగుఁగాత. దాన నేను భవద్గుణ
కథామృతముఁ గ్రోలి వ్యసనబహుళం బైనసంసారసాగరంబు వేగంబ
ని స్తరింతు. పద్మనాభా, భవత్పదారవిందపరిమళము చవిగొన్నవారి ప్రసం
గముం గాంచినమహాత్ములు మరణశీలం బైనయీదేహమును దాని
ననుసరించియుండు దారపుత్త్రమిత్త్రక్షేత్త్రవిత్తాదులను సరకుగొనరు.
తిర్యఙ్మనుష్యద్విజసరీసృపదేవదైత్యప్రభృతి నానాప్రాణిజాలసంకులం బై
కార్యకారణాత్మకంబై యొప్పునీస్థూలరూపంబు నెఱుఁగుదుఁగాని దీనికి
బరం బైనపరమేశ్వరరూపమును శబ్దవ్యాపారగోచరంబుగాని దానినెఱుఁ
గను. కల్పాంతమున నీజగంబెల్లఁ గుక్షిలోఁ దాల్చి యేకార్ణవజల
మధ్యమునందు శేషపర్యంకమునం బవ్వళించి యంతఁ గ్రమ్మఱఁ దళితో
నాభిసాగరసంభూతలోకాంభోరుహంబునఁ బితామహుం బుట్టించి
నీకుఁ బ్రణామంబు. నిత్యముక్తశుద్ధబుద్ధస్వరూపుఁడు కూటస్థుఁడా
పురుషుఁడు త్రిగుణనియామకుండునై యాత్ముఁ డగునీవ ప్రతిహత
బైనయాత్మచిచ్ఛక్తిమహిమంబునఁ దత్తద్బుద్ధ్యవస్థలఁ గాంచుచు
దద్వ్యతిరిక్తుండవై వెలయుదువు. జగత్పాలనంబున విష్ణురూపంబు
నైకొందువు. విరుద్ధగతులగునవిద్యాది వివిధశక్తు లానుపూర్వితో
నెవ్వనియెడం గార్యార్థంబు సేయుచుండు నట్టిజగత్కారణం బడి
తీయం బనంత మాద్య మానందమాత్రము నగుబ్రహ్మం బైననిన్ను
గొలిచెద. పురుషార్థమూర్తి యగునీపాదపద్మమే యితరమనోరథము
లన్నిటికంటెఁ బరమమనోరథంబు. అట్టిపరమార్థఫలం బైనభవత్పా
మూలముం గామనిమిత్తం బాశ్రయించి దీనతం బొందుమమ్ము ననుగ్రహ
పరుండవై లేఁగటియావు తర్ణకంబునుబోలె నీవుపాలింతువు. అని యిట్లు
సత్సంకల్పుం డైనయాధీమంతుఁడు ప్రస్తుతించినం జిత్తగించి భగవంతుఁ
డబ్బాలుం జేర్కొని యిట్లనియె. వత్సా, భవదీయమనోరథం బేనెఱుఁ
గుదు. ఇంతకుమున్ను లాఁతు లధిష్ఠింపక పశుమండలికి మేధిస్తంభము
రీతి గ్రహనక్షత్త్రతారాదిజ్యోతిశ్చక్రమున కాధారంబై లోకత్రయ
వాసులకును మీఁదనొప్పునక్షత్త్రరూపు లగుధర్మాగ్ని కశ్యపశక్రయమ
ప్రభృతులప్రదక్షిణప్రచారంబుఁ గాంచుచు నత్యంతభద్రం బైనస్థానంబు
నీకొసంగెద. నీతండ్రి యగుయుత్తానపాదుఁడు రాజ్యమెల్ల నీకొప్పగించి

ధర్మాశ్రయుండవై తపోవనమున కరిగినపదంపడి నీకు ద్రోహ మొనర్చిన నీ సవతితల్లి తనకొడుకు ఉత్తముఁ డడవిని వేటలో నశించిన నతని వెదకుచు నగ్నిప్రవేశంబు చేయంగలదు. అట్లు రాజ్యస్థుండవై యిరువదియాఱువే లేండ్లు నిష్కంటకంబుగఁ బ్రజల నేలి పుష్కలదక్షిణలతో యజ్ఞేశ్వరుం డైన నన్నారాధించి యైహికభోగములెల్ల నెన్నయనుభవించి యంత కాలమున నన్నుఁ దలఁచి యిప్పుడు నీకే నొసఁగినసర్వోత్తమస్థానం బప్పు డధిగమించి పునరావృత్తిం గాంచవని గరుడధ్వజుం డానతి యొసంగి యందు సూచుచుండ నిజలోకంబున కరిగె.

### ధ్రువుఁడు విష్ణుప్రసాదంబు వడసి మగిడి పురమున కరుగుట

అవ్విధమున ధ్రువుఁడు పరమతపమున హరి నారాధించి మనోరథసిద్ధిం గాంచి నాతిప్రీతచిత్తంబుతో మగిడి నిజపురంబునకుఁ జనియె ననిన విదురుండు మునీంద్రా, సకాములకు దుర్లభం బైనయాపరమపదము నొక్కజన్మముననే హరిచరణారాధనమున నార్జించియు నర్థవిదుం డైనయాధ్రువుఁ డేల తన్నకృతార్థునిఁగాఁ దలంచికొనియె ననియడిగిన మైత్రేయుం డతని కిట్లనియె. ధ్రువుఁడు సవతితల్లి వాగ్బాణములతాఁకునఁ బెద్దయు నొచ్చినవాఁడు గావున ముక్తిప్రదుం డైనభగవంతునికరుణఁ బడయఁ గాంచియు ముక్తిఁ గోరక మోసపోయినదానికిఁ దపించుచుఁ దనలో నిట్లని తలపోసె. సనందనాదిమునీంద్రు లూర్ధ్వరేతస్కులై బహుజన్మముల సమాధియోగం బలవరిచికొని సాధించినహరిచరణచ్ఛాయ నాలునెలలలోఁ బడసియు భేదదర్శనంబునఁ గ్రమ్మఱఁ దొలంగితి. అక్కటా! నాదౌర్భాగ్యం బిట్టి దగునే? సంసారహరం బైన హరిచరణ మాశ్రయించియు ననిత్యమగుదానిం గోరితి. నాకుఁ గ్రిందనుండునమరులు నామతిఁ జెఱిపియుండవచ్చును. మానావమానముల నెఱుఁగనిబాలుఁడవని నారదుఁడు సెప్పినవచనంబు లెన్న పరికింపనైతి. దైవమాయకుఁ జిక్కి నిద్రించువాఁడు స్వప్నమునందు భిన్నభిన్నపదార్థములం జూచునట్లు ద్వితీయవస్తువు వస్తుగతిం బరికింప లేకున్నను భ్రాంతి ననుశత్రుఁ డొక్కండు గలఁ డనువ్యాపదయుశోకమున గుందుచుంటిని. దుర్లభుఁ డైనజగదాత్మునిఁ దపమున మెప్పించియు నాకొన్నకోర్కి గతాయువునకుఁ జికిత్స యొట్టు లట్టులు వ్యర్థం బయ్యె.

మహారాజ్యమైన నొసఁగఁజాలినచక్రవర్తి నాశ్రయించి యధముఁడు పొట్టూడదంచినమంచిబియ్యము యాచించువిధమున భవహారుం బ్రసన్నుం జేసికొనియు భాగ్యహీనుండనై భవంబె ప్రార్థించితి నని చింతించుచుండె. అయ్యా, ముకుందపదారవిందపరాగముఁ గాంచిన నీయట్టిభాగవతులు యదృచ్ఛాలబ్ధమనస్సమృద్ధులై భగవత్పరిచర్య యొక్కండు దక్క మఱి యెయ్యదియుం గోరరు.

## ధ్రువుఁడు తండ్రితోఁ బురముఁ బ్రవేశించుట

అక్కడ నుత్తానపాదుండు దనకొడుకు ధ్రువుఁడు వచ్చుట విని చచ్చినవాఁడు లేచి వచ్చినట్లు తలఁచి యంత నమ్మక నారదవాక్యంబు మీఁదినమ్మికంజేసి యవ్వార్తఁ దెచ్చినవాని కమితధనంబుఁ బారితోషికంబుగా నిచ్చి యుత్తమాశ్వములం బూన్చినకాంచనరథం బారోహించి బ్రాహ్మణులు కులవృద్ధు లమాత్యులు బాంధవులు పరివేష్టింప శంఖదుందుభివేణుప్రముఖవాద్యనాదంబు బ్రాహ్మణాశీర్వాదంబునుం జెలఁగఁ బుత్రదర్శనకుతూహలమునం బురమునుండి వెడలె. అతనిభార్య లగు సునీతియు సురుచియు సువర్ణశిబిక లారోహించి యుత్తమునితోడ నతని వెన్నడించి యరిగిరి. అట్లరిగి పురంబువెలుపల నుపవనంబుచెంగట వచ్చుచున్నకొడుకుం గాంచి యమ్మనుపుత్త్రుండు ప్రేమవిహ్వలుండై రయమునం దేరు డిగ్గి దీర్ఘోత్కంఠాకరంభితచిత్తంబుతో రోఁజుచు నెయిది హరిస్పర్శహతకలుషుం డైనయాత్మభవుని నిండుఁగౌఁగిటం గ్రుచ్చి శిరంబు మూర్కొని యానందాశ్రుజలములఁ దడిపి చరితార్థుం డయ్యె. ధ్రువుఁ డట్టియెడఁ దండ్రియడుగుల కెఱఁగి దీవనలం బడసి తల్లులకుం బ్రణమిల్లుటయు సవతితల్లియయ్యు సురుచి చరణానతుం డైనయతని లేవ నెత్తి కౌఁగిటం జేర్చి బాష్పగద్గదస్వరంబున దీవించె. మైత్ర్యాదిగుణములంజేసి హరి యెవ్వనికిఁ బ్రసన్నుఁడగు నతనికి జలములు పల్లమునకుంబోలెఁ దమంతన యందఱు నవనతు లగుదురు. ఉత్తముఁడును ధ్రువుఁడు నితరేతరాలింగనం బొనర్చి పులకాంకితులై యానందసలిలముల విడిచిరి. తల్లి యగుసునీతి ప్రాణములకంటె నధికప్రేమాస్పదుం డైనతనయు నత్యంతగాఢపరిరంభమున నాదరించి వానిమేను సోఁకఁ బరమసుఖముఁ గాంచి చన్నులు

చేఁత నానందబాష్పములఁ దడిపె. అప్పు డప్పుటఁ జేరినవా రందఱు సద్దేవిం గాంచి సాధ్వీ, చిరకాలనష్టం బైననీకొడుకు నీతాపంబు వాఁపఁ జనుదెంచె. ఇతండే భూమండలం బేలెడు. తన్ను ధ్యానించువారికి మృత్యువుం గెలువ సామర్థ్యంబుఁ బ్రసాదించుప్రణతార్తిహరుం డైన భగవంతుని నీవు నిక్కం బారాధించితి వని ప్రశంసించిరి. అవ్విధమున జనప్రస్తుతులకుఁ బాత్రం బైనయక్కుమారరత్నము నేనుంగు పయిం గూర్చుండఁ జెప్పి మకరతోరణంబులను నూతనచూతపల్లవకుసుమముక్తాదామతోరణంబులను రంభాస్తంభపూగపోతంబులను బూర్ణకుంభములను బలిదీపములను ద్వారదేశములం బొంపిరివోయి మిన్నోరయుమేడలం జూడ నొప్పుగృహములను బ్రాకారగోపురంబులను వెలసి చందనసిక్తంబు లైనరాజమార్గంబులఁ దనరుపురములోని కరిగె. అచట ధ్రువుఁడు పౌరు లొసఁగులాజాక్షతపుష్పఫలకర్పూరనీరాజనాదివివిధోపచారముల నంగీకరించుచుఁ బతివ్రతాజనములు పలుకునాశీర్వచనముల గ్రహించుచు మధురగానముల నాకర్ణించుచుఁ దండ్రినగరిలోనికిం జని మణిగణమయం బైనయాభవనంబునఁ దండ్రి యుపలాలింప దేవభోగంబు లనుభవించుచుండె. అందుఁ బయఃఫేననిభము లై స్వర్ణపరిచ్ఛదంబు లైనదంతపర్యంకముల నట్టియుత్తమాసనంబులను మహామరకతస్ఫటికకుడ్యములందలి మణిప్రదీపములను రత్న సాలభంజికలను శుకపికాదివిహగరుతములను మధురమధుకరగీతములను సొంపారు నుద్యానంబులను హంసకారండవప్రచారభాసురం బైనపద్మోత్పలముల నమరువైదూర్యసోపానవాపికల నేపారి యాసదనం బతని కత్యంత సంతోషదాయకం బయ్యె.

## ధ్రువుఁడు రాజ్యాభిషేకముఁ బొందుట

తన తనయునితాదృశప్రభావమునకు విస్మితుం డై యుత్తానపాదుఁ డతనికి రాజ్యభారముఁ బూనఁ జాలినయౌవనంబు గూడుటయుఁ బ్రజల కతనియెడ సమ్మతియు నతనికిఁ బ్రజలపై ననురాగంబు నెసంగుటయుఁ దనకు వృద్ధత్వంబు దోడరుటయుం బరికించి యఖిలధరణీరాజ్యమున ధ్రువుం బట్టాభిషిక్తుం జేసి విరక్తుం డై యాత్మగతి విమర్శించుచుఁ దపోవనమునకుఁ జనియె. ధ్రువుఁడును శింశుమారుఁ డనురాజుకూఁతును

భ్రమి యనుదానిం బెండ్లియై దానియందుఁ గల్పవత్సరు లన నిరువురు కొడుకులను వాయుపుత్త్రి యైనయిల యనుదానిం బరిణయంబై దానియం దుత్కలుఁ డనుకుమారుం నొక్కకూఁతుం గనియె. ఉత్తముఁడు పెండ్లికి ముందే వేఁటకై యడవికిఁ జని హిమవత్పర్వతంబున యక్షునిచే నిహతుఁ డగుటయు వానితల్లి సురుచియుఁ దద్గతిం బొందె.

### తనతమ్ముని జంపినగుహ్యకాదులను ధ్రువుఁడు సమరమున గెల్చుట

భ్రాతృవధమున కలిగి ధ్రువుఁడు జయశీలం బైనతే రెక్కి యుత్తరంబు పట్టి చని హిమవద్గిరిసానుదేశమునం గుహ్యకసంకులంబు రుద్రానుచరసేవితంబు నగునలకాపురంబున కరిగి శంఖముఁ బూరించిన నాఘోరనాదమున కాకాశంబు దిక్కులునుం బ్రతిధ్వని యొసంగె. గుహ్యకస్త్రీగర్భంబు లవిసె. ఆనినాదంబు సైరింపక గుహ్యకభటులు కైదువులం బూని పురము వెడలి వచ్చి తలపడుటయు నొక్కొక్కని మూఁడేసియమ్ముల లలాటదేశమున నొప్పించుటయు వారు కాలఁ ద్రొక్కినపాములచందమున దాని కోర్వక యతఁడు చేసినదానికి రెండుమడుంగు లెక్కుడు సేయంబూని ప్రాసశూలపరిఘపరశ్వథశక్తినిస్త్రింశాది నానాసాధనము లేసియుఁ జిత్రపక్షంబు లైన పెక్కుబాణములఁ బ్రయోగించియుఁ దుదిఁ బదుమూఁడువేలయక్షు లొక్కమ్మడిం గుప్పించి ధ్రువుని రథరథ్యసారథిసమన్వితంబుగా శరవర్షమునం గప్పిరి. దానం జేసి యాతండు మహావర్షధారల భూధరం బట్టులట్టులు తదీయశరాసారమున మునుఁగుటయు నక్కటా! మనుసూనుండు గుహ్యకపుణ్యజనార్ణవమున మునిఁగిచచ్చె నని చూచుఖేచరులు హాహాకారంబు లొనర్చిరి. అయ్యార్పు విని దానికిఁ దలంకక ధ్రువుఁడు వింటినారి సారించుచు శరాసారంబుఁ గురియించి మేఘమండలముఁ జెదలించు చండమారుతంబురీతిఁ దదీయబాణములనెల్ల నొక్కమాత్రలోనం ద్రుంచి నీహారనిర్గతుం డైనభానుమంతుసరీతిఁ దనరథము దృశ్యంబుగా నొనరించి యరాతులకు ఖేదముఁ గూర్చుచు నానాభల్లములం గుప్పించినం దదీయబాణప్రహారమునం దెగి కనకకుండలకిరీటాదివిలసితంబు లైనతదీయమస్తకంబులను హేమతాళతుల్యము లగుసూరువులను వలయవిలసితంబు లైనబాహుదండములను రాలిననానాభర

ణంబులను దునిఁగినకైదువులపోల్కినుం బరిక్షీణంబై రణక్షోణీతలంబు వీరమనోహరం బయ్యె. హతశిష్టు లగుయక్షరాక్షసు లాక్షత్రియునత్యుగ్రబాణక్షేపంబునం గత్తళంబులు ప్రస్విన్న నటఁ గా లూఁదఁ జాలక సింగముం గన్నయేనుంగులభంగి నతనిమోహారంబున కోహటించి వెఱచి పఱచిరి. అట్టియెడఁ దన్ను మార్కొనువాని నక్కడ నొక్కనిం గానక ధ్రువుఁడు పురదర్శనోత్సాహంబు మానసంబున నుదయించినను మాయావు లగునరాతులచికీర్షితంబు జనుఁ డెఱుంగనేరఁ డని సారథికిఁ జెప్పుచున్నంత నర్ణవఘోషమున కెనవచ్చుఘోరనాదం బొకండు విన నయ్యె. తళతళ మెఱుఁగులు నుఱుములుం జెలఁగ నెరయ మింట మేఘమండలంబు క్షణమాత్రలోనం గాననయ్యె. దెసలనెల్ల ధూళి యెగసి యుప్పరంబుఁ గప్పె. రక్తపూయవిణ్మూత్ర మేదోవర్షంబు గురిసె. అంతరిక్షమునుండి కబంధము లతనియెదురం బడియె. నభమునం గొండ యొక్కండు చూపట్టె. గదాపరిఘనిస్త్రింశముసలాద్యాయుధంబులు వడియె. శిలావర్షంబు గురిసె. పిడుగులట్లు రోజుచుఁ గన్నుల నిప్పులు గ్రక్కుచుఁ బాము లావరించె. సింహవ్యాఘ్రగజములు చుట్టుం జుట్టుకొనియె. సముద్రము కల్పాంతమునం దెట్టట్లు కల్లోలాస్ఫాలభీమంబై భూమండలము ముంచువిధమునం బొంగి వచ్చునట్లు దోఁచె. మఱియు నిట్టివి పెక్కు లసురమాయాప్రభావమునం జేసి భీరులకును వెఱపు పుట్టించునట్లు చూపట్టిన నప్పుడు మును లతనికి సన్నిహితులై యోయుత్తానపాదనందనా, నామశ్రవణమున లోకమృత్యువును నిరసించుభక్తార్తిహరుం డైనశార్ఙ్గధన్వుఁడు నీకుఁ బ్రసాదించినయస్త్రరాజ మిప్పుడు ప్రయోగింపు మని తద్విజయంబుఁ గోరి చెప్పిరి. ధ్రువుఁడు తద్వచనం బాకర్ణించి యాచమించి శుచియై నారాయణాస్త్రము వింట సంధించునంతలోఁ గ్లేశంబులు జ్ఞానోదయంబున నెట్టు లట్టు లాగుహ్యకమాయ లెల్ల క్షణమాత్రలోన మాయ మయ్యె. అయ్యస్త్రరాజముప్రభావమునం జేసి దానం గాంచనపుంఖములు కల హంసపక్షములు నగు పెక్కుబాణంబు లుద్భవిల్లి ఘోరరవంబుతో నాగుహ్యకరాక్షససైన్యంబుఁ జొచ్చి చించి చెండాడుటయు గుహ్యకాదులు గరుడుం గన్నపాములు పడగలు వాంచి పఱచునట్లు కైదు

వులు వైచి యవ్విశిఖముల కోహటించి విచ్చి పఱచిరి. అట్లు పాఱుచున్న వారలం బొదివి పోనీక యాఁగి ధ్రువుఁడు చేతుల నఱికియు నూరువులఁ దఱిగియుఁ దలలు గోసియుఁ గుత్తుకలు ద్రుంచియురూపుమాపియు నూర్ధ్వరేతస్కులైనయుత్తమయోగులకు సూర్యమండలాంతరగమ్యం బగునుత్తమలోకంబునకుఁ బనిచె.

### మనువు ధ్రువుని యుద్ధ ముడుగు మని చెప్పుట

అవ్విధమున ధ్రువుఁడు గుహ్యకాదులం బరిమార్చుట విని తత్పితామహుం డైనస్వాయంభువమనువు కరుణాసాంద్రుండై యతనియొద్ద కేతెంచి యిట్లనియె. వత్సా, నరకద్వారము పాపము నగునత్యంత రోషం బుడుగుము. దానం దవిలికదా యీవు నిరపరాధు లైనయీ పుణ్యజనులం దెగటార్చితివి. అకృతాపరాధు లగుగుహ్యకాదులఁ దెగఁ జూచుట సాధుగర్హితంబు. మనకులమునకుఁ దగదు. భ్రాతృవత్సలా, భ్రాతృవధపరితాపమునం జేసి నీ వొక్కనితప్పిదంబునకై పెక్కండ్రఁ బొలియించితివి. పరాగ్భూత మగుదేహమునం దాత్మాభిమాన మునిచి పశువు లట్టులు హింస చేయుట హృషీకేశానువర్తు లగుసాధువుల మార్గంబు గాదు. భూతావాసుం డైనవాసుదేవుని దురారాధ్యుం డైన వాని సర్వభూతాత్మభావమున నారాధించి నీవు తదీయపరమపదము సాధించి హరిహృదయంబున కెక్కియు హరిదాసులకు సమ్మతుండ వయ్యు సజ్జనులనియమము దేర్చియు నెట్టు లీపాపము నొనర్చినాఁడవు? తితిక్ష కరుణ మైత్రి సర్వభూతసమత్వ మనుగుణముల నఖిలాత్ముఁ డగు భగవంతుఁడు సుప్రసన్నుఁ డగు. అతనిప్రసాదంబు వడసినం బురుషుండు ప్రాకృతగుణవిముక్తుండై లింగశరీరముఁ బరిహరించి బ్రహ్మానందముం బొందు. పంచభూతారబ్ధంబులై దేహాద్యాకారమునం బరిణమించిన స్త్రీపురుషులమిథునధర్మంబునం జేసి యీసంసారంబునందు స్త్రీపురుషుల కుత్పత్తి యగువిధమునఁ బాలకాకారమునఁ బరిణమించినభూతములప్రవర్తనంబునఁ బాలనంబు హంతృదేహాకారమునం బరిణమించినభూతముల సమ్మర్దమునఁ భూతసంహారమును బరమాత్మునిమాయావిలాసమునం జెల్లుచుండెడు. అయస్కాంతమునిమిత్తముగాఁగ లోహమెట్టు లట్టులు నిర్గుణుం డైనయప్పరమాత్ముఁడు నిమిత్తంబు గాఁగ

కార్యకారణాత్మకం బైనవిశ్వము జరుగుచుండెడు. ఆభగవంతుండే యాత్మకాలశక్తిం జేసి క్రమమున గుణక్షోభమునం సృష్ట్యాదిశక్తులు విభక్తంబు లగుచుం దా నకర్తయయ్యుం గార్యము లొనర్చెను. అహంత యయ్యు సంహారంబుం గావించెను. పరమేశ్వరు కాలశక్తి దురూహంబు. అనంతుం డనాది యవ్యయుండు నగునతండు పిత్రాదిజనులచేం బుత్రాది జనులం బుట్టించుచు మృత్యువుచే నంతకు లగుచోరాదులం జంపించుచు సర్వము నియమించుచుండెడు. అతండు మృత్యురూపమునం బ్రజల నావేశించునెడ నొక్కండు మిత్రుం డనుటయు వేఱొక్కండు శత్రుం డనుటయుం బొసంగదు మఱి తత్తత్కర్మానురూపముగ ఫలవైషమ్య మయ్యెవారి కయ్యెసమయముల నమరుచుండెడు. అతం డెటు వోయినం గర్మాధీనంబు లైనభూతసంఘము లనిశంబులై గాలి పోయినదెసం బరాగకణంబు లెట్టు లట్టు లటు వోవుచుండెడు. ఉపచయాపచయరహితుండై స్వస్థుండై యుండునయీశ్వరుండు కర్మాధీనంబు లైనభూతసంఘముల కాయురుపచయాపచయములం గలిగించుచుండెడు. ఇట్టిలోకప్రవృత్తిం గాంచి కొందఱు దీనికిం గర్మంబు కారణం బనియుం గొందఱు స్వభావంబు కారణం బనియుం గొందఱు కాలంబు కారణం బనియుం గొందఱు కామము కారణం బనియుం బలుకుదురు. నిర్గుణుం డప్రమేయుండు నానాశక్తిసముదయోల్లసితుండు నగునప్పరమేశ్వరుచికీర్షితంబుం బరమేష్ఠియు నెఱుంగండు. ఇంక సర్వసంభవకారణం బైన యతని నెవ్వండు లెస్స యెఱుంగు? పుత్రా, యీధనదానుచరులు నీ భ్రాతం జంపి రని తలంపవలదు. పురుషున కుత్పత్తివినాశములయెడం బూర్వకర్మంబే కారణంబగు. అయీశ్వరుండు తాన యీవిశ్వముస్సృజించుచుం బాలించుచు హరించుచుండియు నహంకారరాహిత్యమునం జేసి గుణకర్మలేపంబు వొరయండు. భూతాత్ముండు భూతేశుండు భూతభావనుండు నగు నతం డాత్మశక్తి యగుమాయం గొని విశ్వసృష్టిస్థితిలయంబు లొనరించెడు. ముకుంద్రాటం గట్టినబలీవర్దంబు లట్టులు విశ్వస్రష్టలును నామబద్ధులై యెవ్వనినిదేశము నొనర్తురై దేండ్లబాలుండయ్యు సవతితల్లిప్రల్లదంబులకు నొచ్చి తల్లిని బాసి యీవు వనమునకుం జని తపముసల్పి యింద్రియాగోచరుం డైనయెవ్వని నారాధించి త్రిలోకములకు మీఁది

యుత్తమపదంబు సాధించితి, నా దేవదేవునభక్తులకు మృత్యువురీతిని భక్తుల కమృతముమాడ్కి నిం దోఁచువాని, జగత్పరాయణుం డైనవాని, సర్వవిధముల నాశ్రయించి, విరోధవిరహితం బైనచిత్తమునం దవస్థితుండై నిర్గుణాత్మకస్వరూపుఁ డైనయప్పరమాత్ముని వస్తుసత్తాశూన్యం బయ్యు వివిధభేదవిషయం బైనవిశ్వము ప్రతీతి కధికరణం బైనవానిం బ్రత్యగ్దర్శనంబున నన్వేషింపుము. అవ్విధమునఁ బ్రత్యగాత్ముఁ డనంతుఁ డానందమాత్రుఁ డఖిలశక్తిసంపన్నుఁడు నగుభగవంతునిపై భక్తిఁ జేయుచే నీ వేను నాయది యనుచిరరూఢం బైనహృదయగ్రంథిని మెల్లమెల్లన విదళింతువు. ఔషధమున రోగము నెట్లట్లు బహుశ్రుతమున శ్రేయోవిరోధియగురోషమును వారింపుము. రోషరూషితుం జూచి లోకమెల్ల నుద్వేగంబుఁ జెందుఁ గావునఁ దన కభయముఁ గోరువాఁడు దానిం ద్యజింపవలయును. భ్రాతృవధంబున కలిగి నీవు పుణ్యజనులం జంపినదాన నీశ్వరసఖుం డైనకుబేరునకు హేళనంబుఁ గావించితివి. మహాత్ముల తేజమువలన మనకులమునకుఁ గీడు మూడకుండఁ గోరి వినయమునం బ్రియవచనమున నయ్యలకాపతిప్రసాదంబు వడయు మయ్యా యని స్వాయంభువమనువు తనమనుమనికి హిత ముపదేశించి తదీయప్రణామముల నంగీకరించి దీవించి ఋషులతోడ నిజస్థానంబునకుఁ జనియె.

### ధ్రువుఁడు మనువచనమునఁ బోరుడిగి కుబేరుచెల్మి చేసి రాజ్య మేలుట

ధ్రువుఁ డట్లు మనూపదేశమునఁ గోపము డిగ్గఁద్రావుట విని కుబేరుఁడు యక్షకిన్నరచారణప్రస్తూయమానుండై యచ్చటికి వచ్చి కృతాంజలి యైనయతని కిట్లనియె. క్షత్త్రియపుత్త్రా, పితామహోపదేశమున దుస్త్యజ మగుక్రోధమును నీవు పరిహరించినదానికిఁ బరితోష మొందితి నీవు యక్షులను వారునీభ్రాతను జంపుటపొసఁగదు. భూతముల యుత్పత్తివినాశములకుఁ గాలమే కారణంబు. దేహాత్మానుసంధానకారణంబున స్వప్నమునంబోలె నపార్థ మగునేను నాయది యను బుద్ధి పురుషున కజ్ఞానమునం గలిగెడు దాన బంధదుఃఖాదు లయ్యెడు. నీకు మేలయ్యెడు పొమ్ము. గుణమయ మగునాత్మమాయతోడం గలిసియు వస్తుగతిం బరికింప దాని నంటక స్వతంత్త్రుఁడై వెలయుచు సంసారనివారకుండై భజనీయపాదారవిందుం డైనసర్వభూతాత్మ విగ్రహుని

సర్వభూతాత్మభావమున నభవార్థంబు భజింపుము. ఇంక దక్కిన నీమనంబునం గలకోర్కె నడుగుము. పద్మలోచనచరణారవిందసేవాతత్పరుండవు నీ వని వినియుండుదుఁ గావున వరార్హుండ వని కుబేరుండు సెప్పిన విని ధ్రువుఁ డయత్నమున దురత్యయం బగుతమముఁ దరింపఁ బరమ సాధనం బైనహరిచరణస్మరణనిశ్చలత్వంబు వరించె. కుబేరుఁ డతని కవ్వరముఁ బరమప్రేమంబున నొసంగి యంతర్హితుండై నిజపురమున కరిగె. అట ధ్రువుఁడు నిజనగరంబునకు మగిడి యరుగుదెంచి ద్రవ్యక్రియాదేవతాకర్మసాధ్యఫలస్వరూపుఁడు తత్కర్మఫలప్రదుఁడు నగుయజ్ఞేశ్వరు నమితదక్షిణోపపన్నంబు లైనయజ్ఞములనారాధించుచు సర్వాత్ముఁ డగునచ్యుతునిపయిఁ దీవ్రప్రసారం బైనభక్తి యొనరించుచుఁ దన లోపలను సకలభూతములలోపల నాసర్వేశ్వరుం గాంచుచు ధర్మపథమున రాజ్య మేలుచుండె. శీలసంపన్నుఁడు బ్రహ్మణ్యుఁడు దీనవత్సలుఁడు ధర్మసేతుపాలకుఁడు నగునాధ్రువునియేలుబడిం గాంచిన ప్రజ లతనిఁ దండ్రిఁగాఁ దలంచుచుండిరి. ఇవ్విధమున నయ్యుత్తానపాదసంభవుం డవికలేంద్రియుండై భోగములఁ బుణ్యక్షయంబును యజ్ఞాదినిత్యకర్మానుష్ఠానమునఁ బాపక్షయంబునుం గావించుచుఁ గాలము త్రివర్గసాధకంబుగాఁ గడపుచు నిరువదియాఱువేలేండ్లు రాజ్య మేలి యటఁ గుమారుని రాజ్యమున నభిషేకించి యీవిశ్వమెల్ల నాత్మునియందు మాయారచితం బనియు నవిద్యారచితస్వప్నగంధర్వనగరోపమం బనియు దేహమును దారపుత్రమిత్రాంతఃపురోపవనగృహాదులును సముద్రముద్రితం బైనసర్వంసహామండలంబును గాలోపసృష్టంబు కాని శాశ్వతంబు గా దనియు నిశ్చయించి వానిం ద్యజించి బదరికాశ్రమంబునకుఁ జనియె.

## ధ్రువుఁడు విష్ణుదూతలు దెచ్చినవిమానమున నున్నతపద మారోహించుట

అవ్విధంబున ధ్రువుఁడు బదరీవనమునకుఁ జని యందు మందాకినిం గృతస్నానుండై శుచియై యుచితాసనమున నాసీనుండై యాసనము బంధించి వాయునిరోధం బొనర్చి మనంబున నింద్రియముల నిగ్రహించి భగవంతునివిరాడ్రూపంబుపై ధారణాయోగంబున మనస్సు నిలిపి యట ధ్యాతృధ్యేయభేదశూన్యుండై సమాధినిష్ఠుండై యాస్థూల

మును విసర్జించి హరిపై నిత్యభక్తిపారవశ్యంబు వహించుచు నానంద బాష్పబిందుసందోహంబు దందడిం గ్రందుకొన డెందంబు గరఁగ మేను గరుపారఁ బరమనిర్వృతిం బ్రాపించి యేను ధ్రువుఁడ నిట్టివాఁడ నను నభిమానంబుఁ దొలంగి తన్నుఁ దాను దలంపక పరమానందతదాత్మ్యం బొరసె. అట్టియెడ దశదిశల విశదద్యుతి వెలిఁగించుచు నూతనోదితం బైనరాకానిశాకరమండలంబుఁ గ్రేణిసేయుచు నభమునుండి డిగి వచ్చు చున్న యొక్కయుత్తమవిమానంబునందు బాహుచతుష్టయంబుకమల లోచనంబులు దనరునీలగాత్రంబులఁ గిరీటకుండలహారకేయూరాద్యాభర ణంబులఁ గైసేసి గదాధరులై యొప్పువిష్ణుదూతల నిద్దఱం గనుంగొని ధ్రువుఁడు హరిపార్షదు లని పరమభక్తిం గ్రాలఁ గేలుదోయి మొగిచి దామోదరునామములం గీర్తించుచుఁ బ్రణామంబుఁ గావించె.

అట్లు కృతాంజలియై ప్రణమిల్లి విష్ణుపాదాభినివిష్టచిత్తుం డైనయా ధ్రువుని డాయ వచ్చి వనజనాభుపార్షదు లగుసునందనందులు మంద హాసంబుతోఁ బ్రీతి గదుర నతని కిట్లనిరి. రాజేంద్రా, యవధానంబున మావచనం బాకర్ణింపుము. ఐదేండ్లప్రాయమున నీ వేదేవుం బరమ తపంబున నారాధించి మెప్పించితి వాపరమేశ్వరు పరిచారకులము మేము. అతండు పంప నేము నిన్నుఁ దత్పదమునకుఁ దోడుకొనిపోవఁ జను దెంచినవారము. సప్తర్షులును దాము సాధింపఁ జాలక తల లెత్తి మీఁదఁ గనుంగొన నెసంగుచు సూర్యచంద్రగ్రహనక్షత్రతారాగణ ప్రదక్షిణపరిక్రమణంబుఁ గాంచుచు సర్వోత్తమం బై యితరులకు సాధింప రానివిష్ణుపదము నీవు సాధించితివి. నీతండ్రితాతలును దక్కినవారు నింతకు దాని సాధింపరు. అయ్యది సకలలోకవంద్యంబు. ఆచ్చోటికిఁ నిన్నుఁ దోడ్కొని పోవఁగ భగవంతుఁ డీవిమానము నీతదర్థం బనిచె. దీని నారోహింప నర్హుండ వనిచెప్పిన నప్పరమేశ్వరపార్షదుల తేనియ లొలుకుపలుకు లాకర్ణించి కృతస్నానుండై యలంకృతగాత్రుండై మునులకు మ్రొక్కి తదాశీర్వాదములం గొని యవ్విమానరాజంబు వలగొని యర్చించి పార్షదులకుఁ బ్రణమిల్లి జ్యోతిర్మయం బైనయుత్తమ రూపంబు ధరించి ధ్రువుఁ డావిమాన మారోహించుచున్నంత దుందుభి మృదంగపణవాదివాదిత్రంబులు మ్రోసె. కుసుమవర్షంబు గురిసె. గంధ

స్వగానంబు లెసంగె. అప్పు డతండు దాను విమాన మెక్కుచు దీనురాలగుతల్లి యైనసునీతి నిట విడిచి యేను బుణ్యలోకమున కేఁగుదుఁగా యని మదిఁ దలపోయుట యరసి సునందనందులు దనకు ముందఱ దేవయానమునం ద్రివిష్టపమునకుఁ జనుచున్నతజ్జనని నాతనికిం జూపుటయుఁ బరమానందమేదురుండై యాధ్రువుఁ డప్పరమవిమానమునం గూర్చుండి తెరువున వైమానికు లొనర్చుప్రస్తుతివచనంబుల నాలించుచుఁ గుసుమవృష్టి నంగీకరించుచు గ్రహమండలంబెల్ల దాఁటియు ముల్లోకముల నతిక్రమించియు సప్తర్షిస్థానంబు లంఘించియు నన్నిటికి మీఁద ధ్రువంబై, నిజప్రకాశంబున లోకములనెల్ల వెలిఁగించుచు భగవత్కారుణ్యంబు వడయనివారికి దుర్గమంబై. నిత్యభద్రము లాచరించి శాంతులై సమదర్శనులై సర్వభూతానురంజనులై శుద్ధులై యచ్యుతుండె తమకుఁ బ్రియబాంధవుఁ డనుపరమవిస్రంభమున నేకాంతభక్తి సేయు మహాభాగవతులకు సులభంబై యొప్పునప్పరమపదం బారోహించె.

అత్తెఱంగునఁ గృష్ణపరాయణుండై యుత్తానపాదనందనుం డైన ధ్రువుఁ డాస్థానంబు సాధించి మూఁడులోకములకును శిరోమణిచాడ్పున వెలింగె. మేధిస్తంభమునఁ బశుగణం బెట్టు లట్టులు గంభీరవేగం బైన జ్యోతిశ్చక్రంబు తదీయస్థానమున నావహితంబై తిరుగుచుండెడు. అతని మహిమంబు సూచి నారదుఁడు ప్రచేతసులసత్త్రమున వీణ వాయించుచు "వేదవాదు లైన బ్రహ్మర్షులును భగవద్ధర్మములనెల్ల లెస్స యెఱింగియుఁ బతిదేవత యగుసునీతితపఃఫలంబై సుతుఁడై జనించినధ్రువుని పదంబు సాధింపఁ జాలరు. రాజుల కయ్యది యరిది యని చెప్ప నేల? అతం డై దేండ్ల బాలుఁడయ్యు సవతితల్లిప్రల్లదంబుల కలిగి యడవి కేఁగి నాయుపదేశమున భక్తగుణపరాజితుం డైనయజితుం దపంబునఁ దృప్తుం జేసి యాస్థానం బధిగమించె. ఐదాఱేండ్లవాఁడయ్యు నాతం డల్పదినముల నార్జించినయయ్యుత్తమపదం బెంతటివృద్ధులకేని యేండ్లఁబూండ్లనైన సాధింప నలవిగా" దని యిట్లు గానముఁ గావించె. విదురా, నీయడిగిన దాని కుత్తరంబుగా సాధుసమ్మతం బైనధ్రువచరిత్రంబు నీకుఁ జెప్పితి. ధన్యము యశస్య మాయుష్యము పుణ్యము పరమశుభాయనము స్వర్గ్యము ధ్రువస్థానప్రాపకము సౌమనస్యము ప్రశస్యము పాపనాశనము

నగునీభాగవతోత్తమచరిత్రము మిక్కిలి శ్రద్ధతో వినినం గ్లేశజాల
బడఁగించు భగవద్భక్తి యుదయించెడు. మహత్త్వంబుఁ గోరువారికిఁ
దత్ప్రాప్తిస్థానం బైనతీర్థంబు శ్రోతలకు శీలాదిగుణనిబంధనంబు తేజోభి
లాషులకుఁ దేజస్కరంబు మనస్వులకు మనోనైర్మల్యకారణంబు నగునీ
పుణ్యశ్లోకచరిత్రముం బవిత్రుండై సాయంప్రాతర్వేళల బ్రాహ్మణసభ
లోనం గీర్తింపఁజను. పూర్ణిమామావాస్యాద్వాదశీతిథులందు శ్రవణ
నక్షత్రమందును దినక్షయవ్యతీపాతంబులందును గ్రహణసంక్రమణార్క
వారంబులందును భగవత్పదాశ్రయుఁడై నిష్కాముఁడై శ్రద్ధగలవారికి
వినిపించునతం డాత్ముఁ డాత్మసంతుష్టుం డని యెఱింగి సిద్ధిం గాంచెడు.
భగవన్మార్గమునం దమృతరూప మగుజ్ఞానము నజ్ఞాతతత్త్వునకుఁ గరుణ
పెంపున బోధించుదీనవత్సలునకు సురలు సుప్రసన్ను లగుదురు. పసిబాలుఁ
డయ్యు నాటలను దల్లిని గృహమును విడిచి యడవి కేఁగి యోగి
సేవనీయుం డైనవాసుదేవునిచరణంబు శరణంబు సొచ్చి విఖ్యాతవిశుద్ధ
కర్ముఁడై వెలసినధ్రువునిచరిత్రం బియ్యది యని మైత్రేయుండు సెప్పినం
గౌషారవిమునివర్ణితం బైనధ్రువునివైకుంఠపదాధిరోహణం బాకర్ణించి
విదురుఁడు భగవంతునిపయిం బ్రరూఢభక్తిభావుఁడై మఱియు నిట్లని
యడుగం దొడంగె.

### మైత్రేయుఁడు విదురునకు ధ్రువవంశప్రవర్తనము చెప్పుట

తపోధనా, నారదుఁడు ప్రచేతసులసత్రమున ధ్రువచరిత్రంబుఁ
బాడె నని చెప్పితిరిగదా. ఆప్రచేతసు లెవ్వరు? ఎవ్వనితనయులు? ఎవ్వని
కులమునం బుట్టినవారు? వా రెచ్చట సత్ర మనుష్ఠించిరి? దేవ
దర్శనుం డైననారదమునీంద్రుఁడు మహాభాగుఁ డని తలంచెద. స్వధర్మ
శీలురగుపురుషుల కారాధనీయుం డైనహరిపరిచర్యాప్రకారంబెల్ల భక్తి
మంతుఁడై యమ్మునీంద్రుండకదా నిరూపించె. మఱియు నత్తపోధనుం
డాసమాజమున నింక నేయేకథల వర్ణించె వానినెల్ల నాకర్ణింపఁ గుతూ
హలం బయ్యెడు కరుణించి ప్రతిపాదింపు మని యడిగిన విదురునకు
మైత్రేయుం డిట్లనియె. ధ్రువుఁ డట్లు తపోనుష్ఠానార్థంబు బదరీవనము
నకుఁ జనినపిదపఁ దత్పుత్త్రుం డైనయుత్కలుండు రాజ్యాసనం బంగీకరింప
జన్మసిద్ధశాంతియుక్తుండు గావున నిస్సంగుఁడై సమదర్శనుఁడై లోకము

యందుఁ దన్నుఁ దనలో లోకములను గాంచుచు నిరంతరాయంబైన యోగాభ్యాసం బను ననలంబునఁ గర్మవాసనలం గాల్చి నిరస్తభేదము బోధాత్మకము శాంత మానందమాత్ర మనుస్యూతంబు నగు బ్రహ్మస్వరూప మనుసంధించి తనకంటె నితరపదార్థము నెద్దానిం గానక యాత్మనిష్ఠుండై జడాంధబధిరోన్మత్తమూకాకారుండై సర్వజ్ఞుండు గావున నతన్మతియయ్యు బాలమార్గమునఁ గన్పట్టుచుఁ బ్రశాంతార్చి యగునగ్నిమాడ్కి నుండుటయుఁ గులవృద్ధులును మంత్రులు నతని జడుంగ నున్మత్తుంగఁ దలంచి యతనితమ్ముం డైన భ్రమిసుతుని వత్సరనాముని రాజ్యమున నభిషేకించిరి. ఆవత్సరునిభార్య సర్వర్ధి యనునది పుష్పార్ణుఁడు చంద్రకేతుఁ డిషుఁ డూర్జుఁడు వసుఁడు జయుఁ డన నాలుగురు కొడుకులం గనియె. అందుఁ బుష్పార్ణునకుఁ బ్రభ యనుభార్యయందుఁ బ్రాతర్మధ్యందినసాయంసమాఖ్యు లగుముగ్వురు సుతులును దోష యనుభార్యయందుఁ బ్రదోషనిశీథవ్యుష్టినామకపుత్రులు ముగ్గురును గలిగిరి. వ్యుష్టికిఁ బుష్కరిణి యనుదానియందు సర్వతేజుండు పుత్రుం డయ్యె. వాని కాకూతి యనుపత్నియందుఁ జక్షు వనుమనువు జనించి నడ్వల యనుభార్యయందుఁ బురుఁడు కుత్సుఁడు త్రితుఁడు ద్యుమ్నుఁడు సత్యవంతుఁడు ఋతుఁడు వ్రతుఁ డగ్నిష్టోముఁ డతిరాత్రుఁడు సుద్యుమ్నుఁడు శిబి యుల్ముకుఁ డనఁ బరిశుద్ధులగుద్వాదశపుత్రులంగాంచె. ఉల్ముకునకుఁ బుష్కరిణియనుదానియం దంగుఁడు సుమనసుఁడు ఖ్యాతి క్రతు వంగిరసుఁడు గయుఁ డన నాలుగురుకొడుకులుపుట్టిరి. అంగుభార్య యగు సునీథ దుర్వృత్తుం డైనవేనుఁడనుకుమారుం గనియె. ఆకొడుకు దుశ్శీలత్వమునకు నిర్వేదంబుఁ జెంది యంగుఁడు పురముఁ దొఱఁగి యరిగె. అవ్వేనునిదుశ్చేష్టితంబుల కలిగి మునులు వాగ్వజ్రముల నాతనిం జంపి యప్పుడు లోక మరాజకం బైనం బ్రజలకు దస్యుబాధదొడరినం దాని మాన్ప నవ్వేనునిదక్షిణకరంబు మథించుటయు నారాయణాంశమున నాదిరా జగుపృథు వుదయించె ననిన విని విదురుండు మహాత్మా, శీలనిధి సాధువు బ్రహ్మణ్యుఁడు నగునయ్యంగునకుఁ దాను నగరము విడిచి వెడలవలసినంతటి దుశ్చేష్టితంబులకొడు కేల గలిగె? ధర్మకోవిదు లగు మునులు చండవ్రతధరులై రాజైనయావేనునెడ నేల బ్రహ్మదండముఁ

ప్రయోగింపరి? లోకపాలతేజము భరించినకతన రాజువలన నేదేని తప్పిదంబు గలిగిన నతని నవమానింప నతనియేలుబడి నున్న ప్రజలకుఁ దగదుగదా? శ్రద్ధావంతుఁడు భక్తుఁడునగునాకు సునీథాపుత్త్ర చేష్టితంబు తేటపడఁ జెప్పుము. నీవు పరాపరజ్ఞుండవుగదా యని యడిగిన విదురునకు మైత్త్రేయుం డిట్లనియె.

## అంగుఁడు పుత్త్రేష్టి చేసి వేనుఁ డను పుత్త్రుం బడయుట

రాజర్షి యగునంగుఁ డశ్వమేధ మాచరించిన నందు బ్రహ్మవాదులగు ఋత్విజులు నియమముతో నాహ్వానంబొనర్చిన సురలు రాక తక్కుటయు ఋత్విజు లద్భుతం బంది యజమానుఁ డైనయంగునిఁ జూచి యో రాజేంద్రా, యాహుతుల నమరులు గొనరైరి. హవ్యములు దుష్టములుగావు. మఱియు శ్రద్ధాసాదితంబు లయ్యెడు. ధృతవ్రతులై బ్రాహ్మణులు సారవంతము లైనమంత్రములం బఠించిరి. సురల కించుకేనియు నపరాధము గానంబడదు. కర్మసాక్షు లగు వేల్పులు వచ్చి తమతమ హవిర్భాగములం గొనమికిఁ గతంబు దోఁప దని చెప్పిన విని యంగుఁ డత్యంతదుర్మనుండై సదస్యులయనుమతిఁ గొని మౌనవ్రతముఁ బరిత్యజించి యోమహాత్ములారా, సురలు నాయజ్ఞమునకుఁ బిలిచిన నేల రారు? గ్రహముల నేల గ్రహింపరు? నాతప్పిదం బెయ్యదియేనియుఁ గలుగునేని తెలియఁ జెప్పుఁ డని యడుగుటయు సదస్యు లతని కిట్లనిరి. నరదేవా, నీతప్పిదం బిందుఁ గొంచెమేనియుఁ దోఁపకుండెడుఁగాని నీ వింతవాఁడవయ్యు నపుత్త్రుఁడ వనునొక్కప్రాక్తనపాపంబు గలదు. దానం జేసి సురలు రాకుండుదురు. పుత్త్రేష్టి చేసి పుత్త్రుం బడయుదేని యట నీహవిర్భాగములం గ్రతుభోజనులు గ్రహింతురు. పుత్త్రకామేష్టి నయ్యజ్ఞేశ్వరు నారాధించినఁ బుత్త్రోదయం బయ్యెడు. ఆ యిష్టిని హరి నారాధించునెడ నాతనితోడ వచ్చి గీర్వాణులు తమ తమహవిర్భాగములం గ్రహింతురు. ఎవ్వరేకామములం గోరి యారాధించిన దదనురోధమున హరి వారికోర్కు లీడేర్చు నని చెప్పి వారు పుత్త్రకామేష్టి నేయించువారై విష్ణుదేవతాకం బైనపురోడాశముఁ గల్పించి విధియుతముగ వ్రేల్చిన నయ్యగ్నికుండమునుండి హేమమాలుఁడు ధవళాంబరుఁడు నగునొక్కపురుషుఁడు హిరణ్మయపాత్ర

మున సిద్ధపాయసంబుఁ గొని లేచి వచ్చె. అప్పుడు బ్రాహ్మణానుమతుం డై యంగుఁ డంజలిపుటంబున నాపాయసము గ్రహించి సంతోషమున నాఘ్రాణించి పత్ని కొసంగె. పుత్త్రప్రసవకారణం బైనయాపాయసము నతనిపత్ని యగుసునీథ భుజించి పతివలనం జూలు గొని తత్తఱితోఁ బుత్త్రుం గనియె. అక్కుమారుఁడు వేనుఁ డనంబరఁగి పుట్టిన నాఁటఁగోలె దనమాతామహుఁ డైనమృత్యువు ననువర్తించి యధార్మికుండై విల్లమ్ములు గొని యడవి కేఁగి యసాధువై సాధుమృగముల నిష్కారణంబ వధించుచున్నంతఁ బ్రజ "లక్కటా! వేనుం"డని యందఱు నాక్రోశించునట్లు దుర్వృత్తికిఁ గడంగి తనలో నాడు తోడిబాలుకం బిట్టు గిట్టి కటికవాఁడు పశువు నెట్టు లట్టులు నిర్దయుండై యట్లు దుష్కార్యప్రవృత్తుం డైనకొడుకును శాసింప నెన్నియేఁ బ్రయత్నము లొనర్చియు వితథోద్యముండై యంగుఁడు తనలో నిట్లని వితర్కించె. భరింపరానిదుస్సంతానదుఃఖము నరయక తఱచుగ ననపత్యులైన గృహస్థులు సంతానార్థంబు భగవంతు నారాధింతురు. దురపత్యంబుఁ గన్న నపకీర్తియు నధర్మంబును సర్వద్వేషంబును దీనిమనోవ్యాధియుఁ గలిగెడు. గృహాదిపరికరములకుం గ్లేశదాయకత్వంబుఁ గూర్చు కుపుత్త్రుం డనుమోహపాశముం బండితుఁ డెవ్వఁడైన మెచ్చునే? తప్ప దలఁచితి విచారింపఁ గుపుత్త్రునివలనను మేలు గలిగెడు. సుపుత్త్రుఁడు గలిగినం దదీయచేష్టితంబుల మెచ్చుచు నరుఁడు నిత్యంబు గృహాసక్తుఁ డయ్యెడు. కుపుత్త్రునివలననో యట్లుకాక సంసారభోగములపై విరాగంబు వొడమ నిల్లు వెడలి యాత్మగతి నరయ వల నయ్యెడు? కావున నీవిధంబున సుపుత్త్రునికంటెఁ గుపుత్త్రుఁడే యుత్తముఁ డని తలపోయవచ్చు నని యిట్టులు తనలో నాలోచించి యంగుఁడు సంసారమునెడ విరక్తుండై నిద్దుర గానక చింతిల్లుచు భార్యను విడిచి నడిరేయి సర్వసంపత్సమృద్ధం బైనయిల్లు వెడలి యడవి కరిగె. అవ్విధంబున రాజు చనినం బురోహితు లమాత్యులు సుహృదులు మున్నుగా నెల్లవారు పరమశోకాక్రాంతులై యతని వెదకియుఁ గుయోగులు గుహానిగూఢపరమపురుషు నెట్టు లట్టు

లయ్యంగనృపాలునిపోఁబడి యెఱుంగక హతోద్యములై మగిడి పురమున కేతెంచి విలపించుచు రాజవిప్లవంబు ఋషులకు నివేదించిరి.

### వేనుఁడు రాజై ధర్మవిరోధంబుఁ జేయుట

అట లోకక్షేమం బరయుభృగ్వాదిమునులు రాజు లేకున్నం బ్రజలు పశుసమత్వంబుఁ బొందుదు రని యాలోచించి సునీథం బిలిచి తత్పుత్త్రుం డైనవేనుం బ్రజలు మెచ్చకున్న నరాజకత్వదోషముఁ బరిహరింప రాజ్యమున నభిషేకించిరి. అత్యుగ్రశాసనుఁ డైనవేనుఁడు సింహాసనం బెక్కె నని విన్నంతన సర్పభీతము లగుమూషకంబులచందమునఁ జోరు లణఁగిరి. అవ్వేనుఁ డట్లు సింహాసన మధిష్ఠించి యష్టలోకపాలైశ్వర్యసంభావితుండై గర్వించి మహాభాగుల నవమానించుచు నిరంకుశం బైనగజముమాడ్కి నప్రతిహతగతిం దేరెక్కి భూనభోంతరము కంపింపఁ దిరుగుచు "ద్విజులారా, యజ్ఞముల ననుష్ఠింపవలదు, దానములియ్యవలదు, హోమంబులు వ్రేల్వవల" దని భేరీఘోషమునం జాటించుచు ధర్మము నిషేధించుచుండె. దుర్వృత్తుండై యవ్వేనుని దుష్టచేష్టితంబుఁ జూచి లోకమునకు మూడినకీడుం బరికించి యక్కటా! లోకమునకుఁ బాలకునివలనను దస్కరులవలనను ద్వివిధం బైనవ్యసనంబు దొడరె. కాష్ఠమున కిరువంకల నగ్గి దరికొల్పిన ట్లయ్యె. వీఁడు రాజ్యార్హుఁడు గాకున్న నరాజకభయమునం జేసి వీని రాజుం జేయుటయు నిప్పుడు దానం గడుభయం బయ్యెడు. ప్రజలకు మే లెవ్విధి నయ్యెడునో? పాలు వోసి పాముం బెంచిన నయ్యది పెంచినవానిం గఱచి చంపువిధముఁ బ్రకృతిదుష్టుం డైన యీసునీథాసుతుండు దన్నుఁ బ్రజలు రాజ్యాసనమున నభిషేకించినం దాను వారికే కీడు రోయుచుండెడు. ఐన మనచేనైనంతకు వీనికిఁ జెప్పి చూతము. వాఁడు వినియు వినకుండెఁ జేయఁగలయంతయుం జేసిన మనకుఁ దత్పాప మంటకుండెడు. మనమే యీయసద్వృత్తుని రాజుఁగా నభిషేకించినకతన వానికిప్పుడు హితబోధనంబును గర్తవ్యం బయ్యెడు. మనమారార్చిబోధించిన నాతండు వినక ధిక్కరించునేని లోకధిక్కారసందిగ్ధుం డైనయప్పాపాత్మునస్మత్తేజమున నిర్దహింతుమని తమలో నిశ్చయించి యమ్మునులు నిగూఢమన్యువేగులై యవ్వేనునొద్ద కరిగి సామవచనముల నిట్లని యతని నూఱడించిరి.

రాజేంద్రా, మా విజ్ఞాపనంబు వినుము. దీన నీ కాయువు శ్రీయు బలమును గీర్తియు వర్ధిల్లెడు. వాఙ్మనఃకాయవృత్తుల నాచరించినధర్మము పురుషులకు లోకవిశోకత్వంబును దుదిముక్తిని గలిగించెడు. ప్రజాక్షేమలక్షణం బైనయాధర్మము నయ్యెడ నశింపకుండుఁగాక. ధర్మము దఱఁగిన నైశ్వర్యచ్యుతి రాజున కయ్యెడు. రాజన్యుఁడు దుష్టామాత్యులవలనను జోరులవలనను బ్రజలఁ బ్రోచి విధియుతంబుగ బలిం గొని యీలోకమునను దాన నార్జించినధర్మమున నాలోకమునను సుఖించు. ఎవ్వనిరాష్ట్రమునం బురమునను యజ్ఞపురుషుం డైనభగవంతుని జనులు వర్ణాశ్రమోచితధర్మముల నారాధింతు రట్టిరాజు తనశాసనము ననుష్ఠించువాఁ డని యాతనికి భూతభావనుం డైనభగవంతుఁడు సుప్రీతుం డగు. లోకములును లోకపాలురు నాదరణముతో నెవ్వనికి బలి యర్పింతు రాలోకేశ్వరేశ్వరుండు సంతుష్టుం డగు నేని జనులకుఁ బ్రాప్యంబు గానియర్థ మొక్కఁడుం గలుగదు. కావున సర్వలోకదేవయజ్ఞసంగ్రాహుఁడు త్రయీమయుఁడు ద్రవ్యమయుఁడు తపోమయుఁడు నగునాభగవంతుని వివిధయజ్ఞముల సమృద్ధిఁ బొంది నారాధించుస్వదేశజనుల వారింపఁ దగదు. నీజనపదంబునందు ద్విజు లాచరించుయజ్ఞములం బరితృప్తులై హర్యంశభూతు లగునమరులు వాంఛితార్థముల నిత్తురు. వీరవర్యా, దేవతాతిరస్కారంబు చేయరా దని చెప్పిన నమ్మునులకు వేనుఁ డిట్లనియె. అక్కటా! మీరు మూర్ఖులై యధర్మమును ధర్మ మని తలంతురు. అన్నాదివృత్తుల నిచ్చు రాజైన నన్ను విడిచి తనమగని గాదని జారు నుపసర్పించుజఅభికరణి లాఁతిం గొలువఁ బూనితిరి. నృపరూపముఁ దాల్చి యీశ్వరుం డైననన్ను నవమానించువా రుభయలోకములనుం జెడుదురు. భర్తృస్నేహదూర లగు నసతులకు జారునిమీఁద నెట్టులట్టులు మీ రెవ్వనిపై నిట్టిభక్తి వాటింతు రయ్యజ్ఞపురుషుఁ డెవ్వఁడు? విష్ణువు బ్రహ్మ శంకరుఁడు శక్రుఁడు వాయువు యముఁడు సూర్యుఁడు పర్జన్యుఁడు కుబేరుఁడు సోముఁడు భూమి యగ్ని వరుణుఁడు మున్నగా శాపానుగ్రహసమర్థులైనబృందారకు లందఱును నృపతిదేహమునందు నివసింతురు. కావున రాజు సర్వదేవమయుఁ డని వేర్కొనంబడు. అట్టి నన్ను విప్రులారా, మత్సరంబు మాని యాగా

ధించి బలి యర్పింపుఁడు. నాకంటె నగ్రభోజనీయుం డైనయారాధ్య
పురుషుఁ డొండొకండు మీకుఁ గలుగఁడని యిట్టు లప్పాపాత్ముం డైన
వేనుండు విపరీతమతియై యుత్పథం బాక్రమించి భ్రష్టమంగళుండై
సానునయం బైనయమ్మునులహితోపదేశంబు నిరాకరించె.

### దుష్టుఁ డగువేనుని మునులు హుంకారములం జంపుట

పండితమ్మన్యుం డైనయవ్వేనుం డట్టులు తిరస్కరించినం దమ
కోర్కి వమ్మగుట కలిగి తపోధను లక్కటా! ప్రకృతిదారుణుం డైనయీ
పాపాత్ముంబరిమార్పవలయు. ఇంక వీఁడు బ్రదికినం బ్రపంచంబుఁగాల్చెడు.
సిగ్గుమాలి యజ్ఞేశ్వరుం డైనవిష్ణుదేవుని నిందించునీదుర్వృత్తుఁడు రాజా
సనంబున కర్హుండుగాఁడు. ఎవ్వనియనుగ్రహమున నింతటియైశ్వర్యంబు
గలిగె నట్టిపురుషోత్తముని వేనుఁ డొక్కండు దక్క మఱియొక్కండు
దూఱునే? అని కోపావేగమున నవ్వేనుం జంపఁ దమలో నిశ్చయించి
యచ్యుతనిందచే గతాయువై హతప్రాయుం డైనయవ్వేనుని హుంకార
ముల నదల్చి విగతాసుం జేసిరి. ఋషు లవ్విధమున వేనుం డెగఁజూచి
నిజాశ్రమమ్ములకుఁజనిన పదంపడి సునీథ శోకించుచు నాత్మమంత్రయోగ
మునం దత్కళేబరంబుఁ గాపాడుచుండె. అంత నొక్కనాఁ డమ్మునులు
సరస్వతీనదిం గృతస్నానులై యాసరిత్తీరంబున నగ్నిహోత్రములు
నిర్వర్తించి యాసీనులై సత్కథాగోష్ఠి నున్నంత లోకభీకరంబుగా ననే
కము లగుమహోత్పాతంబులు దోఁచె. వానిం జూచి యమ్మహా
మునులు రక్షకులు లేనిప్రజలకు దస్యుభయంబు గలుగునొక్కొ యని
చింతించుచు ధనమునెల్లఁ గొల్లగొనిపోవఁ బాఱుతెంచుమ్రుచ్చులు
వచ్చుట నచ్చటచ్చట నెల్లదెసల నెనసినపాంసుజాలమున నూహించి
రాజులేనికతనఁ జోరప్రాయులై పరస్పరవధమునకుఁ దొడరుదుర్జనుల
వలన లోకమునకు మూడినకీడు బరికించి యక్కటా! దేశమెల్ల,
నరాజకంబై హీనసత్త్వంబై జోరప్రాయం బయ్యె నని వగచుచు
దానం గలుగుచేటెఱింగియు నాఁప నోపక సమదర్శనుం డైనబ్రాహ్మ
ణుండు దీనులకుఁ జేటు వాటిల్లినపు డుపేక్షించునేని యవిసినకుండలోని
నీళ్లు వెట్టు లట్టు లతనితపంబు స్రవించెడుఁ గావున దీనికిఁ బ్రతివిధానంబు
కర్తవ్యంబు. రాజర్షి యైనయంగునివంశ మీవేనునితోఁ దుది ముట్టఁ

దగదు. అప్పుడా వంశమునం గేశవాత్రియు నైనరాజు లమోఘవీర్యు లని తమలో నిశ్చయించి వానికళేబరముం దర్జనని కాపాడుచునికి యరసి యచ్చటికిం బోయి చచ్చినయవ్వేనునితొడ ద్రచ్చిన నందుఁ గాకివోలె నల్లనిహ్రస్వగాత్రంబుతోఁ గుఱుచచేతులతోఁ మహాహనువుతో హ్రస్వపాదములతో నిమ్ననాసాగ్రంబుతో రక్తనేత్రకేశంబులతో బాహుకుఁ డను నొక్కండు పుట్టి వినమ్రుండై యే నేమి సేయుదు నని యడుగుటయు మునులు "నిషీద" యని నిర్దేశించిన నతండు నిషాదుం డయ్యె. దానం జేసి తద్వంశ్యులు నిషాదులై గిరికాననంబుల వసించిరి. వేనునికల్మషం బెల్లం దన్నిషాదరూపమున నిర్గతం బయ్యె.

## వేనభుజమథనంబునఁ బృథుచక్రవర్తి పత్నితోడ నుదయించుట

అవ్విధంబున వేనగాత్రంబు పవిత్రం బగుటయు సమ్మునులు గ్రమ్మఱ నమ్మహీపతిబాహువులు మథించిన నందొక్కమిథునం బుదయించె. ఆదంపతులం గాంచి బ్రహ్మవాదులైనయమ్మును లద్దిరా యీ పురుషుండు పురుషోత్తమునిలోకపాలనంబైనకళయు నీసుందరి యాగోవిందు నురస్స్థలంబు వాయనియిందిరాదేవియంశంబు నగుదురు. ఈతండు రాజులకుఁ బ్రథముండై యాత్మకీర్తిప్రథనం బొనర్చుఁ గావునఁ బృథు వనం బ్రథితకీర్తియై మహారాజపదంబుఁ గొనియెడు. గుణభూషణభూషణ యగునీదేవియు నిరంతరార్చిష్మత్త్వంబునం జేసి యర్చిస్సనాఁ బరఁగి పృథు ననువర్తించెడు. లోకరక్షార్థం బవతరించినలక్ష్మీనారాయణుల యంశంబులే వీర లని ప్రశంసించుచున్నంత గంధర్వగానంబులు సిద్ధగణసుమవర్షంబులు స్వస్తరుణీనృత్యంబులు దివ్యవాదిత్రవాదంబులు నెసంగె. అట్టియెడ దేవర్షిపితృగణంబులతోఁ బితామహుం డేతెంచి యావైన్యుని దక్షిణహస్తమునందు విష్ణుచిహ్నం బైనచక్రరేఖను జరణములం దరవిందలాంఛనంబునుం గాంచి నిక్కం బీతండు హరికళయని నిశ్చయించె.

## పృథుచక్రవర్తి రాజ్యాభిషిక్తుం డగుట

నారాయణాంశసంభూతుం డైనయతనికి రాజ్యాభిషేకశోభనంబుఁ గావింపఁ బ్రహ్మవాదు లగుబ్రాహ్మణులు కడంగుటయు నెల్లదెసలనుండి యందఱు నభిషేకద్రవ్యసంభారములం గొనితెచ్చి యర్పించిరి. నదులు సముద్రములు వృక్షములు పశువులు గోవులు మృగ

ములు భూమి యంతరిక్షము సర్వభూతములును గానుక వెట్టినం బరమాద్భుతం బయ్యె. ఆపృథుమహీపాలుండు రాజ్యాభిషిక్తుండై యుత్తమాంబరములం గట్టి కనకమణిమయాభరణములఁ దొడిగి లెస్స కై సేయంబడినపత్ని యగునర్చిస్సుతోడం గూడి రెండవయగ్నిదేవుం డునా వెలింగె. కుబేరుఁ డతని కుత్తమసింహాసనంబును వరుణుఁ డంబు స్రావంబై చంద్రప్రకాశం బైనశ్వేతాతపత్రంబును వాయువు చామర ద్వయంబును ధర్ముఁడు కీర్తిమయమాల్యంబు నింద్రుఁ డుత్కృష్టకిరీటం బును యముఁడు సంయమనదండంబును బ్రహ్మదేవుఁడు వేదమయకవచం బును భారతీదేవి యుత్తమహారంబును హరి సుదర్శనచక్రంబును లక్ష్మీ దేవి యవ్యాహతసంపత్తిని రుద్రుఁడు దశచంద్రబింబాకారభాసురకరవా లంబు నంబిక శతచంద్రచర్మంబును సోముఁడు సుధామయతురంగము లను త్వష్ట సుందరస్యందనంబు నగ్ని యజగోశృంగనిర్మితకోదండమును సూర్యుఁడు కిరణమయబాణంబులను భూమి యోగమయపాదుకలను దివంబు నిత్యపుష్పబలిని ఖేచరులు నాట్యగీతవాదిత్రాంతర్ధానకౌశలం బును ఋషులు సత్యాశీర్వాదంబును సముద్రుఁ డాత్మభవం బైన శంఖమును సింధుపర్వతంబు రథవీథుల నొసంగుటయు సూతమాగధ వందు లతనిం బ్రస్తుతింప నుపసర్పించిరి. వారితలం పెఱింగి ప్రతాప వంతుం డైనయావైన్యుఁడు నవ్వుచు మేఘగంభీరస్వనంబున నిట్లనియె. ఓసూత, మాగధ, వందీ, లోకమునం గుణప్రఖ్యాతిఁ గనిననాయెడ నిప్పుడు మీస్తోత్రంబు లేని నాశ్రయించి చెల్లునో యొఱుంగరాదు. ప్రఖ్యాతగుణు లైనయంతరులం బొగడిన మీవచనంబులు సత్యంబు లయ్యెడు కావునం గాలాంతరమున మాచరిత్రములు స్తోత్రపాత్రంబులై ధాత్రిం బ్రవృత్తంబు లయ్యెనేని యప్పుడు మీసుందరవచనముల కలం కారంబుఁ గావింపవచ్చుఁగాని యిప్పుడు దగదు. ఉత్తమశ్లోకులగుణ ములఁ గీర్తింపఁ దగినతఱిఁ దక్కువవారిం గీర్తించుట నింద్యంబని సభ్యు లెన్నుదురు. మహాత్ములగుణములు దనయొడం గలుగకుండిన నవి యున్నట్లు స్తుతిపాఠకులు దన్నుఁ బొగడిన వినఁగ నీశుఁ డెవ్వఁ డుత్సహించు? లేనిగుణము లుగ్గడించి పొగడునెడ నవి గలిగిన నంతవాఁ డగుఁగాని యవి లేకున్నం గాఁ డని యొత్తిచూపి యుపహసించినట్లగాఁ దలంపవల

యుఁగాని కుమతియట్లు లక్ష్మీమిథ్యాస్తుతి కుఱ్ఱరాదు. శ్రీమంతులగు మహోదారులు ప్రభువులయ్యుఁ బ్రఖ్యాతులయ్యు వాస్తవం బగు నాత్మగుణకీర్తిం బ్రస్తుతించునెడ విని సేవగింతురు. ఏమిప్పటికేయుత్తమ కార్యములం జేయకుండియు బాలునిరీతి నెట్టు లాత్మఖ్యాపనం బొనర్తు మని చెప్పిన నాకర్ణించి సూతప్రముఖులు మునిచోదితులై తదీయవచనామృతముఁ గ్రోలి ముదం బెనసి యిట్లని ప్రస్తుతించిరి.

### సూతప్రభృతులు మునిచోదితులై పృథుని ప్రస్తుతించుట

మహారాజాధిరాజా, యాత్మమాయాయోగమున వేనాంగమున జనించిన నారాయణరూపాంతరం బైననీపరాక్రమమహిమంబులు వర్ణింప మే మెంతవారము? బ్రహ్మాదులు సందు మతిభ్రాంతిఁ బొరయుదురు. ఐనం బుణ్యశ్లోకుం డైనహరియంశావతారభూతుల కథాసుధాస్వాదనంబు మీఁది యాదరంబునం జేసి మునులవలన నెఱింగినకొలఁది భవదీయ శ్లాఘ్యకర్మములఁ బ్రకటింతుము. ఈరాజచంద్రుండు ధార్మికప్రవరుండై ధర్మసేతురక్షణంబును దర్విరోధిశిక్షణంబునుం గావించుచు లోకమున ధర్మప్రచారంబు సేసెడు. ఇతండు తఱితోఁ దనతనువున లోకపాలతనువులఁ దాల్చి యుభయలోకములకు హితముఁ గావించెడు. సూర్యుఁ డెనిమిదినెలలు భూమిలోనిజలముఁ దీల్చి నాలుగునెలలు వర్షన్యుండై వాన గురియుకరణి నీతండు దఱితోఁ గప్పములఁ గొనుచుఁ బ్రజల కన్నము లేనికాలమున సాధనము వారి కొసఁగి ప్రోచెడు. సర్వంసహాతీరున నీతఁ డార్తులైనవారు పాదములఁ దన్నాక్రమించిన నయ్యతిక్రమంబు సైరించెడు. ఇంద్రునిమాడ్కి వాన లేక ప్రజలన్నాతురత్వంబున నవయునెడ వారి కన్నాదుల నొసఁగి రక్షించెడు. తనవదనము చంద్రబింబమునకు సాటియై యమృతమయం బై వెలయు స్మేరసానురాగ వీక్షణంబున నీతండు ప్రజల కాప్యాయనం బొనర్చెడు తనమార్గం బితరులకుఁ దెలియకుండఁ జరించుచుఁ దనపూనినపని ఫలపరిణామంబునం గాని లాఁతుల కెఱుఁగఁబడకుండ నిగూఢముగఁ గరణీయంబులఁ గడంచుచు నీతం డనంతమాహాత్మ్యగుణైకధాముండై వరుణునికరణి సంవృతాత్ముండై గంభీరమేధామహిమంబున నర్థగుప్తి గావించెడు. అనలునిరీతి వేనారణిప్రభవుం డైనయీతండు దుఱంగట నుండినను దూరస్థునిరీతిఁ

దోఁచుచు దురాసదుఁడు దుస్సహుఁడునై పరులకుఁ జెనకరాకుండెడు. సూత్రాత్మ యగువాయువుచాడ్పున నధ్యక్షుండయ్యు నుదాసీనునిరీతిఁ దోఁచుచు నీతం డెల్లవారియాంతరబాహ్యకర్మముల నిపుణచారులవలన నరయుచుండెడు. మఱియు నీధార్మికుఁడు శత్రుపుత్త్రునినైన దండనార్హదోషము లేకుండిన దండింపఁడు. ఆత్మపుత్త్రుఁడేనియు దండ్యుఁడైనం దండించు. సూర్యుఁడు దనకిరణముల నెందాఁక నెండ గాయు నందాఁకను మానసాచలంబుదనుక నితనియాజ్ఞాచక్రం బప్రతిహతంబై పర్వెడు. మనోరంజనంబు లైనయాత్మ చేష్టితంబులఁ బ్రజలకు రంజన మొనర్చుటం జేసి యితండు రా జనం బరఁగెడు. వెండియు నితండు దృఢవ్రతుఁడు సత్యసంధుఁడు బ్రహ్మణ్యుఁడు వృద్ధసేవకుఁడు సర్వభూతశరణ్యుఁడు మానదుఁడు దీనవత్సలుఁడు పరస్త్రీలయెడ మాతృభక్తిఁ జూపువాఁడు పత్నిని దనయర్ధముగ నాదరించువాఁడు ప్రజలకుఁ దండ్రివోలె స్నిగ్ధుఁడు బ్రహ్మవాదులకుఁ గింకరుఁడు దేహులకెల్ల నాత్మరీతిఁ బ్రియతముఁడు సుహృదుల కానందవర్ధనుఁడు ముక్తసంగులతోడ సంగ మొనర్చువాఁడు దుష్టులకు దండపాణిరీతిఁ దోచువాఁడునై పరమవిఖ్యాతిం గాంచెడు. అవిద్యారచితం బైననానాత్వము ప్రతీతిగోచరంబయ్యు వస్తుగతి నపార్థం బని పెద్దలు వలుకుదు రట్టికూటస్థుం డైనత్ర్యధీశుఁడే నిజాంశమున నవతరించి యితనిరూపమునఁ గన్పట్టుచుండెడు. ఈనరదేవనాథుఁ డర్కునిమాడ్కిఁ జైత్రరథ మధిరోహించి విల్లుగొని యుదయగిరిదాఁక మహీమండలంబు వలగొనియెడు. సకలరాజులును .లోకపాలురు నితనికచ్చటచ్చట బలులొసంగుదురు. వారిభార్య లితనిఁ జక్రాయుధుఁగా నెన్నుచుఁ దద్యశంబుఁ గీర్తింతురు. ఈరాజాధిరాజవర్యుండు ప్రజలకు వృత్తిఁ గావించువాఁడు. పురందరునిరీతిఁ బర్వతముల నిజకోదండముల విగళించి భూమికి సమత్వం బాపాదించి గోరూపధారిణి యగుధరణిసఖిలార్థదుగ్ధంబుఁ బితికెడు. ఇతండు పోరికి నడచి తనయాజగవచాపం బెత్తి యుద్ధతలాంగూలం బైనమృగేంద్రంబుచందమునం గ్రీడింపఁ బూనిన నరాతులు దశదిశలం బఱచి పొడవడంగుదురు. ఇతండు సరస్వతీప్రాదుర్భావస్థానంబున నశ్వమేధశతం బాచరింపఁ గడపటియాగంబు నడచునెడ నింద్రుఁ డితనిమేధ్యాశ్వం బపహరించెడు. మఱియు నితండు

నిజభవనారామంబున నేకాంతమున సనత్కుమారు నుపాసించి భక్తి యోగంబు నేర్చి బ్రహ్మప్రాప్తిసాధనం బైనదివ్యజ్ఞానంబు సాధించెను. అప్పటప్పట నిజగుణపరిత్రాక్రియంబు లైననానాగాథలం బృథుపరాక్రమంబై యాపృథుఁ డాకర్ణించెను. తనమహనీయతేజమున లోకశల్యము న్మూలించి దిగ్విజయం బొనర్చి యెప్పుట నెన్నఁడు నేమిటం దనయాజ్ఞాచక్రమునకుఁ బ్రతిహతి గలుగనికైజంగునఁ బ్రచారంబుఁ గూర్చి సురాసురేంద్రగీయమానమహాప్రభావుండై భూలోకం బేలెను నని గుణకర్మప్రఖ్యాపనంబు సేయుచుఁ బ్రస్తుతించినం బృథుండు వారిం బ్రశంసించి కామితార్థంబు లొసఁగి బ్రాహ్మణాదివర్ణములను భృత్యామాత్యపురోహితులను బౌరజానపదులను శ్రేణిప్రకృతులను సత్కరించె, ననిన విని విదురుండు మునీంద్రా, భూమి యేల గోరూపంబు ధరించె, భూదోహనంబున నతనికి వత్సదోహనాదిప్రకారం బెట్టి దయ్యెఁ, బ్రకృతినిమ్నోన్నతం బైనభూమండలమున కెట్టు లతఁడు సమత్వం బాపాదించె, నేమి నిమిత్తంబు గలుగ నింద్రుఁ డతనిమేధ్యాశ్వము నపహరించె, బ్రహ్మవిద్వరుం డైనసనత్కుమారునివలన నాతండు జ్ఞానవిజ్ఞానంబులం బడసి యేగతిం గాంచె, మఱియుఁ బృథునియవతారంబునం బవిత్రయశుఁ డగుకృష్ణుఁ డేమి యొనరించె, వానినెల్ల వైన్యరూపమున భూదోహనం బొనర్చిన యధోక్షజునకును మాకును భక్తుండ వనురక్తుండ వగునాకుఁ దేటపడ నెఱింగింపు మని యడుగుటయు మైత్రేయుండు వాసుదేవకథ లడిగినదానికిఁ బ్రశంసించుచుఁ బ్రీతహృదయుం డై యవ్విదురున కిట్లనియె.

పృథుఁడు ప్రజల కన్నముఁ గూర్ప గోరూపధారిణి యగుధరణిం దఱుముట

పృథునృపాలుఁడు రాజ్యాభిషిక్తుం డైనపదంపడి యన్నహీనం బైనభూతలమునం బ్రజ లన్నము గానక క్షుత్పీడ కలజడిపడి యాత్మపాలుఁ డైనయమ్మహీపాలునొద్దకుఁ జని రాజేంద్రా, కోటరములోని యగ్ని వేగమునం బాదపంబు లెట్టు లేము జఠరానలతాపమునం గుందుచు మాకు వృత్తిఁ గావించు ప్రభు వని నీశరణంబు వేఁడి వచ్చినవారము. మే మీయాఁకలి కోర్వఁ జాలక కీడు వొరయకుండ నన్న మొసంగుము. జీవికాప్రదుఁ డగులోకపాలుఁడవు మాకు నీవకదా యని

పల్కినం బృథుఁడు ప్రజలదీనాలాపంబు లాకర్ణించి పెద్దయుం బ్రొద్దు చింతించి యన్నహీనత్వంబునకుఁ గారణంబు చింతించి త్రిపురాంతకునిరీతిఁ గ్రోధరూపుండై శరాసనముఁ గొని భూమిపై నేయ నమ్ముగొని యరిఁ బోయం బోయినఁ గంపించుచు ధరణి గోరూపంబుఁ గొని పోయ దఱుమం బాలులేడికైవడి వెఱచి పఱచుటయు వైన్యుం డది యెటు పోయిన నటనెల్లఁ దాను బాణపాణియై కన్నులు జేవుఱింపఁ బఱచుచుం జూచుచుఁ దఱిమె. ధాత్రి యట్లుపాఱి దిక్కులువిదిక్కులు నంతరిక్షంబునుం బఱచి యెక్కడకుఁ బోయినం గైదువు పూని తనవెంట నంటి వచ్చుచున్న యన్నరనాథుం గాంచి మృత్యువునకుఁ బ్రజ లెట్ల ట్లతనికి వెఱచి యొండుదిక్కు గావక దీనహృదయంబుతో నతని కిట్లనియె. మహాభాగ, ధర్మజ్ఞ, దీనవత్సలా, భూతపాలనపరినిష్ఠుఁ డగునీకు నన్నుం బ్రోవఁ దగదే? ధర్మజ్ఞుఁడవయ్యు నీవు స్త్రీవధదోషంబుఁ బాటింపక తప్పు సేయనిదీనురా లగున న్నేల చంపఁ బూనుదువు? సామాన్యజనులును స్త్రీలు తప్పిదంబు చేసినను వారిం బరిమార్ప నొల్లరు. నీయట్టిదీనవత్సలు లైనరాజులం జెప్పవలయునే? ఏకార్ణవజలంబున నావకైవడి విశ్వాధారంబై యున్ననన్ను విదళించి నిన్ను నీప్రజల నెట్టు జలమున ధరింతు వనినఁ బృథువు భూమి కిట్లనియె. వసుంధరా, యజ్ఞముల నాత్మభాగముఁ గొనుచు ధాన్యాదివసుసంపత్తి నొడఁగూర్పక మదీయశాసనమునకుఁ బ్రతికూలముగ నడచునిన్ను వధించెద. గోరూపమునం దృణము మేయుచుఁ బాలుపిండనిదుష్టాత్మురాలిని దండించుట ప్రశస్తంబు గాకుండునే? తొలుత విధాత సృజించినయోషధిబీజములనెల్ల నీలో నడంచికొని నా కవమానంబు గలుగ వానిం బ్రకటింపకుండుట నీకుఁబోలదు. మదీయబాణములం జీరిగొని నీక్రొవ్వున నాఁకటం దూఱుచున్న యీ ప్రజలపరిదేవనం బుడిపెద. పురుషుఁ డయ్యె స్త్రీ యయ్యె నపుంసకుఁ డయ్యె నెట్టిప్రాణియైన నేమి? భూతదయ లేనియధమజంతువును బరిమార్చుట రాజులకు ధర్మంబ యగు. ఇందు యోషిద్వధపాతకంబు గలుగదు. దుర్మదస్తబ్ధ యగునిన్నుఁ దిలమాత్రశకలంబుగా నావాఁడి తూపులం దునిమి యాత్మయోగబలంబున నీప్రజలను ధరింపఁ జాలుదు. కావున నీవు లేకుండినం బ్రజలకు స్థితి యెట్లు గల్గెడినో యని వెఱపింప

వల దని యట్లు పృథుఁడు పృథులామర్ష సంరంభసముద్రిక్తుండై కృతాంతమూర్తి ధరించినం గాంచి కంపించి భూదేవి యాతని నిట్లని ప్రస్తుతించె.

## భూదేవి తన్నుఁ దఱుముచున్న పృథునిఁ బ్రస్తుతించుట

ఆత్మమాయాయోగమున నానాశరీరములఁ దాల్చి గుణమయుఁ డనం దోఁచుచుండియు నాత్మస్వరూపానుభవంబునం జేసి యధిభూతాధ్యాత్మాధిదైవంబుల మీఱి యహంకారంబును దత్కృతరాగద్వేషాదులనుం దెగడినపరమపురుషునకుఁ బ్రణామంబు. ఎవ్వనిపంపునం బితామహుండు నన్ను జీవులకాధారంబుగా నియమించినం జతుర్విధభూతగ్రామం బేను ధరింతు నట్టిస్వతంత్రుఁడే నన్నుఁ దెగఁజూడఁ గైదువు గొని తలపడిన నింక నెవ్వని శరణు సొచ్చెదాన? ఎవ్వఁ డాత్మాశ్రయంబై యవితర్క్యంబైన యేమాయ నవలంబించి తొలుత నీచరాచరాత్మకప్రపంచంబు సృజించె నతం డమ్మాయయే పూని ప్రజాపాలనంబునకుఁ దొడరి భవద్రూపమునఁ దోఁచుచుండెడు. అట్టిధర్మపరుం డైననీవు నన్నెట్లు తెగటార్ప నెంతువు? దుర్జయం బైనమాయామహిమమున నీవు స్వతంత్రుఁడవై యొక్కరుండవయ్యుఁ బెక్కువిధములఁ దోఁచుచు నెద్దానిం జేయుదువు. మఱియుఁ జేయింతు వట్టినీవిలాసంబు విక్షిప్తచిత్తు లగుజనులకు నిక్కం బక్కటా లక్షింపరాదు. మహాభూతము లింద్రియములు బుద్ధి యహంకార మధిష్ఠానదేవత లనుశక్తులం గొని యీజగంబునకు జన్మస్థితిభంగ మెవ్వండు గావించు నట్టిసముత్కటనిరుద్ధశక్తికుం డైనపరమపురుషునకు మ్రొక్కెద. అప్పు డట్లు సృష్టి యొనర్చినదేవుఁడే యిప్పుడు పృథురూపమునఁ బ్రజలఁ బాలింప నవతరించియుండెడు. అప్పుడు భూతేంద్రియాంతఃకరణాత్మకం బైనయాత్మసృష్టవిశ్వమునకు స్థితిఁ గావింప నాదిసూకరరూపం బెత్తి జలనిర్మగ్నం బైనన న్నుద్ధరించి యాసలిలంబున నావపోలె నన్నుఁ బ్రతిష్ఠించి నాపై భూతజాలంబు నిలిపి యిప్పుడు వీరమూర్తివై పయోనిమిత్తమునం దీవ్రశరములఁ దెగటార్ప నీకు బోలునే? ఈశ్వరగుణసర్గరూప మగుమాయచేఁ జిత్తమోహముఁ జెందిన మాబోంట్ల కీశ్వరభక్తులచికీర్షితంబె యెఱుంగ నశక్యం బన్న నీశ్వరచికీర్షితంబు దురూహం బని వేఱ చెప్ప నేల? జితేంద్రియులకు యశంబుఁ గావించుమహాత్ములకు మ్రొక్కుదు నింతియ కాని యొం డెఱుంగ నని

వసుంధర ప్రస్తుతించి రోషమునం బెదవు లదర వెఱపు గదురఁ దన్నుం దాన యూరార్చికొనుచుఁ బృథునకు మఱియు నిట్లనియె. నృపాలశేఖరా, యలుక మాని నావిన్నప మాలింపుము. పువ్వులలో స్వాదుగు తేనియ నానుతేఁటి తెఱంగున బుధుఁ డన్నింటను సారంబుఁ గొను. తత్త్వదర్శను లగుమునులు పురుషుల కీలోకమందు నాలోకమందును మేలు గావింపఁ బెక్కుయోగములం గని ప్రయోగించిరి. పెద్దలు సూపినయయ్యుపాయములం బిన్నవారికి శ్రద్ధతో ననుసరించుటొప్పెడుఁ. వాని నాదరింపక యవిద్వాంసుండై తనకుఁ దోఁచినట్లు కార్యములఁ దొడరునేని యతనికార్యములు పలుమాఱు లారబ్ధంబులయ్యు సిద్ధింపవు. తొలుత విధాతసృజించినయోషధుల నధృతవ్రతులైనయసాధుజనులు భుజించుటం జూచి యేను లోకపాలకులైనరాజు లప్పు డాదరమునఁ బాలింపనికతంబున లోకమెల్లఁ జోరప్రాయంబగుడు యజ్ఞార్థంబ యేను వాని మ్రింగితి. పెద్దకాలంబు గడచుటం జేసి యయ్యవి నాలో జీర్ణంబు లయ్యె. ఇయ్యర్థంబున నీ వొక్కయెరవున వానిం గ్రమ్మఱఁ బడయుదువు. తగినవత్సములను దోహనపాత్రలను దోహకుల నమర్తువేని యేను వాత్సల్యంబున బయోరూపమునం గామము లొసంగి భూతములకు బలప్రదంబైనయన్నము సమకూర్చెద. వర్షేతరఋతువులందును సమృద్ధిమై మళ్ల నుదకము నిండియుండఁగ మిఱ్ఱుపల్లంబులు లేకుండ నాకు సమత్వంబుఁ గావింపు మని నివేదించె.

పృథుచక్రవర్తి గోరూపము ధరించినభూమియం దోషధిమయక్షీరము పితుకుట

అట్లు భూదేవి విన్నవించుటయు బ్రియహితంబైనతద్వాక్యం బాదరించి పృథునృపాలుం డప్పుడు మనువును వత్సంబుగాఁ గల్పించి తనపాణితలంబున సకలౌషధు లాగోరూపధారిణి యగుధరణిం బితికె. పృథుమహీపతిమాడ్కి నితరులకు నన్నింటను సారగ్రహణంబు కర్తవ్యంబు. అవ్విధంబునం బృథునృపతి వశీకరించికొన్నధాత్రి నితరులు నాత్మకామానురూపంబుగాఁ బయోదోహనం బొనర్చిరి. తత్ప్రకారం బెట్లంటేని. ఋషులు బృహస్పతిని వత్సంబుగా నేర్పఱిచి యింద్రియ పాత్రంబున వేదమయక్షీరంబును, సుర లింద్రుని వత్సముగఁ గల్పించి హిరణ్మయపాత్రలో సోమవీర్యౌజో బలాత్మకక్షీరంబును, దైత్యదాన

త్రులు ప్రహ్లాదుని వత్సముగ సంభావించి యయోమయభాజనంబున సురాసవమయపయస్సును, గంధర్వాప్సరోగణంబు విశ్వావసుని వత్సముగం గుదిర్చి పద్మమయభాజనంబున మాధుర్యసౌందర్యముల నొప్పు గాంధర్వంబు పేరిటిపాలును, పితృదేవత లర్యముని వత్సంబుగ నిర్ణయించి యామపాత్రంబునం గవ్యాత్మకక్షీరంబును, సిద్ధవిద్యాధరులు కపిలుని వత్సంబుగ ననుసంధించి యణిమాదిసిద్ధిరూపం బగుక్షీరంబును నభోభాజనంబున ఖేచరత్వాదివిద్యామయపయస్సును, గింపురుషాదులు మయుని వత్సముగ నమర్చి యాత్మపాత్రంబున సంకల్పమాత్రప్రభవంబైనయంతర్ధానాద్భుతమాయామయపయస్సును, యక్షరక్షోభూతపిశాచగణంబులు భూతేశుని వత్సముగ నొనరించి యరణ్యపాత్రంబున రుధిరాసవరూపక్షీరంబును, నాగసర్పాహిదందశూకంబులు తక్షకుని వత్సంబుగ నుపపాదించి బిలపాత్రంబున విషరూపక్షీరంబును, బశువులు గోవృషమును వత్సముగ నొప్పించి యరణ్యపాత్రంబున యవసమయపయస్సును, దంష్ట్రావంతంబులైన క్రవ్యాదమృగములు సింహమును వత్సముగ నావిష్కరించి స్వకళేబరపాత్రంబున మాంసమయక్షీరంబును, పక్షులు గరుడుని వత్సముగ నిర్దేశించి యాత్మపాత్రంబునం గీటఫలాదిరూప మగుపాలును వనస్పతులు వటమును వత్సముగ సంపాదించి యాత్మపాత్రంబున బృథగ్రోహమయపయస్సును, బర్వతములు హిమవంతంబు వత్సంబుగ సంఘటించి యాత్మసానుపాత్రంబున నానాధాతుమయక్షీరంబునుం బితుకుటయు నందఱును దమతమప్రధానులను వత్సములంగాం గల్పించి యాత్మోచితభాజనంబుల నాత్మానురూపపయోదోహనంబుం బృథువశీకృతయై సర్వకామదోగ్ధ్రి యగునాపృథ్విం గాంచిరి. అంత నాపృథునృపాలుండు పరమప్రీతచేతస్కుండై పృథ్విం దన కూంతుంగా సంభావించి దుహితృవత్సలుండై నిజకోదండకోటిం గిరిశిఖరంబులం గూల్చి మిట్టపల్లంబులు లేకుండ భూమండలంబు సమంబుగా సవరించి ప్రజలకు వాసయోగ్యత్వంబు నెఱవేఱ *గ్రామములు పురములు పట్టణములు వివిధదుర్గములు ఘోషములు వ్రజములు శిబిరము

* మేడలు లేనిజననివాసస్థానములు గ్రామములు. మేడలతోడం గూడినజన నివాసస్థానములు పురంబులు. అవియే గొప్పవి పట్టణంబులు. జలదుర్గము గిరిదుర్గము

లాకరంబులు ఖేటములు ఖర్వటములునోప్వార నానావిధసన్నివేశంబు గావించె. పృథుమహీపతికిఁ బూర్వ మిట్టిపురగ్రామాదికల్పనంబు లేక యాతం డేర్పఱచినదాన నత్యంతసుఖస్థితి గుదురుటయు జను లేమిటను వెఱవు గానక యందు నివసించిరి. ఇయ్యది పృథున్నృపాలుని గోరూప భూదోహనప్రకారంబు. అతనియశ్వమేధానుష్ఠానప్రకారంబు వినుమని మైత్రేయుండు విదురునకు వెండియు ని ట్లనియె.

**పృథుచక్రవర్తి యశ్వమేధములు చేయుట**

అంత నాపృథుమహీపాలుండు సరస్వతీనది ప్రాఙ్ముఖముగఁ బ్రవహించు బ్రహ్మావర్తనామకంబైన మనుక్షేత్రంబున నశ్వమేధశతము లాచరింపఁగ దీక్ష వహించుటయు దాన నతండు దన్ను మించెడు నని తలంచి శతక్రతుండు తద్యజ్ఞమహోత్సవంబు సైరింపకుండె. పృథునియశ్వమేధమునకు సర్వలోకగురుఁడు సర్వాత్ముఁడు యజ్ఞేశ్వరుండు నగుహరి బ్రహ్మయు శర్వుఁడును బరిచరపరివృతు లైనలోకపాలురునుం దాను మునిగంధర్వాప్సరోగణగీయమానుండై సిద్ధవిద్యాధరదైత్యదానవ గుహ్యకాదిసేవ్యమానుండై సునందనందప్రముఖనిజపార్షదాన్వీయమానుండై విచ్చేసె. ఆభగవంతుని సేవింపఁ గపిలుఁడు నారదుఁడు దత్తుఁడు సనకాదు లగుయోగీశ్వరులును మఱియుఁ బలువురుభాగవతులు నరుగు దెంచిరి. భూదేవి హవిర్దోగ్ధ్రియై యజమానుం డైనపృథున్నృపాలునకుఁ గోరినయర్థంబులెల్ల సమకూర్చె. నదులు క్షీరదధ్యన్నపానకఘృతతక్రాది రసంబుల నిక్షుద్రాక్షాదిరసంబులను వహించె. తరువు లాత్మశరీరంబులు వెంచి తేనియలు గురియుచు ఫలపుష్పాదిసమృద్ధి యొడఁగూర్చె. రత్నాకరంబులు రత్ననికరమ్ముల సమర్పించె. పర్వతంబులు భక్ష్యభోజ్యచోష్యలేహ్యభేదమునఁ జతుర్విధం బైనయన్నం బొయి త్తపఱిచె. లోకపాలురును దక్కనవారును నానావిధము లగునుపాయనము లర్పించిరి.

---

వనదుర్గము శస్త్రదుర్గము మున్నుగా ననేకభేదములు గలిగి యితరులకుఁ బోవరాకుండ నిర్మించిన గుప్తస్థానములు దుర్గములు, గొల్లవారిపల్లియలు ఘోషములు, పశువులమందలు వ్రజములు. సేన విడియుచోట్లు శిబిరములు, బంగారము రత్నములు మొదలగువాని యుత్పత్తిస్థానంబు లైనగను లాకరములు, కృషి చేయువారి పల్లియలు ఖేటములు, పర్వతప్రాంతమందలి గ్రామములు ఖర్వటములు.

పృథుచక్రవర్తి నూఱవయశ్వమేధము గుఱ్ఱము నింద్రుఁడు హరించుట

అవ్విధంబున నత్యంతవిభవం బెసఁగఁ బృథునృపాలుఁ డశ్వమేధశతదీక్షితుండై తొంబదితొమ్మిదిక్రతువుల నెఱవేర్చి నూఱవదానికిఁ దొడంగుటయు దాన నాతండుచు శతక్రతుండగు నని శంకించి శక్రుండు వక్రుండై స్పర్ధయు నసూయయుఁ దనమనంబునం బెనంగఁ దిరోధానంబున యజ్ఞశాల కేతెంచి యందలిమేధ్యాశ్వంబు నపహరించె. అప్పు డత్రిమునీంద్రుం డతఁ డట్టు లయ్యశ్వమును మ్రుచ్చిలించి వైహాయసగతిం బోవుచుండఁ దనయోగగతిం జూచి యతిత్వరితంబునఁ బృథుపుత్త్రుం బిలిచి యయ్యా, యీయాఖండలుండు పాషండుండై యధర్మకవచపరిచ్ఛన్నుండై యజ్ఞాశ్వంబు నపహరించికొని పోవుచున్న వాఁడని చెప్పి చూపుటయు నాపృథుసూనుం డనూనక్రోధంబున నిలునిలు మని యదల్చుచు నాతనిందఱిసి జటాధరుండై భస్మలిప్తగాత్రుండై ధర్మశరీరితీరున నగపడుచున్న యన్నముచివైరిపయిం బాణమేయ నొల్లక మిన్నకుండె. అత్రి యది సైరింపక ఓరాజనందనా, యేల యుపేక్షించెదు? యజ్ఞఘాతకుండైన యీదేవాధముం దెగటార్పకునికిపోలదని యొత్తిచెప్పుటయుఁ బృథునందనుండు వియద్గమనంబున నతిత్వరితగతిం బోవుచున్న యన్నాకపతిని మృగేంద్రంబు గజేంద్రంబు నెట్లట్లు క్రోధోద్రిక్తుండై తఱిమి యఱిమినం ద్రిదివపతి యయ్యశ్వము నారూపంబుతో విడిచి యంతర్హితుం డయ్యె. పృథుపుత్త్రుండు మేధ్యాశ్వముం గొని తండ్రియజ్ఞశాలకుం జనుదెంచుటయు నతనియద్భుతకర్మంబునకు మెచ్చి యతనికి విజితాశ్వుం డనుపేరు పెట్టిరి. అవ్విధమున సాధితాశ్వుండై పృథుండు యజ్ఞమునకుం దొడరుటయు నింద్రుండు గ్రమ్మఱ నదృశ్యుండై యేతెంచి కనకచషాలంబైన యూపస్తంభమునం గాంచనరశనాబద్ధంబై యున్న యమ్మేధ్యతురంగము నపహరించె. అత్రిముని యప్పుడుం బృథుసుతుం బిలిచి కపాలఖట్వాంగధరుండై మాఱువేషంబుఁ దాల్చి యశ్వముం గొనిపోవుచున్న యతనిం జూపి వానిం జంపఁ దలంపుగొనని రాజనందనుం దద్విధంబునకుఁ బురికొల్పిన నాతం డలిగి యాతనిం దెగటార్ప వింట నమ్మరిఁ బోయుచున్నంత నయ్యమరేంద్రుం డయ్యశ్వము నారూపమునుం ద్యజించి యంతర్ధానంబుఁ గాంచె. అట నాహయముం గొని

విజితాశ్వుండు జనకునియజ్ఞశాలకుఁ జనుదెంచె. ఇంద్రుఁడు త్యజించిన కపాలఖట్వాంగధరం బైనయారూపమును జ్ఞానదుర్బలులు గ్రహించిరి. అశ్వహరణార్థంబు గ్రహించి యింద్రుఁడు విసర్జించినరూపములు పాషండంబులై పాషండము లనంబరఁగె. నగ్నరక్తపటాదినానాభేదముల నొప్పునాపాషండరూపములమీఁద నధర్మం బని యరయ నేరక ధర్మ మని భ్రమించి వాక్చమత్కారంబుల కాసపడి కుమతు లాదరంబు వెట్టుటం జూచి పృథుపరాక్రముఁ డైనపృథునృపాలుఁ డధర్మవృద్ధి యగు నని తలఁకి యలుకమై దానికి మూలం బైనబలారిం బరిమార్పఁ గోదండంబుఁ గొని బాణసంధానంబు సేయుచుండె. అట్టియెడ ఋత్విజులు క్రోధదుర్నిరీక్షుం బైనయతనియాకారం బుపలక్షించి మహామతీ, మేధ్యపశు వొక్కటి దక్క యజ్ఞదీక్షితుం డైననీ కిప్పుడు లాఁతి ప్రాణి యెయ్యదియు వధ్యంబు గాదు. ఇతరవధంబున నిప్పుడు నీకుఁ బాతకంబు దొడరెడు. ఏము వీర్యవంతము లగుమంత్రముల నుచితాహూతు లగ్నిముఖంబున వ్రేల్చి యాశతమఖు నిటకు రావించి భవత్కీర్తిమాత్రంబున హతప్రభుం డైనయయ్యమరప్రభు నస్మదీయమంత్రాహుతులకు బలి చేసి నీకు హితంబుఁ గూర్తుముగాని నీవు మిన్నకుండు మనిబోధించి యుదంచితక్రోధంబుతో స్రుక్పాణులై వ్రేల్వఁ బూనుటయు బ్రహ్మదేవుం డాక్షణంబ ప్రత్యక్షంబై యిట్లనియె.

### బ్రహ్మ వచ్చి యశ్వహారి యైనయింద్రుం జంపవలదని పృథుని వారించుట

ద్విజులారా, యింద్రుఁ డవధ్యుండు. యజ్ఞనాముఁ డైనయితఁడు భగవంతునియంశంబు. యజ్ఞమున మీ రారాధించుసుర లితనియంశములను నెఱుంగరే? పృథునియజ్ఞమునకు విఘ్న మొనర్పఁ బూని యీతం డొనర్చినయన్యాయంబు సూడుఁడు. లోకమునం బాషండప్రచారంబు పెల్లయ్యె. పృథుకీర్తి యగుపృథుఁ డేకోనశతమఖపూరణమాత్రంబున నాత్మదీక్షాపూర్తి సేయుఁగాక యని చెప్పి యప్పితామహుండు పృథునృపాలుదెస మొగంబై యిట్లనియె. నృపాలా, నీవింతకు ననుష్ఠించినయజ్ఞంబులు నీకుఁ జాలు. మోక్షధర్మవిదుఁడవు గావున శతమఖానుష్ఠానలభ్యం బగుఫలము నీ కనపేక్షితంబు. కావున మహేంద్రునిపై రోషం బుడుగుము. నీవు నీ యింద్రుఁడు నుత్తమశ్లోకుం డగుభగ

కంతునివిగ్రహంబులు గావున మీలో విగ్రహంబు నాకుం జూడం బోలదు. యజ్ఞవిఘ్నంబునకుం జింతిల్లవలదు. ఆదరించి నామాట పట్టుము. దైవోపహతం బైనకార్యముం జేయునెడ నయ్యది నెఱవేఱమిం జేసి మానసంబు రోషాక్రాంతంబై మఱింత మోహం బెనయుం గాని శాంతిం బొరయదు. దేవతలయెడ దురాగ్రహంబునకు నింద్రుండు సృజించుపాషండములు లోకమునం జొచ్చుటం జేసి ధర్మలోపమునకుం గారణం బైనయీమఖంబు చాలింపుము. నీయజ్ఞమునకు ద్రోహము సేయ వాహము నాహరించిన మేఘవాహనుండు వన్నినపాషండములు జనులచిత్తములం జెఱిచెడు నిదె చూడుము. వేనునియపచారంబునం జెడినధర్మమునకుం దత్తత్సమయానురూపంబుగం బునఃప్రతిష్ఠం గావింప విష్ణుదేవునంశమున నవ్వేనునంగమున నవతరించిన నీకు ధర్మలోపముం బాటింపకుండం జెల్లునే? విశ్వసృష్టివిధానం బరసి సృష్టికరు లగు ప్రజాపతులసంకల్పంబు నెఱవేర్పుము. అధర్మకారణం బైనయింద్రమాయవలనం బొడముప్రచండపాషండమార్గంబు హరింపు మని యిట్లు పరమేష్ఠి బోధించినం బృథునృపాలుం డధ్వరంబుమీఁదియాగ్రహముం ద్యజించి యింద్రునితో సంధిచేసె. అట్లు యజ్ఞపూర్తి యొనరించి యవభృథస్నానంబు దీర్చినయతనిం జేర నరిగి తదధ్వరంబున నతనివలనం బరమశ్రద్ధాయుతంబుగ నర్పించినభూరిదక్షిణలం గొని యత్యంతసంతృప్తులై సత్యాశీర్వచను లైనవిప్రులో రాజాధిరాజమూర్ధన్యా, నీ వత్యాదరంబున సత్కరించి దానమానంబులం బూజించినదానం బితృదేవఋషిమానవులందఱు వీరువా రనక పరమానందంబుం గాంచి రని యొలుంగఁ బల్కుడం జెప్పిరి.

## ఇంద్రవధము మానినపృథునకు హరి ప్రత్యక్షం బై హితము బోధించుట

అట్టియెడ యజ్ఞభోజనుండు యజ్ఞేశ్వరుండు నగుభగవంతుండు తనయయజ్ఞముల సమ్యగారాధితుండై యింద్రునితో నచ్చటికి విచ్చేసి పృథునృపాలున కిట్లనియె. నరేంద్రా, యితండే యింద్రుండు, నియశ్వమేధశతదీక్షకు భంగముం గావించినవాఁడు. తనతప్పిదంబు మన్నించి నీవు శాంతిం గొనునట్లు వేఁడికొన వచ్చియుండెను. ఇతనివిన్నపం బాలించి ప్రసన్నుఁడ వగుము. దేహమునెడ నాత్మాభిమానంబు పెట్టినిపోత్తములు

భూతద్రోహమునఁ గొల్లరు భవాదృశులును దేవమాయకు మోహముఁ జెందుదురేని వృద్ధసేవనంబు నిష్ఫలంబకదా. కావున నీకాయం బవిద్యాకామకర్మముల నారబ్ధం బని యెఱింగి ప్రతిబోధంబుఁ గాంచిన విద్వాంసుఁడు దీనియెడ నాసక్తిసేయఁడు. శరీరమునందే యాసక్తిసేయకుండినం దాని నాశ్రయించియుండు గృహాపత్యద్రవిణాదులయెడ బుధుఁడెవ్వఁడైనను మమత వెట్టునే? బాలతరుణాదిభేదమున ననేకత్వంబు మలినత్వంబు జడత్వంబు సగుణత్వంబు కారణభూతగుణాశ్రితత్వంబు పరిచ్ఛిన్నత్వమావృతత్వము దృశ్యత్వము నిరాత్మత్వ మనుదోషములంగూడిన దేహమునకుఁ బరుండై యీదోషములనంటక యేకస్వరూపుఁడై శుద్ధుఁడై స్వయంజ్యోతియై నిర్గుణుండై గుణాశ్రయుండై సర్వగతుండై యసంవృతుండై సాక్షియై యాత్ముఁడై భగవంతుఁ డాత్మలో నుండు నని యెఱింగినవాఁడు దేహస్థితుండయ్యు బ్రహ్మనిష్ఠతంజేసి తద్గుణంబులం బొరయఁడు. ఫలాసంగముఁ ద్యజించి శ్రద్ధమై స్వధర్మమున నిత్యంబు నన్ను భజించువానికి మెల్లన మనంబు ప్రసన్నం బయ్యెడు. ప్రసన్నమానసుండై పరిత్యక్తగుణుం డై నసమ్యగ్దర్శనుండు శాంతిరూపంబై మదీయసమవస్థానంబైన బ్రహ్మకైవల్యంబు నధిగమించు ఉదాసీనుఁడయ్యు దేహజ్ఞానకర్మేంద్రియమానసంబుల కధ్యక్షునిరీతిం దోఁచుకూటస్థుఁ డగునాత్మ నెఱిఁగినవాఁ డభవముం బ్రాపించు. ద్రవ్యక్రియాకారకచిదాభాసస్వరూపంబై విభిన్నంబై దేహమునకేగాక గుణప్రవాహరూపంబైన సంసార మాత్మునకుఁ గలుగ దని నాయెడ సౌహార్దంబు నెఱపుబుధు లాపత్సంపత్సమయంబుల వికారంబు నొందరు. ఉత్తమమధ్యమాధమవిషయముల సమానుండవై సుఖదుఃఖములఁ దుల్యుండవై జితేంద్రియాశయుండవై నాయెడఁగూర్చిన యమాత్యాదిసహాయమున లోకరక్షణం బొనర్పుము. ప్రజ లాచరించుధర్మమున నాఱవపాలు పరలోకమునఁ దన్నుఁ జెందుటంజేసి రాజునకుఁ బ్రజాపాలనంబె పరమధర్మంబు ప్రజలవలన నరిఁ గొని వారిం గావనిరాజు తనపుణ్య మాప్రజలు గొనిపోవం దత్పాపంబుఁ దాను గుడుచు. ఇవ్విధమునం బ్రాహ్మణానుమతం బైన ధర్మము ప్రభావముగ నర్థకామము లానుషంగికములుగాఁ గొని ధర్మార్థకామములయెడ నాసంగముఁ దొఱంగి యీపృథివి నేలుము. దానఁ

ప్రజానురాగంబుఁ గాంచి యచిరంబ నీ యింటికి వచ్చుచున్నాఁడ; నీకుం
గొలిచి జ్ఞాతవ్యం బెఱుంగుదువు. ఏను భవదీయగుణశీలములకు భావ్య
శుండ నైతిఁ గావున నో మానవేంద్రా, యభిమతవరంబులు వేఁడుము.
సములచిత్తములందు వర్తించు నేను గుణశీలహీను లైనవారలకు
యజ్ఞతపోయోగాదులనేనియు నలభ్యుండ నని యనుశాసించినం బృథు
నరేశ్వరుండు పుండరీకాక్షునాదేశంబుఁ దలఁ దాల్చి తనచేసిన నిష్టం
బునకు లజ్జితుండై పాదములపయిం బడిన శతక్రతుం గ్రుచ్చి కౌఁగిటం
జేర్చి రోషం బుడిగి ద్వేషంబు విడిచె. అట్టియెడ భగవంతుండు పృథు
సమర్పితపూజలం గ్రహించి ప్రస్థానాభిముఖుండయ్యుఁ దదీయగాఢభక్తి
దనపాదములఁ బట్టికొన్న నాఁగినవానికై వడి ననుగ్రహావిలంబితుండై
మిన్నకుండిన నయ్యాదిమసార్వభౌముఁ డానందాశ్రుపూరంబు కను
దోయిం గ్రమ్మినదానఁ దనివి దీఱఁ గనుంగొనఁ జాలక కేలుమోడ్పు
ఘటియించి యకించనుండై యాదేవదేవు నాత్మలోఁ జింతించుచు నూర
కుండి కొండొకవడికిఁ గన్నీరు దుడిచికొని భక్తిలమీఁదిప్రేమపారవశ్యం
బున మైమఱచినవానిమాడ్కి దేవయోగ్యంబు గానితిలితలపాద
స్పర్శమునకుఁ దలఁకుచు గరుడాంసమునం గరతలం బూఁది యెదుర
దనివి దీఱ చూడ్కికి గోచరుండై యున్న యన్నళినాభున కిట్లని విన్న
వించె.

## పృథుచక్రవర్తి తనకు హిత ముపదేశించినహరితో విన్నవించుట

కైవల్యనాయకా, యహంకారావిష్టు లైనదేహాభిమానుల కుఁ
భోగ్యంబులై నరకవాసులకును లభ్యంబు లైనసుఖముల కాసించి
వరదు లగుబ్రహ్మాదుల కెల్ల నీశ్వరుండవైన నిన్ను వరం బిమ్మని యెట్లు
వేఁడుదు? అట్టివరంబు లెవ్వియు నాకుఁ బంప్రార్థనీయంబులు గావు.
మహానుభావుల హృదయాంతరంబునుండి వెడలు భవదీయచరణకథాసుధా
ప్రవంబు లేకుండినఁ గైవల్యంబైన నే నభిలషింపను. మఱి భవదీయ
దివ్యకథ లాకర్ణింపఁ బదివేలు వీనులు నాకు వాంఛితంబులు. అవ్వరం
బొసంగుము. ఉత్తమశ్లోకు లగుభాగవతులముఖారవిందమునుండి వెడలు
భవచ్చరణామృతకణానిలంబు తత్త్వమార్గంబు మఱచు కుయోగు లగు
మాబోంట్లకుఁ బునస్స్మృతి నొదవించెడు. లాఁతివరములు నా కేల?

శ్రీదేవి గుణగ్రహణమనీషం జేసి తానే వరించుభవదీయమంగళకీర్తి యార్యసంగమున యదృచ్ఛాగతి నాకర్ణించి పశువు దక్క మఱి యెవ్వఁడేనియు గుణజ్ఞుఁ డగునేని యిఁకఁ జాలు నని చాలించుకొనునే! అఖిలపూరుషోత్తముఁడు గుణాలయుఁడు నగునిన్ను రమాదేవికై వడి లాలసత్వమునం గొలిచెద. నీపాదములపై నేకతానమానసంబున నొక్క పతిం గోరుమాకుఁ బరస్పరకలహంబు కలుగునేమొకాని కలిగినం గలుగుఁగాక. ఏకకార్యంబుకై యిద్దఱు పూనినకతన నాకు నాజననికి నితరేతరస్పర్ధ గలుగుటయు సకారణంబ యినం దానికి నే వగవను. భక్తులయెడ నేమే నించుకగుణ మున్నట్లు దోఁచినం దానిఁ బెద్ద చేయునీవు గలుగ నాకు విచారం బేల? మఱియు నాత్మానంద నిరతుం డైననీకు రమతోఁ బని యే మయ్యెడు? కావుననే నిష్కాములు నిరస్తమాయాగుణవిలాసకార్యుం డైననిన్ను భజింతురు. వారికి భవచ్చరణస్మరణంబుకంటె నొండొకఫల ముండు నని యేమెఱుంగము. దేవా, వరము వరింపు మని నన్నడుగు టారయ జగన్మోహనం బైన వాక్యప్రచారం బని తలంచెద. భవదీయవేదరూపవాక్యచోదనంగదా జనుఁడు ఫలాసంగమున మోహితుండై కర్మమార్గమునం బ్రవర్తించుచుండు. నీమాయాయోగమున సత్య మగునాత్మస్వరూపమునఁ బృథక్కారంబుఁ గాంచి ఖండితుఁ డైనవానికి మఱింత ఖండనంబు గలుగ వర మడుగు మని ప్రలోభనంబు సేయ నీకుఁ బాడియే? అడుగకున్నను బాలునకుఁ దండ్రి యెట్లు లట్టులు నాకు హితమగుదాని నొడఁగూర్పు మని ప్రథమపృథ్వీశ్వరుం డైనపృథున్నృపాలుఁడు విన్నవించె. అతని విన్నపం బాలించి వెన్నుండు రాజాగ్రణీ, నీకు నాయెడ భక్తిదృఢత్వంబు గలిగెడు, మిట్టిమతికలిమిం జేసి యీవు త్యజింపరాని నామాయం దరింతువు. ప్రమాదంబు దక్క నాయానతి నడపుము, మదాదేశకరుఁడు శోభనములం బడయు, నన్ను వరంబుల వేఁడ నన్ను నీవ్యవసాయంబు లెస్స. మత్పరులు స్వర్గాపవర్గనరకముల నన్నిటిం దుల్యత్వమునఁ జూతురు పరిహరింపరానిరోష ముడిగినదాన నీకు సుప్రీతుఁడ నైతి. శ్రద్ధమై నాయానతిఁ గొనుటే నాకుఁ బరమార్హణం బని యర్థవంతం బైనయప్పార్థివువచనముఁ బ్రశంసించి యతనిపూజలం గ్రహించి యను

గ్రహించి నిజలోకమునకుఁ జనఁ దలంచె. ఆదేవదేవుండు సన్నిధి చేసినప్పు డరుదెంచిన వైకుంఠపార్షదులును దేవఋషి పితృగంధర్వసిద్ధచారణ ప్రముఖులును యజ్ఞేశ్వరబుద్ధి నద్ధరణీపాలుండు సత్కరింపఁ బదియుపలాక నములం గొని యరిగిరి. భగవంతుండు సోపాధ్యాయుం డైన యాగసద నాయకునిచిత్త మాకర్షించువానిరీతి నిజధామంబున కరిగె.

### పృథుచక్రవర్తి యజ్ఞశాలనుండి పురమునకు వచ్చుట

అంత నమ్మానవేంద్రుం డాత్మదర్శనముఁ బ్రసాదించి దృష్టిపథము నకు దూరుండై యరిగిన దేవదేవుం డైనవాసుదేవునకు మ్రొక్కుచుఁ గుసుమమౌక్తికదుకూలస్వర్ణతోరణంబుల నలంకృతంబై సురభిధూప ముల వాసితంబై చందనోదకంబులం జత్వరరాజవీథుల సంసిక్తంబై పుష్పాక్షతఫలహరితయవలాజదీపాదుల నర్చితంబై రంభాస్తంభపూగ డింభసంభృతంబై తరుపల్లవమాలికాలంకృతంబై వివిధాభరణంబుల నలంకరించికొని కన్యాజనంబు లశేషమంగళంబుగా బలినీరాజనదీప ములం దెచ్చి యుపచారము లాచరింప రమణీయంబై విరాజిల్లు నిజరాజ ధానిం జేరఁ దఱలి శంఖదుందుభిఘోషంబు ఋత్విగాశీర్వాదనాదంబును రోదోంతరంబునం బరమమేదురంబై పర్వ వందిమాగధప్రస్తుతి వచనంబు లకు విగతస్మయుండై పౌరజానపదు లచ్చటచ్చటఁ దెచ్చి యిచ్చు పూజలం గ్రహించుచుఁ బురంబుసేరి నగరుసొచ్చి పరమప్రీతిమైఁ నప్పౌర జానపదుల నాదరించి లోకోత్తరంబు లైనకార్యంబులు పెక్కు లాచ రించి ధర్మమున ధరణీమండలం బేలి తనవిశదయశము దశదిశల వెలుఁ గించి తుదిఁ బరమపదం బారోహించె నని చెప్పిన విని విదురుండు ప్రథమపార్థివుం డైనపృథునృపాలునికీర్తి ననవద్యగుణవిభూషితుం డైన దాని గుణవదాదృతంబైనదానిం గీర్తించుచున్న మైత్రేయుం బూజించి మునీంద్రా! విప్రు లభిషేకింప రాజ్యాసనం బారోహించి యశేష సురార్హణంబు సాధించి విష్ణుతేజము ధరించి గోరూపిణి యగుధరణి నిష్టదోహంబుఁ గావించి కీర్తిఁ గాంచిన మహారాజాధిరాజవతంసునికీర్తి నభిజ్ఞుఁ డైనవాఁ డెవ్వఁడేనియు వినక యుజ్జగించునే? తదీయవిక్రమో చ్ఛిష్టంబ కదా రాజు లందఱు నుపజీవించుచుండుదు రాతనిపరిశుద్ధ

కంబులైన ధ్యానస్తుతిపరిచర్యారూపకర్మంబులను సేవింపుఁడు. ఆభగవం తుఁడు స్వతస్సిద్ధశుద్ధబోధఘనుండయ్యు నగుణుండై నిర్విశేషగుణుం డయ్యుఁ గర్మమార్గంబున నానావిశేషగుణశిష్టుండై భిన్నవిధంబులైన వ్రీహ్యాదిద్రవ్యములుశుక్లాదిగుణములవఘాతాదిక్రియలు మంత్రములు యాగసాధ్యఫలము సంకల్పముపదార్థశక్తిజ్యోతిష్టోమాది నామములు మున్నగుపరికరంబుల నుపపాదితంబై నయధ్వరం బగు. ఆయజ్ఞేశ్వరుండు పరమానందస్వరూపుఁడయ్యుఁ బ్రధానకాలాశయాదృష్టజన్యంబైన దేహంబున విషయాకార మగుబుద్ధిం జెంది తదభివ్యంగ్యానందరూపుఁడై దారుగతుండైనయనలుఁడు దారుగుణము లగుహ్రస్వదీర్ఘ వక్రావక్ర త్వాదిగుణములఁ జెందుచందమునం గ్రియాఫలరూపమునఁ దోఁచెడు. యజ్ఞభోజనుల కధీశ్వరుఁడు గురుఁడునగుహరిని నిరంతరము ధృతవ్రతులై స్వధర్మముల నారాధించునా ప్రజలు గొందఱు బలేయని నన్ననుగ్రహిం చినవారు. తితిక్షాతపోవిద్యల దేదీప్యమానంబైనభగవదాశ్రయు లగు బ్రాహ్మణులకులమునం బరమసమృద్ధులం దనరురాజులతేజ మొకప్పు డేనియుఁ బ్రభావంబుఁ జూపకుండుఁగాక. పురాణపురుషుండైనహరియు బ్రాహ్మణులే తనకు దైవతం బనియు బ్రహ్మచరణసేవామహిమంబునం దాను. బవిత్రకీర్తి ననపాయినిఁగా శ్రీదేవినిం బడసి మహత్తమాగ్ర గణ్యుఁడనైతి ననియుం దలంచు. ఎవ్వారిని సేవింప సర్వాంతర్యామి యైనయీశ్వరుండు సంతుష్టుం డగు నట్టిబ్రాహ్మణుల నావిష్ణుదేవుఁడు లోకసంగ్రహార్థంబు దా నొనర్చు ధర్మతాత్పర్యం బరసి వినయముతో సర్వవిధముల మీరు సేవింపుఁడు. నిరంతర విప్రసేవనంబునం గాలయాప నంబు సేయునెడ సర్వదేవతాముఖం బగునగ్నిలోని యజ్ఞాద్యనుష్ఠాన ముల కంతరాయ మొదవుకతనఁ జిత్తశుద్ధియుఁ దన్మూలముగ జ్ఞానోద యంబును దాన ముక్తియుఁ గలుగనేర దని శంకింపం బని లేదు. నిత్య బ్రాహ్మణసేవనంబుననే చిత్తము శుద్ధ మగుడు జ్ఞానమూలకమోక్షం బెనయవచ్చుఁ గావున బ్రాహ్మణసేవనంబుకంటెఁ గ్రతుభుజులకు ముఖం బెయ్యది. బ్రాహ్మణపరిచర్య యజ్ఞాదికర్మఫలమును జ్ఞానఫలము నొడఁ గూర్చెడు. ఉపనిషద్వాక్యంబులం బ్రహ్మజ్ఞానఘనుం డని పేర్కొనంబడు పరమేశ్వరుఁడు తత్త్వవిదు లింద్రాదిదేవతోద్దేశమున బ్రాహ్మణముఖ

మున నర్పించినయన్నము భుజించి తనిసినట్లు చేతనాకర్షితుం డైనయగ్ని ముఖమున వ్రేల్చినదాని భుజించి తనియఁడు. శ్రద్ధయుఁ దపంబును బ్రశస్తాచరణంబు బ్రశస్తవర్ణనంబు ననుమంగళంబును మౌనంబును సంయమంబును సమాధియుం బెరయ నర్థవిచారార్థం బీజగంబెల్ల నెందు దర్పణంబునంబోలె సమ్యక్ప్రకాశితంబై యుండు నట్టినిత్యశుద్ధం బైనసనాతనవేదమును ధరించుబ్రాహ్మణులచరణసరోజరేణువుల నోయార్యులారా! యేను యావజ్జీవంబు మదీయకిరీటమున వహించెద. వానిఁదలఁదాల్చువారికిఁ బాపక్షయంబును సర్వగుణోదయంబు నయ్యెడు. గుణోదయంబు గలిగి శీలశ్రద్ధాకృతజ్ఞతల నెసఁగినవానిం దమంతన సకలసంపదలు వరించెడు. బ్రాహ్మణకులంబును గోవులు ననుచరసమన్వితుండైన జనార్దనుండు నాయెడఁ బ్రసాదించెడు మని యుపన్యసించిన నాకర్ణించి పితృదేవత లమరులు బ్రాహ్మణులును బరమసంతుష్టులై తద్వచనం బభినందించిరి అట్టియెడఁ బ్రజ లమ్మహీపాలున కిట్లనిరి. మానవేశ్వరా! పుత్త్రునివలనం దండ్రి లోకముల జయించు ననువేదవచనంబు సత్యంబు. నిన్నుఁ బుత్త్రుఁగాఁ బడసి బ్రహ్మదండనిహతుఁ డైనవేనుఁడు పాపాత్ముఁ డయ్యు నరకముఁ దరించె. హిరణ్యకశిపుఁడును భగవన్నిందానిమిత్తమున నరకమునం బడ నున్న వాఁడు ప్రహ్లాదుని ప్రభావమునం దప్పించుకొనియె. సకలలోకైకనాయకుం డైనభగవంతునిపై నిట్టిభక్తి వెట్టిన నీవు శాశ్వతవర్షములు పృథివిఁ బాలింపుము. మనోజ్ఞపవిత్రకీర్తీ! బ్రహ్మణ్యదేవుఁ డై యుత్తమశ్లోకవర్యుం డైనవిష్ణుదేవునికథలఁ గీర్తించునిన్ను నాథుఁగాఁ బడసి యేము బలే ముకుందునే నాథుంబడసినవార మైతిమి. రాజేంద్రా! సేవకుల నిట్టు లనుశాసించుటయు నీయం దద్భుతంబు గాదు. కరుణాత్ము లగుమహాత్ములకుఁ బ్రజలయెడ ననురాగము స్వభావంబు. దేవసంజ్ఞితంబు లైనకర్మంబుల భ్రమించి నష్టదృష్టు లగుమమ్ము నీ విపుడు తమఃపారంబుఁ జేర్చితివి. సత్త్వవృద్ధిం గాంచి బ్రాహ్మణజాతి నధిష్ఠించి క్షత్త్రియకులంబును క్షత్త్రియజాతి నధిష్ఠించి బ్రాహ్మణకులంబును నిజతేజమున భరించుపురుషోత్తమస్వరూపుఁ డైననీకుఁ బ్రణామం బని విన్నవించిరి.

## పృథుచక్రవర్తియొద్దకు సనకాదులు వచ్చుట

అట్టియెడ సూర్యతేజులైన సనకాదులు నలువురు సిద్ధులు లోకములకుఁ బావనత్వంబుఁ గావింప నంతరిక్షము డిగి తనయొద్దకు వచ్చుచున్నంతఁ బరమతేజోవిశేషమున నుపలక్షించి పృథుమహీవల్లభుండు తదవలోకనార్థ ముద్గతంబులైన ప్రాణముల స్వస్థానంబునం జేర్పుతలంపునం బోలె లేచి యింద్రియార్థంబులకుఁ దఱియుసంపాదితీరున నుత్సుకత్వంబు గదుర సదస్యులుం దాను నెదు రేఁగి గౌరవనియంత్రితుండై వినయవినమితోత్తమాంగంబునఁ బూజోపకరణముల మోచికొని చని విధియుతంబుగ నమ్మునులం బూజించి శీలవంతులయాచారంబు సమ్మానించు రీతి వారిపాదప్రక్షాళనోదకంబు శిరస్సునం బ్రోక్షించికొని నిజస్థానంబుల వెలుంగువైతానికాగ్నులట్లు కాంచనాసనంబులపై సుఖాసీనులై యున్నయాసిద్ధమునులకుఁ బరమప్రీతుండై శ్రద్ధానియమంబులతో నిట్లనియె. మంగళాయనులారా! యే నేమి మంగళ మాచరించితినోగాని యోగులకైన నశక్యం బైనభవద్దర్శనంబు వడసితి. బ్రాహ్మణులు శివుఁడు విష్ణువుభాగవతులు నెవ్వనియెడఁ బ్రసాదింతు రతనికిక్కడ నక్కడ నెయ్యది దుర్లభంబు? లోకప్రవర్తకులైనమున్నాదు లందఱును సర్వసాక్షిం గానలేనికైవడి లోకము నెల్లెడలం గ్రుమ్మరుచున్నను జనులు మిమ్ముఁ గనుంగొనఁ జాలరు. ఏగృహస్థులగృహములకు మహాత్ములరుగుదెంచి యర్ఘ్యపాద్యసలిలము నాసనమును బరిచర్యనాత్మార్పణంబు నాదరింతు రట్టిభాగ్యముఁ బడయఁ జాలినవారె దరిద్రులైనను ధన్యులు. ఏయధములగృహముల భాగవతులపాదోదకంబు పర్వకుండు నట్టివారు సమస్తసంపత్సమృద్ధులయ్యుఁ గ్రూరజంతువులకు నెలవైన మ్రాఁకు లనంబడుదురు. మునిశ్రేష్ఠులారా! స్వాగతంబకదా. ముముక్షువులైనమీరు బాలురయ్యు ధీరులై శ్రద్ధతో మహావ్రతముల నాచరింతురు. మీయాచారంబు సూచి యితరులును దత్పథం బనువర్తింతురు. స్వకర్మములం జేసి వ్యసనబీజప్రరోహం బైనసంసారమునం బడి యింద్రియార్థమే పురుషార్థమని తలంచుమాకో మహాత్ములారా! కుశలమే మైనం గలుగునే? కుశలాకుశలంబులైనబుద్ధివృత్తుల కెడ గలుగని యాత్మారాములైన మీయెడఁ గుశలసంప్రశ్నం బనుపపన్నంబు కావున

నత్యంత విస్రంభముతో నేయుపాయమున నీసంసారమునఁ దగ్లినవారికిఁ బారమార్థికం బైనక్షేమం బొడఁగూడెడు నని తపస్విసుహృదు లైనమి మ్మడిగెద. ఆత్మవంతుల కాత్మలై యాత్మభావనుం డైనభగవంతుఁ డాత్మభక్తుల ననుగ్రహించువాఁడై నిక్కంబుయుష్మాదృశసిద్ధరూపమునం జనించుచుండెడు నని విన్నవించుటయు సార మర్థగంభీరము మితాక్షరము శ్రుతిప్రియము నగునతనివిన్నపం బాకర్ణించి ప్రీతివికసితవదనహాసంబు దళుకొత్తువిధమ్మున నమ్మునులలో నన్యతముఁ డగుసనత్కుమారుఁ డా పృథుమహీపాలున కిట్లనియె.

### సనత్కుమారుఁడు పృథుచక్రవర్తి కాత్మతత్త్వము బోధించుట

మహారాజా! సర్వభూతహితాత్ముఁడగునీవు తెలిసియున్నను లెస్స యడిగితివి. సాధువులవిధం బిట్టిది. సంభాషణసంప్రశ్నముల నెల్లవారికి మేలు గూర్చుటం జేసి సాధుసంగమంబు వినువారికిఁ జెప్పువారికి సమ్మతం బయ్యెడు. అంతరంగకరణకషాయమలము నిర్మూలించు హరిచరణగుణశ్రవణ నిష్ఠానిరతి నీకు స్వతస్సిద్ధంబు. ఆత్మేతరంబు లగుదేహాదులమీఁద వైరాగ్యంబు నిర్గుణబ్రహ్మంబుపై నత్యంతరతియు ననుటే నరులకుఁ బారమార్థికక్షేమంబునకు హేతువని శాస్త్రములందు సమ్యగ్విమర్శమున నిశ్చితం బయ్యె. అట్టివిరక్తిసహకృతబ్రహ్మాభిరతి శ్రద్ధాయోగంబునను భగవద్ధర్మాచరణంబునను తత్త్వార్థవిచారంబునను యోగేశ్వరోపాసనంబునను నిరంతరహరికథాశ్రవణంబునను రాజసతామసగోష్ఠీపరిత్యాగంబున నర్థకామాపరిగ్రహంబునను హరిగుణకీర్తనం బెడఁబాయని వివిక్తసేవనంబున నాత్మసంతోషంబునను హింసావర్జనంబునను శమాదిసంపాదనంబున నాత్మహితానుసంధానంబునను హరిచరితస్మరణసుఖానుభవంబునను నిష్కామయమనియమానుష్ఠానంబునను మార్గాంతరానిందనంబునను యోగక్షేమార్థక్రియారాహిత్యంబునను శీతోష్ణాదిద్వంద్వసహనంబునను భాగవతులకుఁ గర్ణపూరంబైనహరిగుణశ్రవణంబున నెసక మెసఁగిన భక్తియోగంబుననుం గలుగు బ్రహ్మరతినిష్ఠ యొదవెనేని పురుషుఁ డాచార్యోపదేశంబునఁ దీవ్రవైరాగ్యవిజ్ఞానములం జేసి నిర్వీర్యం బైన యహంకారమును బంచాత్మకంబై జీవుల కావరణంబుఁ గావించుదాని నాత్మోత్థితం బైనయగ్ని యరణింబోలె దహించెడు. దాని నుపాధి

దగ్ధం బగుడుఁ దద్గుణము లైనకర్తృత్వభోక్తృత్వాదులం బరిహరించి ద్రష్టృదృశ్యభేదప్రతీతికారణంబు నశించినకతన స్వప్నావస్థయందు సేవ్యసేవకభేదప్రతీతులగు రాజభృత్యాదులం బ్రత్యేకంబు గోచరింపఁజేయు ప్రతిపత్తి యాస్వప్నము నశించినం దోడన నశించువిధంబున భేదదర్శనంబు నిర్మూలం బగుటయుఁ బురుషుండు బాహ్యము లగుఘటాదుల నాభ్యంతరము లగుసుఖదుఃఖాదులనుం గనుంగొనఁడు. ఉపాధి యగు నంతఃకరణ మొక్కఁడుండినం ద్రష్ట యగునాత్ముని దృశ్య మగునింద్రియార్థవిషయంబు నేతదుభయసంబంధ హేతు వైనయహంకారమును భిన్నభిన్నముగఁ బురుషుండు సూచుఁగాని యయ్యుపాధి లేకుండినం గాదు. జలము దర్పణము మున్నగు ప్రతిబింబనిమిత్తము లుండినంగదా బింబప్రతిబింబభేదముఁ జూచుట లోకమున ననుభవగోచరం బగుచుండు గుణముల నారోపించికొని స్మరించుపురుషులయింద్రియములు విషయాసక్తంబులై మనస్సు నాకర్షించుటయు నమ్మనస్సు సరస్తీరసంజాతకుశాదిస్తంబము లాసరోజలంబు నెట్లట్లు బుద్ధినుండి విచారసామర్థ్యము నాకర్షించు. అట్టిచేతన యపహృతం బగునేని దానివెంటన పూర్వాపరానుసంధానరూపం బైనస్మృతి సెడు. స్మృతిక్షయంబున జ్ఞానభ్రంశంబు దొడరు. అట్టిజ్ఞానరోధంబె యాత్మనాశంబు. దీనికై యితరవస్తువులు ప్రియంబు లగు నట్టియాత్మస్వరూపమున కపహ్నుతిఁ గనుటకుఁ గడచినస్వార్థహాని లోకమునం బురుషునకు వేఱొండు గలుగదు. స్థావరతుల్యత్వంబును విజ్ఞానభ్రంశంబు నొదవించువిషయేంద్రియార్థచింతనంబె నరులకు సర్వార్థనాశంబు. తీవ్ర మగుసంసృతి దాఁటఁ గోరునతనికి ధర్మార్థకామమోక్షముల కత్యంతవిఘాతుకం బైనసంగముఁ ద్యజించుట కర్తవ్యంబు. ధర్మార్థకామములు మూఁడును గాలభయసంయుక్తంబులై యనిత్యము లవుటం జేసి మోక్ష మొక్కండె పరమపురుషార్థంబు. పరు లైనబ్రహ్మాదులకును గుణక్షోభానంతరము గలిగి యవరు లనంబడునస్మదాదులకును గాలవిక్రమంబునఁ బ్రధ్వంసంబు వడయ వలయుటం జేసి యాత్యంతికక్షేమరూపం బైననిత్యత్వంబు లేదు. కావున నోనరేంద్రా! దేహేంద్రియప్రాణబుద్ధ్యహంకారముల నావృతంబు లైనస్థావరజంగమంబులలో నంతర్యామియై సాక్షియై ప్రత్య

ప్రతీతిరహితుఁ డపరిచ్ఛిన్నుండై వెలయుపరమాత్ముండు నేన యని తాత్త్వానుసంధానమున నెఱుంగుము. ఉత్కృష్టనికృష్టరూపములను గార్యకారణాత్మకత్వంబులను దనరు నీవిశ్వ మెవ్వనియందు రజ్జువునందు సర్పప్రతీతిరీతి మాయాయోగమునం దోఁచి వివేకమున నిరాకృతిం గాంచు నట్టి నిత్యముక్తశుద్ధబుద్ధసత్యస్వరూపమునఁ గర్మమలినప్రకృతిం బరిభవించుపరమాత్ము నాశ్రయించెద. అట్టి యద్వైతాపరోక్షజ్ఞాన మశక్య మగునేని భక్తి నలవరింపుము. తత్ప్రకారంబు వినుము. ఎవ్వనిపాదపంకజపలాశవిలాసము మీఁది భక్తియోగమున సాధువు లెట్టు లట్టు లింద్రియముల నిగ్రహించి మతికి నిర్విషయత్వం బాపాదించినయతులును గర్మాశయం బైనయహంకార మనుహృదయగ్రంథి నున్మూలింపఁ జాల రట్టి భక్తిసులభుం డైనవాసుదేవుని శరణువొందుము. ఈశ్వరుని నావగాఁ బడయఁ జాలనివారికి షడ్వర్గ మను మొసళ్లు బెరయుసంసారసాగరంబు నిస్తరింపఁ దలఁచునెడఁ బరమసంకటం బగు. కావున నీవు భజనీయం బైనభగవత్పాదంబు నావగా నాశ్రయించి దుస్తరం బైన సంసారసాగరంబుఁ దరింపు మని బ్రహ్మవిదుఁడు బ్రహ్మపుత్త్రుఁడు నగు సనత్కుమారుం డాత్మతత్త్వదర్శనంబు గూడ నుపదేశించినం బృథుచక్రవర్తి తద్వచనం బభినందించుచు నిట్లనియె. బ్రహ్మవిద్వరేణ్యా, దీనదయాళుం డైనహరి తొల్లి నాకుఁ గావించినయనుగ్రహము నెఱవేర్ప మీర లిటకు విచ్చేసితిరి. పరమకారుణికులై మీరే నా కెల్లయు నుపపాదించితిరి. కావున నాదేహంబును రాజ్యాదులెల్లను సాధువు లైనమీయుచ్ఛిష్టంబు గురుదక్షిణగా మీ కెయ్యది యర్పింపఁ గలవాఁడను? నాప్రాణములను భార్యలను బుత్త్రులను సపరికరంబు లైనగృహములను రాజ్యమును సైన్యమును గోశమును భూమండలంబును మీకు నివేదించితి. సేనాపతిత్వంబును దండనాయకత్వంబును రాజ్యాధిపతిత్వంబును సర్వలోకాధిపత్యంబును నంగీకరింప వేదశాస్త్రవిదుఁ డర్హుండు. బ్రాహ్మణుఁడు దనయన్నమే భుజించు. తనవస్త్రమే కట్టు. తనసొమ్మే యొసంగు. సర్వంబును బ్రాహ్మణధనంబు. క్షత్త్రియులు వారి కధీనులై యన్నము భుజింతు రింతియ కాని తమకు స్వత్వసిద్ధి లేని బ్రాహ్మణధనంబుల నొసంగ స్వతంత్త్రులు గారు. వేదవిదు లైనమీర

లాత్మతత్త్వజ్ఞానమున నింత యుపదేశించి యుపకారంబుఁ జేసిన మీపరమ కారుణికత్వంబునకు మీరలే సంతోషంబు నొనయవలయు నని ప్రార్థించుట నాకుఁ దగియుండెడు. ఎవ్వఁడేనియు మీకావించినయుపకారమున కొకక్కం బైనప్రత్యుపకారము సేయఁ బూనిన నాతండు కేవలపరిహాస భాజనంబు గాకుండునే యని విన్నవించి పూజించుటయు దివ్యజ్ఞాన మహనీయు లైనయాసనత్కుమారాదిమునీంద్రు లతనివచనంబుఁ బ్రశంసించుచు నెల్లవారు నుల్లాసమునం గనుంగొనుచుండ నంతరిక్షమార్గంబున నరిగిరి.

అట్లు సనత్కుమారోపదేశంబున నాత్మజ్ఞానంబు వడసి పృథు నృపాలుండు తదుపదేశమున నేకాగ్రచిత్తంబున నాత్మవిమర్శంబుఁ గావించి యాత్మనిష్ఠుండై యాప్తకామునిఁగాఁ దన్నెన్నికొనుచు నుపదేశానుసారంబుగాఁ గాలబలవిత్తోచితముగఁ గర్మముల నాచరించుచుఁ దత్ఫలంబునకు బ్రహ్మార్పణం బొనర్చుచు నిస్సంగుఁడై సమాహితుఁడై కర్మాధ్యక్షుం డైనసాక్షి ప్రకృతికిఁ బరుఁ డని నిశ్చయించి గృహమున సామ్రాజ్యము ననుభవించుచుండియుఁ బ్రతిబింబదశ నాదిత్యుండు జల దర్పణాదులయెడ నెట్లు లట్టులింద్రియార్థములయెడ సంగముం ద్యజించి నిరహంకారుండై నిజధర్మం బైనప్రజాపాలనంబు నడపుచు నర్చిస్సను భార్యయందు విజితాశ్వుఁడు ధూమ్రకేశుఁడు హర్యక్షుఁడు ద్రవిణుఁడు నృకుఁ డనఁగ లోకపాలగుణు లగునేవురుకొడుకులం గాంచి జగత్స్వ రక్షణార్థంబు దక్షితో సౌమ్యము లగుకాయికవాచికమానసికగుణంబులఁ బ్రజారంజనంబునిర్వర్తించుచు రెండవసోమరాజురీతి రాజశబ్దంబు సార్థకంబుగఁ జెల్లించుచు నాదిత్యుం డెండగాయుచు రసముఁ బీల్చుచుఁ దణి యగుడుఁ గ్రమ్మఱ వర్షించువిధంబునం బ్రజలవలనఁ గప్పములం గొనుచు నవసరంబుల నొసంగుచు నగ్నిరీతిఁ దేజోదుర్ధర్షుండై మహేంద్రునిమాడ్కి దుర్జయుండై భూదేవికై వడిశాంతిమంతుండై స్వర్గమువిధమున జనాభీష్టప్రదుండై పర్జన్యునితీరునఁ దృప్తికరపుష్టవృష్టికరుండై సముద్రునిసాటి గంభీరుండై మేరుగిరికరణి సత్త్వస్థిరుండై శాసనంబున ధర్మసంయమను నైశ్వర్యమునఁ బురందరుని గోశసంపత్తిని గుబేరు నర్థ గోపనంబున వరుణుని నప్రతిహతప్రచారౌజోమహాబలంబులం బవ

మానుని నవిషహ్యత్వంబున భూతేశ్వరుని సౌందర్యమునఁ గందర్పుని ధైర్యమున మృగేంద్రుని మనుష్యవాత్సల్యంబున మనువును బ్రభుత్వమున బ్రహ్మదేవుని బ్రహ్మవాదమున బృహస్పతినిం బోలెయు జితేంద్రియత్వంబున గురువిప్రవైష్ణవభక్తిహ్రీవినయశీలంబులు పరార్థోద్యమంబు ననువానియెడఁ దనకుఁ దాన సాటియై శ్రీరామునిచందమున ముల్లోకంబులం బురుషు లచ్చటచ్చటఁ గీర్తించువిమలకీర్తివైభవంబున నెల్లవారికిఁ గర్ణగోచరుండై వెలసె.

### పృథుచక్రవర్తి తపోవనమునకుఁ జని యోగమున సిద్ధిం గనుట

అవ్విధమునఁ బృథుచక్రవర్తి యీశ్వరాదేశము మెయిఁ దనజన్మమునకుఁ గర్తవ్యము లైనధర్మపాలనము మున్నగువానిం జేయుచుఁ బెద్దకాలంబునకుఁ దనవయోధికత్వం బెరసి దుహితృవాత్సల్యమునం దా నేలుచుండఁ దనయెడఁబాటు సైరింపక వగచునట్లు తోఁచుపృథివి నాత్మజుల కర్పించి తనవిరహ మోర్వక ప్రజలు కొందలం బందుచుండఁ బత్నియుం దాను దపోవనంబున కరిగి తనతొల్లింటిదిగ్విజయావసరమునం బెట్టు లట్టులు నియమస్థుండై వానప్రస్థసమ్మతం బైనయుగ్రతపమునకుఁ దొడరి కందమూలఫలములు తృణపర్ణములు దొలుదొలుత నాహారంబుగా గ్రహించి యటఁ గొన్ని నెలలకుఁ గ్రమంబున జలపాయియు వాయుభక్షుండునై గ్రీష్మవేళలం బంచాగ్నిమధ్యస్థితుండై వర్షావసరంబుల వర్షధారాసిక్తుండై శిశిరదినంబుల నాకంఠజలమగ్నుండై మునియై స్థండిలశాయియై శమదమసంపన్నుండై యూర్ధ్వరేతుండై కృష్ణు నారాధింప నుత్తమతపం బాచరించి క్రమానుసిద్ధం బైనతపోమహిమంబున నిరస్తకర్ముఁడై నిర్మలాశయుఁడై నిపుణప్రాణాయామనిరుద్ధషడ్వర్గుండై నికృత్తబంధనుండై సనత్కుమారుం డుపదేశించిన విధంబున నాధ్యాత్మికయోగమునం బురుషోత్తముని భజించె. శ్రద్ధమై నవ్విధమునం గడంగినయతని కనన్యవిషయ మగుభక్తి యుదయించె. దానం జిత్తశుద్ధి గలుగుటయు హరిస్మరణపరిపూరితం బైనభక్తిప్రభావమునం జేసి తీవ్రమగువిరాగసహాకృతజ్ఞానం బొదవె. అట్టిజ్ఞానఖడ్గమున వివిధసంశయాస్పదం బైనజీవోపాధిం దఱిగి యన్యమతులం ద్రెంచి యాత్మగతి నధిగమించి తత్సాధనం బైనజ్ఞానము నెడను విరతిఁ గాంచె.

గదా గ్రజాకళలపై రతి గలుగకుండునంతకే యోగికి యోగగతుల బ్రమాదంబు గలుగుఁగాని పిమ్మటనుం గలుగ నేర్చునే? అవ్విధంబున నవ్వీరవర్యుం డాత్మం బరమాత్మునం దనుసంధించి దేహముఁ ద్యజింప నెంచి గుల్ఫముల మూలాధారంబు బిగియించి యచటివాయువు నెత్తి నాభిస్థానంబునందును గ్రమంబున నుదరహృదయకంఠభ్రూమధ్యకోష్ఠములనుం జొనిపి యటఁ బ్రాణముల నన్నింటిని బ్రహ్మరంధ్రంబునఁ జేర్చి నిష్పృహుండై ప్రాణవాయువును బాహ్యవాయువునందును శరీరగత కఠినాంశంబును బృథివియందును దేజస్సును దేజమందు నింద్రియచ్ఛిద్రముల నాకాశమందును ద్రవాంశమును దోయమందును యథాస్థానంబులయించి క్షితి నంభస్సునను దానిం దేజస్సునందును దానిని వాయువునందు నవ్వాయువు నాకాశమందు నాకాశమును మనస్సునందును మనస్సు నింద్రియములయందు నింద్రియంబులఁ దన్మాత్రంబులందు నుత్పత్తిక్రమంబునం బ్రవిలాపించి నభస్సు నింద్రియంబులను విడఁదీసి భూతాది యగు నహంకారంబుతోఁ జేర్చి యయ్యహంకారమును మహత్తత్త్వంబునందును సర్వకార్యస్థితిహేతువై మహత్తత్త్వంబును మాయోపాధివిశిష్టుండైన జీవునందును లయించి యయ్యుపాధిం బరిహరించి యాత్మభూతుండైన జీవుని జ్ఞానవైరాగ్యవీర్యంబున బ్రహ్మంబునం దనుసంధించి స్వరూపస్థితుండయ్యె. అతనిపత్ని యగు నర్చిస్సు పాదముల భూస్పర్శ మెనియుం జేయఁజాలనంతటి సౌకుమార్యంబున నొప్పి వనవాసాయాసంబులకుఁ దా నోర్వఁజాలకున్నం బతిదేవత గావున నతనితోడ వనమునకుఁ జని భర్తృవ్రతధర్మనిష్ఠత్వంబునను శుశ్రూషణంబునను ఋషియోగ్య మగు కందమూలాదిజీవనంబునను మీఁదుమిక్కిలి కృశించియుఁ బ్రియునికరస్పర్శ సమ్మానంబుల సుఖించుచుఁ దన క్లేశంబు గణింపక పతిసహవాసంబె పరమసౌఖ్యం బని మెచ్చుచుండి తనకుం బృథివికిఁ బతియైన యాపృథుచక్రవర్తిదేహము నష్టచైతన్యం బగుటం గాంచి విలపించి కొండొకవడికిఁ దన్నుఁ దాన యూరార్చికొని ధీరస్వాంతయై యమ్మందరగిరిసానుభాగంబున సొద గావించి నదిలోనం గృతస్నానయై యుదారకర్ముఁడైన పతి కుదకదానంబు నేసి మగిడి పతిచితాస్థానంబున కేతెంచి యగ్నిం బెట్టి లెస్స రగుల్కొల్పి యటఁ ద్రిదివస్థితు లగు త్రిద

ళులకుఁ బ్రణమిల్లి చితాగ్నికి ముమ్మాఱు ప్రదక్షిణంబు లొనర్చి యనన్యమానసంబునం బతిపాదమూలంబు ధ్యానించుచు నయ్యగ్నిం జొచ్చుటయుఁ బతిసహగమనం బొనర్చిన యావీరపత్నిం గాంచి యమరులును దత్పత్నులును బరితోషంబుఁ జెందిరి. అప్పుడు దేవవాదిత్రంబులు మ్రోసె, దేవపత్ను లాపతివ్రతపైఁ గుసుమవర్షంబుఁ గురియుచు శ్రీదేవి యజ్ఞేశ్వరుం బోలె సర్వవిధములం బృథునిఁ బతిగాఁ బడసినయీసతి యత్యంతధన్యురాలు గావునఁ బతియే యేపుణ్యలోకంబులకుఁ బోయినం దనదుర్విభావ్యభవ్యకార్యంబునఁ దాను నతనితోడ నాయాలోకములకుఁ బోయెడు. చంచలాయువు లయ్యు నరులు భగవత్ప్రాప్తిసాధనం బైనజ్ఞానమునే సాధింతు రట. ఇఁక వారి కెయ్యది దుర్లభం బగు? అపవర్గసాధనం బైనమానుషజన్మ మెత్తియు విషయములం దగిలి యాత్మద్రోహంబు సేయువాఁ డక్కటా! మోసపోయెడు నని యిట్లు దేవపత్నులు ప్రశంసించుచున్నంత నాత్మవిద్వరేణ్యుం డైనపృథుధరిత్రీపాలుఁ డధిగమించినయచ్యుతాశ్రయలోకంబు నతనితోడఁ దాను నావీరపత్ని వడసె. పృథునృపాలుఁ డన సంతతివాఁడు. ఉద్దామప్రభావుం డైనయతనిచరిత్రంబు నీకుఁ జెప్పితి. దీనిం బఠించినను వినినను నరునకుఁ బృథుగతి గలిగెడు. మఱియు బ్రాహ్మణుండు బ్రహ్మవర్చసంబును రాజన్యుండు రాజ్యంబును వైశ్యుండు పశ్వాదిసమృద్ధిని శూద్రుఁ డుత్తమత్వంబు నేతత్పఠనశ్రవణంబులం బొందెడు. పురుషుం డైన నారి యైన నాదరంబుతో నీపుణ్యచరిత్రంబు ముమ్మాఱు విన్న నసపత్న్యులు సంతానంబును దరిద్రులు ధనంబు నస్పష్టయశోలు సుకీర్తిని మూర్ఖులు పాండిత్యంబునుం గాంతురు. ఇయ్యది శుభావహం బశుభవారణం బాయుర్యశోధనస్వర్గసాధనంబు కలిదోషాపహంబు నై [illegible]. చతుర్వర్గకారణం బైనదీనిం బురుషార్థచతుష్టయసమ్యక్సిద్ధి గోరువారికి శ్రద్ధమై నాకర్ణింపఁ దగు. సంగ్రామాభిముఖుం డై రాజు దీని వినినఁ దనపగఱం బరిమార్ప వలసినశ్రమం బించుకేనియు లేకుండు. వారే తమకుఁ దామ వచ్చి యఖిలరాజులు పృథునృపతి కెట్టు లట్టులు కప్పము లతనికి సమర్పింతురు. ఇతరసంగము మాని భగవంతునిపై నిర్మలభక్తి నెఱపి యీయుపాఖ్యానముం బ్రతిదినముం బఠించిన నాకర్ణించిన నమ్మను

జూఁడు సంసారార్ణవతరణి యగుపాదారవిందముల వెలయుభగవంతు నిపై నిపుణమతిం జేయు నని చెప్పి మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె.

## పృథుచక్రవర్తివంశక్రమానువర్ణనము

పృథునియనంతరంబు తత్పుత్త్రుండై నవిజితాశ్వుండు సార్వభౌముఁడై తమ్ములమీఁది వాత్సల్యమునం జేసి హర్యశ్వునకుఁ దూర్పు దెసను ధూమ్రకేశునకు దక్షిణదిక్కును వృకునకుఁ బ్రతీచిని ద్రవిణునకు దీచినింగా దిగ్విభాగం బేర్పఱిచి తదీయరాజ్యంబుల వారి కొసఁగి తాను రాజాధిరాజపదంబున వెలసె. ఆవిజితాశ్వుండు దొల్లి తనతండ్రి యశ్వమేధసమయమున మేధ్యాశ్వము నపహరించినయింద్రుం జంపక విడిచినవాని కాతండు ప్రీతుండై యంతర్ధానగతి యొసంగుటఁ జేసి యంతర్ధానుం డనం బరఁగిన నతనికి శిఖండిని యనుపత్నియందుఁ దొల్లి వసిష్ఠశాపమున మనుష్యజన్మం బెత్తి నర్హులైన పావకుఁడు పవమానుఁడు శుచియుననునగ్నులు ముగ్గురు తచ్ఛాపనిస్తారణార్థంబు జనించి శాపంబు నిస్తరించి యోగమునఁ గ్రమ్మఱ నగ్నిగతిం గాంచిరి. అయ్యంతర్ధానునకు నభస్వతి యనుపేరొకపత్నియందు హావిర్ధానుం డనుపుత్త్రుండుదయించె. అటఁ గొండొకకాలంబున కంతర్ధానాపరనామధేయుండై నవిజితాశ్వుఁడు రాజులవృత్తి కరశుల్కగ్రహణదండాదిదారుణం బని నిర్వేదంబుఁ జెంది రాజ్యభోగములఁ దొలంగి పుణ్యరూప మగుసమాధియోగమున నాత్మదర్శనుండై క్లేశహారుఁడు పరిపూర్ణుఁడు నగుపరమాత్ము నారాధించి తల్లోకంబు వడసె. హావిర్ధానునకుఁ దత్పత్నియందు బర్హిష్మంతుఁడు గయుఁడు శుక్లుఁడు కృష్ణుఁడు సత్యుఁడు జితవ్రతుం డనఁ నాలుగురు సుతులు జనించిరి. వారిలో బర్హిష్మంతుఁడు కర్మతంత్రంబులందును బ్రాణాయామాదియోగంబులందును నిష్ణాతుం డయ్యె. అతం డొక్కచో నొక్కయజ్ఞమాచరించి తత్సమీపంబుననే మఱియొకయజ్ఞము నాకుఱంగట నింకొకయధ్వరంబు నాచెంగట నొండొకక్రతువునుగా నాచరించుటయు వసుధాతలంబెల్ల నతనియజ్ఞశాలలయ్యె తోఁప నెచ్చటఁ జూచినం బృథివీతలంబునం బ్రాచీనాగ్రంబులైనబర్హిస్సులు పఱచి ప్రాచీనబర్హి యనం బరఁగె. ఆతండు సముద్రతనయ యగుశత

ధృతి యనుదానిం బ్రహ్మనిదేశంబునం బరిణయం బయ్యె. తొల్లి సప్తర్షులసత్త్రంబునం దద్భార్యావలోకనంబునం గామతప్తుండై యనలుం డయ్యతిక్రమంబునకు మృదువిధానమున సమాధానంబుం గావింప నగ్నిపత్ని యగుస్వాహాదేవి తాను సప్తర్షి భార్యారూపమునం బతికిం జోడగట్టె ఋషిపత్నీ భ్రాంతి నత్యంతానురాగమున నగ్ని సంగమించుటయుం దదీయవీర్యం బాదేవి శుకీరూపమున శరస్తంబమునం బడం ద్రోచునెడ నాశుకిం గామించినరీతి లలితాలంకారభాసురసర్వాంగవిలసిత యగు నాశతధృతిని వివాహసమయముల నయ్యగ్నిదేవుఁడు మోహించె. ఇం పైనయందియలమ్రోఁతతోడం దిరుగునెడ సురాసురగంధర్వసిద్ధమునిప్రభృతులు నాకన్నియ పెన్నున కచ్చెరు వొందిరి. అట్టి లోకోత్తరసౌందర్యలావణ్యవతి యగునాశతధృతియందుఁ బ్రాచీనబర్హికిఁ బ్రచేతసు లనం దుల్యనామంబులతో సమానవ్రతులు ధర్మస్నాతులు నగు పదుగురు సుతు లుద్భవిల్లిరి. వారు తండ్రిపంపునఁ బ్రజల సృజింపఁ దపం బొనర్ప వనమునకుం జని మార్గమున సాక్షాత్కరించి శంకరుండు ప్రసన్నుండై యుపదేశించినవిధానంబున నియతచిత్తులై జపధ్యానపూజనంబులఁ బదివేలేండ్లు హరి నారాధించి రనిన విని విదురుండు మునీంద్రా! ప్రచేతసులకు గిరీశ్వరునితోడం దెరువున నెట్లు సమాగమం బయ్యె, నతండు ప్రీతుండై యేమి చెప్పె, నర్థవంతం బగునద్దాని నాకు బోధింపుము. మునులును గాఢవిరాగంబునం జేర్చినతపంబున నెవ్వని దర్శనంబు వేఁడుదు రట్టిశివునితోడిసంగమంబు శరీరులకు దుర్లభంబుగదా. ఆత్మారాముఁ డయ్యు నమ్మహేశ్వరుండు లోకరచనం బాలింప ఘోరశక్తితోడం గూడి తిరుగుచుండు నట్టిలోకేశ్వరునితోడ సమాగమం బా ప్రచేతసులకుం బరమతపఃప్రయోజనంబ యని యడిగినవిదురునకు మైత్రేయుం డిట్లనియె.

### ప్రచేతసులు శివోపదేశమునఁ దపస్సు చేయుట

సాధుచేతస్కులైన ప్రచేతసులు పితృవాక్యంబుఁ దలఁ దాలిచి తపము సేయఁ బశ్చిమదిశకుఁ జనువారు దెరువున మహాత్ములమానసంబుపోలి నిర్మలసలిలపూరమునఁ బూరితంబై కమలకువలయకల్హారభాసురంబై హంససారసచక్రకారండవాదిసంచారబంధురంబై నలినోత్పలమధుర

మకరంద పానతుందిలమిళింద బృంద సుందరసంగీత పల్లవిత తటజాతతరు లతాజాతవిద్యోతంబై శిశిరశీకరనికరవ్యతికరవిభాసుర సరోరుహ పరాగ పరివాహిమారుతాంకూర సంచారమనోహరంబై సాగరంబు చందంబునం బరమవిస్తారం బైన కాసారంబుఁ గాంచి యచ్చట మృదంగపణవాదివాది ప్రనాదంబుతో మేళగించి తిలకించి మదికించుక సమంచితగానంబు వీతెంచిన నాలకించి విస్మయం బందుచున్నంత నాకొలను వెడలి సిద్ధవిద్యాధరాదుల సంగీతంబు చిత్తగించుచుఁ బరిచరులుగొలువఁ దప్తసువర్ణసవర్ణ గాత్రకాంతులు వెలయించుచు శ్రీకంఠుఁడు ప్రసాదాభిముఖుండై వారికి సాక్షాత్కరించె. అద్దేవదేవుం గాంచి జాతకౌతుకులై ప్రచేతసులు ప్రణమిల్లుటయు ధర్మవత్సలుం డైనభగవంతుఁడు ధర్మజ్ఞులు శీలసంపన్నులు ప్రపన్నులు నగువారల నాదరించి శ్రీరుద్రుం డిట్లనియె. అయ్యా, మీరలు బర్హిష్మంతుని పుత్త్రులరు. మీరు సేయఁ బూనినదాని నెఱిఁగి మీకు మేలు సమకూర్ప దర్శనం బొసంగితి. సూక్ష్మ మనుప్రధానమునకును జీవపదవాచ్యుం డైనపురుషునకును బరుండై ప్రకృతిపురుష నియామకుం డైనవాసుదేవు నాశ్రయించిన యతండు నాకుఁ బ్రియుఁడు. శతజన్మములు నిష్ఠతో స్వధర్మ మాచరించినవాఁడు బ్రహ్మత్వంబు నంతకంటె నెక్కువ ధర్మ మార్జించినవాఁడు నన్నునుం బొందెడు. భగవద్భక్తుఁ డన్ననో యాధికారికు లైనబ్రహ్మాదులు నేను నెట్టు లధికారాంతమున రూపు మాయుదు మట్లుగాక ప్రపంచాతీతం బైనవైష్ణవపదంబుఁ బ్రాపించెడు. మీరలు భాగవతులు గావున భగవంతునట్లుపోలె నాకుఁ బ్రియులు. భాగవతులకును నాకంటెఁ బ్రియతరుఁడు గలుగఁడు. పవిత్రము పరమ మంగళము నిశ్శ్రేయసకరము నగునొక్కస్తోత్రంబు మీకే నుపదేశించెద దీని నసంకీర్ణముగ జపింపుఁ డని చెప్పి యప్పార్వతీవల్లభుం డుల్లంబునఁ గరుణాభరంబు పల్లవింపఁ గృతాంజలు లైనయారాజనందనులకు నారాయణపరం బైనయాస్తోత్ర మిట్లని చెప్పం దొడంగె.

### శ్రీరుద్రగీతాస్తోత్రము

దేవా, నీయుత్కర్షం బాత్మవిదుల కానందలాభార్థంబు గావున నా కాత్మానందలాభంబు గలుగుఁగాక. నిరతిశయపరమానందరూపమున నీవు సిద్ధుండవు. అట్టియాత్మస్వరూపుఁ డైననీకుఁ బ్రణామంబు. లోకమయు

పద్మముం బొక్కిటఁ దాల్చి కారణాత్మకుఁడవై సృజ్యప్రపంచజాలమున కుపాధిభూతంబులై భూతతన్మాత్రేంద్రియములకు నియామకుండవై చిత్తాధిష్ఠాతృత్వంబు వహించి వికారములం దవులక స్వప్రకాశమున వెలుంగుచు వాసుదేవపదవాచ్యుండవై, యహంకారాధిష్ఠాతృత్వంబు పూని సూక్ష్మానంతత్వధర్మములం గొని ప్రళయసమయంబున ముఖానలంబున లోకములఁ గాల్చుచు సంకర్షణపదాభిధేయుండవై, బుద్ధ్యధిష్ఠాతృత్వంబు ధరించి విశ్వమునకుఁ బ్రబోధంబుఁ గావించుచు నంతరాత్మ యనం బరఁగి ప్రద్యుమ్నపదబోధ్యుండవై, మనోధిష్ఠాతృత్వంబు ధరించి యింద్రియములం గార్యములఁ బ్రేరించుచు ననిరుద్ధపదవేద్యుండవై, క్షయవృద్ధులం గాంచక తేజఃపరిపూర్తి యొనసి సూర్యస్వరూపుఁడవై, సర్వాంతఃకరణములందు వసించి జనులకు స్వర్గాపవర్గద్వారంబవై, యజ్ఞముల విస్తరించి చాతుర్హోత్రకర్మముల సాధించుచు నగ్నిస్వరూపుఁడవై, దేవతలకుఁ బితృదేవతలకు నన్నముఁ గల్పించి సోమస్వరూపుండవై, వేదత్రయపతివై, జీవులకుఁ దృప్తిఁ గావించి సర్వరసాత్మకుఁడవై, పృథివీస్వరూపుఁడవై, సర్వప్రాణిదేహాతిశయితస్థూలతరత్వవిశిష్టవిరాడ్రూపుఁడవై యోజస్సహోబలంబులం దనరి ప్రాణరూపమున ముల్లోకములఁ బాలించుచు వాయురూపుఁడవై, యర్థములం బోధించు శబ్దము గుణంబై యమర నంతర్బహిర్వ్యవహారాలంబనత్వంబు వహించి నభోరూపుఁడవై, భూరివర్చోవిలాసంబున నొప్పి స్వర్గరూపుఁడవై, ప్రవృత్తినివృత్తిలక్షణకర్మస్వరూపుఁడవై, తదుభయసాధ్యఫలస్వరూపుఁడవై, దుఃఖప్రదమృత్యురూపుఁడవై, సర్వకర్మఫలప్రదుండవై, మంత్రాత్మకుండవై, పరమధర్మాత్ముఁడవై, కృష్ణాభిధేయుండవై, యప్రతిహతజ్ఞానుండవై, పురాణపురుషుఁడవై, సాంఖ్యయోగేశ్వరుండవై, కర్తృకర్మకరణశక్తిత్రయసమన్వితుండవై, యహంకారాత్మక రుద్రాత్మకుండవై, వివిధవాక్కుల సృజించి జ్ఞానక్రియారూపుఁడవై, వెలయునీకు నమస్కారము. ఆత్మగుణముల సర్వేంద్రియముల రంజిల్లఁ జేయుచు వార్షికజలధరమేచకరుచిం గ్రాలుచు సర్వసౌందర్యసారము సంగ్రహించుచుఁ బీనాయతబాహాచతుష్టయంబు పద్మపలాశలోచనద్వయంబునను సుందరభ్రూనాసాదంతకపోలంబులను సమకర్ణంబు లనుకుటిల కుంతలంబులను ప్రీతిహాసితకటాక్షవీక్షణంబులను సొంపారు రుచిరాననం

బులు గమలకింజల్కసచ్ఛాయమృదులాంబరంబులును లసద్రత్నకుండల కిరీటకటకహారనూపురమేఖలాది విభూషణాలంకారంబును శంఖచక్ర గదాపద్మమాలామణిసమృద్ధియు సింహస్కంధంబులును కౌస్తుభోల్లసిత కంఠంబును స్వర్ణకాంతి నెసఁగుశ్రీదేవి నివసింపఁ దననీలరుచిం జేసి స్వర్ణ రేఖనలరునికషోపలంబునకుఁ బోల్పఁ దగినవిశాలవక్షస్స్థలంబును బూరక రేచకవాయుప్రచారమునం జలించువళులఁ జెన్నారుచు నశ్వత్థపత్రముం బురుడించునుదరంబును విశ్వమెల్లఁ దనలో నిమిడించుకొనఁగ నసఁగ నావర్తమున నత్యంతగంభీరం బైననాభియు దుకూలోపరిమేఖలోల్లసిత నితంబబింబంబును సమానాంఘ్రిజంఘోరు దేశంబులును నిమ్నజాను భాగంబులును శరత్పద్మప్రకాశం బైనఖకాంతుల నంతరఘంబు విదళించు పాదయుగ్మంబునుం గలిగి యాత్మభక్తులకు భయహరం బై పరమప్రియం బై యొప్పునీదివ్యమంగళవిగ్రహంబుఁ జూడఁ గోరుమాకుఁ జూపుము. నీవ కదా యజ్ఞులకు జ్ఞానమార్గంబు సూపుగురుఁడవు. స్వధర్మ మనుష్ఠించు వారి కెవనిభక్తియోగం బభయము నొసంగు నట్టినీ దగునీరూపం బాత్మశుద్ధిఁ గోరువారికి ధ్యేయంబు. స్వారాజ్య మేలువానికిఁ బ్రార్థ నీయుఁ డాత్మవిదుల కేకాంతగతియు నగునీవు సర్వదేవాలకు దుర్లభుఁడ వయ్యు భక్తిమంతులకు సులభుఁడవు. అశక్యారాధనుం డైన నిన్ను దుర్లభభక్తి నారాధించియుఁ ద్వదీయపాదమూలము విడిచి బాహ్యము లగుస్వర్గాదిసుఖముల నెవ్వండు గోరు? నీవక్రశౌర్యవిస్ఫూర్జితభ్రుకుటి చటులుండై విశ్వవిధ్వంసంబుఁ గావించునంతకును నీశరణు సొచ్చిన వానిం దేఱి చూడరాదు. స్వర్గమేనియు నపవర్గమేనియు భాగవతులతోడి సంగముతోడ క్షణార్ధమున నైనం బురుడింపను. ఐహికరాజ్యాదిభోగ ములఁ జెప్ప నేల? అనఘ మగునీపాదకీర్తితీర్థములం గ్రుంకి యంతర్బ హిర్మలముల నిరసించి రాగాదులఁ బాసి శుద్ధం బైనశీలము నెసఁసిన చిత్తముల నుత్తము లగుమహాత్ములతోడిసంగము నాకు నిరంతర మొడఁగూర్చి యనుగ్రహింపుము. ఎవ్వనిచిత్తము భగవద్భక్తియోగ మునం జేసి బాహ్యవిషయములం దవులక శుద్ధం బై తమోగుహాలోనం జొరకుండు నిక్కం బమ్మౌని నీతత్త్వంబుఁ గాంచెడు. విశ్వవ్యంజకం బై ఖిలాంతర్విఖ్యాతం బై యాకాశంబురీతి విస్తృతం బై పరబ్రహ్మాశబ్దాభి

ధేయం బగుజ్యోతిస్సే నీతత్త్వంబు. ఇతరులకు భేదబుద్ధి నొదవించు నానా రూపమగు మాయచేఁ బరమార్థంబుగాఁ దోఁప నీవిశ్వము సృజించుచుఁ బాలించుచు హరించుచు నమ్మాయ దనయెడ నైకార్యముం జేయఁ జాలక తొలంగియుండ నిర్వికారుండవై స్వతంత్రుండవై వెలయునీవు నిరస్త భేదుండ వని యెఱుంగుదుము. భూతేంద్రియాంతఃకరణోపలక్షితం బైన నియంతృరూపమును శ్రద్ధమై స్వధర్మమగు వివిధక్రియాకలాపమున నర్చించువారు వేదాగమములఁ గోవిదులు గాని స్వధర్మము నాదరింపక కేవలజ్ఞానమునం బ్రవర్తించువారు గారు. లీనమాయుండవైన యాదిపురు షుఁడు నీ వొక్కఁడ వైనం బిదప మాయను గొని రజస్సత్త్వతమో గుణంబులు మహదహంకారభూతేంద్రియగణంబులు మున్నగు ప్రపం చము సృజించిన నీభేదం బపారమార్థికంబుగఁ దోఁచుచుండెడు. ఆత్మ శక్తియోగమునఁ జతుర్విధం బైనశరీరమును నీవు సృజించి యాత్మాంశ మున నందుఁ జొచ్చిన నవిద్యావరణమున విషయసుఖము ననుభవించు నతఁడు జీవుఁ డనంబడు. నీవన్నో స్వశక్తిచే నీజగము సృజించి వాయువు మేఘపటలంబు నెట్లట్లు ప్రచండవేగుఁడవై భూతములచేతనే భూత ములం బొలియించుచు నలక్ష్యస్వరూపంబున వెలయుదువు. లోభము వర్ధిల్ల విషయలాలసుండవై యితికర్తవ్యతావిచారం బెడలి పెద్దయుం బ్రమాదంబు నెనసినవాని క్షుత్పరీతం బైనపన్నగ మాఖువు నెట్టు లట్టు లంతకుండవై యఱుముదువు. నిన్నునాదరించుట యొడలు చెఱుచు నని తెలిసి పండితుఁ డెవ్వఁడేని బ్రహ్మదేవుఁడును మన్వాదులు నర్చించి రని శంక దక్కి నీపాదారవిందంబుఁ గొలువ కుడుగునే? జగ మెల్ల రుద్రభయనష్టంబు గావున నోపరమాత్మా, నీవే మాకు సర్వభయ ములఁ దొలఁగించుగతి వైతివి.

రాజనందనులారా, భగవంతునియెడ నంతఃకరణ మర్పించి స్వధర్మ మనుష్ఠించుచు మునివ్రతులై యోగాదేశనామకం బైనయీ పరమస్తోత్ర మభ్యాసమున సుస్థిరంబు గావించుకొని సమాహితచిత్తులై జపించుచు సర్వభూతస్థితుఁ డాత్మస్థితుఁ డాత్ముఁడునగుహరిం గీర్తించుచు ధ్యానించుచుఁ బూజింపుఁడు. బ్రహ్మదేవుఁడు ప్రజాసర్గమునకుఁ బూని సర్గనిర్దిష్టు లైనభృగుప్రముఖు లగుమాకుఁ దొల్లి దీనిఁ జెప్పె. ఏము నతని

పంపున సృష్టికిఁ గడంగి దీనిం జపించి తమోనిరాసం బెనసి ప్రజల సృజిం చితిమి. నిత్యయుక్తుండై యవధానమున దీని జపించు వాసుదేవపరా యణుఁ డచిరంబ శ్రేయం బెనసెడు జ్ఞానంబు సర్వశ్రేయంబులలో నుత్తమంబు. జ్ఞాన మనునావను సాధించినం బురుషుఁడు దుస్తరం బగువ్యసనార్ణవంబు నిస్తరించు. మద్గీతం బైనయీస్తోత్రమును శుచియై నిత్యముం బఠించుచు నశక్యారాధనుం డైనహరి నారాధించు నతఁడు మద్గీతగానంబున సుప్రీతుం డైనయాశ్రేయోనాయకునివలన సుస్థిరం బుగఁ దనకోరునర్థంబులనెల్లఁ బ్రాపించు. రాజకుమారులారా, యే నుపదేశించిన యీపరమపురుషస్తవ మేకాగ్రమతిం జపించుచు నుత్తమ తపం బాచరింపుఁడు. వాంఛితంబుఁ దపోవసానంబున సాధింతు రని చెప్పి మృత్యుంజయుం డా ప్రచేతసులపూజలం గ్రహించి వారు సూచు చుండ నచ్చటన యంతర్హితుం డయ్యె. వారును రుద్రగీతం బైనహరి స్తోత్రంబు జపించుచు జలములం బదివేలేండ్లు తపంబు సలుపుచుండిరి.

## పురంజనోపాఖ్యానప్రారంభము

కర్మాసక్తుం డైనప్రాచీనబర్హి యొద్ద కథ్యాత్మతత్త్వవిదుం డైన నారదుం డట్టియెడఁ గరుణించి యరుదెంచి రాజవర్యా, కర్మంబుల నీ వేమి మేలు గలిగెడు నని తలంతువు? దుఃఖహానియు సుఖప్రాప్తియు నను శ్రేయంబు కర్మంబువలనం గలుగ దని నుడువుటయు నాతండు మునిపుంగవా, కర్మవిక్షిప్తమతి యగునేను బరమశ్రేయోమార్గం బెఱుంగను కర్మమోక్షముఁ గలిగించు నిర్మలజ్ఞానము నాకు బోధింపుము. కూటధర్మము లగుగృహములందు దారపుత్రవిత్తంబులే పరమార్థం బని సంసారమార్గమునం బరిభ్రమించుమూఢుఁడు పరమశ్రేయంబు గాంచ నేరఁ డని వేడికొనుటయు నారదుం డతని కిట్లనియె. జనేశ్వరా, దయ మాలి యాగముల నీవు చంపినపశువు లయ్యవియే గుంపులుగుంపులై నీయొనర్చిన యపకృతిం దలంచుచు నీ వీమేను దొఱంగి పరలోకము సేరిన నయఃకూటోపమంబు లగుకొమ్ముల నిన్నుఁ బొడిచి నలిగులి సేయఁ జేర లుకమై వేచియుండెడు. ఈసంకటంబునఁ బురంజనచరితం బనుపురాతనేతి హాసంబు చెప్పెద వినుము. తొల్లి పురంజనుఁ డన మహాకీర్తి యగురాజో త్తముఁ డుండె. అతని కవిజ్ఞాతనామం డవిజ్ఞాతచేష్టితుండు నగునవిజ్ఞాతుఁ

డనుసుఖుఁ డొక్కఁ డుండె. అతండు దనకు సకలభోగము లనుభవింపఁ
దగిననెలవు గోరి పృథివి యెల్లెడలం గ్రుమ్మరి యచ్చటచ్చటఁ జూచుచు నవ
పురంబులెల్లఁ దా నేయేకోర్కులు గోరిన నయ్యైవాని కనువు గామింజేసి
తనకోర్కె నెఱవేఱనికతన విమనస్కుండై యొక్కనాఁడు హిమవంతంబు
దక్షిణసానువులందు నవద్వారసమేతంబై లక్షణలక్షితంబై ప్రాకారోప
వనాట్టాలపరిఖాతోరణంబులను స్వర్ణరౌప్యాయసశిఖరగవాక్షనీలస్ఫటిక
వైడూర్యముక్తామరకత పద్మరాగపరిష్కృతహర్మ్యవిలసితగృహంబులను
సభాచత్వరరథ్యాక్రీడాపణంబులను జైత్యధ్వజపతాకలను విద్రుమవేదిక
లనుందనరి శ్రీవిభవమున భోగవతింబోలుచున్న యొక్కపురంబుఁ గాంచె.
కాంచి దానివెలుపల నునుఁజివుళ్లను బండ్లను బూఁదేనియల నానుచిలు
కలు మున్నగుపులుఁగులయుఁ దేఁటులయు నలివునం జెలంగుచుఁ జేరిన
వారికి నేద దేర్పఁ జల్లనీడలు పచరించుపలు మ్రాఁకులఁ దీఁగల నభి
రామంబై సరోవరశిశిరశీకరనికరంబులతో వికచకమలకువలయపరాగం
బుల మోచి పూఁదెమ్మెల మెల్ల మెల్లన యూఁచుచు నరుదెంచునును
గాడ్పు వీచుటల రమణీయంబై తనసొంపు గనుంగొనఁ బథికులఁ బిలుచు
తెఱంగున నుత్ప్రేక్షింప నర్హంబై నకోకిలాలాపమున మనోహరంబై
మునివ్రతము లయిననానారణ్యమృగవ్రాతముల నిరాబాధంబై దర్శ
నీయం బైనయుపవనంబునందు విశదదశనోన్నతనాసికావిశాలకపోల
బంధురవదనంబునను గుండలమండితకర్ణద్వయంబునను బిళంగనీవీపరీత
శ్రోణితటవిరాజితకనకమేఖలాప్రకాశంబునను సొంపు పెంపు సవరించుశ్యామ
గాత్రంబునఁ జూడ నొప్పి జవ్వనంపుఁబేపు సూపుసమవృత్తకఠినకుచ
ద్వయంబు సిగ్గుపెంపునఁ బయ్యెఁటలో నణఁగ నవరించుచు విభ్రమభ్రూ
విలాసంబు విశదదరహాసంబునుం జెలంగఁ గటాక్షించుచుఁ బదయుగ
మునం దొడిగినయందియలు గలుగల్లన మ్రోయ దేవతారూపంబునఁ
దేజరిల్లుచుఁ బంచశీర్షపన్నగప్రతీహారునికాపు వడసి ప్రత్యేకంబు శతనా
యకు లైనపదుగురు భృత్యు లొక్కని నిర్దేశమునఁ బనివడి పరివేష్టింపఁ
దగినపతి నన్వేషించుచుఁ దిరుగుచున్నయప్రౌఢ యగుకామరూపిణి
యైనయొక్కప్రమదం జూచి తదీయలలితాపాంగపుంఖసంస్పృష్టుండై
యోపద్మాక్షి, నీవెవ్వతె, వెవ్వరిదాన, వెచ్చోటినుండి యేమి సేయ

నిచ్చటి కేతెంచినదానవు? బృహద్బలుం డైనయేకాదశునాదేశంబున
నడచు, నీపదుగురుభటు లెవ్వరు? నిన్ననువర్తించియున్నయిన్నెలంత
లెవ్వ, రీపంచశీర్షాహి యెయ్యది? ధర్మని వెదకుహ్రీవో, భవుని వెదకు
భవానివో, బ్రహ్మ నన్వేషించుభారతివో, విష్ణుగవేషణంబు సేయునింది
రవో, కాని మనుష్యసామాన్యవనితవు నీవుగావు. నాకుఁ జూడ నీయడు
గుల వేఁడి దానవే సర్వకామములం బడసినపతి నన్వేషింతు వనియు
ము న్నెన్నినవారు దేవతాసుందరులు గావున భూతలంబు నంటునిన్ను
వారిలో నొక్కర్తుగా నెన్నరా దనియుఁ దోఁచెడు. భవదీయకరా
గ్రంబు వాసి పద్మకోశం బెచ్చటఁ బడియె? రమాదేవి పరమపురుషు
నెట్టు లట్టులు కరుణపెంపున నన్ను వరించి తిలకించి యేలుము. లజ్జాలలిత
స్మితలసితభవదపాంగశరప్రహారశిథిలేంద్రియుం డైననన్ను మదనుండు
మిక్కిలి యేఁచుచున్నవాఁడు. అనుగ్రహించి సుందరభ్రూవిలోచనంబు
వ్యాలంబినీలాలకజాలసంవృతంబు నగునీమొగమ్ము చూపి ముచ్చట
గూర మాట లాడుము. సిగ్గున మాఱుమొగంబు సేయవల దని యిట్లు
పురంజనుండు మోహగ్రస్తుండై యడుగుటయు నానితంబిని మోహి
తయై లేనగవు మొగమునఁ జెలంగ నభినందనపురస్సరంబుగా నతని
కి ట్లనియె: అయ్యా, యేము నాకును నీకును గోత్రనామంబు లేర్పఱిచి
పుట్టించినవాని నెఱుంగము. మఱి యీపురమున నుండువాని నొక్కని
నెఱుంగుదు మింతియకాని యాత్మశరణం బైనయీపురమును నిర్మించిన
పర్వునేనియు నెఱుంగము. ఈపదుగురుభటులు నేకాదశుఁ డైనబృహ
ద్బలుఁడును నాసఖులు. ఈయువిదలు నాచెలికత్తియలు. పంచశీర్షం
బైనయీపన్నగం బేను నిద్రించునెడఁ దాను మేల్కని యీపురముం
గాచుచుండెడు. భాగ్యమున వచ్చి గ్రామ్యకామముల వేఁడునిన్ను
బంధులతోడ నుద్వహించెద. నవద్వారం బైనయీపురము ననుష్ఠించి
యీవు నాయొద్దఁగూర్చు కామభోగంబులు శతవర్షంబులనుభవింపుము.
నిన్నుఁ గాదని యరతిజ్ఞుఁ డనిపుణుఁ డసాంపరాయాభిముఖుఁడునై
రేపటిచింత లేనిపశుప్రాయుని వరింతునే? గృహాస్థాశ్రమంబున నర్థకామ
ములు ప్రజానందము లమృతకీర్తులును నివృత్తిధర్మనిరతు లైనయతుల
కేనియుఁ బ్రాప్యంబులు గానివి శోకనిశ్చల పుణ్యాలోకములుం గలుగు.

పితృదేవర్షి మానవులకు నఖిలభూతములకును గృహస్థాశ్రమంబు సేవనీయం బైనయాశ్రయం బని చెప్పఁబడు. వీర్యధుర్యా, విఖ్యాతుఁడు వదాన్యుఁడు ప్రియదర్శనుండు నగునీయట్టిపతి దనంతన లభించిన నాయట్టియువతి యెవ్వ తెయేనియు వరింపకుండునే! పరమకరుణో ల్లసితస్మితమిళితవిలోకనంబున దీనులతాపం బాఁప నోపు భవదీయ భోగిభోగోపమభుజములపై నేపడఁతికి మనసు రాకుండును? అని యిట్లు లయ్యిర్వురు ముచ్చట లాడి యొండొరుల మెచ్చుచు హెచ్చిన మచ్చిక నప్పురంబు సొచ్చి శతవర్షంబులు సమ్మోదంబుఁ గాంచిరి. అట్టి యెడ నాపురంజనుం డచ్చట గాయకగానంబుల నాలించుచు స్త్రీ జనపరివృతుండై క్రీడించుచు నిదాఘసమయంబున హ్రదినిం జొచ్చె. ఎవ్వనే నొక్కని నీశ్వరుంగాఁ బడసినయాపురంబు ద్వారనవకంబున నేడు మీఁదను రెండు గ్రిందను వేఱువేఱ విషయగత్యర్థంబు చొప్పడి యుండెడు. అందును ద్వారపంచకంబు పూర్వభాగంబునను నొక్కటి దక్షిణంబున నొక్కటి యుత్తరంబునను రెండు పశ్చిమంబున నుండెడు. వానినామంబులు వినుము. ఖద్యోతయు నావిర్ముఖియు నను రెండు పూర్వద్వారంబు లొక్కచో నిర్మితంబులై యుండెడు. అప్పురుషుండు ద్యుమంతుఁ డనుచెలితోడ్పాటున నాద్వారముల విభ్రాజితము లను జనపదములకుఁ బోవుచుండెడు నళినియు నాళినియు నన రెండుపూర్వ ద్వారంబు లొక్కెడ నడరెడు. అవధూతుఁ డనుసఖునితోడ్పాటున నాద్వారముల నతండు సౌరభవిషయంబుఁ బ్రాపించెడు. ముఖ్యనామ ధేయం బైనపూర్వద్వార మొక్కఁ డొక్కచో నుండెడు. దాన నాపుర రాజు రసజ్ఞ విపణనామసుహృత్సహాయంబున నాపణబహూదనవిష యంబుల నధిగమించెడు. మఱియు నాపురంజనుండు శ్రుతధన్వితుండై పితృహూనామకం బగుదక్షిణద్వారంబున దక్షిణపాంచాలంబును దేవహూసమాఖ్యం బైనయుత్తరద్వారంబున నుత్తరపాంచాలంబునుం గాంచెడు. ఆసురి యనుపశ్చిమద్వారంబున దుర్మదసమన్వితుండై గ్రామ కాభిఖ్యం బైనవిషయంబును నిరృతి యనునొండొక్కపశ్చిమద్వారమున లుబ్ధకాన్వితుండై వైశసాఖ్యం బైనవిషయంబును బొందుచుండెడు. అప్పురమున నుండువారిలో నంధు లైననిర్వాక్పేశస్కరు లనునిరువురి

సహాయమున నక్షణ్వంతులకుఁ బలి యగునాపురంజనుఁడు యానమును గృతిని నెఱవేర్చెడు. అతఁ డంతగపురగతుండై విషూచీనయోగంబెనసి జాయాత్మజోద్భవంబు లగుమోహప్రసాదహర్షములం బడయు. అవ్విధమున నాపురంజనుఁ డజ్ఞత్వమునఁజేసి కామప్రవణుండై కామసాధనము లగుకర్మములం దవిలి దైవవంచితుండై తనయిల్లా లెయ్యదెయ్యది చేయఁ దలఁచిన దానిదానినెల్ల ననువర్తించుచుండె నెట్లంటేని ఒక్కచో నది మదిరఁ ద్రావినం దానును మదవిహ్వలుండై త్రాగు. తినినం దిను. సహభోజనంబు గోరినం దోడఁ గుడుచు. పాడినం బాడు. విలపించిన విలపించు. నగిన నగు. పలికినం బలుకు. పఱచినం బఱచు. నిలిచిన నిలుచు. పవ్వళించినం బవ్వళించు. కూర్చుండినం గూర్చుండు. వినిన విను. చూచినం జూచు. మూర్కొనిన మూర్కొను. స్పృశించిన స్పృశించు. వగచిన నార్తునిరీతి వగచు. హర్షించిన హర్షించు. సుఖించిన సుఖించు. అవ్విధంబున నతండు దానికిఁ జిక్కి వంచితుండై యిచ్ఛ లేకున్న నజ్ఞుఁడై యథ్రష్టత్వమునంజేసి క్రీడామృగంబువోలె దాని చేసినవాని ననుకరించుచుండె.

ఆపురంజనుఁ డొక్కనాఁడు పసిఁడిక త్తళంబు దొడిగి యక్షయతూణీరంబులు మహాచాపంబుఁగొని యేఁడికోలలు రెండు చక్రములు రెండు బండిక న్నొక్కండు టెక్కియంబులు మూడు బంధనంబు లైదు యుగ్యము లైదు పగ్గ మొక్కటి సారథియొక్కండు రథికాసన మొకటి నొగలు రెండు చర్మాద్యావరణము లేడు ప్రహారణంబు లైదునుం గలిగి గతిభేద పంచకంబున నొప్పుచు నాశుగతిం దనరుస్వర్ణభూషణభూషితరథం బధిరోహించి యేకాదశుండు సేనాపతియై నడువ పానుఁపంచకంబున నొప్పు వొక్కవనంబున మృగవ్యసనలాలసుఁడై విడువరానిభార్యను విడిచి చని దృప్తుండై వేఁటాడఁ బూని యాసురవృత్తికిఁ దెగించి ఘోరాత్ముఁడై నిరనుగ్రహుఁడై నిశితశరము లేసి వనముల వనగోచరముల లోఁబఱచికొనియె. సామాన్యనిత్యశ్రాద్ధాదిసమయంబులు గాక ప్రఖ్యాతము లైన శ్రాద్ధాదులందే మేధ్యపశువులనే వనంబులనే రాజే వలసినంతమాత్రమే వధింపఁ దగునని మృగయావిషయంబున నాఱునియమములు గలుగు. ఆనియమ మొఱఁగి తత్ప్రకారంబు దప్పక నడచునతఁడు దానం బుట్టిన

జ్ఞానమునం జేసి తత్కార్యంబు నంటఁడు. అట్టినియమము మీఱి నడచినం
గర్తృత్వాభిమానంబుఁ గాంచి తత్కర్మబద్ధుండై ప్రజ్ఞ చెడి సంసార
ప్రవాహమునం బడి మనుజుఁ డధోగతిం జెందు. అట్టిమృగయాభ్యస్త మ
యక యాతండు చిత్రపతము లగుశిలీముఖములం బరఁగించి చెండా
డుటయుఁ దదీయశరవిదళితాంగంబు లైనమృగంబులవినాశంబు కారుణి
కులకు దుస్సహం బయ్యె. అట్టు లతండు శశవరాహమహిషగవయరురు
శల్యకప్రముఖంబు లైనవాని మేధ్యామేధ్యవిచారంబు దక్క వేఁటాడి
పెద్దయుం బ్రొద్దున కలసి మగిడి యింటి కరుదెంచి స్నానంబు నుచితా
హారంబును నిర్వర్తించి యలపు దీర్చికొని శయనంబు సేరి ధూపాలేప
స్రగాదుల నలంకరించికొని భార్యపై మనసుపెట్టి బాహ్యేచ్ఛ లుజ్జ
గించి సంతోషం బెనసినకతన నత్యంతతృప్తుండై కందర్పాకృష్టమాన
సుండై తనగృహిణిం గాంచక విమనుండై యంతగపురసఖులం బిలిచి
యోరామలారా, మీకును మీయీశ్వరికినిం దొల్లింటియట్లు కుశ
లంబె. ఇంటఁ దల్లియుండెఁ బతిదేవత యగుపత్నియుండె లేకుండినం
గృహసంపద లింపు గూర్పవు. విఱిగినతేరిపై నెట్టులట్టు లట్టిగృహమునం
బ్రాజ్ఞుఁ డెవ్వఁడేనియు దీనునిచాడ్పునఁ గూర్చుండునే? వ్యసనార్ణవం
బున మునుఁగునన్నుఁ దఱిలోఁ దేర్చునాలలన యెటనుండెడు నని యడిగిన
నారామ లోనరనాథా, నీప్రియురాలివ్యవసాయంబే మెఱుంగము. ఇదె
పాన్పు లేనిభూతలమునం బరుండియుండెడు. చూడుమనిచూపిరి. దేహావ
రముఁ దొఱఁగి భూతలమునం బరున్న యాత్మమహిషిం గాంచి యాతండు
తదీయసంగమునం దనతెలివి వ్యాకులం బగుడు విన్ననై కొదలంబందు
డెందంబుతో మృదువచనముల నూరార్చుచుఁ బొలయలుక వెంపున
నాయువిద చూచిన కుటిలావలోకనములం బడసి యనునయకోవిదత్వం
బున మెల్లమెల్లన సామప్రయోగము లుపయోగించుచు నుత్సంగ
మునం దానిపాదద్వయంబు సేర్చి యొత్తుచు, నోకల్యాణీ, తప్పిదంబొన
ర్చిన తమవారియెడ నేలిక లుచితశిక్షాదండముఁ బ్రయోగింపరేని
యయ్యది భృత్యులదౌర్భాగ్యంబు. ప్రభునియమితదండంబు భృత్యు
లకుఁ బరమానుగ్రహంబు. అజ్ఞుఁడైనక్రోధి యాబంధుకృత్యముఁ దెలి
యఁడు. సుందరీ, శోభనదశనభ్రూవిభ్రమంబులఁ జెలంగి యనురాగమున

నెనఁగుసిగ్గు పెల్లున సోయగంబునకుఁ దావలం బైనలేనగవులఁ దఱఁగలి గొనుక్రేఁగంటిచూడ్కుల నింపు గూర్చి నీలాలకంబు లళికులంబులకు పోటి రాఁగ విరిసినతమ్మిపూవు దలఁపించులలితవదనోల్లసితం బైననీ నెమ్మొగ మ్మో మనస్వినీ చూపుము. నీ కపరాధము నెవ్వఁడైనఁ జేసి యుండునేని యతఁడు బ్రాహ్మణుఁడును మురారిదాసుఁడునుం గాకుండిన ముల్లోకముల వానిం గిట్టి గీటడఁగించెద. నీవదనంబు తొల్లింటిచాయఁ బాసి తిలకరహితంబై మలినంబై హర్షహీనంబై సంరంభభీమంబై యనుల్లసితంబై యపేతరాగంబై చూపట్టెడు. సుందరం బైనచన్ను దోయి చెన్నుదఱిఁగియుండెడు. కెంపువాతెఱయుఁ గుంకుమపంకరాగం బెడలి కనుపట్టెడు. విచ్చలవిడి వేఁట దవిలి తప్పు సేసిననీచెలికానిపై నలుక మాని ప్రసాదింపుము. కామిని యెవర్తు కుసుమాస్త్రవేగమున ధైర్య ముడివోవ వశంగతుండై వచ్చినకాంతునిఁ గార్యార్థమున నుప సర్పింపకుండు నని దైన్యంబు గదురఁ బలుకుటయు నది యతనిం దనకుఁ జిక్కించుకొని బహుళవిభ్రమంబుల రమింపఁ జేసె.

అవ్విధంబునఁ బురంజనుండు ప్రేయసి ననునయించి మంగళస్నాన రుచిరాంబరధారణవివిధభూషణాలంకరణముల రమణీయయై యున్న యక్కామినిం గూడి యేకాంతమునఁ దదీయకంఠాశ్లేషణసుఖం బనుభ వించుచు దానిరహస్యసల్లాపములం బడి వివేకంబు దక్కి ప్రమదాతత్ప రుండై రేలు పవ లని యరయక కాలమెల్లఁ బుచ్చుచుఁ దదీయశయ నాదివిహారముల నున్నద్ధుండై భార్యయే పురుషార్థ మని తలంచెఁ గాని యజ్ఞానపరిభవనంబునం జేసి పరబ్రహ్మసంపత్తి పరమపురుషార్థం బని యెఱుంగఁడయ్యె. అవ్విధమునఁ గామకలుషితచేతస్కుండై రమించు చుండ క్షణార్థంబువోలె నతనికి యౌవనకాలంబెల్లఁ గడచె. ఆ పురంజనుఁడు దానియం దేకాదశాధికశతసంఖ్యాకు లైనపుత్త్రులను బితృభ్రాతృయశస్కరు లగుకూఁతులనుం గని యప్పాంచాలపతికొడు కులకుఁ దగినభార్యలను గూఁతులకుఁ దగినపతులను సంపాదించి వివా హములు సేయుటయుఁ బుత్త్రుల కొక్కొక్కనిఁ బ్రత్యేకంబు నూఱు గురుసుతులు జనించిరి. తదీయపుత్త్రపౌత్త్రక్రమంబునఁ బురంజను వంశము పాంచాలమున వర్ధిల్లె. అతం డంతఁ గృహకోశానుజీవు లైన

పుత్త్రపౌత్త్రాదులమీఁద నాటుకొన్న మమతం జేసి విషయబద్ధుండై నానా కామములం గోరి నీరీతిఁ బశుమారకంబు లైనఘోరక్రతువు లాచరింప దీక్షితుండై దేవతలను పితృదేవతలను భూతపతులం దనిపె. అట్లు కుటుంబాసక్తచిత్తుండై ప్రమత్తుం డైనయతనికి యోషిత్ప్రియులకుఁ బ్రియంబు గానియాకాల మాసన్న మయ్యె. అప్పుడు చండవేగుఁ డను గంధర్వరాజు మున్నూటయఱువండ్రు గంధర్వులును మిథునీభూతంబు లై తావత్సంఖ్య నొప్పుసితాసితగంధర్వాంగనలునుం దమపరివర్తనంబునఁ బురంజనపురంబునకుఁ జేటు గావింపఁ జాలినవారు వెంటఁ గొలిచిరాఁగ నేతెంచి యతనిపురము ముట్టడించె. ముట్టడించుటయుఁ గావలియై యున్నపంచశీర్షపన్నగంబు వానిం బురంబులోనికిఁ జొరనీక వారించుచు నావింశత్యధికసప్తశతగంధర్వీగంధర్వులతోడఁ బోరాడుచుండఁ దుద నాకావలివానిబలము దఱుఁగుటయు నారాజు రాష్ట్రపురబాంధవసమన్వితంబుగ నార్తుండై చింతిల్లుచుఁ బాంచాలంబులఁ దనపరివారంబు దెచ్చి యిచ్చినబలిఁ గొనుచు మధుభోజనుండై స్త్రీజితుండై భయ మరయఁ డయ్యె. వరుని వెదకుచు ముల్లోకములం ద్రిమ్మరి యందఱుం గాదని నిషేధించినకతన దుర్భగ యనిపేరు గాంచియుఁ దాను దొల్లి పూరునకు మెచ్చి వరమిచ్చిన కాలకన్యక యతనియొద్ద కొక్కనాఁడు చనుదెంచె. ఏ నొక్కయవసరమున బ్రహ్మలోకమునుండి పుడమికిఁ జనుదెంచియుండ నక్కన్నియ నన్ను వరించి యేను నిషేధించినదాని కలిగి తనకోర్కి నెఱవేర్పనిదానికిఁ బ్రతిగా నాకొక్కచో నిలుకడ గలుగక నిత్యసంచారంబుగా శాప మిచ్చి నాయుపదేశమున యవనేశ్వరుం డైన భయనామునొద్ద కరిగి యయ్యా, యవనేశ్వరుం డైననిన్నుఁ బతిఁగా వరించెద. భూతములకు భవద్విషయసంకల్ప మొక్కనాఁడుం జెడదు. లోకవేదప్రాప్తం బైనవిషయము నియ్యమియుఁ గొనమియు నను రెంటిపై నాదరంబు సేయునసదవగ్రహు లైనబాలురు శోచనీయులు గావునఁ దనంతన వరింప వచ్చిన నన్ను నిరాకరింపక కరుణించి గ్రహింపుము. దీనులఁ గరుణించుటకుఁ గడచినపురుషధర్మము గానరా దని దేవగోప్యముఁ జేయఁ బూనిన యాకన్యకపలుకు విని చిఱునవ్వు గదుర నయ్యవనపతి యయ్యతివ కిట్లనియె. నీ వెవ్వనిం గోరిన నందఱును

నిన్ను మెచ్చక నిషేధింతురు. కావున మదీయజ్ఞానదృష్టిఁ దగినపతిని నీ కేర్పఱిచితి. అవ్యక్తగతి వై లోకమెల్లఁ దిరుగుచుఁ గర్మనిర్మితం బైనలోకము నాక్రమించి భోగింపుము. దాన లోకమెల్లఁ నీకుఁ బతియు గతియు నయ్యెడు. నాసేననెల్ల నీకుఁ దోడుగఁ బంపెద. తత్సహాయమునఁ బ్రజానాశంబు సేయుదువు. ఇతండే ప్రజ్వారుఁ డనునాభ్రాత గలఁడు. నీవు నాకుఁ జెలియలవు. మీ రిద్దఱు దోడ్పడ భీమసైనికుఁ డనై యేను లోకమెల్లఁ దిరుగుదు నని దాని నొడంబఱిచి భయనాముఁ డైనయయ్యవనపతి తనసైన్యంబును బ్రజ్వారకాలకన్యలును దనకుఁ దోడై నడువఁ బుడమి నెల్లెడలం ద్రిమ్మరుచుండు.

అంత నొక్కనాఁడు భౌమభోగాఢ్యంబై వృద్ధపన్నగపాలితం బైనపురంజనపురం బాక్రమింప వా రెంచుటయుఁ దొలుతఁ గాలకన్యయఱిమి పారమెల్లఁ జీల్చిన నయ్యవను లందఱును గ్రమక్రమంబున నానాద్వారంబుల నాపురంబులోనికిం జొచ్చి పీడించుటయుఁ దదభిమాని యగుపురంజనుండు కుటుంబమమతాకులుండై పలుదెఱంగు లగుతాపములఁ గుందుచు నాకాలకన్య యలమినదాన శ్రీసెడి కృపణుండై విషయాత్మకుండై నష్టప్రజ్ఞుఁడై గంధర్వులును యవనులు నాక్రమించిన కతన నైశ్వర్యంబుఁ బాసి నిజపురంబు విశీర్ణం బగుటయుఁ బుత్రులు పౌత్రులు పరిచరు లమాత్యులును దనయెడఁ దొల్లింటియాదృతి దప్పుటయుఁ దనభార్య దనపైఁ బూర్వస్నేహ మెడలుటయుఁ దనకుఁ గాలకన్యకవలన నెడరు దొడరుటయుఁ బాంచాలంబు లరిదూషితంబు లగుటయుం గాంచి తుది లేనివగ నెనసియు దానికిఁ బ్రతీకారంబు సేయ నేరక కాలకన్యాభిభవకారణమున నిస్సారము లైనకామముల నభిలషించుచు దీనుండై విగతాత్మగతియై స్నేహమునఁ బుత్రదారోపలాలనం బొనర్చుచు నిచ్ఛ లేకున్నను గంధర్వయవనాక్రాంతం బైన తనపురము విడువఁదొడరె. ఆయ్యెడ భయనామునియగ్రజభ్రాత యగు ప్రజ్వారుం డేతెంచి భ్రాతృప్రియంకరుండై యతనిపురమెల్లం గాల్చె. దాన నాకుటుంబాసక్తుండు దాను దనకుటుంబినియుఁ బరివారంబును బుత్రపౌత్రాదుల నందు మీఁదుమిక్కిలి తపించుటంజేసి యత్యంత సంకటంబు గాత్రకంపంబును గలుగ యవనోపరుద్ధంబు కాలకన్యాక్ర

స్తంబు నైనయప్పురంబున నిలువ నోపక తరుకోటరములనుండి [illegible] వెట్టు లట్టు లాపురము వెలుపడ నెంచి గంధర్వులవలన నాత్మపురప్రదేశముం గోల్పడియు బలియు రగుయవనులముట్టడంబు నడచియు నంగశైథిల్యంబుం గాంచి యేడ్చుచుం బుత్త్రపౌత్త్రులు దుహితృజామాతలు భగినీప్రభృతిబాంధవులు పరిచారకులు గృహమునందలి భుక్తావశిష్టంబైనధనము పరివారము మున్నగువానియెడ నభిమానంబు వెట్టి కుమతియై ప్రమదావియోగంబునకు దురపిల్లుచు, నక్కటకటా! నేను లోకాంతరమున కేగిన నీకుటుంబిని యనాథయై యొంటియై శోకాక్రాంతు లగునీబాలుర నెట్లు ప్రోచెదు? నేను భుజియింపకుండినం దాను గుడువ, దేను స్నానము సేయకుండినం దానును స్నానము సేయ, దే నలిగిన వెఱచు, నదలించిన భీతిలి యెదు రాడదు, వివేకంబు దప్పి యే నెయ్యదియేనియుం జేయం బూనినం దఱితో నన్ను బోధించి తేర్చు, నిట్టిప్రియురాలు న న్నెడంబాసి గృహస్థధర్మం బెట్లునడప నేర్చు? వీరజననిగావున సహమరణం బొనర్చుంగాని నన్నుం బాసి నిముసమేని యుండ నోప, దేనుజన్న నాప్రాపు గన్నయీపిన్నవారు భిన్ననౌగణంబు లంబునిధి నెట్టు లట్టు లొక్క నియతగతిం గానక యేమయ్యెదరో యని దీనత్వంబునం దనలోం జింతిల్లునాపురంజనునిం బరాభవానర్హుం డైన వానిం బట్టుకొన భయనామ్ముం డఱుముటయు యవను లతనిం బశువు నెట్లు లట్టులు కట్టి యీడ్చికొనిపోవ నాతురులై తత్పరిచరులెల్ల నతని తోడం జనిరి. పంచశీర్షపన్నగంబు విడిచి చనినంతన యప్పురము విశీర్ణంబై ప్రకృతిభూతాత్మతం గాంచె.

అవ్విధమునం బురంజనుండు యవనాకృష్టుండై మోహముం జెంది తన పూర్వసుహృదుం డైనయవిజ్ఞాతనామునిం దలంపకుండె. అతం డట్టి యప్పురముం దొఱంగి లోకాంతరంబునకుం జనుటయు నక్కడ నయుమాలి యతండు చంపినయజ్ఞపశువులు దను కతని కాపించిన[illegible] దోషములం దలపోసి క్రోధోద్రేకంబునం గుఠారములం బొడిచె. అనంతపారం బైనతమంబున మగ్నుండై యతండు స్మృతి చెడి పెక్కేడు లార్తిం బడి ప్రమదాసంగదూషితుండై యవసానంబున గామినిం దలంచిన కారణంబున స్త్రీజన్మ మెత్త వలయుటం జేసి విదర్భరాజునకుం గూతురై

జనించె. పరపురంజయుం డైనపాండ్యమలయధ్వజుండుపోర రాజులం గెలిచి దానిం బెండ్లియై యసితేక్షణ యగునొక్కయాత్మజను దాని కను జాతులుగా ద్రవిడభూభరణప్రవీణు లైనయేడ్వురకొడుకులనుం గనిన నాకుమారులకుఁ బ్రత్యేకం బర్బుదసంఖ్యాకు లైనవంశకరు లుదయించి మహీమండలంబెల్ల నాక్రమించి మన్వంతరాతిశయిత కాలంబు వర్తించిరి. అందఱకుం బెద్దయై ధృతవ్రతయై యొప్పునాకూఁతు నగస్త్యుండు పెండ్లియై దృఢచ్యుతుం డనుకొడుకుం బడసిన నాతని కిధ్మవాహుండుపుట్టె. మలయధ్వజుండు భూరాజ్యముఁ గొడుకులకుఁ బంచి పెట్టి కృష్ణునారాధించువాఁడై కులాచలంబునకుఁ జనుటయు వైదర్భియు గృహములను దనయులను భోగములను ద్యజించి కౌముది కుముదనాథుంబోలెఁ బతి ననుసరించి చనియె. మలయధ్వజుం డచ్చటఁ జంద్రవస తామ్రపర్ణి నవోదక మున్నగునదులం దీర్థమాడి బాహ్యాభ్యంతరమలములఁ గడిగి కందమూలఫలపర్ణతృణోదకంబుల దేహయాత్ర నిర్వర్తించుచు శరీర కర్శనం బైనతపస్సునకుఁ బూని శీతోష్ణములు వర్షవాతములు క్షుత్పిపాసలు ప్రియాప్రియములు సుఖదుఃఖములు మున్నగుద్వంద్వములం గెలిచి సమదర్శనుండై జితేంద్రియమనఃప్రాణుండై తపోవిద్యానియమములం గామాదివాసనల నిర్మూలించి బ్రహ్మతాదాత్మ్యంబు భావించి దివ్యవర్ష శతం బొక్కచో నొక్కమ్రోఁడుకైవడి నిలిచి భగవంతుఁ డగువాసుదేవునిపై నాత్మరతిం జేయుచు నొండేమియు నెఱుంగక యాత్ముని దేహాది వ్యతిరిక్తుఁగను దేహాదిప్రకాశకుఁగను స్వప్నదృష్టాంతమున నామర్శ సాక్షిఁగను దలంచి భగవత్స్వరూపుఁడై గురు వనుగ్రహించిన విశ్వతో ముఖవిభాసి యగువిశుద్ధజ్ఞానదీపమునఁ దన్నుఁ బరబ్రహ్మంబునందును దనలోఁ బరబ్రహ్మంబునుం గాంచుచున్నంత నాజ్ఞానంబును దుదిఁ దనంతన యుపశాంతం బయ్యె. పరమధర్మవేదిని యగువైదర్భి పతిదేవతయై భోగముల నుజ్జగించి నారలు గట్టి జడలు దాల్చి వ్రతనియమమునం గృశించియు శాంతాగ్నిశిఖ శాంత మైనయగ్ని నెట్టు లట్టు లెడఁ బాయక తపోవనమునం బతికిఁ బరమప్రీతిమై నుపచారము లొనర్చుచు సమాధినిష్ఠుండై యతండు బ్రహ్మనిర్వాణంబుఁ గాంచుటరయక యప్పటి యట్టు లుండు నని తలంచి కొండొకవడి కతనిపాదములం దోఁచిన శైత్య

ముపలక్షించి గుంపు దప్పినలేడికైవడి గుండియ లవియ నశ్రుధారాప్రవాహంబు గుచతటంబుపయిం జాలువాఱ నావిజనవిపినంబున నతియడుగులపయిం బలుమఱు పడుచు లేచుచు నగకెల్లిన నో రాజర్షివర్యా, లేలెమ్ము. దస్యువు లైనక్షత్రియాధముల దుష్టచేష్టితంబుల భయాక్రాంతం బైనభూమండలం బేలు మని చేరెలుంగెత్తి యేడ్చి కొండొకవడికి దానం జేయునది లేమింజేసి తాన యుచితమిల్లి కాష్ఠముల సంగ్రహించి సొద పేర్చి పతికళేబరం బందుం జెట్టి యగ్నిపెట్టి పతిసహగమనంబు సేయ నుంకించుచున్నంతం బూర్వజన్మమునం బురంజనరూపంబుతో నున్నపు డతనికిం గూర్మి సేయుచుండిన యవిజ్ఞాతుండు నాంబరంగు బ్రాహ్మణసఖుండు యాదృచ్ఛికముగ నచ్చటికిం జనుదెంచి విలపించుచున్న యావైదర్భినూరార్పంగ మృదుభాషితంబుల నిట్లనియె. కల్యాణీ, నీ వెవ్వతె, వెవ్వరిదానవు, నీశోకమునకు నిమిత్తం బైనయీతం డెవ్వండు, న న్నెఱుంగుదువే? మన మిరువురము నొల్లి సహాసుఖస్థితిం బడసియుంటిమి. ఏ నవిజ్ఞాతనాముండ నైననీసఖుండను. భౌమభోగములపై నాస దవిలి నీవు నన్ను విడిచి యరిగితివి. తొలుత మన మిరువురము మానసావాసహంసరూపమున వేయేండ్లు విహరించిన వారము. బాంధవా, యట్టిపురగ్రామ్యసుఖములయెడ మతి జేసి నన్నుం బాసి భూమిలోం దిరుగుచుం బంచారామంబు నవద్వారం బేకపాలకంబు త్రికోష్ఠకంబు షట్కులంబు పంచవిపణంబు పంచప్రకృతికంబు స్త్రీధవంబునై యొప్పునొక్కనారి నిర్మించిననెలవు గాంచితివి. దానిం విశదించెద వినుము. శబ్దాదివిషయంబు లైదు పంచారామంబు లనియు నక్షినాసాదిరంధ్రములు తొమ్మిది నవద్వారంబు లనియుం బ్రాణ మొక్కండె యేకపాలకుం డనియుం బృథివ్యప్తేజస్సులు మూండు త్రికోష్ఠంబు లనియు జ్ఞానేంద్రియంబు మనస్సు ననునాఱు షడ్వణిక్కులంబు లనియుం గర్మేంద్రియంబు లైదు పంచవిపణంబు లనియుం బంచభూతములు పంచప్రకృతు లనియు శక్తి యొక్కటి యేనుసేలిక యనియు వీనితోడంగూడి తన్నుం జేరినపురుషునకు బోధము దఱుంగం జేయుదేహాఖ్యము నెల వనియుం గల్పింపంబడియె. అందు నీ వారామముకుం జిక్కి దానితోడం గ్రీడించుచు స్మృతి యుడలి తత్సంగమునం జేసి యిట్టిపాపదశం బొందితివి. వస్తుగతిం

బరికించిన నీవు విదర్భపుత్త్రివి గావు. ఇతండును నీకుఁ బతి గాఁడు. నవ ద్వారం బైనపురమునఁ బురంజను నాక్రమించిన మదీయమాయాయోగ మున నీవు నిన్నుఁ బురుషుఁ డైనం గామినిఁగాఁ దలంతువు. ఈ రెండును వాస్తవంబులు గావు. మన మిరువురము పరమపరిశుద్ధులము. మన స్వరూపంబుఁ గనుంగొనుము. పండితులు మనలోఁ గొంచెమేనియు నంత రముం గాంచరు. దేహ మొక్కటియై యున్న నాదర్శబింబిత మొక్క టియు బింబరూప మొక్కఁడుగాఁ దోఁచురీతిని విద్యావిద్యోపాధి భేద మునంజేసి మనలోఁ భేదమవాస్తవమయ్యుఁ బ్రతీతిగోచరం బనియెఱుంగ వలయు. అవ్విధమునఁ బరమాత్ముఁడు బోధించుటంజేసి యవిద్యోపా ధికుం డైనజీవుఁ డాపరమాత్మవియోగమునఁ దాను మున్ను మఱచిన స్మృతిం గ్రమ్మఱఁ బడసె. రాజేంద్రా, విశ్వభావనుం డైనభగవంతుఁడు పరోక్షప్రియుఁడు గావున నీయధ్యాత్మతత్త్వమును బరోక్షముగ రాజ కథావ్యాజమున నీకు బోధించితి నని నారదుండు సెప్పిన విని ప్రాచీన బర్హి, మునీంద్రా, భవద్వచనంబు సంకేతార్థగూఢంబై యునికింజేసి కవులకు విజ్ఞేయంబై యుండుఁగాని మాబోంట్లకు సుబోధంబు గాదు. కరుణించి తదర్థంబు వివరింపవే యని యడుగుటయు నాబ్రహ్మనందన మునీంద్రుఁ డామనుజేంద్రున కిట్లనియె.

## నారదుఁడు పురంజనోపాఖ్యానసంకేతములు వివరించుట

నృపాలా, యేకద్విత్రిచతుష్పాదములఁ దగి నానావిధంబు లగు దేహములకుఁ జైతన్యముఁగూర్చుపురుషుఁడు పురంజనుఁడు అవిజ్ఞాతుఁ డని యుదాహరింపఁబడినయతఁడు. నామక్రియాగుణముల నవిజ్ఞాతుఁడై జీవునకు సఖుఁడైన యీశ్వరుఁడు. అతండు ప్రకృతిగుణములనెల్లఁ గొనఁ దలంచినపుడు నవద్వారము ద్విపాదము ద్విహస్తము నగుమనుష్యదేహ మనుపురము మెచ్చు. ఏను నాయది యనునభిమానముం బుట్టించుబుద్ధి యాప్రమద. దాని నాశ్రయించి పురుషుం డింద్రియములం గుణముల ననుభవించు జ్ఞానకర్మేంద్రియగుణంబులు తన్మిత్త్రంబులు. వానివృత్తి గణంబు సఖిప్రకరంబు. పంచవృత్తి యగుప్రాణము పంచశీర్షపన్నగంబు. ద్వివిధేంద్రియప్రేరకం బైనమనస్సు బృహద్బలుఁడు. నవద్వారపురము యన్నర్థమున నుండు నాపాంచాలములు శబ్దాదిపంచవిషయంబులు.

ద్వారములు తొమ్మిదింటిలో నేత్రములు రెండు నాసికంబులు రెండు
నో రొక్కండు నన నైదు పూర్వద్వారపంచకంబు దక్షిణకర్ణంబు
దక్షిణద్వారంబు. ఉత్తరకర్ణ ముత్తరద్వారంబు గుదశిశ్నంబులు రెండు
పశ్చిమద్వారద్వయంబు. నేత్రములు రెండు ఖద్యోతయు నావిర్ముఖియునన
నొక్కచో నిర్మించిన రెండుద్వారంబులు. రూపము విభ్రాజితంబు. దర్శన
సాధనం బైనచక్షుస్సు ద్యుమంతుండు. నాసికంబులు రెండు నళినియు
నాళినియు ననుద్వారద్వితయంబు. గంధము సౌరభవిషయంబు. ఘ్రాణ
మవధూతుండు. ఆస్యము ముఖ్య యనుద్వారము వాగింద్రియంబు
విపణంబు. రసనేంద్రియము రసజ్ఞుండు. వాగ్వ్యవహారం బాపణంబు.
చిత్ర మగునన్నము బహూదనంబు. దక్షిణకర్ణంబు పితృహూవు. ఉత్తర
కర్ణంబు దేవహూవు. కాలోపలక్షక మైనసంవత్సరము చండవేగుండు.
అహస్సులు మున్నూటయఱువండ్రు గంధర్వులు. రాత్రులు తావత్సం
ఖ్యాకగంధర్వస్త్రీలు. జర లోకము మెచ్చనికాలకన్యక. ఆజరయే మృత్యు
వునకుం జెలియలు. మృత్యువు భయనాముం డగుయవనేశ్వరుండు. ఆధి
వ్యాధులు మృత్యుసైనికులు. భూతములం బీడింప నురువడించు ద్వివిధ
జ్వరము ప్రజ్వారుండు. ప్రవృత్తినివృత్తిలక్షణం బైనశాస్త్రము పాంచా
లంబు. పితృయానదేవయానప్రాప్తిసాధనం బైనశ్రోత్రము శ్రుత
ధరుండు. మేఢ్ర మాసురం బనుపశ్చిమద్వారంబు. వ్యవాయము గ్రామ
కంబు. ఉపస్థము దుర్మదుండు. గుదము నిరృతి. నరకము వైశసంబు.
పాయువు లుబ్ధకుండు. హస్తపాదములు క్రియాగతు లానరప్పనంధులు.
హృదయ మంతఃపురము. మనస్సు విషూచీనము. అందే తద్గుణంబులం
దవిలి గుణలిప్తుండై పురుషుండు సాక్షిస్వరూపుం డయ్యు గుణములవలనం
గలుగుక్రియావిక్రియ లాత్మకృతము లనితలంచి క్రమమునం దమ
స్సత్త్వరజోధర్మము లైనమోహప్రసాదహర్షములం గను. దేహము
రథము. ఇంద్రియము లశ్వములు. సంవత్సరయంబు గతి. పుణ్యపాప
కర్మంబులు రెండు చక్రంబులు. త్రిగుణములు టెక్కెయంబులు పంచ
ప్రాణములు బంధనంబులు. మనస్సు పగ్గము. బుద్ధి సారథి. హృద
యము రథికస్థానంబు. ద్వంద్వములు రెండునొగలు. ఇంద్రియార్థములైదు
ప్రహారణంబులు. సప్తధాతువులు చర్మావరణంబులు. మృగతృష్ణలకుం

బఱచుపంచసూనావినోదకరం బైనబాహ్యవిక్రమం బేకాదశచమూసాధ
నోపలక్షితం బైనయాసురవృత్తి. ఆత్మేతరంబు లైనదేహేంద్రియమనో
ధర్మముల నిర్గుణాత్మస్వరూపంబునం దారోపించి పురుషుం డహంమమాభి
మానములం జెంది యజ్ఞానావృతుండై దేహేంద్రియభూతసంభవంబు
లైననానాదుఃఖములం గుడుచుచు దేహమునం గ్లేశములం బ్రాపించు.
తాను బ్రకృతికిం బరుం డైనపరమాత్ముం డనియు గురుం డనియుం దెలియక
స్వప్రకాశుం డయ్యుం బ్రకృతిగుణములం దగులువడు నేని యప్పు డతండు
గుణాభిమానియై సత్త్వరజస్తమోమయము లైనకర్మముల నవశుండై
చేసి సాత్త్వికకర్మమునం బ్రకాశభూయిష్ఠములగు లోకములను రాజసకర్మ
మున శోకోత్కటము లగులోకములను దామసకర్మమున దుఃఖోత్త
రము లగులోకములనుం బొందెడు. ఒకప్పుడు పురుషుండై యొకప్పుడు
స్త్రీయై యొకప్పుడు నపుంసకుండై దేవమనుష్యతిర్యగ్రూపములం దత్త
త్కర్మానుగుణముగ జనించెడు. ఆఁకట నలమట పడుశునక మిల్లిల్లుదిరిగి
యక్కడక్కడఁ బ్రాప్తం బైనకూడును దన్నును దిన్నట్టులు కామా
శయుం డైనజీవుం డుచ్చనీచమార్గముల మీఁదను గ్రిందనుం దిరుగుచు
దైవోపలబ్ధంబులైన ప్రియాప్రియములం గుడుచు. దైవభూతాత్మ
హేతువులలో నొక్కటేనియు జీవునకు దుఃఖవిచ్ఛేదంబు సేయఁజాలదు.
చాలునని తలంచుట యెల్లఁ దాత్కాలికతత్ప్రతీకారమాత్రంబ కాని
యాత్యంతికనివృత్తి గాదు తలమీఁదిబరువు భుజముమీఁదికి దించు
కొన్నట్టులే ప్రతీకారంబు లయ్యెడు. కర్మంబులకుం గేవలకర్మం బాత్యం
తికప్రతీకారంబు గానేరదు. స్వప్నమున స్వప్నాంతరం బెట్టులట్టు లా
కర్మంబులు రెండు నవిద్యాప్రాప్తంబులు. అర్థ మేదియు లేకుండిన నుపాధి
భూత మగుమనస్సు స్వప్నమునం జరించువాని కెట్టు లట్టులు జాగరంబు
నందును సంసారము తనంతన నివర్తింపదు. పరమార్థస్వరూపుం డైన
యాత్మున కనర్థపరంపరయే సంసారము. హరిభక్తి దానికి విచ్ఛేదంబుఁ
గావించు వాసుదేవునిమీఁద భక్తి సమాహితం బయ్యె నేని యయ్యది
సమీచీనప్రకారంబున విరక్తిని జ్ఞానమునుం గలిగించు. అచ్యుతకథా
శ్రయం బైనయాభక్తియోగము భగవద్గుణకథ సంశ్రవణాసక్తచిత్తులై
నిర్మలు లైనభాగవతసజ్జనులు సేరినచోట నిత్యంబు శ్రవణకీర్తనాద్య

యనంబు లొనర్చుచుండిన నొదవెడు. సాధుసమాజమున వాసుకీర్తించు
హరికథామృతనదీప్రవాహములఁ దనివి తీఱక వీనులం గ్రోలువారికి
క్షుత్పిపాసాభయశోకమోహములు గలుగవు. స్వభావజనితంబు లైన
వీనికిఁ జిక్కి జీవలోకము హరికథామృతసాగరముమీఁద రతి సేయ
కుండు. బ్రహ్మ మహేశ్వరుఁడు మనువు దక్షాదిప్రజాపతులు నైష్ఠికు
లగుసనకాదులు మరీచి యత్రి యంగిరసుఁడు పులస్త్యుఁడు పులహుఁడు
క్రతువు భృగువు వసిష్ఠుఁ డేను నను బ్రహ్మవాదులకును వాచస్పతులై
యున్నను దపోవిద్యాసమాధినిష్ఠఁ బూనియు లోకమెల్ల సాక్షులై
చూచుచుండు నప్పరమాత్ముం జూడ నేరక మహావిస్తరంబు దుష్పారంబు
నగుశబ్దమయబ్రహ్మంబున వర్తించుటం జేసి మంత్రలింగములఁ బరిచ్ఛిన్నుం
గాంచఁ గలిగెఁ గాని యపరిచ్ఛిన్ను నవలోకింపఁజాలకుండె. భగవదను
గ్రహభాజనం బైనపరముఁ డాత్మభావనమునం జేసి లోకవ్యవహారంబు
నందును వైదికమార్గంబునందును మతిం ద్యజించి యాత్మదర్శనంబుఁ
గాంచు. కావున నో ప్రాచీనబర్హీ, చెవి కింపై పరమార్థరూపమునఁ గన్ప
ట్టుచు నవాస్తవంబు లైనకర్మమునెడ బరమార్థదృష్టి సేయఁ దగదు.
మలినబుద్ధులు వేదపరమార్థం బెఱుంగక కర్మంబె వేదార్థం బని పలు
కుచు జనార్దనావాసం బైనయాత్మలోకం బెఱుంగరు. ప్రాచీనాగ్రము
లైనదర్భల భూమండలం బెల్లఁ బఱచి మానివై బృహద్వధమున స్తబ్ధుం
డవై పరమకర్మం బెఱుంగవైతివి. ఎయ్యది హరిపరితోషంబుఁ గూర్చు
నయ్యది కర్మంబు. హరిపై నెయ్యది మతి నెలకొల్పు నయ్యది విద్య.
హరియే దేహధారుల కాత్ముఁడు స్వతంత్రకారణంబు. తదీయపాద
మూలంబు క్షేమముఁ గోరువారికి శరణం బతండే పరమప్రియుం డతండే
భయనివారకుం డని యెఱింగినవాఁడు విద్వాంసుఁడు. పెక్కు లేల
యతండే హరిస్వరూపుఁడు. నీప్రశ్నకు సాకల్యముగ సదుత్తరంబుఁ జెప్పి
తీర్చితి నిందు రహస్యంబు సెప్పెద నాకర్ణింపుము. పుష్పవనంబున
నతివలతో జంటయై క్షుద్రముగఁ దిరుగుచు భ్రమరగీతములకుఁ బ్రీతియై
చెవియిచ్చుచు నింద్రియార్థతృప్తిప్రవణంబులై ముందఱవోవుచుండు
వృకముల గణింపక నడచుచు వెఱెందిదెసఁ దఱిమికొని వచ్చుబోయ
వాఁడితూఁపునఁ దెగినమృగముం జూడుము. దీనియభిప్రాయం బెట్లంటేని

పువ్వులరీతి నింపైనయింతులయిండ్ల దేనియవోలె క్షుద్రతమం బైన కామ్యకర్మవిపాకరూపకామసుఖలవము వెదకుచు మిథునత్వమున రాగిల్లి యుల్లము దానిపై నిలిపి తేఁటిపాటలకు సాటి యగుబోటుల చాటువచనంబుల వినుచు వృకగణములకరణి ముందుముందు చనునహోరాత్రాదికాలవిశేషముల గణింపక గృహములం గ్రీడించుచుఁ బిఱుంద నాత్తశరుండై యముఁడు తఱుముటం గాంచక తుదిఁ దదీయబాణప్రహారమునఁ దెగుసంసారిం జూడు మని పరోక్షకథావ్యాజమున బోధించితి. కావున నీమృగచేష్టితంబు నంతర్హృదయంబున విచారించి చిత్తము జయించి చెవులకుఁ బ్రవాహప్రాయం బైనకర్మము నిగ్రహించి కాముకవృత్తాంతగాఢం బైనగృహాశ్రమంబు విడిచి హంసశరణం బైనయీశ్వరునిప్రీతి నార్జించి యన్నింట విరామ మొందు మని నారదుండు బోధించిన విని ప్రాచీనబర్హి యో బ్రహ్మర్షివర్యా, భవద్వచనంబు విని యాత్మతత్త్వంబు విచారించితి. నాకుఁ గర్మము బోధించినయుపాధ్యాయులు దీనిం దెలియరు కాఁబోలు. తెలిసినఁ జెప్పకుందురే? తత్కృతం బైన యాత్మతత్త్వము మీఁదియసంభావనారూప మగుసంశయము దీఱె. ఇంద్రియవృత్తుల కగోచరం బైనయియ్యర్థమునఁ బరమర్షులును మోహముఁ గాంతురు. కర్మముల నాచరించువాఁడు తదాచరణసాధనం బైన దేహము నిక్కడఁ ద్యజించి యక్కడ దేహాంతరంబునఁ దత్ఫలముఁ గుడుచు నని వేదవాదులు వల్కుదురు. ఇందుఁ గర్తృభోక్తృదేహభేదమునం జేసి యెట్లు పొసఁగు ననియుఁ జేసినకర్మ ముత్తరక్షణమున నదృశ్యంబయ్యుఁ గాలాంతరమున నెట్లు ఫల మిచ్చు ననియు రెండు సంశయంబులు నా కుండెడు. వానిం దీర్చు మని యడుగుటయు నమ్ముని వల్లభుఁ డాజనవల్లభున కిట్లనియె.

### నారదుఁడు ప్రాచీనబర్హికిఁ గర్మవిషయసంశయము దీర్చుట

నరేశ్వరా, పురుషుఁడు మనఃప్రధాన మైనలింగశరీరముతోడం గలిసి కర్మములఁ జేయుఁ గావునఁ గర్మారంభక మగునాలింగశరీరముననే యాత్మ తత్కర్మఫలములం గుడుచు. స్వప్నమందు జాగరదేహము జీవించియున్నను దాని విడిచి తత్కాలకల్పితం బైనజాగరావస్థాన శరీరసదృశ దేహాంతరముం బ్రవేశించి జాగరదేహాభిమానము విడిచి

మనస్సున సంస్కారాహితం బైనకర్మఫలముం గుడుచుచుపేక్షముచు గర్భోపస్థాపితం బైనదేహాంతరంబెత్తి తత్కర్మఫలములఁ బురుషుండనుగుడుచు. కర్మారంభకమగుమనఃప్రధానలింగశరీర మెల్లపుడొక్కటియేకావునఁ గర్తృభోక్తృశరీరభేద మని తలంపం బని లేదు. స్థూలశరీరభేదం బకించిత్కరంబు. వీరు నావార లే నిట్టివాఁడ నని యహంమమాభిమానముతో నేదేహమునఁ బురుషుఁడు కర్మమాచరించు నట్టియహంకారగృహీత మగుకర్మంబె దేహాంతరోత్పత్తికారణంబుగావునఁ గర్తృత్వభోక్తృత్వధర్మములు రెండు నభిమానసన్నిధాపితము లవుటంజేసి యభిమానకారణం బైనమనస్సు ప్రధానముగా నమరులింగదేహమున కన్నింటిలో నేకరూపమున సమన్వయముగలిగినకతనం గర్తృత్వంబునందును భోక్తృత్వంబునందును దేహభేదము చూపట్టదు. తత్తత్ప్రారబ్ధకర్మభుక్తావసానములై యల్పకాలభోగ్యము లగుతత్తత్స్థూలదేహములం గర్మసాకల్యఫల మనుభవించుట యశక్యంబు గావునఁ బ్రధానలింగశరీరైక్యంబె కర్తృత్వభోక్తృత్వములయెడ నైక్యాపాదకంబని యెఱుంగుము. ఇంద్రియవ్యాపారజ్ఞానకర్మరూపము లగుచిత్తవృత్తుల నొక్కప్పుడు చిత్తమున కనుమితి యొదవువిధమునఁ జిత్తవృత్తులను బూర్వజన్మకర్మ మనుమితం బయ్యెడు. ఈదేహమున నొకప్పుడేనియుఁ జూచియు వినియు నెఱుంగని విషయముల స్వప్నమనోరథాదులం బురుషుఁడేరూపమున నేప్రకారమునం దనమదిఁ గనుంగొను నయ్యర్థం బరసి యతండు దాను దేహాంతరమునఁ బూర్వ మెప్పుడే నొకప్పుడు తద్రూపము తత్ప్రకారము లగునర్థము ననుభవించియుండెడు ననియుఁ దదారంభక మగుకర్మంబును దాన నుండెడు ననియుఁ గర్మం బనుమేయం బగు. అననుభూతవిషయమును మనస్సు గ్రహింప నేరదు. కావున నతీంద్రియార్థంబులయెడఁ బూర్వకర్మానుమానం బపరిహార్యం బయ్యెడు. ఉచ్చనీచజన్మంబులఁ బొందువానికి భావిరూపముల మనస్సె తెలుపుచుండెడు. మనోధర్మము లగునౌదార్యకార్పణ్యాదిగుణములం బూర్వవృత్తి యనుమింపఁబడియెడు. స్వప్నావసరంబులందు మనస్సునం గేవలాసంభావితంబు లగుపర్వతాగ్రమునందు సముద్రదర్శనము పగలునక్షత్రప్రకాశమాత్మశిరశ్ఛేదమున్నగుకొన్ని యత్యంతా

దృష్టశ్రుతములు దోఁచుంగాని దేశకాలక్రియాశ్రయంబు లగునవియెల్ల నిద్రాదిదోషమునం బ్రతీతిగోచరంబు లగు నని యనుమించుటొప్పదు. ఇంద్రియగోచరంబులన్నియుఁ గ్రమానురోధమున మనస్సున వచ్చుచుఁ బోవుచుండుఁ గావున దరిద్రుఁ డొకప్పుడు దన్ను మహారాజుఁగాఁ దలఁచుటయు సంపన్నుఁ డొకప్పుడు దన్ను దరిద్రుఁగాఁ దలంచుటయుఁ బొసఁగఁ జనుఁ గావున మనోధర్మప్రవృత్తిం జేసి యసంభవంబు దేనికిం గలుగదు. జను లందఱు సమనస్కులు గావున మనోధర్మము లందఱకు నవినాభూతంబు లై యుండు. సత్త్వైకనిష్ఠంబై భగవద్ధ్యానపరం బైన మనస్సునందుఁ జంద్రమండలమున రాహూపరాగం బెట్టు లట్టు లీజగంబెల్ల నేకకాలసంయోగము నొందినతెఱంగునఁ జూపట్టుఁగాని శుద్ధమనస్సున సర్వవిషయస్ఫురణం బనునయ్యర్థము యోగిప్రత్యక్షంబు. మనోబుద్ధింద్రియార్థగుణప్రవాహపరిణామం బైనలింగశరీర మనాదియై యెందాఁక నుండునందాఁక నహంమమాభిమానకార్యం బైనస్థూల దేహసంబంధము పురుషు నెడఁబాయదు. సుషుప్తిమూర్ఛాసంతాపమృత్యుప్రజ్వారసమయంబుల నింద్రియవిఘాతమునం జేసి యహంకార ముండినం బ్రకాశింపదు. మఱియు గర్భావస్థయందును బాల్యమందు నింద్రియపుష్కలత్వంబులేనికతన నమావాస్యనాఁడు చంద్రరూపం బెట్టులట్టులు యౌవనదశం దోఁచునహంకార మభివ్యక్తిఁ బొరయదు. అర్థము లేకుండినను విషయములఁ జింతించువానికి స్వప్నమున ననర్థదర్శనంబుమాడ్కి సంసారానువృత్తి యుడుగదు. ఇవ్విధమున లింగదేహము పంచతన్మాత్రాత్మకంబు త్రిగుణాత్మకంబు షోడశవికారాత్మకంబును, చైతన్యాపాదకుండైన యప్పురుషుఁడు జీవుఁ డనంబడు. పురుషుఁ డీలింగదేహమున నొక్కస్థూలదేహముం ద్యజించి దేహాంతరంబుఁ గొని దీనిమూలముననే హర్షశోకభయసుఖదుఃఖంబుల ననుభవించు. జలగ యుత్తరతృణమును సాకల్యముగఁ బట్టుకొనునంతకుఁ బూర్వతృణముం ద్యజింపనివిధంబునం బురుషుఁడు మ్రియమాణుఁడయ్యుఁ బూర్వదేహారంభకకర్మసమాప్తమున నన్యదేహప్రాప్తి గలుగునంతకుఁ బూర్వదేహాభిమానంబు విడువఁడు.

పూర్వకర్మము లుండినకారణంబుననే పురుషుం డింద్రియములఁ బూర్వోపభుక్తములం జింతించుచుం గర్మము లొనర్పుటం జేసి మనస్సే భూతములకు సంసారకారణం బనియు నవిద్య యుండునంతకుం దేహాదులకుఁ గర్మబంధము గలుగు ననియు నెఱుంగుము. ఇవ్విధమునఁ బూర్వపూర్వకర్మం బుత్తరోత్తరదేహములకుఁ బ్రారంభక మగుటం జేసి యనుమానప్రమాణగోచరం బైనకృతకర్మ మదృశ్య మనియు నెట్లు కాలాంతరమున ఫలమిచ్చు ననియు సంశయింపం బని లేదు. కర్మప్రవాహమున సర్వం బుపపన్న మయ్యెడు. కావున నవిద్యాదినాశంబుం గోరి యీజగంబెల్ల సృష్టిస్థితిలయకారణవాసుదేవాత్మకం బని తలపోసి సర్వవిధముల నాహరిని భజింపు మని యిట్లు జీవేశ్వరతత్త్వంబు నిరూపించి ప్రాచీనబర్హిని వీడుకొని నారదుండు సిద్ధలోకంబునకుం జనియె. అటం బ్రాచీనబర్హియుం బ్రజాసర్గాభిరక్షణంబులం బుత్త్రుల నియమించి తపోమతియై కపిలాశ్రమంబున కరిగి ముక్తసంగుండై యేకాగ్రచిత్తమునం గోవిందచరణాంబుజంబు భజియించి తత్సమత్వంబు వడసె. నారదమునీంద్రుండు బోధించిన చిత్తశోధకం బైనయీయాథార్థ్యాత్మపారోక్ష్య మేకతానచిత్తమున విన్నం గీర్తించినను విదేహకైవల్యంబు గలుగు. ముకుందకీర్తిప్రచారమున లోకములకుం బావనత్వం బొదవించు చిత్తశుద్ధికరం బగునారదోపదిష్ట మైనయీయాథార్థ్యాత్మపారోక్ష్య మధిగమించునతండు సమస్తబంధనములం బాసి సంసారభ్రమణంబునకుం దప్పి పారమేష్ఠ్యంబుం బ్రాపించు. బుద్ధిసహితున కహంకారచ్ఛేదంబు నాముష్మికకర్మఫలభోగవిషయకసంశయచ్ఛేదంబునుం దెలుపునద్భుతం బైనయీయాథార్థ్యాత్మపారోక్ష్యంబు నీకుం దెలిపితి ననిన విని విదురుండు మునీంద్రా, నీచెప్పిన ప్రచేతసులు రుద్రగీతంబున హరి నారాధించి యే సిద్ధిం బొందిరి. యాదృచ్ఛికంబుగ మహాదేవునవలోకించి యాకైవల్యపతిప్రాపు గాంచుటం జేసి మోక్షముం బ్రాపించియుండుదు రనుట నిస్సంశయంబు. అంతకుము న్నిక్కడనొండె నక్కడనొండె వా రేమి ప్రాపించి రయ్యది యెఱింగింపు మని యడుగుటయు మైత్త్రేయుండు విదురున కిట్లనియె.

## ప్రచేతసులు సముద్రమునఁ దపస్సు చేసి హరి నారాధించుట

అవ్విధమునం బ్రచేతసులు తండ్రి పంపునఁ దపము సేయం బూనిన వారు వారిధిమధ్యంబున రుద్రగీతస్తోత్రరూప మగుజపయజ్ఞమునఁ దపమున నిరంజనుఁ డగుహరి నారాధించుచున్నంత దశవర్షసహస్రావసానంబున మేరుశిఖరము పై నుండుజలధరంబుమాడ్కి గరుడస్కంధమారోహించి కనకకుండలకిరీటాదిభూషణగణప్రభల దెసల వెలిఁగించుచుఁ బీనాయతాష్టభుజాంతర్వర్తిరమాస్పర్థి వనమాలాలంకృతుండై ముని గరుడకిన్నరాదిగీయమానుండై మూర్తిమంతంబు లైనయష్టాయుధములు పరివేష్టించి కొలువ నాప్రాచేతసులకు సాక్షాత్కరించి కరుణాపాంగ విలోకనంబున నాదరించుచు మేఘగంభీరభాషణంబున నిట్లనియె. నృప నందనులారా, వరము వేఁడుడు. మీకు మే లయ్యెడు సౌహార్దకారణమున నపృథగ్ధర్ము లైనమీసౌహార్దమునకు మెచ్చితి. రుద్రగీతమునఁ బ్రాతస్సాయంసమయముల నన్నుఁ బ్రస్తుతించువారి కేను గామవరములను శోభను ప్రజ్ఞనుం బ్రసాదింతు. తండ్రియాదేశము ముదమునం గొన్నదానఁ గమనీయంబై మీయశంబు లోకమున వెలసెడు. గుణముల నంభోజసంభవునకుఁ దక్కువగాక యాత్మసంతానంబున ముల్లోకముల నిందించుచుఁ బ్రసిద్ధిఁ గాంచుపుత్త్రుండు మీకుదయించెడు. తొల్లి కండుముని తపము సేయునెడ విఘ్నము నొనరింప నిలింపపతిపంపునఁ బ్రమ్లోచ యనునచ్చరమచ్చెకంటి వచ్చి యమ్మునివలనం జూలు దాల్చి దాని నచ్చటివృక్షమధ్యమున నిక్షేపించి యరుగుటయు నాగర్భంబు కన్యయై యాఁకలి పట్ట నేరక యేడ్చుచున్న నాయేడ్పు విని సోమరాజు సదయుండై యమృతస్రుతిఁ గొలుపుతనతర్జనిం దానినోరిలోఁ గుడుపఁ బెట్టిన నాకన్నియ తదమృతపానంబునఁ బెరిగి యౌవనముఁ జెందియుండెడు. నామతం బనువర్తించుతండ్రిపంపునఁ బ్రజాసర్గమునకుఁ దొడరిన మీర లందఱు నపృథగ్ధర్మశీలురై యపృథగ్ధర్మశీల యగునావార్క్షిం బెండ్లియై సమానానురాగమున నుపచరించునాపతివ్రతతోడఁ గూడి

దివ్యవర్షసహస్రంబు లప్రతిహతబలులై భౌమదివ్యభోగము లనుభవించి తుది నాయనుగ్రహమున నెడతెగనిమద్భక్తియోగమునఁ గామాది మలాహంకారముల నిర్దహించి విరక్తులై మత్పదంబుఁ బ్రాపింతురు. గృహాశ్రమంబున నుండినను గుశలకర్మము లొనర్చుచు మత్కథాప్రస్తావమునఁ గాలముఁ గడపుమీకు గృహములు బంధకారణంబులు గానేరవు. నాకథలు కీర్తించుబ్రహ్మవాదుల కారణంబున సర్వజ్ఞుఁ డగు నేను శ్రోతృచిత్తంబుల నవనవప్రకారమునఁ దోఁచుచుండుదు. మోహశోకహర్షాదుల కగోచరం బైనబ్రహ్మం బేన యని చెప్పుచున్న పురుషార్థప్రదుం డైనజనార్దనునకుఁ గేలుమోడ్పు ఘటించి ప్రచేతసులు భగవదవలోకననిరస్తరజస్తమోమలులై హర్షగద్గదవచనముల నాహరి నిట్లని ప్రస్తుతించిరి.

## ప్రచేతసులు ప్రత్యక్షమైనహరిం బ్రస్తుతించుట

దేవా, క్లేశనివారకుఁడు, సకలశ్రేయస్సాధనం బని నిరూపింపఁబడినయుదారగుణనామముల వెలయువాఁడు, మనోవాగగోచరుఁడు, సర్వేంద్రియమార్గానవగతపథుఁడు, స్వరూపనిష్ఠాపరిశుద్ధుఁడు, పరమశాంతుఁడు, వ్యర్థవిలసితరూపసముపేతుఁడు, సృష్ట్యాదినిమిత్తంబు మాయామయంబు లగు బ్రహ్మాదిమూర్తులఁగొనువాఁడు, శుద్ధసత్త్వస్వరూపుఁడు, సంసారహారిజ్ఞానసముజ్జ్వలుఁడు, హరికృష్ణవాసుదేవపదవాచ్యుఁడు, సర్వసాత్త్వతప్రభుఁడు, కమలనాభుఁడు, కమలమాలి, కమలనేత్రుఁడు, కమలపాదుఁడు, కమలకింజల్కపీతాంబరుఁడు, సర్వభూతనివాసుఁడు, సర్వసాక్షియునగు నీకు నమస్కారంబు. క్లేశములఁ గుడుచుమాకు సర్వక్లేశవారణం బైననీదర్శనం బొసంగితి వింతకంటెఁ గరుణ యెందు గలుగునే? తఱితోఁ దన్నుఁ దలఁపించు టనుటే దీనులయెడఁ బ్రభువులకుఁ గర్తవ్యం బైనకరుణాప్రకారంబు. అంతియకాక మాకు దర్శనంబు నొసంగి మమ్ము ధన్యాత్ములఁ గావించితివి. భవదనుస్మరణమాత్రంబుననే సర్వభూతముల కుపశాంతి యొదవెడు. క్షుద్రము లగుభూతములందు నంతర్యామివై యుండునీ కాత్మోపాసకులకామములు దెలియకుండు నే? అపవర్గగురుఁడు గతియు నగునీవు మాకుఁ బ్రసన్నుఁ డగు టనుటే మా కభీష్టవరంబు.

పారిజాతప్రసూనం బలవడినం దేఁటి లాఁతిపువ్వుల కాసపడనివిధమున నీపాదమూలము నాశ్రయించినమేము మఱి యేవరముఁ గోరువారము? భవదీయమాయచేఁ దవిలి కర్మమార్గమునఁ ద్రిమ్మరుచుండినను మాకన్ని జన్మంబులందును నీభక్తులసంగంబు గలుగుచుండవలయు నిది యస్మదీయ వరంబు. స్వర్గముగాని యపవర్గముగాని భాగవతసంగమున లవమాత్ర మునకైన సాటిగా నెన్నము. తక్కినభోగములఁ జెప్పవలయునే? భాగ వతసంగము లభించెనేని యందు భూతభయవారణం బైననిర్వైరం బుతోఁ దృష్ణాప్రశమంబుఁ గావించు నీపరిశుద్ధచరిత్రంబులు కీర్తింపఁబడి యెడు. కథాప్రస్తావమున ముక్తసంగు లైనవిరక్తులు సన్న్యాసులకు గతియగునిన్నుఁ బలుమాఱు ధ్యానింతురు. తీర్థములకుఁ బావనత్వంబుఁ గావింపఁ బాదరేణువుల వెలయించుచుఁ దిరుగు నీభక్తులతోడిసమా గమంబు సంసారభీతునకు రుచింపకుండునే? నీకుఁ బరమప్రియసఖుండైన మహేశ్వరు సమాగమమునం జేసి యప్రతిక్రియం బైన సంసారమృత్యు వున కుత్తమవైద్యుఁ డైననిన్నుఁ గతిఁగాఁ బడయఁజాలితిమి. మే మొన ర్చినస్వాధ్యాయంబు గురూపసదనంబు విప్రసిద్ధానువర్తనంబు సాధు ప్రణామంబు భ్రాతృసుహృద్భావమున నసూయవిడిచి సర్వభూతముల నేకరీతిం గాంచుట పెద్దకాలము నీట నాచరించినపరమతపంబును నీపరితోషమున కయ్యెడు నని యిదియు నొక్కవరంబు వేఁడుదుము. బ్రహ్మశివమన్వాదులే తపోవిజ్ఞానవిశుద్ధసత్త్వు లయ్యు భవన్మహిమపా రముఁ గనలే రన్న నే మెంతవారము? మాకుఁ దెలిసినంత ప్రస్తుతించి తిమి. సముఁడు శుద్ధుఁడు పురుషుఁడు పరుఁడు వాసుదేవుఁడు సత్త్వ స్వరూపుఁడు నగునీకుఁ బ్రణామం బని యిట్లు ప్రచేతసులు ప్రస్తుతించినం బ్రీతుండై భక్తవత్సలుం డైనహరి వారు దనియక యెల్లప్పుడును దమ యెదుర సాక్షాత్కరించియుండఁ గోరిన నంతర్హితుం డై నిజధామంబునకు విచ్చేసె. అంతఁ బ్రచేతసు లాసలిలంబు వెడలి వచ్చి మి న్నొరయఁ బెరిగియున్నతరువులం గాంచి యలిగి యగ్ని మారుతముల నాత్మముఖ ముల విసర్జించినం బ్రళయకాలాగ్నిరుద్రుమాడ్కి నయ్యావి యయ్యనోక హములఁ గాల్పఁ దొడంగుటయు బ్రహ్మ సన్నిహితుండై సాంత్వవచన

ముల వారల నూరార్చె. అట హతశిష్టము లైనపాదపములు బ్రహ్మ
నియోగమునఁ బ్రమ్లోచ తనగర్భమునఁ ధరించి విడిచినయాకన్యఁ దెచ్చి కానుకగా నర్పించుటయు వారు దానిం బెండ్లియైరి. తొల్లి శివ
దూషణంబుఁ జేసినకారణంబున దక్షుఁడు దా నయోనిజుఁడయ్యు
మనుష్యయోనిం బుట్టవలయుటం జేసి ప్రచేతసులవీర్యమున మారిషాభి
ధాన యగునావార్క్షిగర్భమునం బొడమి పుట్టువుతోడఁ దనకు వెలసిన
తేజోమహిమంబునను దక్షత్వమునను దక్షుఁ డనఁ బరఁగి చాక్షుష
మన్వంతరంబునఁ బ్రజాసర్గంబొనర్చె. అప్పుడు బ్రహ్మదేవుఁ డతనిం బ్రజా
సర్గరక్షణంబున నియోగించి మరీచిప్రభృతు లగునితరులను దత్త
త్కార్యముల నియమించుటయుఁ బ్రజాసర్గం బప్రతిహతంబై ప్రవర్తిల్లె.

### ప్రచేతసులు నారదోపదేశమున ముక్తిఁ గాంచుట

అట దివ్యవర్షసహస్రావసానంబునఁ జ్ఞాన ముదయించుటయు నా
ప్రచేతసులు భార్యను బుత్త్రులయొద్ద విడిచి ప్రవ్రజ్యఁ గావించి పశ్చిమ
సముద్రతీరమున జాబాలి సిద్ధుఁ డైనపుణ్యాశ్రమంబునందు సర్వభూ
తాత్మభావనంబున నాత్మవిచారము నొనర్ప దీక్షితులై యింద్రియముల
నిగ్రహించి మనస్సు నిర్జించి ప్రాణములం గుదియించి యాసనము
జయించి శాంతసమానవిగ్రహులై పరబ్రహ్మమున నాత్మయోగం బొనర్పు
చున్న యాప్రచేతసులయొద్దకు నారదుం డేతెంచె. ఏతెంచిన యమ్మునిం
బ్రత్యుత్థానప్రణామాదిప్రకారంబు లైనపూజల నర్పించి యాసీనుం
గావించి స్వాగతంబు నడపి మునీంద్రా, మాభాగ్యమున మీదర్శనం
బయ్యె. సూర్యునిరీతి మీరలు లోకముల కభయముఁ గావింపఁ
జరించుచుండుదురు. తొల్లి శివకేశవు లుపదేశించిన యధ్యాత్మతత్త్వము
గృహాసక్తిం జేసి మాకు విస్మృతప్రాయం బయ్యె. మీరు కరుణించి
క్రమ్మఱ దానిం బోధించిన దత్త్వార్థం బెఱింగి మేము దుస్తరం
బైనసంసారసాగరంబు నిస్తరింతు మని యడుగుటయు నారదుండు
నారాయణావేశితమానసుండై ప్రచేతసుల కిట్లనియె. విశ్వాత్ముఁ డగు
హరి దేవ నారాధింపఁబడు నదియే నరులకు జన్మంబు. అట్టిదియే
కర్మంబులు. తాదృశంబే యాయువు. తద్విధంబే మనస్సు. తత్ప్రకా

రంబె వచనంబు. ఆత్మప్రదుండైన హరిం గొలువకుండినం బరిశుద్ధమాతాపితృజననం బుపనయనసంస్కారంబు వివిధయజ్ఞానుష్ఠానంబు యావజ్జీవవైదికకర్మాచరణంబు వేదశాస్త్రాధ్యయనంబు తపంబు వాగ్విలాసంబులు చిత్తవృత్తిసామర్థ్యంబు బుద్ధినైపుణ్యం బింద్రియపాటవంబు ప్రాణాయామాదియోగసాధనంబు సాంఖ్యతత్త్వపరిజ్ఞానంబు సన్న్యాసంబు వ్రతవైరాగ్యాదిసకలశ్రేయస్సాధనంబు లుండినం బ్రయోజనం బేమి? శ్రేయస్సులకెల్ల సర్వాత్ముండైన హరియే పరమార్థమున నవధి. సర్వభూతములకు నాతండే యాత్మం డాత్మప్రియతముండునై యొసంగెడు. తరుమూలమున జలసేచనంబు చేసిన శాఖోపశాఖాపత్రపుష్పఫలాదులకుం దృప్తి యగురీతిం బ్రాణోపహారమున నింద్రియతృప్తి యగుమాడ్కిని సర్వమూలం బైనహరి నర్చించిన నెల్లభూతముల నర్చించిన ట్లయ్యెడు. సూర్యునివలన వానకాలమున నుదకములు వెడలి వేసవితఱిం గ్రమ్మఱ నయ్యుదకము లారవిం జేరుతీరునను జరాచరభూతములు భూమిలోనం బుట్టి యట నందే చొచ్చువిధంబునను జేతనాచేతనాత్మకం బైనయీప్రపంచమెల్ల హరివలనం బొడమి తుది నతనిలో లయించెడు. గగనగంధర్వనగరంబువిధమున, నింద్రియములు సుషుప్తిసమయంబునం దోఁపక జాగ్రావస్థయందుఁదోఁచు తెఱంగున నొకప్పుడు దోఁచుచు వేఱొకప్పుడు దోఁపకుండు. విచిత్రప్రకారంబైనయీజగంబు సూర్యకాంతి సూర్యునకు వేఱుగానిచందమున నహంకారకార్యము లగు ద్రవ్యము లహంకారకారణం బగుభేదభ్రమము నెవ్వనియెడం జెల్ల వట్టి హరియం దొకప్పుడు దోఁచి వేఱొకప్పుడు దోఁపకుండిన నతనివలనం బ్రభవించినకతన నాతని కపృథగ్భూతంబై సర్వోపాధినిర్ముక్తం బైన తదీయపదంబకాని యొండు గాదు. ఆకాశమున నభ్రతమఃప్రకాశములు పర్యాయమునం దోఁచుచు నడఁగుచు నుండురీతి జగత్సృష్టిరక్షాలయకారణంబు లైనత్రిగుణశక్తిప్రవాహములు పరబ్రహ్మస్వరూపంబునం దొకప్పుడు దోఁచుచు మఱియొకప్పుడు లయించు. అవ్విధమున హరిసర్వకారణకారణంబు గావున నశేషదేహుల కాత్ముఁడు కాలప్రధానపురుషరూపుఁడు స్వతేజోనిరస్తసమస్తగుణప్రవాహుఁ డపాస్తసకలసంకల్ప

వికల్పుం డద్వయుండు భేదాధ్యాసాపవాదానంతరగమ్యాత్మ స్వరూపుం డనాదిమధ్యాంతుండు నిత్యానందమాత్రుండు చిద్ఘనుండు నగునాపర మాత్ము నాత్మైకత్వభావనమున భజింపుఁడు. సర్వభూతదయ యదృచ్ఛా లాభసంతుష్టి సర్వేంద్రియోపశాంతి యనునివి యలవరించికొన్న కేశ వుండు పరితోషంబు నొందు. ఏపణలెల్ల వర్జింపఁ బరిశోద్ధంబై వెలయు సాధుచిత్తమున నిరంతరభావనోపహూతుండై భక్తులకు వశుండైన యయ్యుత్తరుండు తద్గతాకాశంబురీతి నటఁ బాసి యరుగఁడు. విద్యాధన కులమదంబులం బీద లగుసాధుజనులకుఁ గీడు రోయుకుమతులవ్యూజల నాత్మధను లైనయకించనులకుఁ బ్రియుండై తదీయభక్తిరసము చవిఁ గొన్నహరి యాదరింపఁడు. తన్ననుసరించు శ్రీదేవిని సంపత్కాము లగు రాజులను విబుధులను స్వపూర్ణుఁ డైనహరి నజభృత్యవర్గరక్తుండై యాదరింపఁడు. రసజ్ఞుఁ డెవ్వఁడేనియు నట్టిహరిం ద్యజింపఁ దలంపు గొనునే? అయ్యా, మీకులమునం బ్రసిద్ధుఁ డైనధ్రువుండు సవతితల్లి ప్రల్లదంబుల కోర్వక యైదేండ్లప్రాయమునఁ దల్లిని విడిచి యడవి కేఁగి తెరువున నాయుపదేశంబు వడసి తత్ప్రకారమునఁ బురుషోత్తము నారా ధించి యందఱిపదములకు మీఁద నుండుధ్రువపదం బారోహించె. ఇప్పటికిని సప్తర్షులాస్థానముఁ దలయెత్తి చూతురు. మీరును శివోప దిష్టప్రకారమున సంసారనివారణార్థంబు సర్వాంతర్యామి యగునీశ్వరు నారాధింపుఁ డని యుపదేశించియు మఱియుఁ గొన్నికథలు వినిపించియు నారదుండు బ్రహ్మలోకంబున కరిగె. ప్రచేతసులును నారదుండు కీర్తిం చిన కలిమలాపహం బగుహరికీర్తి నాకర్ణించి తత్పదపంకజంబు ధ్యానించి తద్గతిం గాంచిరి. విదురా, యియ్యది నీయడిగినప్రాచీనప్రచేతస్సంవా దము. మనుపుత్త్రుం డైనయుత్తానపాదునివంశముం జెప్పితి. ప్రియవ్రత వంశముం జెప్పెద. వినుము. అతండు నారదునివలన నధ్యాత్మవిద్య నేర్చి క్రమ్మఱ మహీమండలం బేలి యట నిజరాజ్యముఁ బుత్త్రులకు విభాగించి యిచ్చి యీశ్వరపదం బధిగమించె నని మైత్త్రేయుండు వివ రించిన హరికథ లాకర్ణించి విదురుండు భక్త్యుత్కర్షరూషమహాప్రహర్షప్రపరీ తుండై హరిచరణంబు హృదయమున నెలకొలిపి మహాభాగవతుండు గుల కెఱిఁగి యోగీశ్వరా, కరుణామయుండవై నీ వకించనగోచరుం

డై నహరిం గాంచఁజాలుతమగపారంబు సూపినదానం గృతార్థుండ నైతి నని పలికి యమ్మైత్రేయు నామంత్రణంబు చేసి నిభృతాశయుండై తన వారిం జూడఁగోరి హాస్తిపురంబునకరిగె. హరిసమర్పితాత్ము లగురాజుల చరిత్రం బియ్యది. దీని విన్నవా రాయురర్థకీర్తికుశలైశ్వర్యసద్గతులం గాంతు రని శుకయోగీంద్రుఁడు పరీక్షిన్నరేంద్రునకు వివరించె.

చ. స్థిరతరభక్తియోగము మదిం బదిలం బొనరించి యన్యభా
వరహితభావనన్ సకలవైషయికస్పృహ మాని యాత్మసౌ
ఖ్యరతిని గోరి ధ్యాన మనపాయముగాఁ దనరించుసాధుశే
ఖరులహృదంతరంబునఁ బ్రకాశముఁ గొల్పెడుదేవుఁ గొల్చెదన్.

గద్యము. ఇది శ్రీమదుభయభాషాకవిత్వకలాభిరామ సీతారామకవి లలామ పుత్త్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహ సుధీవర్య సచ్ఛాత్త్ర, శాలావత్సగోత్రాపస్తంబసూత్ర, విబుధజన విధేయ, వేంకటరంగనామధేయ విరచితం బైనశ్రీమదాంధ్రవచన భాగవతంబునం జతుర్థస్కంధంబు సర్వంబు నేకాశ్వాసము.



# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకుగల సంపుటము | | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము | | | |
| ,, బాలకాండము | ... | 2 | 8 |
| ,, అయోధ్యాకాండము | ... | 5 | 0 |
| ,, ఆరణ్యకాండము | ... | 2 | 8 |
| ,, కిష్కింధాకాండము | ... | 2 | 8 |
| ,, సుందరకాండము | ... | 8 | 0 |
| ,, యుద్ధకాండము | ... | 7 | 8 |
| ,, ఉత్తరకాండము | ... | 8 | 8 |
| కథాసరిత్సాగరము | ... | 12 | 8 |
| జగత్కథ, H. G. Well's History of the world, | | | |
| శ్రీ. శఠకోపాచార్యులు | ... | 6 | 0 |
| పంచతంత్రహితోపదేశకథామంజరి | ... | 8 | 0 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 4 | 0 |
| న్యాయవిచారము, (ప్రహసనము) | ... | 0 | 8 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 0 | 10 |
| డిటో మూడవభాగము | ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 12 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 12 |
| డిటో టీకతో | ... | 1 | 4 |
| భోజునికథలు | ... | 1 | 0 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 4 |
| II భాగము | ... | 1 | 8 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, 1-2 భాగములు, సీతారామశాస్త్రిగారిది | | 2 | 0 |
| చార్ దర్వీషుకథలు | ... | 1 | 0 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| బేతాళునికథలు | ... | 1 | 0 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| పురాణగాథలు I | ... | 1 | 4 |
| ,, II | ... | 1 | 4 |
| బాజీరాయని చరిత్ర | ... | 1 | 4 |
| రఘువంశకథ | ... | 0 | 12 |
| విక్రమార్కచరిత్ర, భా. రామ. శాస్త్రి | ... | 1 | 8 |
| పంజాబు అల్లరి | ... | 0 | 8 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | ... | 0 | 12 |
| శకుంతలచరిత్ర, చిన్నసైజు | ... | 0 | 6 |
| నల ,, | ... | 0 | 8 |
| సావిత్రి ,, | ... | 0 | 6 |
| హరిశ్చంద్ర ,, | ... | 0 | 8 |
| ప్రహ్లాదచరిత్ర ,, | ... | 0 | 6 |
| సాక్షి, శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుది | | | |
| ,, మొదటిభాగము | ... | 3 | 0 |
| ,, రెండవభాగము | ... | 3 | 0 |
| ,, మూడవభాగము | ... | 2 | 8 |
| ,, నాల్గవభాగము | ... | 3 | 0 |
| ,, అయిదవభాగము | ... | 2 | 8 |
| ,, ఆరవభాగము | ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.